

ఇంటింటికి వైద్య విజ్ఞానం
అందించటమే ఉద్యమంగా చేపట్టి
రచనలు సాగిస్తున్న

**మీ డాక్టర్ జి. సమరం**

కలం నుండి మరో వైద్య విజ్ఞాన దీపిక

# మీ ఇంట్లో మీరే డాక్టర్

అక్షర జ్యోతితో నిరక్షరాస్యతని పారద్రోలుతున్న
ఈ తరుణంలో ఇంటింటికి ఓ 'డాక్టర్'ని తయారు చేయాలనే
సదాశయంతో ఉద్యమిస్తున్న
మీ అభిమాన డాక్టర్ సమరం తో
చేయిచేయి కలపండి. వైద్య విజ్ఞానాన్ని గ్రామగ్రామానికి
వీలైతే ఇంటింటికీ చేరగలిగేటట్లు మీ వంతు కృషి చేయండి.
"మీ ఇంట్లో మీరే డాక్టర్" పుస్తకం
మీ వద్ద వుంటే అన్నీ విశ్లేషించి సలహా చెప్పగల
డాక్టర్ మీ చెంత ఉన్నట్లే

వైద్య విజ్ఞాన జ్యోతి

డా॥ జి. సమరం

# మీ ఇంట్లో మీరే డాక్టర్

నవభారత్ బుక్ హౌస్
కార్ల్‌మార్క్స్ రోడ్ - విజయవాడ - 2




# MEE INTLO MEERE DOCTOR

**Dr. G. Samaram**
Vasavya Nursing Home
Benz Circle - Vijayawada - 520 006

First Edition : January, 1997

Laser Type Setting : PRINT PLAZA, Durgaiah St., Vijayawada - 520 002

Offset Printing : VIJAYAWADA OFFSET PRINTERS LABBIPET, VIJAYAWADA - 520 010

Title Design : RAMANA - Vijayawada - 520 002

ISBN 81-85659 - 63 - X

**PRICE : Rs. 160/-**

**A Navabharat Publication**

# ముందుగా నా మాట



వైద్య విజ్ఞానం ఎంతో అభివృద్ధి సాధించింది. అయినా దాని ఫలితాలు అందరికీ అందుబాటులో లేవు. అందుకనే నేటికీ నాటు వైద్యాలు, మోటు వైద్యాలు రోగులపాలిట శాపాలుగా మిగిలాయి.

నిత్యం హాస్పిటల్లోనూ, పేదల పేటల్లోనూ, పల్లె పట్టుల్లోనూ, వైద్య సేవా కార్యక్రమాల్లో పాల్గొనే నేను వైద్య సేవలు సక్రమంగా అందని వారిని చూసి ఎంతో వేదనకు గురవుతూంటాను. ఆర్థిక స్థోమత ఉన్నవారి విషయం వేరు. ఆర్థిక స్థోమత లేనివారు రోగాలు-రొప్పులతో బ్రతుకుని లాగవలసి వస్తోంది. ఉచితంగా వైద్య పరీక్షలు జరిపి మందులు రాసి ఇచ్చినా వాటిని కొనలేనివారు ఎందరో ఉన్నారు.

వారి విషయం అలా ఉండగా మందు వాడే పద్ధతి, వ్యాధి ఎడల తీసుకోవలసిన శ్రద్ధ, కాంప్లికేషన్లు వస్తే డాక్టర్‌ని సంప్రదించే వివేకం చాలామందిలో లేదు. దానివల్ల ఆరోగ్య రక్షణలో ఆశించిన ఫలితాలు లభ్యం కావడం లేదు. గ్రామీణ ప్రాంతాల్లోనూ, పేదల పేటల్లోనూ, స్వచ్ఛంద సేవా సంస్థల ఆరోగ్య కార్యకర్తలకు ఉన్నా వారికి వైద్యం గురించి సరైన అవగాహన లేకపోవడంతో రోగులకి తోడ్పడలేకపోతున్నారు. ఈ దయనీయ పరిస్థితే ఈ పుస్తక రచనకు నన్ను పురికొల్పింది. కనీసం చదువుకున్న వారికైనా కొంత అవగాహన ఉంటే ఇతరులకు తోడ్పడగలుగుతారు.

వ్యాధి ఎందుకు వస్తుంది? వ్యాధి లక్షణాలు ఎలా ఉంటాయి?చికిత్స ఏమిటి? - అనేది రోగికి తెలిస్తే డాక్టర్‌కి వైద్యం చేయడం సులభం అవుతుంది. డాక్టరూ, పేషెంటు సంబంధాలు కూడా చక్కగా ఉంటాయి. అనవసర అపోహలు ఉండవు.

'స్వంత వైద్యానికి పరిమితి ఎక్కడ?' - అనేది కొందరిలో కలిగే మీమాంస. వైద్య సేవలు అందుబాటులో ఉన్నప్పుడు స్వంత వైద్యం అవసరమే లేదు.

వైద్యసేవలు అందుబాటులో లేనప్పుడు స్వంత వైద్యం తప్పనిసరి. వైద్యం ఖరీదు అయినప్పుడు మరింత అవసరం. తప్పని సరి పరిస్థితుల్లో రోగి రిస్క్ తీసుకోక తప్పదు. ఇది ఎవరైనా ఒప్పుకుంటారు. స్వంత వైద్యం అవసరం ఉన్నా లేకపోయినా డాక్టర్ చెప్పింది అక్షరాలా పాటించడానికి కొంత అవగాహన కావాలి. అందుకోసమే ఈ పుస్తకం.

ఈ రోజున పత్రికలు, రేడియోలు, టి.వి.ల్లో ఆరోగ్యం గురించి కుప్పలు తెప్పలుగా సమాచారం గుప్పిస్తున్నారు.

ప్రతి ఒక్కరికి ఎప్పుడోఒకప్పుడు ఏదో ఒక అనారోగ్యం కలగక తప్పదు. అనారోగ్యం కలిగినప్పుడు తనకి వచ్చిన వ్యాధి గురించి తెలుసుకోవాలని రోగి ఆరాటం చెందుతాడు. కనీసం తన గురించి కాకపోయినా, తనవాళ్ళకి వ్యాధి వస్తే, అది ఎలా తగ్గుతుందో, ఎప్పుడు తగ్గుతుందో తెలుసుకోవాలని తహతహలాడతాడు. వ్యాధి గురించి అవగాహన లేనప్పుడు ఎవరైనా సరే గందరగోళంలో పడతారు. తలా ఒకరు తలా ఒకటి చెబుతారు. ఏది చేయాలో, ఎలా చేయాలో తెలియని స్థితి వారిని కుదిపేస్తుంది.

అందుకనే ప్రతి ఒక్కరికీ తోడ్పడాలనే ధ్యేయంతో ఈ పుస్తకం రాశాను.

సామాన్యునికి సైతం చట్టం గురించి అవగాహన ఉంటే న్యాయం అందరికీ చేకూరుతుంది.

అదే విధంగా వైద్యం గురించి అవగాహన ఉంటే అందరి ఆరోగ్యం బాగుంటుంది.

ప్రతి ఒక్కరూ ఈ పుస్తకం చదవాలనీ, ఆరోగ్యాన్ని చక్కగా కాపాడుకోవాలనీ ఆకాంక్షిస్తున్నాను.

మీ ఆరోగ్యానికి మీరే నిర్దేశకులు. "మీ ఇంట్లో మీరే డాక్టర్".

ఈ పుస్తకం చదివి మీ సూచనలను, సలహాలను అందించాలని కోరుతూ

మీ

**సమరం**

## ఇందులో....

### 1. సాధారణ వ్యాధులు

## 2. కడుపులో పాములు



## 3. మెదడు - నరాల వ్యాధులు





## 4. గుండె జబ్బులు





## 5. శ్వాసకోశ వ్యాధులు

## 6. జీర్ణకోశ వ్యాధులు



## 7. కాలేయం - పసరతిత్తి వ్యాధులు



## 8. మూత్ర పిండాల వ్యాధులు



## 9. వినాళ గ్రంథులు - వ్యాధులు

## 10. చర్మవ్యాధులు



## 11. చిన్నపిల్లలు - వ్యాధులు





## 12. రక్తహీనత (ఎనీమియాస్)



## 13. లైంగిక వ్యాధులు

## 22. వ్యాధులు - మందులు



## 23. లేబరేటరీ పరీక్షలు - పద్ధతులు



## 25. రోగులవద్ద ఉంచుకోవలసిన రికార్డులు





# 1. సాధారణ వ్యాధులు

## 1. ఫ్లూ జ్వరం

*ఫ్లూ జ్వరాన్నే ఇన్‌ఫ్లూయంజా జ్వరం అని కూడా అంటారు. ఇది వైరస్ క్రిములు సోకడంవల్ల వస్తుంది. వైరస్ క్రిములు శరీరంలోకి ప్రవేశించిన 1 నుంచి 3 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

ఫ్లూ జ్వరం అకస్మాత్తుగా వస్తుంది. చలి ఉంటుంది. బాగా నీరసం అనిపిస్తుంది. జలుబు, దగ్గు, గొంతునొప్పి ఉంటాయి. తలనొప్పి, ఒళ్ళునొప్పులు ఉంటాయి. కొందరికి ఒంటిమీద కొద్దిపాటి రాష్ కూడా వస్తుంది.

**ఫ్లూ జ్వరాల్లో రకాలు :**

* ప్రధానంగా జ్వరం వరకే పరిమితమైన ఫ్లూ : ఇందులో జ్వరం, ఒళ్ళునొప్పులు, జలుబు, గొంతునొప్పి, కళ్ళు ఎర్రబడటం, నీరసం ప్రధానంగా ఉంటాయి. పొడి దగ్గు వస్తుంది. ఛాతినొప్పిగానీ, ఊపిరితిత్తులలో నిమ్ముగానీ ఉండవు. 4 నుంచి 6 రోజులలో జ్వరం తగ్గిపోతుంది.
* శ్వాసకోశాలకి సంబంధించిన ఫ్లూ : జ్వరంతోపాటు బ్రోంకైటీస్, బ్రోంకో న్యూమోనియా, ఫ్లూరసి, న్యుమోనియా వంటివి వస్తాయి. ఒకోసారి ఇవి సీరియస్ అవుతాయి. కళ్ళె జిగురుగానూ, కాస్త ఎరుపుగానూ ఉంటుంది.
* జీర్ణకోశ పేగులకి సంబంధించిన ఫ్లూ జ్వరం : ఇందులో ఫ్లూ జ్వరంతోపాటు ఆకలి లేకపోవడం, వికారం, వాంతులు, కడుపులో నొప్పి, మలబద్ధకం ప్రధానంగా ఉంటాయి. విరోచనాలు కూడా అవుతాయి.
* మెలిగ్నెంట్ టైప్ ఫ్లూ : ఈ రకమైన ఫ్లూ జ్వరాన్నే విషజ్వరం అని కూడా అంటారు. జ్వరం వచ్చిన వాళ్ళలో పరిస్థితి విషమంగా ఉంటుంది. ఒళ్ళు నీలంగా మారుతుంది. హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు పెంపొందుతాయి. చాలామందిలో ఇటువంటి ఫ్లూ జ్వరం ప్రాణహాని కలిగిస్తుంది.
* నరాలకి చెందిన ఫ్లూ జ్వరం : ఇందులో విపరీతంగా తలనొప్పి ఉంటుంది. సంధి లక్షణాలు ఏర్పడతాయి. మెనింజైటీస్ కూడా రావచ్చు.



**కాంప్లికేషన్స్ :**

న్యూమోనియా, మతి భ్రమణం, నరాల బలహీనత, మెనింజైటీస్, ఎన్‌కెఫలైటీస్, గుండె బలహీనత, చెవిలో చీము, బీర్జాల వాపు, మూత్రపిండాల వ్యాధి, జీర్ణకోశంలో రక్తస్రావం.

**చికిత్స :**

1. ఫ్లూ జ్వరం వచ్చిన వ్యక్తికి పూర్తిగా విశ్రాంతి ఇవ్వాలి.
2. నొప్పులు తగ్గేందుకు బిళ్ళలు వాడాలి.
3. గొంతునొప్పికి, దగ్గుకి మందు వాడాలి.
4. వైరల్ ఇన్‌ఫెక్షన్‌తోపాటు బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్‌కూడా ఉంటే యాంపిసిలిన్, ఎమాక్సిసిలిన్, ఎరిత్రోమైసిన్ వంటి యాంటిబయోటిక్ మందులు వాడాలి.

❑❑❑

# 2. ఆట్లమ్మ

*ఆట్లమ్మనే చికెన్‌పాక్స్ అంటారు. ఈ వ్యాధి చిన్నపిల్లల్లో రావడం ఎక్కువ. ఇది కూడా వైరస్ క్రిములవల్ల వస్తుంది. ఆట్లమ్మ రోగి తుమ్మగా, దగ్గగా నేరుగా రెండోవారికి సంక్రమిస్తాయి. డైరెక్టుగా స్కిన్ కాంటాక్ట్ వల్ల కూడా రావచ్చు.*

*ఆట్లమ్మ క్రిములు శరీరంలో ప్రవేశించిన 14 నుంచి 15 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

తలనొప్పి, గొంతునొప్పి, జ్వరంతో ఆట్లమ్మ మొదలవుతుంది. ముందుగా ఛాతి, కడుపు, ముఖంమీద నీటి పొక్కులులాగా ఆట్లమ్మ పొక్కులు వస్తాయి. వీటిని వెసికిల్స్ అంటారు. ఆట్లమ్మ పొక్కులు నిదానంగా ఒళ్ళంతా వస్తాయి. పాత పొక్కులు రెండు రోజులలో మాడుపట్టగా కొత్త పొక్కులు మరిన్ని వస్తాయి. ఇలా అప్పుడప్పుడు కొత్త పొక్కులు వారం, పది రోజులు వస్తాయి. ఆట్లమ్మ వచ్చినవారికి పొక్కులు దురద అనిపిస్తాయి. చంకల్లో, గజ్జల్లో లింఫ్ గ్లాండ్లు ఉబ్బుతాయి. అరుదుగా కొందరిలో ఆట్లమ్మ పొక్కుల నుండి రక్తం కారుతుంది.

కాంప్లికేషన్స్ :

ఆట్లమ్మ పొక్కులు చీముగడ్డలుగా మారడం, న్యూమోనియా, ఎన్‌కెఫలైటీస్.

చికిత్స :

1. ఆట్లమ్మ వచ్చిన కొందరిలోనే పూర్తి బెడ్‌రెస్ట్ అవసరమౌతుంది. చాలామందిలో ఆట్లమ్మ వచ్చినా అంతగా బాధలుండవు. ఇటువంటివారు లేచి తిరగొచ్చు.
2. దురదలు తగ్గడానికి ఎవిల్‌గానీ, ట్రెక్సిల్‌గానీ (బిళ్ళలు) రోజుకి రెండుసార్లు వేసుకోవాలి.
3. ఆట్లమ్మ వైరస్‌తోపాటు బాక్టీరియా క్రిములు కూడా తోడైనట్లు కనబడితే యాంటిబయోటిక్ మందులు వాడాలి.
4. న్యూమోనియా ఏర్పడితే ఆక్సిజన్ పెట్టాలి.
5. ఎన్‌కెఫలైటీస్ లక్షణాలు కనబడితే కార్టిజోన్స్ వాడాలి.
6. యాంటి వైరల్ ఇంజక్షన్ మందు 'ఎసైక్లోవిర్' 250 మి.గ్రా. చొప్పున 8 గం॥కి ఒకసారి నరానికి 3 రోజులపాటు ఇవ్వాలి. లేదా దీనికి సంబంధించిన బిళ్ళలు తడవకి ఒకసారి చొప్పున రోజులో 5 సార్లు ఇవ్వాలి. ఇలా వారం రోజులు వాడాలి.

❑❑❑

# 3. గవద బిళ్ళలు

*గవద బిళ్ళలనే 'మమ్స్' అంటారు. ప్రధానంగా 15 సంవత్సరాల వారిలో ఎక్కువగా వస్తాయి. ఇది కూడా వైరస్ క్రిముల వల్లనే వస్తుంది. మమ్స్ రోగి దగ్గగా, తుమ్మగా, వాంతి చేసుకోగా లాలాజలం అంటగా ఒకరి నుంచి మరొకరికి సంక్రమిస్తాయి. ఈ క్రిములు శరీరంలో ప్రవేశించిన 2, 3 వారాలలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి. ఇలా శరీరంలో ప్రవేశించిన వైరస్ రక్తం ద్వారా చెంప ప్రక్కన ఉండే పెరాటిడ్ గ్లాండ్స్‌కి చేరి వాపును కలుగచేస్తాయి.*

లక్షణాలు :

కొద్దిపాటి జ్వరం , గొంతునొప్పి, దవడ కీలు దగ్గర నొప్పి, చెంప ప్రక్కన వాపు, చలి చలిగా అనిపించడం, వాపు దగ్గర నొప్పి, చెంపకి ముందు ఒకవైపు వాపు వచ్చి తరువాత రెండవవైపు వాపు, వాపు వచ్చిన 3 రోజులలో బాగా పెరిగిపోవడం, తక్కిన లాలాజలం

గ్రంథులు కూడా వాచడం, నోట్లో లాలాజలం తగ్గడం.

**కాంప్లికేషన్స్ :**

గవద బిళ్ళలు వచ్చిన మగపిల్లల్లో వృషణాలు ఒకటిగానీ, రెండుగానీ వాపు, మెనింజైటీస్, స్త్రీలలో ఓవరీస్ వాపు, పాన్‌క్రియాటిస్ వాపు,అరుదుగా కీళ్ళవాపు, రొమ్ములవాపు, థైరాయిడ్ గ్రంథి వాపు, కిడ్నీ ఫెయిల్యూర్.

**చికిత్స :**

1. గవద బిళ్ళలు వచ్చిన రోగి పది రోజులపాటు విశ్రాంతి తీసుకోవాలి.
2. వాపు తగ్గేవరకు గ్లూకోజ్, పళ్ళరసం, జావ తీసుకోవాలి.
3. నోటి శుభ్రతని పాటించాలి. గవదల వాపు తగ్గడానికి 'బిడాంజిన్' బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున 3 సార్లు వాడాలి.
4. నొప్పి తగ్గడానికి 'కాంబిఫ్లామ్' బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున రోజుకు 3 సార్లు వాడాలి. వైరస్‌తోపాటు బాక్టీరియా క్రిములు తోడైతే యాంటిబయోటిక్ మందులు వాడాలి.
5. వృషణాలు వాపు వస్తే పూర్తి బెడ్‌రెస్ట్ తీసుకోవాలి. స్క్రోటల్ సపోర్టు ఇవ్వాలి. ప్రెడ్నిసాలోన్ 15 మి. గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు వాడాలి.
6. గవద బిళ్ళలు రాకుండా బిడ్డకు 16 - 18 మాసాలలోనే వాక్సిన్ చేయిస్తే వ్యాధి నుండి రక్షణ ఉంటుంది.

❑❑❑

# 4. పొంగు జ్వరం

*పొంగు జ్వరాన్నే 'మీజిల్స్' అంటారు. ఈ వ్యాధి చిన్నపిల్లలలో ఎక్కువగా వస్తుంది. 6 మాసాలలోపు పిల్లలకు పొంగు జ్వరం రావడం చాలా అరుదు. ఈ వ్యాధి రావడం కూడా వైరస్ క్రిముల వల్లనే వస్తుంది. పొంగు వ్యాధి వచ్చిన రోగి దగ్గగా, తుమ్మగా రెండవవారికి అతి తేలికగా సంక్రమిస్తాయి. వ్యాధిక్రిములు సంక్రమించిన 8 నుంచి 10 రోజులలో పొంగు బయటపడుతుంది.*

**లక్షణాలు :**

పొంగుకి సంబంధించిన రాష్ బయటబడటానికి ముందు జ్వరం, దగ్గు, జలుబు ఉంటాయి. కళ్ళు ఎర్రబడతాయి. వెలుతురు చూడలేకపోతారు. రాష్ వంటి మీద

కనబడటానికి ముందుగా నోటిలోపల చిన్న చిన్న స్పాట్స్‌గా కనబడతాయి. గొంతు కాస్త బొంగురుగా మారుతుంది. వాంతులు అవుతాయి. పై లక్షణాలు కనబడిన 5 రోజుల తరువాత ఒంటిమీద పొంగుకి సంబంధించిన రాష్ (ఎర్రని దద్దురు) కనబడుతుంది. ముందుగా ఈ రాష్ చెవుల వెనుక, తలవెంట్రుకల మార్జిన్‌లోనూ, బుగ్గలమీద కనబడుతుంది. ఆ తరువాత 1, 2 పూటల్లో ఒళ్ళంతా రాష్ ఏర్పడుతుంది.

**కాంప్లికేషన్స్ :**

చెవిలో చీము, న్యూమోనియా, బ్రోంకైటీస్, ఎన్‌కెఫలైటీస్, నోటిలో పుళ్ళు.

**చికిత్స :**

1. బెడ్‌రెస్ట్.
2. తాగడానికి ఎక్కువ ద్రవపదార్థాలు ఇవ్వాలి.
3. జ్వరం తగ్గడానికి పేరాసెటమాల్ వాడాలి.
4. కళ్ళ ఎరుపు తగ్గడానికి బోరిక్ లోషన్ ఐ డ్రాప్స్ వాడాలి.
5. దగ్గు తగ్గడానికి దగ్గు మందు వాడాలి.
6. పొంగుతోపాటు బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ తగ్గడానికి యాంపిసిలిన్, ఎమాక్సిసిలిన్ మందులు వాడాలి.

   బిడ్డ పుట్టిన 9 వ మాసంలో, 16 వ మాసంలో యాంటీమీజిల్స్ వాక్సీన్ చేయిస్తే పొంగు జ్వరానికి గురికావడం ఉండదు.

□□□

# 5. డిఫ్తీరియా

*డిఫ్తీరియా వ్యాధినే అంగుడువాపు అంటారు. 2 నుంచి 5 సంవత్సరాల వయసు పిల్లల్లో ఈ వ్యాధి రావడం ఎక్కువ. ఈ వ్యాధి సి. డిఫ్తీరియా క్రిములవల్ల వస్తుంది. డిఫ్తీరియా రోగి తుమ్మగా, దగ్గగా గాలిలో కలిసి మరొకరికి ఈ వ్యాధి సంక్రమిస్తుంది. ఈ క్రిములు శరీరంలో ప్రవేశించిన 2 నుంచి 6 రోజులలో వ్యాధి లక్షణాలు కనబడతాయి.*

**లక్షణాలు :**

డిఫ్తీరియా రోగిలో ముక్కు వెంట నీరు, ఎర్రజీరలా, ద్రవంలా వస్తుంది. ముక్కులోపల ఎర్రగా కనబడుతుంది. గొంతుకలో టాన్సిల్స్ ఎర్రగా అవుతాయి. టాన్సిల్స్ మీద సన్నటి పొర ఏర్పడుతుంది. నిదానంగా ఈ పొర అంగిలిపైన వ్యాపిస్తుంది. కొందరిలో ఈ పొర స్వరపేటికకు చేరుతుంది.

డిఫ్తీరియా వచ్చిన వాళ్ళలో పరిస్థితి విషమంగా కనబడుతుంది. కొందరిలో శ్వాస తీయడం ఇబ్బందవుతుంది. గుండె బలహీనం అవుతుంది. హార్ట్ ఫెయిల్యూర్ డెవలప్ అవుతుంది.

**నిర్ధారణ :**

థ్రోట్‌స్వాబ్ లేదా లెరింజియల్ స్వాబ్ తీసుకుని మైక్రోస్కోప్‌లో క్రిములను పరీక్ష చేయడం మరియు కల్చర్ టెస్ట్ చేయడం.

**చికిత్స :**

1. డిఫ్తీరియా వచ్చిన రోగిని తక్కినవారి నుంచి వేరుగా ఉంచాలి. రోగి ఉండే గదిలో వెలుతురు, గాలి పుష్కలంగా ఉండాలి. త్రాగగలిగితే కొద్దికొద్దిగా నీళ్ళుఇస్తూ ఉండాలి. త్రాగలేనప్పుడు నరానికి గ్లూకోజ్ పెట్టాలి. నొప్పి తగ్గడానికి మందులు వాడాలి.
2. డిఫ్తీరియా యాంటి టాక్సిన్ వ్యాధి ప్రారంభ దశలోనే నరానికిగానీ, కండకిగానీ ఇవ్వాలి. ఈ ఇంజక్షన్ ఇచ్చేముందు టెస్ట్ డోస్ ఇవ్వాలి. వాక్సిన్‌వల్ల ఎటువంటి రియాక్షన్ ఉండదని తేలిన తరువాత ప్రెడ్నిసాలోన్ 20 మి.గ్రా. నోటిద్వారానూ, ప్రొమాథైజిన్ 50 మి.గ్రా. ఇంజక్షన్ రూపంలో ఇవ్వాలి. ఆ తరువాత అరగంటకి నిదానంగా వాక్సిన్ ఇవ్వాలి. వాక్సిన్ ఇచ్చేముందు పూర్తి జాగ్రత్తలు తీసుకోవాలి.

**యాంటిబయోటిక్స్ :**

బెంజైల్ పెన్సిలిన్ **2,50,000** యూనిట్స్ ప్రతి **6** గంటలకి ఒకసారి కండకి ఇవ్వాలి. లేదా ఎరిత్రోమైసిన్ **250** మి.గ్రా. నోటి ద్వారా ప్రతి **6** గంటలకి ఇవ్వాలి. ఇలా వారం రోజులు యాంటిబయోటిక్ వాడాలి.

డిఫ్తీరియా వస్తే ఆసుపత్రిలో చేర్చి చికిత్స చేయించాలి. డిఫ్తీరియా రాకుండా బిడ్డ పుట్టిన **6**వ వారంలో; **10**వ వారంలో, **14**వ వారంలో ట్రిపుల్ యాంటిజన్ ఇంజక్షన్ ఇవ్వాలి. తిరిగి **18**వ మాసంలోనూ, **5**వ సంవత్సరంలోనూ ఒక్కొక్క మోతాదు చొప్పున ఇవ్వాలి.

❑❑❑

# 6. కోరింత దగ్గు

*కోరింత దగ్గునే హూపింగ్ కాఫ్ లేదా పెర్టూసిస్ అంటారు. ఈ వ్యాధి పిల్లలలో ఎక్కువగా వస్తుంది. బ్రాడిటెల్లా పెర్టూసిస్ అనే బాక్టీరియావల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది.*

*కోరింతదగ్గు ఉన్నరోగి దగ్గగా గాలిలో వ్యాపించి మరొకరికి చేరుతాయి. ఆ విధంగా వ్యాధి ఒకరి నుండి మరొకరికి సంక్రమిస్తుంది.*

*క్రిములు సంక్రమించిన 1, 2 వారాలలో వ్యాధి బయటపడుతుంది.*

**లక్షణాలు :**

వ్యాధి 3 దశలుగా పెరుగుతుంది. ప్రతి దశ రెండేసి వారాలు ఉంటుంది.

**మొదటి దశ :** కోరింత దగ్గు మొదటి దశలో జలుబు ఉంటుంది. కొద్దిపాటిగా జ్వరం ఉంటుంది. దగ్గు నిదానంగా పెరుగుతుంది.

**రెండవ దశ :** దగ్గు తీవ్రంగా ఉంటుంది. దగ్గుని బిడ్డ తట్టుకోలేకపోతుంది. దగ్గుతుంటే కళ్ళు ఎర్రబడతాయి. కళ్ళ వెంట నీళ్ళు కారిపోతుంటాయి. తెంపు లేకుండా దగ్గు రావడంతో గాలి అందక బిడ్డ నీలంగా మారడం కూడా ఉంటుంది. ఏకబిగిన దగ్గిన తరువాత లారింగ్స్ దగ్గర స్పాజం పోయి ఒక్కసారిగా గాలి శ్వాసకోశాల్లోకి దుముకుతుంది. అలా లోపలికి గాలి పోతున్నప్పుడు పెద్దగా శబ్దం అవుతుంది. దాన్నే హూఫ్ అంటారు. హూఫింగ్ కాఫ్ దాని నుంచే వచ్చింది. దగ్గుతోపాటు తెమడ ఉంటుంది. కడుపులో ఏదున్నా వాంతి అయిపోతుంది. దగ్గి దగ్గి బిడ్డ అలసిపోవడం జరుగుతుంది. చివరకు సొమ్మసిల్లి నిద్రపోవడం జరుగుతుంది. ఆహారం తీసుకున్న తరువాత శారీరకంగా కాస్త శ్రమ చెందిన తరువాత దగ్గు మరింత ఎక్కువగా వస్తుంది. వాతావరణంలో మార్పు కూడా దగ్గును పెంచుతుంది.

**మూడవ దశ :** కోరింత దగ్గు కనబడిన తరువాత నాలుగు వారాలకి పరిస్థితి మెరుగవుతుంది. దగ్గు తీవ్రత తగ్గడం మొదలవుతుంది. దగ్గుతో వాంతి అవడం ఉండదు. ఆకలి మొదలవుతుంది. బిడ్డ కాస్త ఆహారం తీసుకోగలుగుతుంది.

**నిర్ధారణ :**

థ్రోట్ స్వాబ్ కల్చర్.

**కాంప్లికేషన్స్ :**

పల్మనరీ ఎటలెక్టైసిస్ - శ్వాసకోశాలు కొలాప్స్ అవుతాయి, న్యూమో థొరాక్స్.

**చికిత్స :**

1. కోరింత దగ్గు రోగిని తక్కినవారికి దూరం చేయాలి.
2. దగ్గు లేని సమయంలో ఆహారం కొద్దికొద్దిగా తరచూ ఇవ్వాలి.



3. దగ్గు ఎక్కువగా ఉన్నప్పుడు బిడ్డ తలని క్రిందికి వంచి దగ్గించాలి.
4. దగ్గు ఎక్కువగా ఉన్నప్పుడు నిద్రకి మందు వాడాలి.
5. సాల్‌బుటమాల్ 2 మి.గ్రా. బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున 3 సార్లు వాడాలి.
6. కోరింత దగ్గుని కంట్రోలు చేయడంలో యాంటిబయోటిక్స్ అంతగా తోడ్పడవు. అయినా టెట్రాసైకిలిన్ లేదా ఎరిత్రోసిన్ లేదా యాంపిసిలిన్ కోర్సుగా కొంతకాలం వాడితే మంచిది.

కోరింత దగ్గు ఉన్నప్పుడు కొందరిలో ఫిట్స్ వస్తాయి. అవి తగ్గడానికి డైజిపామ్ ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి.

కోరింత దగ్గువల్ల బిడ్డ నీలంగా మారుతుంటే ముక్కు ద్వారా ఆక్సిజన్ పెట్టాలి.

**వ్యాధి రాకుండా :**

**కోరింత దగ్గు రాకుండా బిడ్డ పుట్టిన 6వ వారం, 10వ వారం, 14వ వారంలో డి.పి.టి. ఇంజక్షన్స్ఇవ్వాలి. తిరిగి 18వ మాసంలో మరొక ఇంజక్షన్ ఇవ్వాలి. 5 సంవత్సరాలు దాటిన తరువాత కోరింత దగ్గుకి ఇంజక్షన్ ఇవ్వడం మంచిది కాదు. ఆ వయసులో కోరింతదగ్గు వాక్సిన్‌వల్ల దుష్ఫలితాలు కలుగుతాయి. అందుకని 5వ సంవత్సరంలో డి.పి.టి. ఇంజక్షన్ కాకుండా డి.టి. ఇంజక్షన్ ఇవ్వాలి.**

❑❑❑

# 7. ధనుర్వాతం

*ధనుర్వాతాన్నే టెటనస్ అంటారు. ఈ వ్యాధి క్లోస్ట్రిడియం టెటనై అనే బాక్టీరియావల్ల కలుగుతుంది. ఈ బాక్టీరియా క్రిమి విడుదల చేసే విషపదార్థం నాడీవ్యవస్థ మీద దుష్ప్రభావాన్ని కలిగిస్తుంది. దానివల్ల కండరాలు బిగుసుకుపోవడం, స్పాజంకు లోనవడం ఉంటుంది.*

**కారణాలు :**

శరీరానికి కాలిన గాయాల ద్వారా టెటనస్ క్రిములు ప్రవేశిస్తాయి. టెటనస్ క్రిములు ఎక్కువగా దుమ్ములో, పేడలో, తుప్పుపట్టిన వాటిలో ఎక్కువగా ఉంటాయి. శరీరానికి ఏదైన గాయం అయినపుడు, ముల్లుగానీ, మేకుగానీ గుచ్చుకున్నప్పుడు, తుప్పుపట్టినవి తెగినప్పుడు తేలికగా శరీరంలోకి ప్రవేశిస్తాయి. సూదులు మరగపెట్టకుండా ఇంజక్షన్స్

ఇచ్చినా. శుభ్రత పాటించకుండా ఆపరేషన్స్ చేసినా, ఆపరేషన్ తరువాత తగిన శ్రద్ధ తీసుకోకపోయినా బయట ఉన్న క్రిములు శరీరంలో చేరి ధనుర్వాతం కలిగిస్తాయి.

చెవిలో చీము కారినప్పుడు, ఒళ్ళు కాలినప్పుడు, పిల్లులు, కుక్కలు కరిచినప్పుడు టెటనస్ క్రిములు తేలికగా అక్కడకు చేరుతాయి. గర్భస్రావాలు అయినప్పుడు, కాన్పులు అయినప్పుడు, రకరకాల చర్మవ్యాధులు కలిగినప్పుడు కూడా టెటనస్ క్రిములు చేరడం, ధనుర్వాతం రావడం ఉంటుంది.

టీకాలు వేసినప్పుడు ఆ చోట కొందరు పేడ రాయడం, మట్టి రాయడం చేస్తారు. పేడ, మట్టిలో ఉండే టెటనస్ క్రిములు ధనుర్వాతాన్ని కలిగించడం సులభం.

శరీరంలో చేరినటువంటి టెటనస్ క్రిములు విడుదల చేసే విషపదార్థాలు రక్తం ద్వారా వెన్నుపాముకి (స్పైనల్ కార్డ్), మెదడుకి చేరి వ్యాధి లక్షణాలు కలుగచేస్తాయి.

వ్యాధి క్రిములు శరీరంలోకి ప్రవేశించిన 6 నుంచి 10 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి. కొందరిలో వ్యాధి లక్షణాలు బయటపడటానికి నెలలు పడుతుంది.

లక్షణాలు :

టెటనస్ ప్రారంభ దశలో జ్వరం, తలనొప్పి, కండరాల నొప్పులు, నీరసం ఉంటాయి. ఆ తరువాత నోరు పూర్తిగా తెరవలేని విధంగా దవడ కీలు బిగుసుకుంటుంది. నీరు త్రాగడం, మింగుడుపడడం కష్టం అవుతుంది. ఆ తరువాత మెడనరాలు బిగదీసుకుంటాయి. మెడ ముందుకి వంచలేకుండా అవుతుంది. వెన్ను కండరాలు కూడా బిగుసుకుపోతాయి. పొట్టకండరాలు కూడా బిగుసుకుంటాయి. దానితో పొట్ట బిర్రుగా మారుతుంది. నడుము విల్లంబులాగా పైకిలేస్తుంది. శరీరంలోని కండరాలు స్పాజంకు లోనవుతాయి.

టెటనస్‌కి తగిన చికిత్స జరగకపోయినట్లయితే వారం, పది రోజులలో ప్రాణాపాయం కలుగుతుంది.

కాంప్లికేషన్స్ :

బ్రోంఖోన్యూమోనియా, శ్వాసక్రియ దెబ్బతినడం, గుండె అస్తవ్యస్తంగా కొట్టుకోవడం తీవ్రంగా జ్వరం.

చంటి పిల్లలలో, వృద్ధులలో, అనారోగ్యం ఉన్న వాళ్ళల్లో టెటనస్ వ్యాధి ఎక్కువ ప్రమాదం కలిగిస్తుంది. వీరిలో కాంప్లికేషన్స్ త్వరగా వస్తాయి.

**చికిత్స :**

1. రక్తంలో చేరిన టెటనస్ క్రిముల విషాన్ని నాడీమండలానికి చేరకముందే నిర్వీర్యం చేయాలి.
2. మరిన్ని కొత్త విషపదార్థాలు తయారవకుండా నిరోధించాలి.
3. ఒకవేళ నాడీవ్యవస్థకి వ్యాధిసోకినా దాన్ని అదుపుచేయాలి.
4. వ్యాధి పూర్తిగా తగ్గేవరకు చికిత్స చేయాలి.
   టెటనస్ వ్యాధి మొదటి దశలోనే విషప్రభావం నాడీమండలానికి సోకకుండా యాంటిటెటనస్ సీరం 10,000 యూనిట్స్ నరానికి ఇవ్వాలి.
5. బెంజైల్ పెన్సిలిన్ 600 మి.గ్రా. ప్రతి 6 గంటలకి ఇవ్వాలి **లేదా** ఎరిత్రోమైసిన్ 500 మి.గ్రా. చొప్పున ప్రతి 6 గం॰లకి ఇవ్వాలి. ఇలా 10 రోజులు వాడాలి.
6. కాంపోజ్ ఇంజక్షన్ 40 - 200 మి.గ్రా. నరం ద్వారా సెలైన్‌లో ఎక్కించి నిదానంగా ఇవ్వాలి. **లేదా**
   క్లోరోప్రొమజిన్ 100 - 300 మి.గ్రా. ɹ 6 గంటలకి ఒకసారి ఇవ్వాలి.
   **లేదా** పెరాల్డిహైడ్ ఇంజక్షన్ 4 గంటలకి ఒకసారి ఇవ్వాలి.
7. రోగి గాలి పీల్చుకోలేకపోతున్నప్పుడు వెంటనే ట్రేకియాస్టమి చేయాలి. వెంటిలేటరులో ఉంచాలి.

**ముందు జాగ్రత్త :**

**బిడ్డకి 6వ వారం, 10వ వారం, 14వ వారంలో డి.పి.టి. ఇంజక్షన్ ఇవ్వాలి. తిరిగి 18వ మాసంలో ఒకసారి ఇవ్వాలి. ప్రతి 5 సంవత్సరాలకి ఒకసారి టెటనస్ టాక్సైడ్ ఇంజక్షన్ ఇవ్వాలి. అంతేకాకుండా గాయాలు తగిలినప్పుడు, ఆపరేషన్లు అయినప్పుడు అదనంగా టెటనస్ టాక్సైడ్ ఇంజక్షన్ తీసుకోవాలి.**

□□□

# 8. రూబెల్లా

*రూబెల్లా వ్యాధినే జెర్మన్ మీజిల్స్ అంటారు. ఈ వ్యాధి వైరస్ క్రిములవల్ల వస్తుంది. గాలి ద్వారా ఈ క్రిములు వ్యాపించి ఒకరి నుంచి మరొకరికి సంక్రమిస్తాయి. వ్యాధిక్రిములు శరీరంలో చేరిన 2 నుంచి 3 వారాలలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

పొంగుజ్వరంవలె ఇందులోనూ రాష్ వస్తుంది. లింఫ్ గ్లాండ్లు కొద్దిగా ఉబ్బు తాయి.

గొంతు పుండుగా అనిపిస్తుంది. కళ్ళు ఎర్రబడతాయి.

**కాంప్లికేషన్స్ :**

కీళ్ళవాపులు, నొప్పులు, ఎన్‌కెఫలైటీస్, థ్రోంబోసైటోపీనిక్ పర్ప్యూర. స్త్రీ గర్భవతిగా ఉండగా రూబెల్లా వచ్చినట్లయితే గర్భస్రావం జరగడంగానీ, పుట్టే బిడ్డకు అంగవైకల్యం రావడంగాని ఉంటుంది.

**నిర్ధారణ :**

కల్చర్ టెస్ట్, హీమ్ ఎగ్లుటినేషన్ ఇన్‌హెబిషన్ టెస్ట్, కాంప్లిమెంట్ ఫిక్సేషన్ టెస్ట్.

**నివారణ :**

1. బిడ్డకి 16వ మాసంలో రూబెల్లా వాక్సిన్ ఇస్తే వ్యాధి నిరోధక శక్తి పెంపొందుతుంది.
2. యం.యం.ఆర్. ఇంజక్షన్‌గా మీజిల్స్, మమ్స్, రూబెల్లా వ్యాధుల నివారణకు ఇవ్వడం జరుగుతుంది.
3. ఆడపిల్లలకు రొటీన్‌గా 12 - 13 సంవత్సరాలలో రూబెల్లా వాక్సిన్ ఇవ్వడం మంచిది. రూబెల్లా వ్యాధివల్ల గర్భస్రావాలు జరగకుండానూ, బిడ్డలకు అంగవైకల్యం కలగకుండానూ నిరోధించవచ్చు.

వ్యాధి వచ్చిన తరువాత ఉపశాంతికి చికిత్స తప్ప సరైన మందులు లేవు.

□□□

# 9. పోలియో

*పోలియో వ్యాధినే పోలియో మైలైటిస్ అనీ, బాలపక్షవాతం అనీ అంటారు. ఈ వ్యాధి కూడా వైరస్ క్రిములవల్ల వస్తుంది. ఈ వ్యాధి క్రిములతో కలుషితం అయిన నీరు, ఆహారం తీసుకున్న పిల్లల ప్రేగుల్లో పోలియో వైరస్ వృద్ధి చెందుతాయి. ఆ తరువాత ప్రేగులగుండా రక్తంలో చేరి వెన్నుపూసకి, మెదడుకి సంక్రమిస్తాయి.*

*పోలియో వైరస్ మూడు తరగతులకి చెంది ఉంటాయి.*

***పోలియో వ్యాధి చిన్నపిల్లలలో రావడం ఎక్కువ. ఆరు నెలల నుంచి 3 సంవత్సరాల పిల్లలలో పోలియో ఎక్కువ కనబడుతుంది.***

**లక్షణాలు :**

పోలియో వస్తున్నట్లుగా ముందుగా గుర్తించడం కష్టం. మామూలు జ్వరాల్లోలాగానే జలుబు, గొంతునొప్పి, దగ్గు ఉంటాయి. వికారం, వాంతులు, విరోచనాలు ఉంటాయి.

తలనొప్పి, జ్వరం, చికాకు, నీరసం ఉంటాయి. ఈ రకంగా రెండు మూడు రోజులు అనారోగ్యం ఉండి అకస్మాత్తుగా కాలో, చెయ్యో చచ్చుబడటం జరుగుతుంది. ఒకోసారి రెండు కాళ్ళు చచ్చుబడతాయి. కాళ్ళకి పక్షవాతం రావడం ఎక్కువ. నడుము, పొట్ట కండరాలకి కూడా పక్షవాతం రావచ్చు. ఛాతి కండరాలకి డయాఫ్రమ్‌కి పోలియోవల్ల పక్షవాతం వచ్చినప్పుడు గాలి తీసుకోవడం కష్టమవుతుంది. పోలియో వచ్చిన కొందరిలో ఫిట్స్ కూడా వస్తాయి.

పోలియో క్రిములు సంక్రమించిన ప్రతి ఒక్కరికి కాలు, చేయి చచ్చుపడవు. కేవలం కొద్ది శాతం మందిలోనే వ్యాధి లక్షణాలు ఏర్పడతాయి. తక్కినవారిలో జ్వరం, తలనొప్పి, కండరాల నొప్పి వచ్చి తగ్గిపోతాయి.

నిర్ధారణ :

సెరిబ్రోస్పైనల్ ఫ్లూయిడ్ ఎగ్జామినేషన్, పోలియో వైరస్ కల్చర్.

చికిత్స :

1. బిడ్డకు పోలియో వచ్చిందన్న అనుమానం కలగగానే పూర్తి బెడ్‌రెస్ట్ ఇవ్వాలి. పోలియో వచ్చినప్పుడు కండరాలు బాగా నొప్పి అనిపిస్తాయి. అందుకని పోలియో వచ్చిన చేయినిగానీ, కాలునిగానీ కదపకుండా ఉంచాలి. పోలియో వచ్చిన భాగానికి దన్నుగా చిన్న దిండ్లు వంటివి పెట్టాలి.
2. నొప్పి తగ్గడానికి బ్రూఫిన్ సిరప్ చెంచా చొప్పున రోజుకి 3 సార్లు ఇవ్వాలి.
3. వేడి నీళ్ళ కాపడం పెట్టాలి.
4. త్రాగడానికి మంచినీళ్ళు ఎక్కువ ఇవ్వాలి.
5. కండరాల నొప్పి తగ్గిన తరువాత ఫిజియోథెరపి ప్రారంభించాలి. పోలియో వచ్చిన శరీరభాగాన్ని నిదానంగా కదుపుతూ కండరాలకి వ్యాయామం చేయించాలి.

పోలియో వచ్చిన ఆరు వారాలలో బిడ్డ చాలావరకు కోలుకోవడం జరుగుతుంది. ఆపైన ఆరు నెలల వరకు మరింత కోలుకోవడం ఉంటుంది.

పోలియో వచ్చిన వారిలో కండరాలు, కీళ్ళు బాగా బలహీనం అవుతాయి. కీళ్ళు పటుత్వం కోల్పోయి ప్రక్కకి తొలుగుతాయి.

పోలియో వచ్చిన తరువాత నయం చేయడానికి ప్రత్యేకమైన మందులు ఏమీ లేవు. ఫిజియోథెరపీ ఒక్కటే సరైన చికిత్స.

**పోలియో రాకుండా :**

బిడ్డ పుట్టిన 4వ వారం నుంచి ప్రతినెలా 5 నెలలపాటు పోలియో చుక్కలు వేయించాలి. తిరిగి 18వ మాసంలోనూ, 5వ సంవత్సరంలోనూ పోలియో చుక్కలు వేయించాలి. పోలియో చుక్కలు వేయించినవారికి పోలియో రావడం ఉండదు.

# 10. ఇన్‌ఫెక్టివ్ మోనో న్యూక్లియోసిస్

*ఇన్‌ఫెక్టివ్ మోనో న్యూక్లియోసిస్‌నే గ్లాండ్యులార్ ఫీవర్ అంటారు. ఇది వైరస్ క్రిములవల్ల వస్తుంది. ఇందులో ముఖ్యంగా జ్వరం, లింఫ్ గ్లాండ్ల వాపు, రక్తంలో మోనో న్యూక్లియార్ సెల్స్ ఉంటాయి.*

*ఈ వ్యాధి ముఖ్యంగా యవ్వనప్రాయంలో అడుగుపెడుతున్న వారిలో కనబడుతుంది. 14 నుంచి 35 సంవత్సరాల వారిలో ఈ వ్యాధి వస్తుంది. ఈ వ్యాధి వచ్చినవారిలో వైరస్ క్రిములు రోగి గొంతులోనూ, లాలాజలంలోనూ ఉంటాయి. రోగిని ముద్దుపెట్టుకున్నా, రోగి తాగిన గ్లాస్‌తో మరొకరు మంచినీళ్ళు త్రాగినా మరొకరికి తేలికగా సంక్రమిస్తుంది. వ్యాధిక్రిములు ప్రవేశించిన 10 నుంచి 14 రోజులలో వ్యాధి లక్షణాలు కనబడతాయి.*

**లక్షణాలు :**

ముందు జ్వరం కనబడుతుంది. 3 -4 రోజులలో ఒళ్ళంతా రాష్ వస్తుంది. జ్వరం 2 -3 వారాలు ఉంటుంది. జ్వరం కనబడిన 3 వారాలకి శరీరంలో వివిధచోట్ల లింఫ్ గ్లాండ్లు వాచి సలపరం కలిగిస్తాయి. స్ప్లీన్ పెరుగుతుంది. గొంతు నొప్పి అనిపిస్తుంది. చిగుళ్ళు వాస్తాయి. చిగుళ్ళ వెంట రక్తం వస్తుంది. పచ్చకామెర్లు వస్తాయి.

**కాంప్లికేషన్స్ :**

శ్వాస తీసుకోడానికి అడ్డంకి కలుగుతుంది, స్ప్లీన్ రప్చర్ అవుతుంది, నరాలు దెబ్బతింటాయి.

**నిర్ధారణ :**

రక్త పరీక్షలో అసాధారణమైన మోనోసైట్స్ ఎక్కువగా కనబడతాయి, హెటిరోఫిల్ యాంటి బాడీ టెస్ట్, వైరల్ క్యాప్సిడ్ యాంటిజెన్స్‌కి యాంటి బాడీస్, వ్యాధికి సంబంధించిన వైరస్‌ని కల్చర్ చేయడం.

**చికిత్స :**

1. ఈ వ్యాధికి సరైన మందు లేదు.
2. రోగికి పూర్తిగా 2 -3 వారాలు బెడ్ రెస్ట్ ఇవ్వాలి.
3. ఎరిత్రోమైసిన్ టాబ్లెట్స్ వాడినట్లయితే వైరస్‌తోపాటు తోడయిన బాక్టీరియా క్రిములని అరికట్టవచ్చు.
4. కార్టికో స్టిరాయిడ్స్ రోగికి త్వరగా ఉపశాంతిని చేకూరుస్తాయి.

□□□

# 11. మలేరియా

మలేరియా జ్వరాన్నే చలి జ్వరం అంటారు. ఎనాఫిలస్ జాతికి చెందిన ఆడదోమలు కుట్టడంవల్ల మలేరియా వ్యాధి వస్తుంది. మలేరియా జ్వరం పిల్లలు, పెద్దలు అందరికి సమానంగా వస్తుంది. జులై నుంచి నవంబరు మాసం వరకు మలేరియా జ్వరాలు ఎక్కువ.

**మలేరియా జ్వరం 3 దశలుగా వస్తుంది. జ్వరం మొదట్లో ఒళ్ళు వేడి లేకుండానే చలి వణికిస్తుంది. దీన్ని 'కోల్డ్ స్టేజ్' లేదా మొదటి దశ అంటారు. ఇది అరగంట నుంచి గంట వరకు ఉంటుంది. ఇక రెండవ దశని 'హాట్ స్టేజ్' అంటారు. ఇందులో జ్వరం చాలా తీవ్రంగా ఉంటుంది. ఇలా 1 గంట నుంచి 4 గంటలు జ్వరం ఉంటుంది. 3వ దశనే 'స్వెట్టింగ్ స్టేజ్' అంటారు. విపరీతంగా చెమటలు పోసి జ్వరం దిగిపోతుంది. చెమటలతో రోగి ధరించిన దుస్తులు తడిసిపోతాయి. ఈ మూడవ దశ 2 నుంచి 3 గంటలు ఉంటుంది.**

మలేరియా వచ్చిన అందరిలోనూ పై విధంగానే విడివిడిగా మూడు దశలు కనపడకపోవచ్చు. జ్వరం, చలి ఒకేసారి ఉండొచ్చు. చివరలో చెమటలు మాత్రం విపరీతంగా పోస్తాయి.

**లక్షణాలు :**

మలేరియా కనబడటానికి 1, 2 రోజులు ముందు నుంచి తలనొప్పి, కొద్దిపాటిగా చలి, ఒళ్ళునొప్పులు ఉండవచ్చు. మలేరియా జ్వరం ప్రారంభం అయిన తరువాత చలి, జ్వరం, చెమటలు ఉంటాయి. తలనొప్పి, ఒళ్ళునొప్పులు, కండరాల నొప్పులు, కడుపునొప్పి, వికారం, వాంతులు, విరోచనాలు ఉండటం మామూలే. కొందరిలో మలేరియా జ్వరం లక్షణాలు తీవ్రంగా ఉంటాయి. రక్తపోటు పడిపోతుంది. నాడి తగలకుండా అవుతుంది. మూత్రపిండాల ఫంక్షన్ ఫెయిలవుతుంది. ఫిట్స్ కనబడతాయి. కోమా వస్తుంది. స్ప్లీన్, లివర్ పెరుగుతాయి. మూత్రం నల్లగా వస్తుంది. మలేరియా వచ్చినవారిలో రక్తహీనత ఏర్పడటం సహజం. నీరసం అతిగా ఉంటుంది. కొందరిలో పల్మొనరి ఎడీమా వస్తుంది.

చలి అనిపించే ప్రతి జ్వరం మలేరియా కాదు. బోదకాలు జ్వరం (ఫైలేరియా), టాన్సిల్స్ వాపు, మూత్రపిండాల వ్యాధులు, శరీరంలో ఎక్కడైనా చీమి ఎక్కువగా చేరడం, మెదడువాపు జబ్బులు ఉన్నప్పుడు కూడా చలిజ్వరం వస్తుంది.

ఫాల్సిఫారం తరగతికి చెందిన పెరసైట్‌వల్ల మలేరియా వస్తే ఆ క్రిమి మెదడుకి చేరి సెరిబ్రల్ మలేరియా కలిగించవచ్చు. సెరిబ్రల్ మలేరియా వచ్చినవారిలో అపస్మారక స్థితి వస్తుంది. ప్రాణాపాయం కలిగే అవకాశం ఉంది.

## నిర్ధారణ :

చలి జ్వరం అనిపించగానే రక్తపరీక్ష చేసి మలేరియాని నిర్ధారణ చేయవచ్చు. కొందరిలో రక్త పరీక్ష చేసినా మలేరియా క్రిమి కనబడకపోవచ్చు. కానీ ఇతర వ్యాధులు ఏమీ కనబడకుండా కేవలం చలి, జ్వరం అయితే క్లోరోక్విన్ వాడి చూడొచ్చు. ఆ జ్వరం మలేరియా అయినట్లయితే క్లోరోక్విన్‌తో వెంటనే కంట్రోలు అవుతుంది. ఇది కూడా ఒక వ్యాధి నిర్ధారణ పద్ధతి. మలేరియా అయినా కాకపోయినా క్లోరోక్విన్ వాడవచ్చు. హాని ఏమీ కలగదు.

## చికిత్స :

1. మలేరియా జ్వరానికి క్లోరోక్విన్ సరైన మందు. క్లోరోక్విన్ సిరప్ రూపంలోనూ, బిళ్ళల రూపంలోనూ, ఇంజక్షన్ రూపంలోనూ లభ్యమవుతుంది.
2. మలేరియా జ్వరం అనుకున్నప్పుడు 15 సంవత్సరాలు దాటినవారు ఒకేసారి 4 బిళ్ళలు వేసుకోవాలి. తరువాత 6 గంటలకి రెండు బిళ్ళలు వేసుకోవాలి. ఆపైన ప్రతి 24 గంటలకి 2 బిళ్ళలు చొప్పున రెండు రోజులు వాడాలి. ఇలా మొత్తం పది బిళ్ళలు వాడాలి.
3. చిన్నపిల్లల్లో ఒక సంవత్సరంలోపు పిల్లలకి క్లోరోక్విన్ అరబిళ్ళ వేయాలి. లేదా రెండు స్పూన్లు 10 యం.యల్ క్లోరోక్విన్ సస్పెన్షన్ ఇవ్వాలి. 1 నుంచి 4 సంవత్సరాల పిల్లలకి 1 బిళ్ళ లేదా 4 స్పూన్లు 20 యం.యల్. ఇవ్వాలి. 4 నుంచి 8 సంవత్సరాల పిల్లలకి రెండు బిళ్ళలు వేయాలి. 8 నుంచి 14 సంవత్సరాల పిల్లలకి మూడు బిళ్ళలు వేయాలి. ఈ పైన చెప్పిన మోతాదు మొదటిసారి వెయ్యవలసిన మోతాదు. ఆ తరువాత 6 గంటలకి, మళ్ళీ 24 గంటలకు వరుసగా రెండు రోజులు మొదటి డోస్‌లో సగం వేయాలి.
4. రక్తపరీక్షల్లో మలేరియా ఉన్నట్లు నిర్ధారణ అయితే పిల్లలుగానీ, పెద్దవాళ్ళుగానీ వారి నిర్ణీత క్లోరోక్విన్ మోతాదు వాడి ఆ తరువాత రాడికల్ ట్రీట్‌మెంటుగా ప్రైమాక్విన్ టాబ్లెట్లు 5 రోజులు వాడాలి.



5. ప్రైమాక్విన్ టాబ్లెట్లు 1 నుంచి 4 సంవత్సరాలలోపువారికి రోజుకో బిళ్ళ వాడాలి. 4 నుంచి 8 సంవత్సరాల వారికి రోజుకి 2 బిళ్ళలు, 8 నుంచి 14 సంవత్సరాల పిల్లలకి రోజుకి 4 బిళ్ళలు, 15 సంవత్సరాలు దాటిన వారికి రోజుకి 6 బిళ్ళలు వాడాలి. ఈ మందును రోజుకి 2 మోతాదులుగా వాడొచ్చు.

**ముందు జాగ్రత్తగా మలేరియా మందు :**

మలేరియా లేనివాళ్ళు, మలేరియా ఉండే ప్రాంతానికి వెళ్ళేటప్పుడు మలేరియా రాకుండా ముందు జాగ్రత్తగా ఒక వారం రోజులు ముందు ఉదయం-రెండు, రాత్రి-రెండు క్లోరోక్విన్ బిళ్ళలు ఒకరోజు వాడాలి. ఆ తరువాత ప్రతి వారం 2 బిళ్ళలు వేసుకోవాలి.

**మలేరియా జ్వరం వచ్చినప్పుడు :**

మలేరియాకి క్లోరోక్విన్ బిళ్ళలు కోర్సుగా వాడటమే కాకుండా జ్వరం ఉన్న సమయంలో మంచినీళ్ళు, ఇతర ద్రవపదార్థాలు ఎక్కువగా వాడాలి. అవసరంబట్టి నరానికి సెలైన్ పెట్టాలి. మలేరియా వచ్చినప్పుడు కొందరిలో షాక్ పరిస్థితి, మూత్రపిండాల ఫెయిల్యూర్ రావచ్చు. ఈ పరిస్థితి ముందుగానే గుర్తించి చికిత్స చేయాలి.

❑❑❑

## 12. కాలాజార్

*కాలాజార్ వ్యాధి లీష్మానియా డోనోవాని అనే పరాన్నభుక్తజీవి వల్ల వస్తుంది. ఈ వ్యాధి వచ్చినవారిలో చాలాకాలంపాటు జ్వరం రావడం, పోవడం, లివర్, స్ప్లీన్ పెరగడం, రక్తహీనత ఏర్పడడం, తెల్లకణాలు తగ్గిపోవడం ఉంటుంది. ఈ వ్యాధి సాండ్ ఫ్లైస్ ద్వారా సంక్రమిస్తుంది. వ్యాధికి సంబంధించిన క్రిమి శరీరంలోకి ప్రవేశించిన 2 నుంచి 6 నెలల్లో లక్షణాలు కనబడతాయి.*

**లక్షణాలు :**

కుడి డొక్కలో నొప్పి, తలనొప్పి, దగ్గు, ముక్కు వెంట రక్తం, బరువు కోల్పోవడం, తరచుగా విరోచనాలు, పాదాలకి నీరు, జ్వరం, ముఖంమీద నల్లమచ్చలు, లివర్,స్ప్లీన్, లింఫ్ గ్లాండ్లు పెరుగుదల ఉంటాయి.

**నిర్ధారణ :**

లివర్, స్ప్లీన్, బోన్‌మారో యాస్పిరేషన్ ద్వారా వ్యాధికారక క్రిమిని కనుగొనడం. సీరాలజి పరీక్ష.

చికిత్స :

1. పెంటావాలెంట్ యాంటీమొనీ లేదా డైమెడిన్
2. యాంటిబయోటిక్స్
3. ఐరన్
4. స్ప్లినెక్టమీ

❑❑❑

# 13. ఎమీబియాసిస్

*ఈ వ్యాధి ఎంటమీబా హిస్టలిటికా అనే క్రిమివల్ల సంక్రమిస్తుంది. ప్రధానంగా ఈ వ్యాధి జీర్ణకోశం ప్రేగులకి సంబంధించినది. ఆ తరువాత ఎక్కువగా ఈ వ్యాధి వస్తుంది.*

కారణాలు :

ఎమీబా క్రిమిగానీ, సిస్టులుగానీ ఉన్న నీరు, ఆహారం తీసుకున్నవారికి ఈ వ్యాధి వస్తుంది. సాధారణంగా ఎమీబియాసిస్ రోగి విసర్జించిన మలంతో కలుషితమైన నీరు త్రాగడంవల్ల ఈ వ్యాధి వస్తుంది. ఎమీబియాసిస్‌కి సంబంధించిన ఈ క్రిమి శరీరంలోకి ప్రవేశించిన వారం, రెండు వారాలలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.

లక్షణాలు :

ఎమీబియాసిస్‌లో ప్రధానంగా జిగట విరోచనాలు ఎక్కువ అవుతాయి. ఈ విరోచనాలు అకస్మాత్తుగా మొదలయి రోజుకి 10 నుంచి 20 అవుతాయి. కొందరిలో విరోచనంలో జిగురుతోపాటు రక్తం కూడా ఉంటుంది. ఎమీబియాసిస్ ఉన్నవాళ్ళలో కడుపులో ప్రేగులు మెలిపెడుతున్నట్టు నొప్పి అనిపిస్తుంది. విరోచనాలు లేకపోయినా కడుపునొప్పి ఉండొచ్చు. కొందరిలో రోజుకి 3, 4 విరోచనాలు అవడం, అలా కొద్దిరోజులు ఉండి తగ్గిపోవడం, ఆ తరువాత కొంతకాలం మలబద్ధకం రావడం ఉంటుంది. ఈ రకంగా కొంతకాలం విరోచనాలు, మలబద్ధకం ఉంటూ ఉంటుంది. కడుపు ఉబ్బరంగా ఉంటుంది. చెయ్యిపట్టి కడుపు నొక్కితే నొప్పి అనిపిస్తుంది. కొందరిలో లివర్ పెరిగి కనబడుతుంది. కడుపు ఉబ్బరం అనిపిస్తుంది, ఆకలి సరిగా ఉండదు. కొద్దిగా తినగానే కడుపు ఉబ్బినట్టుగా కనబడుతుంది. జీర్ణశక్తి సరిగా ఉండదు.



కాంప్లికేషన్స్ :

**ఎమీబిక్ లివర్** - ఎమీబియాసిస్ వల్ల లివర్‌లో యాబ్సిస్ వస్తుంది. దానివల్ల లివర్ దగ్గర నొప్పి ఉంటుంది. లివరు సైజు పెరుగుతుంది. జ్వరం వస్తుంది. కొద్దిపాటిగా పచ్చకామెర్లు కనబడతాయి. చెమటలు ఎక్కువ పోస్తాయి. ఎమీబియాసిస్‌వల్ల జీర్ణకోశంలో పుళ్ళు ఏర్పడతాయి. అరుదుగా కొందరికి ఆ పుళ్ళవల్ల ప్రేగుకి చిల్లు పడుతుంది. అరుదుగా కొందరిలో ఎమీబా క్రిములు మెదడు, గుండె, ఊపిరితిత్తులు, స్ప్లీన్ మొదలైన శరీర అవయవాలకి చేరి అక్కడ వ్యాధిని కలుగచేస్తాయి.

నిర్ధారణ :

విరోచనం పరీక్ష (విరోచనంలో ఎమీబా క్రిములు, సిష్టులు కనబడతాయి), రెక్టోస్కోపి సిగ్మాయిడో, సీరాలజి, అరుదుగా ఏర్పడే కాంప్లికేషన్స్‌బట్టి ఆయా అవయవాల పరీక్ష.

చికిత్స :

1. డైలాక్సినైడ్ ఫ్యూరేట్ (ఎమిలాస్ట్ ఫోర్ట్ లేదా డైరేడ్-యం.) తడవకి ఒక బిళ్ళ చొప్పున రోజుకి 3 సార్లు అలా పది రోజులు **లేదా**
2. మెట్రోనిడజోల్ (మెట్రోజిల్ - 400, ఫ్లాజిల్ - 400) తడవకి ఒకటి చొప్పున రోజుకి 3 సార్లు. అలా వారం 10 రోజులు **లేదా**
3. కినడజోల్ 600 మి.గ్రా. రోజుకి రెండుసార్లు చొప్పున 5 రోజులు.

పై మందులు ఏవైనా ఒక రకం వాడితే సరిపోతుంది. ఎమీబిక్ లివర్ యాప్సిస్ ఉన్నప్పుడు మెట్రోనిడజాల్ ఇంజక్షన్ నరానికి ప్రతి 8 గంటలకి ఒకసారి చొప్పున 3 రోజులు ఇవ్వాలి.

చిన్న పిల్లలకి మెట్రోనిడజాల్ సస్పెన్షన్ 5 యం.యల్. చొప్పున రోజుకి 3 సార్లు పట్టాలి.

□□□

# 14. రక్త విరోచనాలు

*రక్త విరోచనాలనే బాసిలరి డిసెంట్రి అంటారు. ఈ విరోచనాలు షిగల్లా గ్రూపుకి చెందిన బాక్టీరియావల్ల వస్తాయి. కలుషితం అయిన నీరు, ఆహారం తీసుకోవడంవల్ల బెసిలరి డిసెంట్రి వస్తుంది. ఈ క్రిములు శరీరంలో చేరిన 1 నుంచి 4 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

బాక్టీరియల్ డిసెంట్రి చిన్నపిల్లల్లో ఎక్కువ. ఈ విరోచనాలు సడన్‌గా మొదలవుతాయి. మాటిమాటికి అవుతాయి. జ్వరం కూడా ఉండొచ్చు. కడుపులో నొప్పి ఉంటుంది. విరోచ నానికి వెళ్ళొచ్చినా ఇంకా వెళ్ళాలనే ఉంటుంది. విరోచనం పలచగా ఉంటుంది. రక్తం కూడా పడుతుంది. రోజుకి 10, 15 విరోచనాలు అవుతాయి. కొందరిలో వాంతులు అవుతాయి. డీహైడ్రేషన్ కూడా కలగొచ్చు. విరోచనాలు తగ్గినట్టు తగ్గి మళ్ళీ అవుతాయి.

**నిర్ధారణ :**

మోషన్ కల్చర్, విరోచనం పరీక్ష.

**చికిత్స :**

సిప్రాన్ 250 మి.గ్రా. బిళ్ళలు ఉదయంఒకటి, రాత్రిఒకటి చొప్పున 5 రోజులు. లేదా ఐమోసెక్-ఎఫ్ తడవకి ఒక క్యాప్సూల్ చొప్పున రోజుకి మూడు సార్లు. ఇలా 2 నుంచి 5 రోజులు వాడాలి.

❑❑❑

## 15. కలరా

*ఈ వ్యాధి విబ్రియో కలరా అనే బాక్టీరియా క్రిమివల్ల వస్తుంది. కలుషితమైన నీరు, ఆహారం తీసుకోవడంవల్ల ఈ వ్యాధి వస్తుంది. వ్యాధి క్రిమి శరీరంలోకి చేరిన ఒకటి, రెండు రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

కలరా వ్యాధిలో అకస్మాత్తుగా నీళ్ళ విరోచనాలు మొదలవుతాయి. మొదట నీళ్ళ విరోచనాలు పసుపు రంగులో ఉంటాయి. ఆ తరువాత పూర్తిగా నీరులాగా మారతాయి. విరోచనాలు ఎటువంటి రంగు ఉండవు. విరోచనంలో కొద్దిపాటి మ్యూకస్ కూడా ఉంటుంది. విరోచనాలు చూడటానికి బియ్యపు కడుగునీళ్ళలాగా ఉంటాయి. విరోచనాలు మాటిమాటికి అవుతాయి. వాంతులు కూడా ఉంటాయి. చాలా త్వరగా డీహైడ్రేషన్ కలుగుతుంది. ఒళ్ళు చల్లబడిపోతుంది. త్వరితంగా ఒంట్లో నీరు ఎండిపోవడంతో నాడి అందకుండా అవుతుంది. కండరాలలో క్రాంప్స్ వస్తాయి. కాళ్ళ పిక్కలు బిగపట్టేస్తాయి. ఎంతో నొప్పి అనిపిస్తుంది. మూత్రం తయారీ లేకుండా అవుతుంది. పేషెంట్ పరిస్థితి విషమంగా మారుతుంది.

నిర్ధారణ :

కలరా రోగి నీళ్ళ విరోచనాలని మైక్రోస్కోప్‌లో పరీక్షచేస్తే వ్యాధికారక క్రిమి కనబడుతుంది. విరోచనం కల్చర్‌చేస్తే కలరా క్రిమి వృద్ధి అవుతుంది.

చికిత్స :

1. కలరా రోగిని తక్కినవారి నుంచి వేరుచేయాలి.
2. కలరా రోగి విసర్జించిన మలమూత్రాలతో- త్రాగే నీరు, తినే ఆహారం కలుషితం కాకుండా చూడాలి.
3. కలరా రోగిలో డీహైడ్రేషన్ ఉంటుంది. కనుక నరానికి గ్లూకోజ్, సెలైన్ ఎక్కించాలి. డీహైడ్రేషన్ సరిదిద్దేవరకు వేగంగా నరానికి సెలైన్ పెట్టాలి. డీహైడ్రేషన్ తగ్గిన తరువాత కూడా విరోచనాలు పూర్తిగా తగ్గేవరకు సెలైన్ పెట్టాలి.
4. టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. చొప్పున ప్రతి 6 గంటలకి 3, 4 రోజులు ఇవ్వాలి. **లేదా** ఫిరాక్సోన్ 400 మి.గ్రా. చొప్పున రోజుకి ఒక్కసారి ఇవ్వాలి. అలా 3 రోజులు ఇవ్వాలి.

కలరా రాకుండా ప్రతి ఆరు నెలలకి ఒకసారి కలరా వాక్సిన్ వేయించుకోవాలి.

❑❑❑

# 16. ప్లేగు

*ఎర్సీనియా పెస్టిస్ అనే బాక్టీరియావల్ల ప్లేగు వ్యాధి వస్తుంది. కొన్ని రకాల పురుగులు కుట్టడంవల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది. ఈ వ్యాధి క్రిములు శరీరంలో ప్రవేశించిన 2 నుంచి 4 రోజులలో వ్యాధి లక్షణాలు బయటకు కనబడతాయి.*

లక్షణాలు :

ప్లేగు వచ్చినవారిలో ఒళ్ళునొప్పులు, మగత, మానసిక గందరగోళ పరిస్థితి ఉంటుంది. గజ్జల్లో గడ్డలు కడతాయి. గడ్డలు సలపరం కలిగిస్తాయి. జ్వరం ఉంటుంది. వాంతులు ఉంటాయి. లివర్, స్ప్లీన్ పెరుగుతాయి. కొందరిలో ఊపిరితిత్తుల్లో ప్లేగు లక్షణాలు తీవ్రంగా ఉంటాయి. చలి, జ్వరం, వణుకు, ఛాతీలో నొప్పి, దగ్గు, ఆయాసం, రక్తంతో కూడిన కళ్ళె ఉంటాయి. రోగి పరిస్థితి విషమంగా మారుతుంది. ప్లేగు లక్షణాలు

అందరిలోనూ ఒకేలా ఉండవు. గజ్జల్లో బిళ్ళలు కట్టి, జ్వరం వచ్చి బాధ కలిగించే ప్లేగు వ్యాధిని "బ్యూబోనిక్ ప్లేగు" అంటారు. ఇది ఎక్కువమందిలో కనబడుతుంది. శ్వాసకోశాలకి వచ్చే ప్లేగువ్యాధిని "ప్రైమరి న్యూమోనిక్ ప్లేగు" అంటారు. శరీరమంతా విషప్రభావాన్ని కలిగించిన ప్లేగుని "సెప్టిసీమిక్ ప్లేగు" అంటారు. ప్రైమరీ న్యుమోనిక్స్, సప్టిసీమిక్ ప్లేగు వ్యాధులు చాలా సీరియస్ ప్లేగు వ్యాధులు.

**నిర్ధారణ :**

లింఫ్ గ్లాండ్లు, రక్తము, కళ్ళె నుండి వై. పెస్టిస్ క్రిములని వేరుచేసి గుర్తించడం; సీరాలజి పరీక్షలు.

**చికిత్స :**

1. టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. క్యాప్సూల్స్ ప్రతి 6 గంటలకి ఒకసారి చొప్పున 10 రోజులు వాడాలి.
2. నొప్పి తగ్గడానికి మందులు వాడాలి.
3. మంచి ఆహారం తీసుకోవాలి.

ఇమ్యూనైజేషన్ - ప్లేగు రాకుండా ప్లేగు వాక్సిన్ 5 యం.యల్. చేయించుకుని తిరిగి వారం రోజులకి 1 యం.యల్. వాక్సిన్ చేయించుకోవాలి. ఈ వాక్సిన్‌వల్ల దాదాపు సంవత్సరం రక్షణ ఉంటుంది.

□□□

# 17. టైఫాయిడ్

*సాల్మోనెల్లా టైఫి అనే బాక్టీరియా క్రిమివల్ల టైఫాయిడ్ జ్వరం వస్తుంది. ఈ క్రిమితో కలుషితమైన నీరు, ఆహారం తీసుకున్నవారిలో టైఫాయిడ్ జ్వరం వస్తుంది. ఈ క్రిమి శరీరంలోకి ప్రవేశించిన 10, 15 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.*

**లక్షణాలు :**

టైఫాయిడ్ జ్వరం నిదానంగా పెరుగుతుంది. తలనొప్పి ఉంటుంది. ఒళ్ళునొప్పులు ఉంటాయి. ఆకలి తగ్గిపోతుంది. కడుపులో నొప్పి ఉంటుంది. కొందరిలో కొద్దిగా విరోచనాలు అవుతాయి. మరికొందరిలో విరోచనాలు అయిన తరువాత మలబద్ధకం ఏర్పడుతుంది.

నాలిక మీద తెల్లగా కోటింగు ఏర్పడుతుంది. నాలిక అంచులు ఎర్రగా కనబడతాయి. కడుపు ఉబ్బరంగా ఉంటుంది. నొప్పి అనిపిస్తుంది.

జ్వరం రోజురోజుకి కొద్దికొద్దిగా పెరుగుతూ వారం రోజులకి 103 డిగ్రీలు మించి ఉంటుంది. దగ్గు వస్తుంది. ముక్కు వెంట రక్తం రావచ్చు. జ్వరంతో సమానంగా నాడీ వేగం పెరగదు.

టైఫాయిడ్ జ్వరం వచ్చిన 2వ వారంలో స్ప్లీన్ పరిణామం పెరుగుతుంది. కడుపు ఉబ్బరం, నొప్పి ఎక్కువవుతాయి. ఒంటిమీద కొద్దిగా రాష్ కనబడుతుంది. విరోచనాలు కూడా అవుతాయి. సాధారణంగా జ్వరం కనబడిన 2 వారాలకి వ్యాధి తగ్గుముఖం పడుతుంది. కొందరిలో కాంప్లికేషన్స్ తలెత్తుతాయి. ఈ రోజుల్లో టైఫాయిడ్‌కి చక్కని మందులు ఉన్నాయి. కాంప్లికేషన్స్ అరుదు.

**కాంప్లికేషన్స్ :**

పెరఫరేషన్, హెమరైజ్, పెరటైటిస్, ఎక్యూట్ కోలి సిస్టైటిస్, న్యూమోనియా, రీనల్ ఫెయిల్యూర్, మయోకార్డైటీస్, మెనింజైటీస్.

**నిర్ధారణ :**

తెల్లకణాల సంఖ్య తగ్గిపోతుంది. వైడాల్ టెస్ట్ - పాజిటివ్ వస్తుంది. కల్చర్ టెస్ట్.

**చికిత్స :**

1. క్లోరోమైసిటిన్ - 500 మి.గ్రా. క్యాప్సూల్స్ ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున 10 రోజులు వాడాలి **లేదా** సిప్రాన్ 500 మి.గ్రా. చొప్పున ఉదయంఒకటి, రాత్రిఒకటి చొప్పున పది రోజులు వాడాలి.
2. జ్వరం తగ్గేవరకు జావ, పళ్ళరసాలు, గ్లూకోజ్, పాలు ఇవ్వాలి.
3. కొందరిలో టైఫాయిడ్‌వల్ల టాక్సిక్ లక్షణాలు పెంపొందుతాయి. దానికి చికిత్స చేయాలి.

టైఫాయిడ్ రాకుండా ముందుగానే టైఫాయిడ్ వాక్సిన్ చేయించాలి.

❑❑❑

# 18. రికెట్సియల్ డిసీజ్

*రికెట్సియల్ డిసీజ్ ముఖ్యంగా రెండు రకాలు. టైఫస్ ఫీవర్, స్పాటెడ్ ఫీవర్. ఈ వ్యాధి ఒక విధమైన బాక్టీరియా క్రిమివల్ల వస్తుంది. ఈ వ్యాధి ఒకరి నుంచి మరొకరికి*

పేను, నల్లి వంటి క్రిములు కుట్టడం ద్వారా సంక్రమిస్తుంది.

**టైఫస్ ఫీవర్ :**

ఈ వ్యాధి పేను కుట్టడం ద్వారా సంక్రమిస్తుంది. వ్యాధి క్రిమి శరీరంలోకి ప్రవేశించిన 10 నుంచి 14 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.

**లక్షణాలు :**

చలితో కూడిన జ్వరం, విపరీతమైన తలనొప్పి, కండరాల నొప్పులు, ఎర్రబడిన కళ్ళు, నిద్రలేమి, వాంతులు, ఫిట్స్, సంధి లక్షణాలు. జ్వరం కనబడిన 5వ రోజు నుంచి ఒళ్ళంతా రాష్ వస్తుంది. జ్వరం తీవ్రంగా ఉంటుంది. విపరీతమైన నీరసం ఉంటుంది. రక్తపోటు పడిపోతుంది.

సాధారణంగా 2 వారాలలో వ్యాధి తగ్గుముఖం పడుతుంది. కొందరిల బ్రోంఖోన్యుమోనియా, మయోకార్డైటిస్, చెవిలో చీము వస్తాయి.

**స్పాటెడ్ ఫీవర్ :**

ఈ వ్యాధి తవుడు పురుగు కుట్టడం ద్వారా సంక్రమిస్తుంది. దీనివల్ల అకస్మాత్తుగా జ్వరం వస్తుంది. చలి ఉంటుంది. విపరీతమైన తలనొప్పి ఉంటుంది. వెలుతురు చూడలేకపోతారు. కీళ్ళనొప్పులు, కండరాల నొప్పులు, అతి నీరసం ఉంటాయి. ఒంటిమీద రాష్ వస్తుంది.

**నిర్ధారణ :**

ఐ.ఎఫ్.ఎ. టెస్ట్, వీల్ ఫెలిస్ రియాక్షన్, ఎలీజా టెస్ట్.

**చికిత్స :**

టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. చొప్పున ప్రతి 6 గంటలకి వేయాలి. అలా 10 రోజులు వాడాలి. **లేదా** డాక్సిసైకిలిన్ 200 మి.గ్రా. 5 రోజులు వాడాలి.

□□□

## 19. డెంగ్ ఫీవర్

ఈ జ్వరం వైరస్ క్రిమివల్ల వస్తుంది. వ్యాధి క్రిమి శరీరంలోకి ప్రవేశించిన 4 నుంచి 6 రోజులలో లక్షణాలు బయటపడతాయి.

**లక్షణాలు :**

విపరీతమైన తలనొప్పి, ఒళ్ళునొప్పులు, కీళ్ళనొప్పులు, కండరాల నొప్పులు ఉంటాయి.

తీవ్రంగా జ్వరం ఉంటుంది. కళ్ళు, ముఖం ఉబ్బుగా కనబడతాయి. వికారం, వాంతులు ఉంటాయి. ఒంటిమీద రాష్ వస్తుంది. శరీరంలో వివిధచోట్ల లింఫ్ గ్లాండ్లు ఉబ్బుతాయి. అక్కడక్కడ రక్తనాళాలు పగులుతాయి. నాడి స్లో అవుతుంది. ఫిట్స్ కూడా రావచ్చు, సాధారణంగా వారం రోజుల్లో వ్యాధి తగ్గుతుంది. కొందరిలో ముక్కు వెంట రక్తం కారడం, చిగుళ్ళ వెంట రక్తం కారడం, చర్మం కింద రక్తనాళాలు పగలడం, జీర్ణకోశాల ప్రేగుల్లో రక్తస్రావం జరగడం, మూత్రం వెంట రక్తం రావడం ఉంటాయి.

నిర్ధారణ :

సీరోలాజికల్ టెస్ట్, రక్త పరీక్షలు.

చికిత్స :

చాలా వైరల్ డిసీజెస్‌కి మందు లేనట్లే దీనికీ లేదు. ఉపశాంతిగా మందులు వాడటం, కాంప్లికేషన్స్‌ని అదుపుచేయడం ఒకటే మార్గం. జ్వరం తగ్గటానికి, రక్తస్రావం తగ్గటానికి మందులు వాడాలి.

□□□

## 20. బ్రూసిలోసిస్

ఈ వ్యాధి బ్రూసెల్లా గ్రూపుకి చెందిన ఒక విధమైన బాక్టీరియావల్ల కలుగుతుంది. ఈ వ్యాధి ఉన్న జంతువుల పాలను కాచకుండా త్రాగినా, వాటిని వధించినపుడు చేతులకి గాయాలున్నా, వాటి ద్వారా వ్యాధిక్రిములు మనిషి శరీరంలోకి ప్రవేశిస్తాయి. శరీరంలోకి క్రిములు ప్రవేశించిన 2 నుంచి 4 వారాలలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.

లక్షణాలు :

జ్వరం, తలనొప్పి, కీళ్ళనొప్పులు, లివర్, స్ప్లీన్ పెరుగుదల, నరాల బలహీనత, మెనింజైటీస్ మొదలైన లక్షణాలు ఉంటాయి. కొందరిలో ఈ వ్యాధి క్రానిక్‌గా కూడా ఉంటుంది.

నిర్ధారణ :

బ్లడ్ కల్చర్, సీరాలజి.ఎగ్లుటినేషన్ టెస్ట్.

చికిత్స : టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. 6 గంటలకి ఒకసారి చొప్పున 3 వారాలు.

□□□

# 21. లెప్రసి

లెప్రసి వ్యాధినే కుష్టు అంటారు. మైక్రో బ్యాక్టీరియం లెప్రే క్రిమివల్ల ఈ వ్యాధి వస్తుంది. ఈ వ్యాధివల్ల చర్మం, మ్యూకస్, మెంబ్రేన్, నరాలు రోగగ్రస్తమవుతాయి.

**కారణాలు :**

లెప్రసి రోగులతో కలిసి చాలాకాలం జీవించడం, లెప్రసి వ్యాధి క్రిమి ఉన్న దుమ్ము, ధూళి రేగి ఊపిరి ద్వారా లోపలకు చేరడం, వ్యాధి నిరోధక శక్తి తక్కువగా ఉండడం. వ్యాధి క్రిములు శరీరంలోకి ప్రవేశించిన తరువాత 2 నుంచి 7 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి.

**లక్షణాలు :**

శరీరం మీద తెల్లని మచ్చలు ఏర్పడతాయి. స్పర్శజ్ఞానం తగ్గుతుంది. మచ్చలమీద సూదితో గుచ్చినప్పటికీ సరిగ్గా తెలియదు. వేడి తెలియదు. కాళ్ళు, చేతులు మొద్దుబారతాయి. చేతి కండరాలు సన్నబడతాయి. వేళ్ళు వంకరపోతాయి. వేడి తెలీకుండా అవుతుంది. చేతులు, కాళ్ళు తరచుగా కాలిన పుండుగా మారుతాయి.

**నిర్ధారణ :**

లెప్రసి మచ్చ ఏర్పడినచోట స్కిన్ బయాప్సి తీసి వ్యాధి నిర్ధారణ చేయవచ్చు. లెప్రసి బాక్టీరియాని స్టెయిన్ చేసి చూడవచ్చు.

**చికిత్స :**

1. డాప్సోన్ 100 మి.గ్రా. రోజుకొకసారి చొప్పున కనీసం 2 సంవత్సరాలు వాడాలి.
2. రిఫాంపిసిన్ 600 మి.గ్రా. చొప్పున నెలకొకసారి వాడాలి.
3. క్లోఫజిమిన్ 50 మి.గ్రా. చొప్పున రోజుకొకటి వాడాలి.
   ఈ మందులు కనీసం 2 సంవత్సరాలు వాడాలి. కొందరికి 10 సంవత్సరాలదాకా వాడాల్సి వస్తుంది.
4. లెప్రసివల్ల అంగవైకల్యం ఏర్పడినవారికి శస్త్ర చికిత్స ద్వారా లోపాన్ని సరిదిద్దవచ్చు.
5. ఫిజియోథెరపి ద్వారా కూడా అంగవైకల్యాన్ని నిరోధించవచ్చు.

❑❑❑

**లక్షణాలు :**

అకస్మాత్తుగా జ్వరం, తలనొప్పి, ఒళ్ళునొప్పులు, రాష్, కీళ్ళనొప్పులు, కండరాల నొప్పులు ఉంటాయి.

**నిర్ధారణ :**

రక్త పరీక్షలు, ప్రత్యేక పద్ధతుల ద్వారా వ్యాధికారక క్రిమిని గుర్తించడం.

**చికిత్స :**

1. ప్రొకైన్ పెన్సిలిన్ 12,00,000 చొప్పున వారం రోజులు **లేదా** ఎరిత్రోమైసిన్ 500 మి.గ్రా. ప్రతి 6 గంటలకు వారం రోజులు వాడాలి.

❑❑❑

# 24. ఫైలేరియా

*ఫైలేరియా వ్యాధినే బోదవ్యాధి అంటారు. క్యూలెక్స్ జాతికి చెందిన దోమ కుట్టడం ద్వారా ఫైలేరియా వ్యాధి సంక్రమిస్తుంది. ఇవి శరీరంలో ప్రవేశించిన లింఫాటిక్ నాళాల్లోనూ, గ్రంథుల్లోనూ స్థావరం ఏర్పరచుకొని ఉంటాయి. రక్తంలో కూడా వ్యాధిక్రిములు ఉంటాయి. రాత్రి 10 నుంచి 2 గంటల మధ్యకాలంలో రక్తపరీక్ష చేస్తే ఫైలేరియా క్రిములు కనబడతాయి.*

**లక్షణాలు :**

ఫైలేరియా జ్వరం అకస్మాత్తుగా వస్తుంది. చలి, వణుకు ఉంటాయి. వికారం, వాంతులు ఉంటాయి. కొంతకాలం ఈ బాధలుండి తగ్గిపోయి మళ్ళీ కనబడతాయి. ఫైలేరియా ఉన్నవాళ్ళలో నరాలు వాచి కనబడతాయి. నొప్పి చేస్తాయి. లింఫ్ గ్లాండ్లు కూడా ఉబ్బుతాయి. ఫైలేరియా వచ్చినచోట వాపు వస్తుంది. నీరు చేరినట్లు అవుతుంది. చర్మం దళసరిగా మారుతుంది. ఫైలేరియా కేవలం కాలికే కాకుండా ఏ భాగానికైనా రావచ్చు.

**నిర్ధారణ :**

రక్త పరీక్ష , గ్లాండ్ బయాప్సీ , ఇంట్రా డర్మల్ టెస్ట్, కాంప్లిమెంట్ ఫిక్సేషన్ టెస్ట్.

**చికిత్స :**

1. హెట్రాజాన్ 100 మి.గ్రా. లేదా 200 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు వేసుకోవాలి. ఈ బిళ్లలు 2, 3 వారాలు వాడాలి.

2. ఫైలేరియాతోపాటు బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కూడా కలిసి ఉండొచ్చు. అందుకోసం డాక్సీసైకిలిన్ 100 మి.గ్రా. ఉదయంఒకటి, రాత్రి ఒకటి చొప్పున పది రోజులు వాడాలి.
3. వాపు వచ్చిన కాలికిగానీ, చేతికిగానీ ఇలాస్టిక్ బాండేజి కట్టాలి.
4. వాపు వచ్చిన కాలునిగానీ, చేతినిగానీ ఎత్తుగా పెట్టి ఉంచాలి.
5. నొప్పి, వాపు తగ్గడానికి బిళ్ళలు వేయాలి.
6. మందులు వాడినా వాపు తగ్గనియెడల శస్త్ర చికిత్స ద్వారా వాపుని తగ్గించవచ్చు.

□□□

# 25. ఉడుకు జ్వరాలు - వడదెబ్బలు.

*వేడి పొయ్యిల దగ్గర, రైలు ఇంజన్లు, బాయిలర్స్ దగ్గర ఉండేవారిలో వేడి వల్ల కొన్ని బాధలు కలుగుతాయి. ఎండ వేడికి గురి అయిన వారిలో కూడా కొన్ని అనారోగ్య పరిస్థితులు ఏర్పడతాయి.*

## I. హీట్ ఫీవర్

*వీటినే ఉడుకు జ్వరాలు అంటారు. వృద్ధులలోనూ, చిన్నపిల్లలలోనూ, ఎండాకాలంలో ఉడుకు జ్వరాలు రావడం ఎక్కువ. ఉడుకు జ్వరాలు అకస్మాత్తుగా వస్తాయి. 102 - 104 డిగ్రీల జ్వరం ఉంటుంది. రోగికి జ్వరంతోపాటు కొంత మగత ఏర్పడుతుంది. వికారం, వాంతులు, తలనొప్పి, నీరసం ఉంటాయి.*

**చికిత్స :**

1. రోగిని చల్లని ప్రదేశంలో పడుకోబెట్టాలి.
2. త్రాగడానికి ఎక్కువ నీరు ఇవ్వాలి.
3. ఎలక్ట్రాల్ (ఎలక్ట్రోలైట్స్) పొడరు గ్లాసు నీళ్ళలో 3, 4 చెంచాలు కలిపి తాగినన్ని ఇవ్వాలి.
4. అవసరం బట్టి నరానికి ఎలక్ట్రోలైట్స్, గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.

## II. హీట్ క్రాంప్స్

*వేడికి ఎక్కువ గురి అయినా, ఎండలో ఎక్కువ తిరిగినా, చెమటలు ఎక్కువగా పట్టి కండరాల నొప్పులు (హీట్ క్రాంప్స్) వస్తాయి. హీట్ క్రాంప్స్ కాళ్ళకి సంబంధించిన కండరాలలోనే కాకుండా కడుపు, నడుము, ఛాతికి సంబంధించిన కండరాలలో కూడా వస్తాయి.*

**చికిత్స :**

రోగిని చల్లని ప్రదేశంలో పడుకోబెట్టాలి. ఎలక్ట్రాల్ పౌడరు కలిపిన నీళ్ళు ఎక్కువ తాగించాలి. **లేదా** నీళ్ళలో ఉప్పు, పంచదార కలిపి త్రాగడానికి ఎక్కువగా ఇవ్వాలి. హీట్ క్రాంప్స్ ఎక్కువగా ఉంటే నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.

## III. హీట్ సింకోప్ :

ఎక్కువ వేడికి గురి అయినా, ఎండలో తిరిగినా తల తిరుగుతుంది. ఒళ్ళు తూలుతుంది. బ్యాలెన్స్ తప్పి పడిపోవడం జరుగుతుంది. ఇటువంటి పరిస్థితినే హీట్ సింకోప్ అంటారు.

**చికిత్స :**

1. హీట్ సింకోప్ వల్ల కళ్ళు తిరిగి పడిపోతామని ఫీలింగ్ రాగానే వెంటనే క్రింద పడుకోవడం అవసరం.
2. చల్లని ప్రదేశంలో విశ్రాంతి తీసుకోవాలి.

## IV. హీట్ స్ట్రోక్ :

*దీనినే సన్ స్ట్రోక్ అని, వడదెబ్బ అని అంటారు. ఎండకి గురి అయిన వారిలో వడదెబ్బ తగలడం సహజం. ఎండాకాలంలో బయట తిరిగితేనే వడదెబ్బ తగులుతుందని అనుకోవడం తప్పు. ఎండలో తిరగకపోయినా, వేడిగా ఉండే గదుల్లో నివసిస్తే కూడా వడదెబ్బ తగులుతుంది.*

**లక్షణాలు :**

జ్వరం అకస్మాత్తుగా 105 - 107 డిగ్రీలు వస్తుంది. విపరీతంగా తలనొప్పి ఉంటుంది. తల తిరుగుతుంది. వికారంగా ఉంటుంది. చెమట పట్టడం పూర్తిగా ఆగిపోతుంది. చర్మం పొడిగా ఉంటుంది. ఒళ్ళు చాలా వేడిగా ఉంటుంది. నాలిక తడారిపోతుంది. నాడి వేగంగా కొట్టుకుంటుంది. చూపు డిమ్ అవుతుంది. అపస్మారక స్థితి ఏర్పడుతుంది. ఫిట్స్ వస్తాయి, 105 డిగ్రీలు మించిన జ్వరం, చెమట పట్టడం, ఆగిపోవడం, స్పృహ కోల్పోవడం వడదెబ్బకి ముఖ్యమైన గుర్తులు.

**చికిత్స :**

1. వడదెబ్బ తగిలిన వ్యక్తిని వీలయితే ఏ.సి. రూములో ఉంచి చికిత్స చేయాలి.

లేదా చల్లని ప్రదేశంలో ఉంచి ఒళ్ళంతా చన్నీళ్ళ గుడ్డతో చుట్టాలి. వీలయితే జ్వరం 102 డిగ్రీలు దిగేవరకూ చన్నీళ్ళ తొట్టిలో పడుకోబెట్టాలి. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి. ఫిట్స్ ఉంటే తగ్గడానికి జ్వరానికి ఇంజక్షన్స్ వాడాలి. రోగి పూర్తిగా కోలుకునేవరకు డాక్టర్ పర్యవేక్షణలో ఉంచాలి. వడదెబ్బ రోగికి సకాలంలో చికిత్స జరగకపోతే ప్రాణాపాయం కలుగుతుంది.

### V. హీట్ ఎగ్జాస్టన్ :

*ఎండకి గానీ, ఇతరత్రా వేడికి గానీ గురి అయిన వారిలో హీట్ ఎగ్జాష్టన్ పరిస్థితి ఏర్పడుతుంది. హీట్ ఎగ్జాస్టన్‌కి ముఖ్యంగా మూడు కారణాలు : ఒంట్లో నీరు తగ్గిపోవడం, శరీరంలో ఉప్పు తగ్గిపోవడం, ఎక్కువ వేడి అనిపించడం.*

*వేడికి ఎక్కువ గురి అయిన వారిలో తలనొప్పి, ఒళ్ళు తూలడం, గుండె దడ, కొద్దిపాటి జ్వరం, మగత వస్తాయి. శరీరంలో ఉప్పు తగ్గిపోయిన వారిలో ఆకలి లేకపోవడం, వికారం, వాంతులు, ఒళ్ళు తూలడం, కండరాల నొప్పులు ఉంటాయి. శరీరంలో నీరు తగ్గిపోయిన వారిలో అతిగా దాహం, అలసట, నీరసం, చిరాకు, కడుపులో నొప్పి ఉంటాయి.*

*హీట్ ఎగ్జాస్టన్ వల్ల పై లక్షణాలు ఏర్పడిన వారిలో చెమట పట్టడం మామూలుగానే ఉంటుంది. స్పృహ కూడా మామూలుగానే ఉంటుంది. అందుకని ఈ పరిస్థితిని సన్ స్ట్రోక్ అనరు. ఎండాకాలంలో ఎక్కువ మందిలో హీట్ ఎగ్జాస్టన్ లక్షణాలు కనబడతాయి.*

చికిత్స :

1. చల్లని ప్రదేశంలో విశ్రాంతి తీసుకోవడం
2. నీళ్ళలో గ్లూకోజ్, ఉప్పు కలిపి ఎక్కువ నీళ్ళు త్రాగడం
3. కొబ్బరి బొండాలు, పళ్ళ రసం తీసుకోవడం
4. అవసరం బట్టి నరానికి సెలైన్ ఎక్కించుకోవడం
5. తలనొప్పికి, కండరాల నొప్పికి మందులు వాడడం.

❑❑❑

## 26. ఫ్లూరోసిస్

*ఎక్కువ మోతాదులో ఫ్లోరైడ్‌ని తీసుకున్నప్పుడు కలిగే వ్యాధిని ఫ్లూరోసిస్ అంటారు. కొన్ని ప్రాంతాలలో త్రాగే నీటిలో ఫ్లోరైడ్ ఎక్కువ శాతంలో కలిసి ఉంటుంది. అటువంటి*



నీరుని త్రాగేవారిలో పళ్ళ మీద మచ్చలు వస్తాయి. ఎముకలలో పటుత్వం తగ్గుతుంది. ఎముకలు మెత్తగానూ, బోలుగానూ తయారవుతాయి.

**ఫ్లూరోసిస్ వ్యాధి ఎవరిలో వస్తుంది :**

ఎక్కువ శాతం ఫ్లోరైడ్ ఉన్న నీరు, ఎక్కువ కాలం త్రాగిన వారిలో.

ఎక్కువగా శారీరక శ్రమ చేసే వారిలో

పౌష్టిక ఆహారం లోపం, ముఖ్యంగా మాంసకృత్తుల లోపంఉన్నవారిలో.

ఉష్ణమండలాల్లో నివసించేవారిలో.

**లక్షణాలు :**

దంతాల ఎనామిల్ మీద నల్లని మచ్చలు, లేదా గారగా తయారయ్యే పళ్ళు, నడుము బిగుసుకుపోవడం, నొప్పి ఉండడం, కాళ్ళల్లో తిమ్మిర్లు, కాళ్ళకు సంబంధించిన పెద్ద ఎముకల మీద అక్కడక్కడ కొత్తగా ఎముకల బుడిపెలు తయారవడం, కీళ్ళు సరిగా ముడవలేకపోవడం, కీళ్ళు వంగిపోవడం, నడుము గూనిగా అవడం,చేతుల్లో, కాళ్ళల్లో అక్కడక్కడ స్పర్శ తెలీకుండా పోవడం,కండరాలలో బలహీనత, కండరాల అదురు, తల తిరగడం, ఒళ్ళు తూలడం, తరచు తలనొప్పి, వినికిడి లోపం, థైరాయిడ్ గ్రంథి పెద్దది అవటం, కిడ్నీ ఫెయిల్యూర్, రక్త హీనత.

**నిర్ధారణ :**

ఎక్స్‌రే , బయోకెమికల్ ఇన్వెస్టిగేషన్స్ - రక్తంలో, మూత్రంలో ఫ్లోరైడ్ శాతం ఎక్కువ ఉండడం

**చికిత్స :**

1. త్రాగే నీటిలో ఫ్లోరైడ్ శాతాన్ని తగ్గించడం
2. విటమిన్ 'సి' రెగ్యులర్‌గా వాడటం
3. కీళ్ళ దగ్గర, ఎముకల మీద పెరిగిన ఎముకలకి శస్త్రచికిత్స

❑❑❑

## 27. కేన్సర్

కేన్సర్ వ్యాధి కలిగిన వారిలో కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. ఆ లక్షణాలబట్టి కేన్సర్ అని అనుమానించవచ్చు.

**లక్షణాలు :**

వక్షోజాలలో గానీ, మరొక చోటగానీ కంతి ఏర్పడటం; పుట్టుమచ్చలో అకస్మాత్తుగా

మార్పు కలగడం; శరీరంలో పడిన పుండు దీర్ఘంగా మానకుండా ఉండిపోవడం; గర్భకోశం, మలం, ప్రేగు నుండి ఆగకుండా రక్తం కారడం; గొంతు బొంగురుపోవడం, ముద్ద మ్రింగుడు పడకపోవడం, గొంతులో అడ్డం అనిపించడం; జీర్ణాశయం ప్రేగుల్లో మార్పు, ప్రేగులు అతిగా కదలడం లేదా మలబద్ధకం ఏర్పడటం, దీర్ఘకాలంగా దగ్గు, బరువు అధికంగా కోల్పోవడం, ఆకలి తగ్గిపోవడం, కొద్దిపాటిగా జ్వరం రోజూ ఉండటం.

పై లక్షణాలు ఇతర వ్యాధుల్లో కూడా ఉంటాయి. కేన్సర్‌కి కూడా ఉంటాయి. అందుకని పై లక్షణాలు ఉన్నంత మాత్రాన కేన్సర్ అనుకోకూడదు. అయితే పరిస్థితి ఏదైనదీ నిర్ధారణ చేసుకోవాలి. కేన్సర్‌లో కూడా ఈ లక్షణాలు ఉంటాయి కనుక కేన్సర్ అయినదీ, కానిదీ వ్యాధి నిర్ధారణ పరీక్షల ద్వారా నిర్ధారణ చేసుకోవాలి.

కేన్సర్ పెద్దవాళ్ళకే కాదు, పిల్లలకీ వస్తుంది. పిల్లల్లో బ్లడ్ కేన్సర్ ఎక్కువ.

నాడీ మండలానికి, ఎముకలకి, కండకీ కేన్సర్ రావడం ఎక్కువ.

60 - 70 సంవత్సరాలు దాటిన వారికి కేన్సర్ రావడం ఎక్కువ.

❑❑❑

# 28. ఆకలి లేకపోవడం

కారణాలు :

ఇన్‌ఫెక్షన్ - జ్వరం వచ్చినపుడు ఆకలి లేకపోవడం సహజం. లివర్ వ్యాధులు, మూత్రపిండాల వ్యాధులు, గుండె జబ్బులు, క్షయ వ్యాధి, రక్త సంబంధమైన వ్యాధులు వచ్చినప్పుడు ఆకలి తగ్గిపోతుంది, థైరాయిడ్ గ్రంథి తక్కువ పనిచేసే వాళ్ళలోనూ, ఎడిసన్స్ డిసీజ్ ఉన్నవాళ్ళలోనూ ఆకలి తగ్గిపోతుంది. జీర్ణాశయంలో పుండు, స్టమక్ కేన్సర్, పెర్నీషియస్, ఎనీమియా ఉంటే ఆకలి ఉండదు. మానసిక ఆందోళన, దిగులు, భయం, బి - కాంప్లెక్సు లోపం, అధికంగా మద్యం సేవించడం, భోజనం ముందు చిరుతిండ్లు తినడం.

చికిత్స :

1. వ్యాధి కారణం బట్టి చికిత్స.
2. ఆహారం ముందు తీపి తినకూడదు.
3. శారీరక వ్యాయామం ఉండాలి.
4. పొగత్రాగడం, మద్యం సేవించడం పనికిరాదు.

5. ఆకలి కలిగించేటటువంటి మందు భోజనం ముందు తీసుకోవడం.
   ఉదా : సిప్రోహెప్టడిన్ హైడ్రోక్లోరైడ్, బేయర్స్ టానిక్.
6. ఎనబాలిక్ స్టిరాయిడ్స్ -ఉదా: డ్యూరాబోలిన్ 25మి.గ్రా. వారానికి ఒక ఇంజక్షన్.

□□□

# 29. ఒళ్ళు తూలడం

**కారణాలు :**

పెరిఫరల్ న్యూరైటిస్ - కాళ్ళు చేతులు మొద్దుబారడం, తిమ్మిర్లు, నాడీమండలంలో వ్యాధులు, చిన్న మెదడులో వ్యాధులు, చెవిలోని వ్యాధులు.

**చికిత్స :**

1. వ్యాధి ప్రకారం చికిత్స
2. ఉపశాంతికి చికిత్స

**మందులు :**

స్టుగరాన్ 25మి.గ్రా. తడవకి ఒకటి చొప్పున రోజుకి 3సార్లు **లేదా** వెర్టిన్ తడవకిఒకటి చొప్పున రోజుకి 3సార్లు లేదా హైడరజిన్ తడవకి ఒకటి చొప్పున రోజుకి 3సార్లు.

□□□

# 30. నడుం నొప్పి

**కారణాలు :**

వెన్నుపూసలో లోపాలు, వెన్ను కండరాలలో లోపాలు, రిఫర్డ్ పెయిన్ - కడుపులో గానీ, ఛాతి లోపల గానీ ఏదైనా వ్యాధి ఉన్నట్లయితే దానికి సంబంధించిన బాధ నడుం నొప్పిగా బయటపడుతుంది. ఉదా : కడుపులో పుండు, మూత్రపిండాలలో రాళ్ళ, ప్రేగుల్లో కేన్సర్, సరిగ్గా కూర్చోలేకపోవడం, సరిగ్గా పడుకోలేకపోవడం. సైకలాజికల్.

**చికిత్స :**

1. కారణం బట్టి చికిత్స
2. తాత్కాలిక నివారణ - బ్రూఫెన్ - 400 **లేదా** ఓవరాన్ 50 **లేదా** ప్రాక్సివాన్ **లేదా** నెప్టాల్ 500 మందులు ఉదయంఒకటి, మధ్యాహ్నం ఒకటి, రాత్రిఒకటి వాడడం.

3. విశ్రాంతి తీసుకోవడం
4. నడుము కండరాలకి ఎక్సర్‌సైజు
5. ఫిజియోథెరపి

❑❑❑

## 31. తెల్లగా మూత్రం (ఖైలూరియా)

కారణాలు :

ఫైలేరియా, కడుపులో పాములు, మలేరియా, థొరాసిక్ డక్ట్‌కి అడ్డంకి

చికిత్స :

1. కారణం బట్టి చికిత్స
2. హెట్రాజాన్ 100 మి.గ్రా. టాబ్లెట్లు తడవకి ఒకటి చొప్పున రోజుకి 3 సార్లు (3 వారాలు పాటు) వాడాలి.

❑❑❑

## 32. స్ప్రూ

*స్ప్రూ వ్యాధి ప్రధానంగా పేగులకి సంబంధించిన వ్యాధి. జీర్ణ రసాయనికాల ఉత్పత్తిలో లోపం, ఆహారం జీర్ణం అవడంలో లోపం, కొవ్వు, గ్లూకోజ్, కాల్షియం మొదలైన ముఖ్యమైన పదార్థాలు జీర్ణం కావడంలో లోపం, స్ప్రూ వ్యాధి ఉన్నవారిలో కనబడుతుంది.*

*స్ప్రూ వ్యాధి ఉన్నవారిలో ఉదయం పూట నీళ్ళ విరోచనాలు, దుర్వాసనతోనూ, గ్యాస్‌తోనూ కూడిన మలం, నాలిక పూత, రక్త హీనత, బలహీనత కనబడతాయి.*

కారణాలు :

ప్రధానంగా 20 - 40 సంవత్సరాల వారిలో ఈ వ్యాధి కనబడుతుంది, పురుషులలో కంటే స్త్రీలలో ఈ వ్యాధి ఎక్కువ. ఉష్ణమండల దేశాలలో ముఖ్యంగా వర్షాకాలంలో ఈ వ్యాధి ఎక్కువగా ఉంటుంది. జీర్ణకోశ పేగుల్లో జీర్ణానికి సంబంధించిన లోపం ఈ వ్యాధికి మూలం.

నిర్ధారణ :

మల పరీక్ష , రక్త పరీక్ష , లివర్ ఫంక్షన్ టెస్ట్స్, గ్యాస్ట్రిక్ సెక్రిషన్ టెస్ట్స్.

చికిత్స :

1. విశ్రాంతి.
2. ఎక్కువ మాంసకృత్తులుండే ఆహారం, తక్కువ పిండి పదార్థం, తక్కువ కొవ్వు పదార్థం.
3. పాలు, గుడ్లు, మాంసం, ఆకుకూరలు, తాజా పళ్ళు.
4. ఆక్సీ టెట్రాసైకిలిన్ 250 మి.గ్రా. రోజుకి 4 సార్లు.
5. ఫోలిక్ యాసిడ్.
6. కార్టికో స్టిరాయిడ్స్.
7. బి. కాంప్లెక్సు.
8. విటమిన్లు, ఖనిజ లవణాలు.

❑❑❑

**మంచి అలవాట్లు అంటే**

- పొగత్రాగడం పనికిరాదు.
- నశ్యం పీల్చకూడదు.
- మద్యం తీసుకోకూడదు.
- కాఫీ - టీలు మానేయాలి లేదా మితంగా తీసుకోవాలి.
- వక్కపొడి, కిళ్లీలు వాడకూడదు.
- టైమ్‌కి భోజనం చేయాలి.
- ముద్ద బాగా నమిలి మ్రింగాలి
- రాత్రిపూట త్వరగా నిద్రపోవాలి.

**మంచి అలవాట్లు మనిషి మనుగడకి మూలం**

# 2. కడుపులో పాములు

## 1. హుక్ వార్మ్స్

మల విసర్జన ద్వారా విసర్జింపబడిన హుక్ వార్మ్ క్రిములు దుమ్ములో బాగా వృద్ధి అయ్యి మనిషి పాదాల ద్వారా శరీరంలోకి ప్రవేశిస్తాయి. ఆ తరువాత నిదానంగా ప్రేగులోకి చేరుతాయి. ప్రేగులోనికి చేరిన హుక్‌వార్మ్ క్రిములు రక్తహీనతకు కారణమవుతాయి.

**లక్షణాలు :**

రక్తహీనత, కడుపులో నొప్పి, విరోచనాలు, గుండె దడ, ఆయాసం, నరాల బలహీనత, హుక్ వార్మ్స్ వల్ల రక్తహీనత కలగడం చాలా ఎక్కువ. రక్తహీనతవల్ల రోగి పరిస్థితి క్షీణిస్తుంది.

**నిర్ధారణ :** మల పరీక్ష

**చికిత్స :**

1. నిబెండజోల్ 100 మి.గ్రా. ఉదయంఒకటి, రాత్రిఒకటి చొప్పున 3 రోజులు **లేదా** ఆల్బెండజోల్ 400 మి.గ్రా. ఒక్కరోజు **లేదా** పెరంటల్ 700 మి.గ్రా. చొప్పున 3 రోజులు.
2. ఐరన్ టాబ్లెట్స్ **లేదా** సిరప్.

❑❑❑

## 2. రౌండ్ వార్మ్స్

రౌండ్ వార్మ్స్‌నే ఏలిక పాములు అంటారు. కలుషితమైన నీరు, ఆహారం ద్వారా వీటికి సంబంధించిన క్రిములు, గుడ్లు ప్రేగుల్లోకి ప్రవేశిస్తాయి.

**లక్షణాలు :**

కడుపులో నొప్పి, వికారం, వాంతులు, విరోచనాలు, ఆకలి లేకపోవడం, ఎదుగుదల లేకపోవడం, జ్వరం, దగ్గు, ఆయాసం, ఒళ్ళు దురదలు.

**నిర్ధారణ :** మల పరీక్ష



**చికిత్స :**

నిబెండజోల్ 100 మి.గ్రా. ఉదయంఒకటి, రాత్రిఒకటి చొప్పున 3 రోజులు **లేదా** ఆల్బెండజోల్ 400 మి.గ్రా. ఒక రోజు **లేదా** లివమిజోల్ 150 మి.గ్రా. ఒక రోజు.

❑❑❑

# 3. టేప్ వార్మ్స్

*గొడ్డు మాంసం, పంది మాంసం తినేవారిలో టేప్‌వార్మ్స్ చేరుతాయి. టేప్ వార్మ్స్ ముఖ్యంగా 2 రకాలు.*

**లక్షణాలు :**

కడుపులో నొప్పి, ఆకలి లేకపోవడం, బరువు కోల్పోవడం, తలనొప్పి, దురదలు ప్రధాన లక్షణాలు, కొందరిలో ఫిట్స్ కూడా వస్తాయి.

**నిర్ధారణ :** మల పరీక్ష

**చికిత్స :**

1. నెక్లోసమైడ్ 2 గ్రా. ఒకే మోతాదులో రాత్రిపూట ఏమీ తినకుండా ఇవ్వాలి.
2. త్రాగడానికి నీళ్ళు ఎక్కువగా ఇవ్వాలి.
3. విరోచనం అవడానికి కూడా మందు ఇవ్వాలి. లేదా ప్రాజిట్వంటిల్ ఒకే మోతాదులో ఉదయం పూట ఇవ్వాలి.

❑❑❑

# 4. పిన్ వార్మ్స్

*పిన్ వార్మ్స్‌నే ఎంటరోబియాసిస్ లేదా థ్రెడ్ వార్మ్స్ అంటారు. నులి పురుగులు అన్నా ఇవే.*

**లక్షణాలు :**

మలద్వారం దగ్గర దురద, ఆకలి లేకపోవడం, కడుపులో నొప్పి, వికారం ఉంటాయి. స్త్రీలలో పిన్‌వార్మ్స్ యోని మార్గంలో ప్రవేశించి తెల్లబట్ట, దురద కలిగించడం ఉంటుంది. అలాగే స్త్రీల, పురుషుల మూత్రనాళంలో ప్రవేశించి మూత్రంలో మంట, దురద, ఎక్కువసార్లు మూత్రం రావడం వంటి లక్షణాలు కలగచేస్తాయి.



నిర్ధారణ :

మామూలుగానే మలంలో పిన్‌వార్మ్స్ కనబడతాయి. విరోచనం పరీక్షలో కూడా వీటి గుడ్లు కనబడతాయి.

చికిత్స :

1. మెబండజోల్ 100 మి.గ్రా. ఒక మోతాదు **లేదా** పైరెంటల్ ఒక మోతాదు **లేదా** పిప్పర్‌జెన్ సిట్రేట్ లిక్విడ్ రోజూ రాత్రిపూట ఒక చెంచా చొప్పున వారం రోజులు.
2. పిన్ వార్మ్స్ మళ్ళీ మళ్ళీ రావడం సహజం. అందుకని శుభ్రతని పాటించడం అవసరం.

❑❑❑

# 5. జియార్డియాసిస్

*జియార్డియాసిస్ ఇన్‌ఫెక్షన్ జియార్డియా రాంబలియా అనే క్రిమివల్ల కలుగుతుంది. ఇవి ప్రధానంగా చిన్నపేగులో ఉంటాయి.*

**లక్షణాలు :**

దుర్వాసనతో కూడిన విరోచనం, పై కడుపులో నులినొప్పి, వికారం, ఆకలి లేకపోవడం, కడుపు ఉబ్బరం, నీళ్ళ విరోచనాలు ఉంటాయి. చాలామందిలో ఎటువంటి మందు వాడకుండానే వ్యాధి లక్షణాలు తగ్గిపోవడం, తిరిగి కనబడడం ఉంటాయి. కొందరిలో ఎప్పుడూ పేగులు కదులుతూ ఉంటాయి. తరచూ విరోచనానికి వెళ్ళాలనే ఫీలింగ్ కలుగుతూంటుంది. అరుగుదల తగ్గుతుంది. ఎలర్జీ లక్షణాలు కనబడతాయి.

నిర్ధారణ :

మల పరీక్ష., యాంటిజెన్ డిటెక్షన్.

చికిత్స :

మెట్రోనిడజోల్ 200 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు చొప్పున 14 రోజులు వాడాలి.

**లేదా** టినడజోల్ 150 మి.గ్రా. చొప్పున రోజుకి 2 సార్లు చొప్పున 10 రోజులు వాడాలి.

**లేదా** టినడజోల్ 2000 మి.గ్రా. సింగల్ డోస్‌గా వాడాలి.

❑❑❑



# 6. హ్విప్ వార్మ్స్

హ్విప్ వార్మ్ ట్రైకోరియాసిస్ అంటారు. ఈ క్రిమి పెద్దపేగుల్లోఉంటుంది.

**లక్షణాలు :** కడుపులో నొప్పి, విరోచనాలు, రక్తహీనత, వికారం ఉంటాయి.

**నిర్ధారణ :** మల పరీక్ష.

**చికిత్స :**

మెబండజోల్ ప్రతిరోజు 200 మి.గ్రా. చొప్పున 3 రోజులు లేదా ఆల్బెండజోల్ 400 మి.గ్రా. సింగల్ డోస్.

❑❑❑

# 7. హైడాటిడ్ డిసీజ్

హైడాటిడ్ డిసీజ్ టేప్ వార్మ్ లార్వేవల్ల కలుగుతుంది.

**లక్షణాలు :**

హైడాటిడ్ డిసీజ్‌లో హైడాటిడ్ సిస్టులు తయారవుతాయి. చాలామందికి ఇవి ఎటువంటి లక్షణాలు కలగజేయవు. కొందరిలో ఎటువంటి నొప్పి లేకుండా లివర్ పెరుగుతుంది. కారణం తెలియని జ్వరం ఉంటుంది, పసర తిత్తి మీద సిస్టు నొక్కేసి పచ్చ కామెర్లు కలగచేస్తుంది, కొందరిలో ఊపిరితిత్తులలో హైడాటిడ్ సిస్టు తయారవుతుంది. వారిలో ఆయాసం కనబడుతుంది. దగ్గుతో రక్తం పడుతుంది. జ్వరం, దగ్గు, కళ్ళె ఉంటాయి, కొందరిలో మెదడులో సిస్టులు తయారయ్యి ఫిట్స్ వస్తాయి. కిడ్నీ, స్ప్లీన్‌లో హైడాటిడ్ సిస్టులు తయారవుతాయి. కడుపులో కూడా హైడాటిడ్ సిస్టులు ఉంటాయి.

**నిర్ధారణ :**

ఎక్స్‌రే, అల్ట్రా సౌండ్ స్కానింగ్, సి.టి. స్కానింగ్, కెసోని టెస్ట్ , సీరాలజి టెస్ట్‌లు

**చికిత్స :**

1. శస్త్ర చికిత్స చేసి హైడాటిడ్ సిస్టులని తొలగించడం
2. కీమోథెరపి
3. పాలు, గుడ్లు, మాంసం, ఆకుకూరలు, తాజా పళ్ళు.
4. ఆక్సీ టెట్రాసైకిలిన్ 250 మి.గ్రా. రోజుకి 4 సార్లు.
5. ఫోలిక్ యాసిడ్.
6. కార్టికో స్టిరాయిడ్స్
7. బి. కాంప్లెక్సు.
8. విటమిన్లు, ఖనిజ లవణాలు.

❑❑❑

# 3. మెదడు - నరాల వ్యాధులు

## 1. క్రేనియల్ నర్వ్స్

*మెదడు నుంచి 12 జతల నరాలు మొదలై పుర్రెలోనించి వాటికి నిర్దేశించిన రంధ్రాల ద్వారా తలకి, ముఖానికి చేరుతాయి. ఇవి చాలా ముఖ్యమైన పాత్రని వహిస్తాయి. ఈ నరాలని 'క్రేనియల్ నర్వ్స్' అంటారు.*

1. వివిధ క్రేనియల్ నర్వ్స్ - వాటి ప్రయోజనం

   1. ఆల్‌ఫాక్టరీ నర్వ్ - ఇది దెబ్బతింటే వాసనలు సక్రమంగా తెలియవు.
   2. ఆప్టిక్ నర్వ్ - ఇది దెబ్బతింటే చూపు సక్రమంగా కనబడక పోవడమో, అసలు చూపు పోవడమో జరుగుతుంది.
   3. ఆక్యులోమోటారు నర్వ్
   4. ట్రోక్లియార్ నర్వ్
   5. ట్రైజెమినల్ నర్వ్
   6. ఎబ్డ్యుసెంట్ నర్వ్

మూడు -నాలుగు - ఆరు క్రేనియల్ నర్వ్స్ దెబ్బతింటే కంటి రెప్పలు - కంటి గుడ్లుకి సంబంధించిన కదలికలు సక్రమంగా ఉండవు. మూడవ క్రేనియల్ నర్వ్ దెబ్బతిన్నప్పుడు కంటి రెప్ప వాలిపోతుంది. కన్ను తెరిచినా, రెప్ప పైకి లేవదు. నాల్గో క్రేనియల్ నర్వ్ దెబ్బతింటే కంటి గుడ్డు పైకి పక్కకి కదలదు. వస్తువు రెండుగా కనబడుతుంది. ఆరవ క్రేనియల్ నర్వ్ దెబ్బతింటే కంటిగుడ్డు పక్కకు లాగబడుతుంది. ఒకే వస్తువు రెండుగా కనబిడుతుంది.

ఐదవ క్రేనియల్ నర్వ్ అయిన ట్రైజెమినల్ నర్వ్ రెండు విధులను నిర్వహిస్తుంది. ఒకటి : నొప్పి. స్పర్శ తెలియడం. రెండు : కండరాల కదలికలని కలుగచేయడం : నుదురు, చెక్కిళ్ళు, ముఖం, కంటి గుడ్లుకి సంబంధించిన స్పర్శ, నొప్పి తెలియకుండా పోతాయి. ఆ నరం దెబ్బతిన్నవైపు దవడ గుంజబడుతుంది. నమలడం కష్టం అవుతుంది.

7. ఫేషియల్ నర్వ్ : ఈ నరం దెబ్బతిన్నప్పుడు ముఖానికి సంబంధించిన కండరాలు బలహీనం అవుతాయి. నుదురు మీద చర్మం ముడతలు పడదు. కంటి రెప్పలు మూతపడవు. నోటితో ఈల వేయాలంటే కుదరదు. కుడివైపు నరం దెబ్బతింటే ఎడం వైపుకి, ఎడంవైపు నరం దెబ్బతింటే కుడివైపుకి మూతి వంకర పోతుంది.
8. వెస్టిబ్యులో కాక్లియార్ నర్వ్ : ఈ నరం దెబ్బతిన్నవారికి చెవిలో హోరు కలుగుతుంది లేదా చెవి వినబడటం మానేస్తుంది. తల తిరగడం, వికారం, వాంతులు ఉంటాయి.
9. గ్లాసోఫెరంజియల్ నర్వ్ : ఈ నరం దెబ్బతిన్నవారికి రుచి తెలియదు. నీళ్ళుగానీ, ఆహారం గానీ మింగుడు పడవు.
10. వేగస్ నర్వ్ : ఈ నరం దెబ్బతిన్నవారికి మాట బొంగురుగా వస్తుంది. మాట్లాడడం, మ్రింగడం కష్టంగా ఉంటుంది.
11. యాక్సిసరి నర్వ్ : ఈ నరం దెబ్బతిన్నవారు గూడు ఎత్తలేకపోతారు. తల తిప్పడం కుదరదు.
12. హైపోగ్లాసెల్ నర్వ్ : ఈ నరం దెబ్బతిన్న వారికి నాలుకకు రెండవ వైపుకి లాగబడుతుంది. మాట ముద్దగా వస్తుంది.

❑❑❑

## ట్రైజెమినల్ న్యూరాల్జియా

ట్రైజెమినల్ నర్వ్ వ్యాధిగ్రస్తమవడం వల్లనూ, పనితీరులో తేడారావడం వల్లనూ కలిగించే నరాల నొప్పిని 'ట్రైజెమినల్ న్యూరాల్జియా' అంటారు. ఈ నొప్పి నిదానంగాను రావచ్చు, అకస్మాత్తుగాను రావచ్చు. చల్లగాలికి గురిఅయినా,అతివేడి అతిచల్లని పదార్థాలని తాగినా, తిన్నా నొప్పి మరింత ఎక్కువ కావచ్చు.

**లక్షణాలు:**

సాధారణంగా ముఖానికి ఒక వైపు ఈ విధమైన నరాల నొప్పి వస్తుంది. ఈ నొప్పి సూదులతో పొడుస్తున్నట్లు, కాల్చిన కడ్డీతో చురకలు పెడుతున్నట్లు ఉంటుంది. ఇలా అనిపించే నొప్పి కొన్ని క్షణాలే ఉండొచ్చు లేదా ఎక్కువ సేపే ఉండొచ్చు. రోజు మొత్తంలో అనేక సార్లు నొప్పి రావచ్చు.

ట్రైజెమినల్ న్యూరాల్జియా నొప్పి వచ్చినప్పుడు ముఖంలోని కండరాలు బిగుసుకుంటాయి. ముఖం ఎర్రబడుతుంది. నోట్లో సెలైవా ఎక్కువ ఊరుతుంది. తీవ్రమైన నొప్పి లేనప్పుడు మొహం మీద అక్కడక్కడ మొద్దుబారినట్లు ఉంటుంది. ఈ నొప్పి వల్ల రోగి తగినంత ఆహారం తీసుకోలేకపోతాడు. కొందరికి ఈ నొప్పి వల్ల పంటిపోటు కూడా వస్తుంది. కానీ వారికి పిప్పి పళ్ళు ఏమీ ఉండవు. దంతాలు చాలా ఆరోగ్యంగా ఉంటాయి. పార్శ్వ నొప్పి, మైగ్రేన్ నొప్పిలాగా కూడా బాధ కలుగుతుంది.

**చికిత్స:**

1. ట్రైజెమినల్ న్యూరాల్జియా అనే నిర్ణయానికి వచ్చే ముందు ఇటువంటి బాధనే కలిగించే ఇతర వ్యాధులని దృష్టిలో పెట్టుకోవాలి.
2. నొప్పి తగ్గటానికి శక్తివంతమైన పెయిన్ కిల్లర్స్ వాడాలి.
3. కార్బమ జిపిన్ టాబ్లెట్స్ 100 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు వాడాలి. నొప్పి కంట్రోల్ అవకపోతే 200 మి.గ్రా. చొప్పున వాడాలి. విటమిన్ బి-12 ఇంజక్షన్లు 1000 మైక్రోగ్రామ్స్ చొప్పున రోజూ చేయాలి. అలా రెండు వారాలు వాడాలి.
4. నొప్పి విడవకుండా ఉంటే ఆల్కహాల్ ఇంజక్షన్ ట్రైజెమినల్ నర్వ్‌కి ఇవ్వాలి. ట్రైజెమినల్ న్యూరాల్జియాకి శస్త్ర చికిత్స కూడా ఉంది.

❑❑❑

## బెల్స్ పాల్సీ

ఫేషియల్ నర్వ్ వ్యాధిగ్రస్తం కావడంతో బెల్స్‌పాల్సీ వస్తుంది.

మధుమేహం, రక్తపోటు ఉన్నవారిలోనూ, గర్భిణీగా ఉన్నవారిలోనూ, చల్లగాలి ఎక్కువగా గురి అయినవారిలోనూ, చెవిలో చీము కారేవారిలోనూ,తలకి దెబ్బ తగిలిన వారిలోనూ, బెల్స్‌పాల్సీ ఎక్కువ కనబడుతుంది.

**లక్షణాలు:**

సాధారణంగా బెల్స్‌పాల్సీ అకస్మాత్తుగా వస్తుంది, ఫేషియల్ నర్వ్ దెబ్బతిని బెల్స్ పాల్స్ వచ్చిన వారిలో ఒక వైపు కన్ను పూర్తిగా మూతపడదు. నుదురు మీద ముడతలు ఏర్పడవు. మూతి ఒక ప్రక్కకి వంకర పోతుంది. నీళ్ళు త్రాగపోతే నోటి అంచులనుంచి బయటకు వచ్చేస్తాయి. వినికిడి కొంత తగ్గవచ్చు.

చికిత్స:

1. ఇన్‌ఫ్రారెడ్ రేడియేషన్ లేదా షార్ట్‌వేవ్ డయథెరమితో కండరాలు బలహీనమయిన చోట చికిత్స చేయాలి.
2. కండరాలు బలహీనమయిన చోట రోజుకి ఐదు నిముషాలు చేతితో మసాజ్ చేయాలి.
3. కళ్ళు పూర్తిగా మూతపడవు కనుక కళ్ళల్లో దుమ్ముపడకుండా రక్షణ కలిగించాలి.
4. కార్టికో స్టిరాయిడ్స్-ప్రెడ్నిసాలోన్ 10 మి.గ్రా.టాబ్లెట్స్ తడవకి ఒకటి చొప్పున రోజుకి మూడుసార్లు వాడాలి.

   పై చికిత్సతో ఫలితం లేనప్పుడు ప్లాస్టిక్ సర్జరీ చేయాలి.

❑❑❑

# 2. అసాధారణ కదలికలు

అసాధారణంగా కండరాలు అదురు, చేతులు, కాళ్ళ కుదుపు, ఫిట్స్ కలుగుతాయి. ఇవన్నీ నరాల వ్యాధులు.

1. ఫిట్స్

అకస్మాత్తుగా స్పృహ కోల్పోవడం, క్రింద పడిపోవడం, కాళ్ళు, చేతులు తన్నుకోవడం, వంపులు రావడం, నోటివెంట నురగ రావడం ఉంటాయి. ఇటువంటి పరిస్థితిని ఫిట్స్ **లేదా** కన్వల్షన్స్ **లేదా** సీజర్స్ అంటారు. ఎపిలప్సీ వ్యాధి ఉన్నప్పుడు ఫిట్స్ వస్తాయి. ఎపిలప్సీ (మూర్ఛవ్యాధి) కాకుండా మరికొన్ని పరిస్థితుల్లో కూడా ఫిట్స్ వస్తాయి.

2. మయోక్లోనస్

అకస్మాత్తుగా క్షణిక కాలంపాటు షాక్ తగిలినట్లుగా జర్క్స్ రావడాన్ని మయోక్లోనస్ అంటారు. ముఖము, నోరు, చేతులు కాళ్ళకి సంబంధించిన కండరాలలో మయోక్లోనస్ రావడం ఎక్కువ.

3. ఒపిస్తోటోనస్

మెడని, వెన్నుని అసాధారణంగా వెనకకి వంగిపోయే పరిస్థితిని ఒపిస్తోటోనస్ అంటారు.

మెదడుపై పొరల్లో ఇన్‌ఫెక్షన్, ఎక్స్ట్రాపిరమిడల్ రిజిడిటీ, టెటనస్, సెరిబ్రల్

హెమరైజ్ పరిస్థితుల్లో ఒపిస్తోటోనస్ కనబడుతుంది.

4. కొరియా

అకస్మాత్తుగా ఒక పద్ధతి లేకుండా చేతులు, కాళ్ళు ఊగే పరిస్థితిని కొరియా అంటారు.

రుమాటిక్ ఫీవర్ వచ్చిన వారిలోనూ, ఎన్‌కెఫలైటిస్ వచ్చిన వారిలోనూ, కొన్ని మందులు వాడిన వారిలోనూ కొరియా వస్తుంది.

5. డిస్టోనియా

ఇందులో మామూలుగా కండరాలు బిగుసుకోవడం, వదులవడం ఉంటుంది. ఒంట్లో వివిధ భాగాలు వంకరలు తిరుగుతాయి. ఒకే రకం కదలిక పలుమార్లు కనపడుతుంది. ముందుగా శరీరంలో ఒక చోట ఈ అసాధారణమైన కదలిక మొదలై తరువాత తక్కిన ప్రాంతంలో కనబడుతుంది.

6. ట్రెమస్

కాళ్ళు చేతుల్లో వణుకు ఏర్పడుతుంది. పార్కిన్‌సొన్స్ డిసీజ్‌లోనూ మానసిక ఆందోళన స్థితిలోనూ సెరిబెల్లం డిసీజ్‌లోనూ ట్రెమస్ కనబడతాయి.

7. టిక్స్

కండరాలలో అదుపు లేకుండా చిన్నచిన్న కుదుపులు కలుగుతాయి. కంటిరెప్పలు, ముఖంలోని చిన్నచిన్న కండరాలు టిక్ టిక్ అని కొట్టుకుంటాయి.

చికిత్స:

1. అసాధారణ కదలికలకి మూలకారణాన్ని కనుగొని దానికి చికిత్స చేయాలి.
2. కాంపోజ్, హాలోపెరిడాల్ వంటి మందులు ఈ అసాధారణ కదలికలని తగ్గిస్తాయి. ఈ అసాధారణ కదలికలు తీవ్రంగా ఉన్నప్పుడు కాంపోజ్ గానీ, సిరినేసి (హాలోపెరిడాల్) గానీ నరానికి ఇవ్వాలి.

□□□

# 3. నడకలో తేడాలు (గెయిట్స్)

వివిధ నరాల జబ్బుల్లో నడకలో, అడుగులు వేయడంలో రకరకాల తేడాలు వస్తాయి. ఈ నడకలో కలిగే తేడాలని గెయిట్స్ అంటారు. ఒకోసారి ఈ తేడా ఒక కాలులోనే ఉండవచ్చు. ఎక్కువగా రెండు కాళ్ళలో లోపం ఏర్పడడం, తేడా రావడం ఉంటుంది.

గెయిట్స్‌లో రకాలు:

* హెమీప్లీజిక్ గెయిట్ :- కాలి బొటన వేలు నేలకి రుద్దుకుంటూ, ముందుకు తూలుతూ అడుగుపడటం.
* యూనిలేటరల్ హైస్టెప్పింగ్ గెయిట్ :- ఒక వైపునే మోకాలిని, తుంటి కీలుని పైపైకి లేపి అడుగు వేస్తూ ముందుకు తూలడం.
* లింపింగ్ గెయిట్ :- కుంటుతూ చిన్న చిన్న అడుగులువేస్తూ నొప్పితో కాళ్ళు ముడుచుకుంటూ ముందుకు వంగి నడవడం. సైయాటికా నొప్పిలో ఇది కనపడుతుంది.
* హిస్టీరికల్ గెయిట్ :- ఒక వైపే కాలు ఈడ్చుకుంటూ నడవడం.
* స్పాస్టిక్ గెయిట్ :- కాళ్ళు రెండు బిగపడుతూ కండరాలు రెండూ బిగుసుకుని చిన్నగా అడుగులు వేయడం.
* సిజర్స్ గెయిట్ :- నడుస్తున్నప్పుడు కాళ్ళు క్రాస్ అవడం.
* ఎటాక్సిక్ గెయిట్:- ఒళ్ళు తూలుతూ ముఖ్యంగా సెరిబెల్లం వ్యాధిలో ఇటువంటి గెయిట్ కనబడుతుంది.
* రీలింగ్ గెయిట్ :- కళ్ళు తిరిగి పడిపోతున్నట్లుగా అడుగులు వేయడం.
* వెస్టిబ్యులార్ గెయిట్:- ఒక పక్క పడిపోతుంటే రెండో పక్క వంగి బ్యాలెన్స్ చేసే నడక.
* స్టాంపింగ్ గెయిట్ :- కాలు సడన్‌గా పైకెత్తి గట్టిగా పాదం నేలకు కొట్టి అడుగులు వేయడం. టేబిస్ డార్సాలిస్‌లో ఈ గెయిట్ కనబడుతుంది.
* వాడ్లింగ్ గెయిట్ లేదా డక్ లైక్ గెయిట్ :- కూర్చుని లేస్తున్నప్పుడు తుంటి కీలుని సాధారణంగా తిప్పుతూ ఛాతిని కూడా అసాధారణంగా కదలిస్తూ లేచి నించొని అసాధారణంగా అడుగులు వేయడం. మస్క్యులార్ డిస్ట్రొఫిలో ఇటువంటి గెయిట్ కనపడుతుంది.

గెయిట్‌లో ఇంకా అనేక రకాలు ఉన్నాయి. నడకలో అసాధారణత ఉన్నప్పుడు మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయాలి. కొన్ని నరాల జబ్బులు, కండరాల జబ్బులకి కొన్ని ప్రత్యేకమైన గెయిట్స్ ఉన్నాయి. వాటిని తెలుసుకుని దాని ప్రకారం రోగ నిర్ధారణకి రావచ్చు.

□□□

# 4. తలనొప్పి

కారణాలు:

రక్తహీనత, అలసట, నిద్రలేమి,గాలి తగినంత లేకపోవడం, రసాయనికాల వాసనలు, జ్వరాలు, యురీమియా, గుర్రపు వాతం, ఆల్కహాలిక్ హేంగోవర్, ఫిట్స్ వచ్చిన తరువాత, హైపోగ్లైసీమియా, ఆల్కలోసిస్, యసిడోసిస్, దృష్టి దోషాలు, గ్లోకోమా, ఐరైటిస్, చెవి వ్యాధులు, పంటి వ్యాధులు, సైనస్సైటిస్, మెడనొప్పి, టెన్షన్‌హెడ్డేక్, మెదడు వ్యాధులు (మెదడుకి ఇన్‌ఫెక్షన్), తలకి గాయం, మైగ్రేన్, హిస్టీరికల్ హెడ్డేక్.

తలనొప్పి ఉన్నప్పుడు మూలకారణాన్ని పరిశీలించాలి. దాని ప్రకారం చికిత్స చేయాలి. కొందరి విషయంలో తలనొప్పి మూలకారణం కనుక్కోవడానికి వివిధ పరీక్షలు చేయవలసి వస్తుంది.

తలనొప్పి నిర్ధారణ పరీక్షలు:

స్కల్ ఎక్స్‌రే, వెన్ను నీరు పరీక్ష, రక్త పరీక్షలు, మూత్ర పరీక్షలు, బ్లడ్ షుగర్, ఇ.ఇ.జి., సి.టి.స్కాన్, సెరిబ్రల్ ఆర్టిరియోగ్రఫి, యం.ఆర్.ఐ.

మైగ్రేన్ తలనొప్పి

మైగ్రేన్‌లో తలనొప్పి తరచు రావడం, ఒకసారి ఎక్కువగానూ, మరొకసారి తక్కువగానూ ఉండడం, తలకి ఒక వైపే రావడం, ఆకలి లేకపోవడం, వికారం అనిపించడం, వాంతులు అవడం వంటి లక్షణాలు ఉంటాయి.

కారణాలు:

సాధారణంగా ఈ వ్యాధి చిన్నతనంలోనే ప్రారంభమవుతుంది. అప్పుడప్పుడు తలనొప్పి వచ్చి వాంతులు అవుతాయి. స్త్రీలలో ఈ తలనొప్పి ఎక్కువ. కొన్ని కుటుంబాలలో ఎక్కువ మందిలో ఇటువంటి తలనొప్పి కనబడుతుంది. కొన్ని పదార్థాలు తిన్నప్పుడు ముఖ్యంగా జున్ను, చాక్లెట్లు, పులుపు ఉండే పళ్ళు తిన్నప్పుడు మైగ్రేన్ రావడం ఉంటుంది. టెన్షన్ పడేవారిలో మైగ్రేన్ రావడం ఎక్కువ.

లక్షణాలు:

మైగ్రేన్ తలనొప్పి రావడానికి ముందు కొందరిలో 15-20 నిముషాలపాటు కళ్ళముందు గజిబిజిగా ఏవేవో కనబడతాయి. కండరాలు కూడా బలహీనంగా అనిపిస్తాయి. ఏదన్నా

మింగాలంటే కూడా బాధగా ఉంటుంది. తలనొప్పి ముందుగా ఒక వైపు ప్రారంభమై తరువాత మొత్తం అనిపిస్తుంది. సాధారణంగా ఉదయం లేస్తూనే తలనొప్పి ఉంటుంది. వికారం అనిపిస్తుంది. వాంతులు అవుతాయి. తలనొప్పి గంటల తరబడి ఉంటుంది. కొందరిలో 2-3 రోజులు ఉంటుంది. చివరికి నిద్రలో తగ్గుతుంది. మందులు వాడితే ఇంత బాధపడకుండా ముందుగానే తగ్గుతుంది.

చికిత్స:

1. మైగ్రేన్ ఎటాక్ వచ్చిన సమయంలో ఎర్గాట్‌మిన్ టాబ్లెట్ 2 మి.గ్రా బిళ్ళ ఒకటి నాలిక క్రింద పెట్టుకుని కరగనివ్వాలి.
2. తలనొప్పి ఇంకా ఉంటే తలనొప్పి తగ్గేవరకు అరబిళ్ళ చొప్పున ప్రతి 30 నిముషాలకి నాలిక క్రింద పెట్టుకుని కరగనివ్వాలి. మొత్తం రెండు బిళ్ళలకి మించి (4 మి.గ్రా.) వాడకూడదు. ఈ బిళ్ళలకి తోడు తలనొప్పి తగ్గటానికి డిస్ప్రిరిన్ రెండు బిళ్ళలు ప్రతి 6 గంటలకు ఒకసారి వేసుకోవాలి. డిస్ప్రిరిన్‌తో పాటు కొడీన్‌ఫాస్ఫేట్ బిళ్ళలు కూడా వేసుకోవాలి.
3. మైగ్రేన్ తలనొప్పి వచ్చినప్పుడే మందులు వాడటం కాకుండా మళ్ళీ మళ్ళీ తలనొప్పి రాకుండా మూడు నెలలు మందులు వాడాలి. ఇందుకోసం 'నోమైగ్రేన్' **లేదా** 'సెబీలియమ్' బిళ్ళలు రోజు రాత్రిపూట ఒకటి చొప్పున వాడాలి.
4. ఆందోళన టెన్షన్ ఉండేవాళ్ళకి మైగ్రేన్ మరింత రావడం సహజం. అందుకని వాలియం-5 కానీ, ట్రైకా 0.5 మి.గ్రా. బిళ్ళలు గానీ రోజూ రాత్రి పూట ఒకటి వేసుకోవాలి.
5. పై మందులకి తోడు 'సిప్లార్ -40 లేదా 'ఇండిరాల్ - 40' బిళ్ళలు ఉదయం- ఒకటి, మధ్యాహ్నం - ఒకటి, రాత్రి - ఒకటి చొప్పున కొన్ని నెలలు వాడాలి. 'ఎమిట్రాల్' 25 యం.జి. బిళ్ళలు రోజూ రాత్రిపూట ఒకటి వేసుకోవాలి.

□□□

# 5. మూర్ఛలు (ఫిట్స్)

ఎపిలెప్సీ వచ్చిన వారిలో అకస్మాత్తుగా స్పృహ కోల్పోవడం ఉంటుంది. కాళ్ళు, చేతులు బిగుసుకుంటాయి. అసాధారణంగా ఊపడం ఉంటుంది. నోటి వెంట నురుగు వస్తుంది. కొద్ది నిముషాల తరువాత స్పృహ వస్తుంది. ఇటువంటి పరిస్థితిని ఎపిలెప్సీ

అంటారు. ఇతర వ్యాధుల్లో కూడా ఫిట్స్ వస్తాయి.

మెదడులో కంతులు ఏర్పడినా, నీరు చేరినా, హెమరేజి జరిగినా, ఫిట్స్ రావచ్చు, మెదడుకి ఇన్‌ఫెక్షన్స్ వచ్చినప్పుడు కూడా ఫిట్స్ వస్తాయి.

ఉదా॥ మెనింజైటిస్, ఎన్‌కెఫలైటిస్.

తలకిగాయం, మెదడు రక్తనాళాలలో రక్తం గడ్డకట్టడం లేదా రక్తప్రసారం ఆగిపోవడం, పుట్టుకతోనే మెదడులో కొన్ని లోపాలు, మెదడు కణాలు దెబ్బతినిపోవడం, మెదడుకి తగినంత ఆక్సిజన్ అందకపోవడం, ఆల్కహాలు, కొకైన్, ఆర్సెనిక్, లెడ్ మొదలైన విష పదార్థాల ప్రభావం, గుర్రపు వాతం, యురీమియా, రక్తంలో గ్లూకోజ్ శాతం తగ్గిపోవడం, రక్తంలో కాల్షియం శాతం తగ్గిపోవడం, కార్బన్ మోనాక్సైడ్ పాయిజనింగ్, టెటనీ, చిన్నపిల్లల్లో జ్వరం రావడం వల్ల ఫిట్స్, విటమిన్ 'డి' లోపం వల్ల రికెట్స్ వ్యాధి కలగడం.

## మూర్ఛవ్యాధి (ఎపిలప్సి)

మూర్ఛ వ్యాధి వంశపారపర్యంగా సంక్రమించవచ్చు మూర్ఛవ్యాధి ఉన్నవారిలో ఏదైన దెబ్బతగిలినా, ఆవేశం వచ్చినా, ఆహారం లేకపోయినా, బాగా అలసిపోయినా, జ్వరం వచ్చినా ఫిట్స్ కనపడవచ్చు.

మూర్ఛ వ్యాధిలో రకాలు:

* గ్రాండ్‌మాల్ ఎపిలప్సి
* పెటీట్ మాల్ ఎపిలప్సి
* ఫోకల్ ఎపిలప్సి

గ్రాండ్‌మాల్ ఎపిలప్సి: ఫిట్స్ వస్తే చాలా సేపు ఉంటాయి. ఈ ఫిట్స్ వచ్చే ముందు సాధారణంగా ఎటువంటి సంకేతం ఉండదు. అకస్మాత్తుగా స్పృహ కోల్పోవడం, క్రింద పడిపోయి కాళ్ళు, చేతులు విపరీతంగా ఊపేయడం, తల ఎత్తెత్తి కొట్టుకోవడం, నోరు వెంట నురగ రావడం ఉంటాయి. కాళ్ళు, చేతుల కండరాలు బాగా బిగుసుకుంటాయి. కంటి గుడ్లు గుండ్రంగా, బొంగరంలా తిరుగుతాయి. కొందరిలో చేతి గోళ్ళు, పెదవులు నీలంగా మారతాయి. బట్టలలోనే మలం, మూత్రం అయిపోతుంది. కొన్ని నిముషాలు ఫిట్స్ ఉన్న తరువాత రోగి నిదానంగా తెలివిలోకి రావడమో, నిద్రపోవడమో జరుగుతుంది. ఒకవేళ తెలివి వచ్చినా మనసు అంతా అయోమయంగా ఉంటుంది.

పెటీట్ మాల్ ఎపిలప్సి: ఇందులో ఎక్కువ సేపు స్పృహ కోల్పోవడం ఉండదు. కేవలం క్షణిక కాలం పాటు స్పృహ కోల్పోవడం ఉంటుంది. ఏదైన పనిచేస్తున్న వాళ్ళు పనిచేస్తూనే అకస్మాత్తుగా ఆగిపోతారు. కళ్ళు తిన్నగా చూస్తూ జీవంలేని వాళ్ళుగా కనబడతారు. చేతులో ఏదైన వస్తువు ఉంటే జారిపడిపోతుంది. ఆ సమయంలో ఏమీ తెలియదు. క్షణిక కాలం అలా ఉండి తిరిగి పూర్తిగా స్పృహలో కొస్తారు. వాళ్ళకలా స్పృహ పోయినట్టు తెలియదు. మామూలుగా వాళ్ళు చేస్తున్న పనిని కొనసాగిస్తుంటారు.

ఫోకల్ ఎపిలప్సి: దీనినే జాక్సోనియన్ సీజర్ లేదా సింపుల్ పార్షియల్ సీజర్ అంటారు. ఇందులో మెదడులోని ఒక ప్రత్యేక భాగంలో అసాధారణ ప్రేరణ కలుగుతుంది. దాని ఫలితంగా శరీరంలో ఒక ప్రత్యేక భాగంలో ఒక క్షణిక కాలం పాటు వీక్‌నెస్ రావడం, సెన్సేషన్ కోల్పోవడం ఉంటాయి. ఆ సమయంలో స్పృహ కోల్పోవచ్చు లేదా కోల్పోకపోవచ్చు. ఫోకల్ ఎపిలప్సి వలెనే మరొకటి ఉంది. దీనిని 'టెంప్రల్ లోబ్ సీజర్' లేదా 'సైకోమోటార్ ఎపిలప్సి' అంటారు. మెదడులో అసాధారణ ప్రేరణ కలగగా కొన్ని క్షణాలపాటు ఆ వ్యక్తిలో అసాధారణమైన ప్రవర్తన, సెన్సేషన్స్, ఆలోచనా విధానంలో మార్పు కలుగుతాయి. ఈ సమయంలో రకరకాల భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. ఈభ్రాంతులు వాసనలకి సంబంధించినవి, రుచులకి సంబంధించినవి అవుతాయి. కలల లోకంలో విహరించడం ఉంటుంది. ఆ సమయంలో దుస్తులు కూడా విభిన్నంగా ధరించడం జరుగుతుంది. మాటలు కూడా మారిపోతాయి. టెంప్రల్‌లోబ్ సీజర్ తగ్గిపోగానే అంతవరకు జరిగింది ఏమీ గుర్తుండదు. కొందరు ఇటువంటి మూర్ఛ వ్యాధిని వ్యాధి అనుకోకుండా సమాధి స్థితిలోకి, దైవ సన్నిధిలోకి వెళ్ళి రావడమని, దైవం ఆవహించడం అని అనుకుంటారు. కానీ అది వ్యాధి మాత్రమే.

## నిర్ధారణ:

ఎలక్ట్రో ఎన్‌కెఫలోగ్రఫి. మూర్ఛలు వచ్చినప్పుడయినా, లేనప్పుడయినా ఇ.ఇ.జి.లో మార్పులు కనబడతాయి. వ్యాధులు వల్ల మూర్ఛలు వస్తున్నప్పుడు వాటిని తగిన పరీక్షలు జరిపి వ్యాధి నిర్ధారించవచ్చు. సెరిబ్రో స్పైనల్ ఫ్ల్యూయిడ్ ఎగ్జామినేషన్. సి.టి.స్కాన్. యం.ఆర్.ఐ.

## చికిత్స:

1. ఎపిలప్సి ఫిట్స్ వచ్చినప్పుడు డైజిపామ్ 10 మి.గ్రా. ఇంజక్షన్ రూపంలో నరానికి ఇవ్వాలి. సాధారణంగా వెంటనే మూర్ఛలు తగ్గిపోతాయి. ఇంకా మూర్ఛలు

ఉన్నట్లయితే పది నిముషాల తరువాత ఒక 500 యం.యల్. గ్లూకోజ్ సెలైన్‌లో 100 మి.గ్రా. డైజిపామ్ కలిపి నరానికి ఎక్కించాలి.

2. పై చికిత్సకి ఫిట్స్ తగ్గకపోతే ఫెనిటాయిన్ ఇంజక్షన్ ప్రతి కే.జి. బాడి వెయిట్‌కి 15 మి.గ్రా. చొప్పున లెక్కగట్టి మందు తీసుకుని నిముషానికి 50 మి.గ్రా. చొప్పున ఇవ్వాలి. ఫిట్స్ తగ్గిపోగానే ఆపేయాలి **లేదా** 1000 మి.గ్రా. మోతాదు ఇవ్వడంతో ఆపేయాలి.

3. ఎపిలప్సి ఫిట్స్ వచ్చినప్పుడే మందులు వాడటం కాకుండా కనీసం ఐదు సంవత్సరాలు క్రమం తప్పకుండా మందు వాడాలి. ఫినటైన్ టాబ్లెట్స్ 100 మి.గ్రా. చొప్పున రోజుకి మూడుసార్లు ఇవ్వాలి **లేదా** సోడియం వేలపరేట్ 200 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు ఇవ్వాలి **లేదా** కార్బమాజిపిన్ 200 మి.గ్రా. చొప్పున 3 సార్లు ఇవ్వాలి **లేదా** క్రోనోజెపామ్ 1-2 మి.గ్రా. రోజుకి ఒకసారి ఇవ్వాలి. ఈ మందులు ఏమైనా సరే చివరగా ఫిట్స్ కనపడిన తరువాత 5 సంవత్సరాలు వాడాలి. 5 సంవత్సరాల తరువాత తిరిగి ఫిట్స్ కనబడితే 5 నుంచి 10 సంవత్సరాలు వాడాలి. కొందరికి ఫిట్స్‌కి మెదడులో కంతులుకి కారణమవుతాయి. అందుకని ఫిట్స్ ఉన్నప్పుడు తగిన పరీక్షలు జరపడం అవసరం.

❑❑❑

# 6. పక్షవాతం (హెమీప్లిజియా)

*శరీరంలో ఒకవైపు కాలు, చేయి చచ్చుబడిపోవడాన్ని హెమీప్లిజియా అంటారు. దీనినే పక్షవాతం అనికూడా అంటారు. దీనినే సెరిబ్రల్ స్ట్రోక్ అంటారు.*

**కారణాలు:**

పక్షవాతానికి ప్రధాన కారణం మెదడులో రక్తంగడ్డ ఏర్పడి రక్తప్రసారానికి అవరోధం ఏర్పడటం. కొందరిలో వేరేచోట రక్తంగడ్డ తయారై రక్తంతో ప్రయాణించే మెదడు రక్తనాళాలలో అడ్డుపడుతుది. ఇంకొందరిలో మెదడు రక్తనాళాలు చిట్లుతాయి. ఇటువంటి కారణాలలో కూడా అకస్మాత్తుగా పక్షవాతం వస్తుంది.

తలకి గట్టిగా దెబ్బతగిలినా, రక్తపోటు వల్ల మెదడులో రక్తనాళాలు చిట్లినా అకస్మాత్తుగా పక్షవాతం రావచ్చు.

కొందరిలో శరీరంలో ఒక వైపు నిదానంగా బలహీనత కనబడి - తరువాత కాలు, చేయి పూర్తిగా చచ్చుబడతాయి. ఇటువంటి వారికి మెదడులో కంతులు ఉండడం, మెదడు వ్యాధులు ఉండడం, ఎన్యూరిజమ్స్ ఉండడం ఒక కారణం.

**లక్షణాలు:**

పక్షవాతం వచ్చిన వైపు కాలు,చేయి పడిపోవడం. తలనొప్పి, ఫిట్స్ రావడం, జ్వరం, మెంటల్ లక్షణాలు. మెదడులో వ్యాధులుండి పక్షవాతం వస్తే వ్యాధికి సంబంధించిన లక్షణాలు, కొందరిలో అపస్మారక స్థితి ఏర్పడుతుంది. నోటిమాట పడిపోవచ్చు. మెడ దగ్గర కండరాలు బిగుసుకుంటాయి. మెడ ముందుకి వంచితే వంగదు. కంటి గ్రుడ్ల కదలికలు సరిగ్గా ఉండవు.

**వ్యాధి నిర్ధారణ:**

రక్తపోటు, మూత్రపరీక్ష, వగైరా, సి.టి.స్కాన్, సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ ఎగ్జామినేషన్, సెరిబ్రల్ యాంజియోగ్రఫీ.

**చికిత్స:**

1. రోగి అపస్మారక స్థితిలో ఉన్నట్లయితే గాలి సక్రమంగా తీసుకునేటట్టు చూడడం.
2. శరీరానికి కావలసిన ఆహారం, నీరు అందచేయడం.
3. బెడ్ సోర్స్ రాకుండా జాగ్రత్తలు తీసుకోవడం.
4. మూత్ర విసర్జన విషయంలో జాగ్రత్తలు తీసుకోవడం.
5. బి.పి., షుగర్, ఇతర ఇన్‌ఫెక్షన్స్ విషయంలో శ్రద్ధ వహించడం.
6. మానిటాల్ 20% నరానికి ఎక్కించడం.
7. గ్లిసరాల్ అవున్స్ చొప్పున రోజుకి మూడుసార్లు నోటి ద్వారా పట్టించడం.
8. డెకడ్రాన్ ప్రతి 8 గంటలకి ఒకటి చొప్పున నరానికి 5 రోజులు ఇంజక్షన్ ఇవ్వాలి.
9. లాసిక్స్ ఇంజక్షన్ రోజూ ఒకటి ఇవ్వడం.
10. లోమోడెక్స్ 500 యం.యల్. రోజూ నరానికి ఎక్కించడం.
11. రోజూ ఒక డిస్ప్రిన్ టాబ్లెట్ ఇవ్వడం.
12. ట్రెంటాల్ 400 మి.గ్రా. టాబ్లెట్స్, లేదా నియోడిప్ క్యాప్సూల్స్ రోజుకి 3 సార్లు ఇవ్వడం.
13. కొన్ని హెమీప్లీజియా కేసుల్లో సర్జరీ అవసరం అవుతుంది.

□□□

# 7. సెరిబ్రల్ హెమరేజ్

**కారణాలు:**

పెద్ద మెదడులో గానీ చిన్న మెదడులో గానీ రక్తనాళాలు చిట్లి వెంట్రికల్స్‌లోకి సబ్‌యారకనాయిడ్ స్పేస్‌లోకి రక్తం చేరడం, మెదడు లోపల ఎన్యూరిజమ్స్ ఉండడం, అవి పగిలి రక్తస్రావం జరగడం.

**లక్షణాలు:**

కొందరిలో మెదడులోపల రక్తస్రావం జరిగేముందుగా కొన్ని లక్షణాలు కనబడతాయి. మైగ్రేన్ లాంటి తలనొప్పి, తాత్కాలికంగా కంటి చూపు మందగించడం, ఒక కాలో, ఒక చెయ్యో బలహీనం అవడం, క్రేనియల్ నర్వ్ దెబ్బతినడం వంటి లక్షణాలు కనబడతాయి.

పై లక్షణాలు ఏవీ కనపడకుండానే అకస్మాత్తుగా ఒకేసారి సెరిబ్రల్ హెమరేజి లక్షణాలు కనబడటం ఎక్కువ. సెరిబ్రల్ హెమరేజి జరిగిన వారిలో అకస్మాత్తుగా స్పృహ పోతుంది. కండరాలన్నీ పటుత్వం కోల్పోతాయి. తలనొప్పి విపరీతంగా అనిపిస్తుంది. వెలుతురు చూడలేకపోతారు. మెడ బిగుసుకు పోతుంది. జ్వరం కూడా ఉంటుంది.

మెదడులో పరిమితం అయిన ప్రదేశంలో కొద్దిపాటి హెమరేజి జరిగినప్పుడు చూపు కొంతే కనబడుతుంది. కంటి గుడ్లు కదలికలు సక్రమంగా ఉండవు. సరైన స్పృహ ఉండదు. ఫిట్స్‌లాగా రావచ్చు.

**నిర్ధారణ:**

సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ ఎగ్జామినేషన్ (సి.ఎస్.ఎఫ్.ఎనాలసిస్) వెన్నులోంచి నీరు తీసి పరీక్ష చేస్తే అందులో రక్త కణాలు ఉంటాయి. యాంజియోగ్రఫీ, సి.టి.స్కాన్ స్కల్ మరియు బ్రెయిన్, ఎమ్.ఆర్.ఐ.

సాధారణంగా సెరిబ్రల్ హెమరేజ్ వచ్చిన వారిలో ముగ్గురిలో ఒక్కరు చొప్పున మరణించవచ్చు. తక్కినవారు రెండు నుంచి నాలుగు వారాలలో కోలుకుంటారు.

**చికిత్స:**

1. ఆసుపత్రిలో ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో రోగికి చికిత్సచేయాలి.
2. న్యూరోసర్జరీ ద్వారా రక్తస్రావం జరుగుతున్న రక్తనాళాలని పట్టుకుని వాటిని క్లిప్పింగ్ వేయాలి.
3. న్యూరోసర్జరీ ద్వారా మెదడులో కలిగిన ప్రెషర్‌ని తొలగించాలి.
4. హెమరేజి తక్కువగా ఉన్నప్పుడు మెడికల్ ట్రీట్‌మెంట్ కొంత తోడ్పడుతుంది.

□□□

# 8. కోమా

రోగికి పూర్తి అపస్మారక స్థితి ఏర్పడుతుంది. రోగిని సూదితో గుచ్చినప్పటికి ఎటువంటి ప్రతిస్పందన ఉండదు.

**కారణాలు:** మెదడులో రక్తస్రావం జరగడం (సెరిబ్రల్ హెమరేజి), మెదడులో కంతులు, లివర్ ఫెయిల్యూర్ (హెపాటిక్ కోమా), కిడ్నీ ఫెయిల్యూర్ (యురీమిక్ కోమా), మధుమేహం(డయబిటిక్ కోమా) మిక్సీడీమా, మత్తుబిళ్ళల ఓవర్ డోస్, వడదెబ్బ (సన్‌స్ట్రోక్), సెప్టీసీమియా, తలకి గాయం, సెరిబ్రల్ మలేరియా, మెనింజైటీస్, అధికంగా ఆల్కహాల్ తీసుకోవడం.

నిర్ధారణ:

పై పరిస్థితులని దృష్టిలో పెట్టుకుని రోగిని పరీక్షించడం.రక్త పరీక్షలు, మూత్ర పరీక్షలు, సి.ఎస్.ఎఫ్. ఎనాలసిస్, సి.టి.స్కాన్, సెరిబ్రల్ యాంజియోగ్రఫి,ఇ.ఇ.జి.

గ్లూకోజ్ టెస్ట్ : కొన్ని సందర్భాలలో కోమా ఎందుకైనది అంతుపట్టదు. క్లినికల్‌గా అన్నీ మామూలుగా ఉంటాయి. ఒకోసారి ఇటువంటి కోమా రక్తంలో గ్లూకోజ్ శాతం పూర్తిగా తగ్గిపోవడం కారణం. ముఖ్యంగా మధుమేహానికి ఇన్సులిన్ ఇంజక్షన్లు, యాంటీ డయబిటిక్ టాబ్లెట్స్ ఓవర్‌డోస్ తీసుకున్నప్పుడు సంభవిస్తుంది. ఇవేమీ కాకుండా కూడా రక్తంలో గ్లూకోజ్ శాతం బాగా తగ్గిపోయి కోమా రావచ్చు. అందుకని క్లినికల్‌గా కోమా కారణం అంతుపట్టనప్పుడు 50% గ్లూకోజ్ 100 యం.యల్.నరానికి ఇస్తే కొందరిలో తెలివి వచ్చేస్తుంది. ఇటువంటి వారికి హైపోగ్లైసీమిక్ కోమా (రక్తంలో గ్లూకోజ్ శాతం తగ్గిపోవడం) కారణం.

చికిత్స:

1. మూలకారణం బట్టి చికిత్స చేయాలి.
2. ఆక్సిజన్ పెట్టాలి. రెస్పిరేషన్స్ సక్రమంగా ఉండేటట్లు చూడాలి.
3. రక్త ప్రసరణ, హార్టు ఫంక్షన్ సక్రమంగా ఉండేటట్లు చూడాలి.
4. కిడ్నీస్ ఫంక్షన్ సక్రమంగా ఉండేటట్లు చేయాలి.
5. ఇన్‌ఫెక్షన్ ఉండేటట్లయితే కంట్రోలు చేయాలి.
6. విషపదార్థం కోమాకి కారణమయితే దానికి విరుగుడు చేయాలి.
7. న్యూరో సర్జరీ ద్వారా ఫలితం ఉండే కేసులలో రోగికి బ్రెయిన్ సర్జరీ చేయాలి.

□□□

# 9. న్యూరో సిఫిలిస్

ఈ రోజుల్లో న్యూరోసిఫిలిస్ చాలా అరుదైపోయింది. సిఫిలిస్ వచ్చినప్పుడు చికిత్స చేయకపోతే కొందరిలో రెండు సంవత్సరాల తరువాత మెదడుకి సిఫిలిస్ క్రిములు చేరవచ్చు. ఇలా చేరిన తరువాత వెంటనే ఎటువంటి లక్షణాలు కలగకపోవచ్చు. అయినా వారి వెన్ను నీరు తీసి (సి.ఎస్.ఎఫ్.) పరీక్ష చేస్తే అందులో సెల్స్ కౌంట్ ఎక్కువగా కనబడుతుంది. వెన్ను నీరుని వి.డి.ఆర్.యల్.రక్తపరీక్ష చేస్తే పాజిటివ్ వస్తుంది. ఇటువంటి వారికి చికిత్స చేస్తే ఆరు నెలల్లో న్యూరో సిఫిలిస్ పూర్తిగా క్యూర్ అవుతుంది. వెన్ను నీరు ఆరోగ్యకరంగా మారుతుంది.

కొందరిలో సిఫిలిటిక్ మెనింజైటీస్ వస్తుంది. వాంతులు, తలనొప్పి ఉంటాయి. వెన్ను నీరులో సెల్స్ 1000 నుంచి 1500 ఉంటాయి. వి.డి.ఆర్.యల్ స్ట్రాంగ్ పాజిటివ్ వస్తుంది. మరికొందరిలో కంటినరం దెబ్బతింటుంది. సిఫిలిస్ వచ్చిన మరికొందరిలో మానసికవ్యాధి లక్షణాలు ఏర్పడుతాయి. రకరకాల భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి.

న్యూరో సిఫిలిస్ వచ్చిన వారిలో టేబిస్ డార్సాలిస్ అనే నరాల వ్యాధి వస్తుంది. దీని వల్ల నరాల్లో చురుకుపోట్లు ఎక్కువ ఉంటాయి. కొన్ని చోట్ల స్పర్శ జ్ఞానం లోపిస్తుంది. కండరాలలో బలహీనత ఏర్పడుతుంది. నడుస్తూంటే ఒళ్ళు తూలుతూంటుంది. కంటి పాపలో తేడా వస్తుంది. మూత్ర విసర్జన బిగపట్టి అవుతుంది. పాదాలలో పెద్ద గుంటల్లాగా పుళ్ళు పడతాయి. దీనికి కూడా న్యూరోసిఫిలిస్‌కి చేసే పరీక్షలే చేయాలి. తల్లి నుండి బిడ్డకు న్యూరోసిఫిలిస్ సంక్రమించవచ్చు.

కంజెనిట్ న్యూరో సిఫిలిస్: బిడ్డ పుట్టిన కొద్ది సంవత్సరాలలోనే మెదడుకి సంబంధించిన సిఫిలిస్ లక్షణాలు బయటపడతాయి. 5,6 సంవత్సరాల వయస్సులో పిచ్చి లక్షణాలు కనపడతాయి: 14-15 సంవత్సరాలు వచ్చేసరికి టేబిస్ డార్సాలిస్ లక్షణాలు కలుగుతాయి. వీరికి వి.డి.ఆర్.యల్.పరీక్ష, సి.ఎస్.ఎఫ్. ఎగ్జామినేషన్ చేసి వ్యాధిని నిర్ధారించవచ్చు.

**చికిత్స:**

1. ప్రెడ్నిసోలోన్ రోజుకి 40 మి.గ్రా. చొప్పున 3 రోజులు.
2. ప్రొకైన్ పెన్సిలిన్ 0.9 - 1.2 మెగా యూనిట్స్ రోజుకి ఒకసారి చొప్పున 21 రోజులు. పెన్సిలిన్ పడని వాళ్ళకి ఆక్సీటెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. క్యాప్సుల్స్ ఆరు గంటలకు ఒకసారి చొప్పున 15 రోజులు. ప్రతి నెల ఇదే కోర్సు ఇస్తూ

ఉండాలి. సాధారణంగా 3 నెలలు సి.ఎస్.ఎఫ్.క్లియర్ అవుతుంది. అవసరమైన వారికి 6 నెలలు కోర్సు ఇవ్వవలసి వస్తుంది.

3. న్యూరో సిఫిలిస్ వచ్చిన వారికి అయోమయ పరిస్థితి. ఒళ్ళుతూలడం, మూత్రం బిగపట్టడం, కీళ్ళ నొప్పులు, ఫిట్స్ వంటి లక్షణాలు ఉండవచ్చు. వీరికి కార్బమజిపిన్ 200-400 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు ఇవ్వాలి. లేదా ఫినటాయిన్ 100 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు ఇవ్వాలి.

❑❑❑

# 10. బ్రెయిన్ ట్యూమర్స్

*బ్రెయిన్ ట్యూమర్స్‌నే మెదడులో కంతులు అంటారు. లేదా ఇంట్రాక్రేనియల్ ట్యూమర్స్ అంటారు.*

*బ్రెయిన్ ట్యూమర్స్ మెదడులోని నాడీకణాలకి సంబంధించినవి కావచ్చు. మెదడు పొరలకి సంబంధించినవి కావచ్చు. రక్తనాళాలకి సంబంధించినవి కావచ్చు. పిట్యూటరి గ్రంథికి సంబంధించినవి కావచ్చు. కేన్సర్‌కి సంబంధించినవి కావచ్చు. టి.బి.కి సంబంధించినవి కావచ్చు. పరాన్నజీవులకి సంబంధించినవి కావచ్చు. నాడీమండలంపై పొరలకి సంబంధించినవి కావచ్చు.*

**లక్షణాలు:**

ఉదయం లేస్తూనే తలనొప్పి ఉంటుంది. కష్టపడి పని చేస్తూంటే తలనొప్పి పెరుగుతుంది. దగ్గినా, తుమ్మినా తలనొప్పి ఎక్కువవుతుంది.

ఉన్నట్లుండి ఒక్కసారిగా వాంతులు అవుతాయి. చెంబుతో నీళ్ళు ఒలకపోసినట్లు ఒక్కసారిగా నీళ్ళు నోట్లోంచి బయట పడతాయి. కంటి చూపు త్వరితంగా మందగిస్తుంది. అంధత్వం కూడా ప్రాప్తించవచ్చు. జ్ఞాపక శక్తి మందగిస్తుంది. తెలివితేటలు తగ్గిపోతాయి. మగతగా ఉంటుంది. కొందరికి మగత కోమాకి దారితీస్తుంది. ఫిట్స్ వస్తాయి, పక్షవాతం లక్షణాలు కలుగుతాయి. భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి.

**నిర్ధారణ:**

స్కల్ ఎక్స్‌రే, సి.టి. స్కాన్, ఎమ్.ఆర్.ఐ, సెరిబ్రల్ యాంజియోగ్రఫి,ఇ.ఇ.జి బయాప్సి.

చికిత్స:

1. న్యూరో సర్జరీ ద్వారా కంతిని తొలగించాలి.
2. రేడియో థెరపి
3. కీమో థెరపి

□□□

# 11. వెన్నుపాము వ్యాధులు

## 1. రెండు కాళ్ళకి పక్షవాతం (పారాప్లీజియా)

వెన్నుపాము (స్పైనల్ కార్డ్) వ్యాధులలో రెండు కాళ్ళకి పక్షవాతం వస్తుంది. ఈ పరిస్థితిని పారా ప్లీజియా అంటారు.

**కారణాలు:**వెన్నుపాములో ట్యూమర్స్ రావడం. వెన్నుపాములో వ్యాధులొచ్చి డామేజి అవడం. నడుంకి దెబ్బ తగలడం. వెన్నుపాములో రక్తనాళాలు దెబ్బతినడం. వెన్నుపాములో రకరకాల కారణాల వల్ల వత్తిడి ఏర్పడడం.

**లక్షణాలు:**

కొందరిలో పూర్తిగా పక్షవాతం రావచ్చు. మరికొందరిలో పాక్షికంగా రావచ్చు. లేదా కేవలం కొన్ని నరాల బాధలు కలగొచ్చు. అటువంటి బాధలలో - కాళ్ళలో నొప్పి. దగ్గినా, తుమ్మినా ఈ నొప్పి ఎక్కువవుతుంది. తిమ్మిర్లు, సూదులు గుచ్చుకున్నట్లు బాధలు. కొందరిలో ఈ బాధలు త్వరితంగా పెరుగుతాయి. కండరాలు క్షీణిస్తాయి. సక్రమంగా నడవలేకపోవడం. కాళ్ళలో వణుకు, కాళ్ళలో కొన్ని భాగాలలో నొప్పి తెలియకుండా పోతుంది. మూత్రం కంట్రోలులో ఉండకపోవచ్చు.

**పరీక్షలు:** సి.ఎస్.ఎఫ్.ఎనాలసిస్, వెన్నుకి ఎక్స్‌రే, సి.టి.స్కాన్, మైలోగ్రఫీ, ఎమ్.ఆర్.ఐ, రక్త పరీక్షలు.

చికిత్స:

1. రోగికి పూర్తిగా విశ్రాంతి ఇవ్వాలి.
2. వ్యాధి బట్టి చికిత్స చేయాలి.
3. స్పైనల్ కార్డ్ కంప్రషన్ ఉంటే సర్జరీ ద్వారా చికిత్స చేయాలి.
4. ఫీజియోథెరపి.

□□□

2. ఎక్యూట్ ట్రాన్స్‌వర్స్ మైలైటిస్

వెన్నుపాముకి సంబంధించిన వ్యాధులలో ఇది ఒక ప్రధానమైన వ్యాధి. ఈ వ్యాధిలో వెన్నుపాము ఒక ప్రత్యేకమైన ప్రదేశంలో డామేజి అవుతుంది. అలా డామేజి అవడానికి రకరకాల కారణాలు ఉంటాయి.

కారణాలు:

నడుముకి ప్రత్యేకంగా ఒక చోట కత్తితో గాయమో, ఎత్తునుంచి పడితే వెన్నుపూస దెబ్బతినడమో జరుగుతుంది. సిఫిలిస్, పొంగు జ్వరం, గవద బిళ్ళలు, టైఫాయిడ్ వ్యాధులలో క్రిములు వెన్నుపాముకి చేరి వ్యాధిని కలగచేస్తాయి. వెన్నుపాముకి రక్త ప్రసారం దెబ్బతినడం, వెన్నుపూసకి టి.బి.రావడం, వెన్నుపాములో కంతి ఏర్పడడం. వైరస్ వ్యాధులు, విష పదార్థాలు తీసుకోవడం.

లక్షణాలు:

కాళ్ళలో కండరాలు బిగుసుకుంటాయి. లేదా బలహీనంగా మారతాయి. కాళ్ళలో తిమ్మిరిలు, మంటలు. జ్వరం. మూత్రం రావడం ఆగిపోవడం. కాళ్ళు రెండూ పూర్తిగా చచ్చుబడటం.

నిర్ధారణ:

సి.ఎస్.ఎఫ్.ఎనాలసిస్, రక్త పరీక్షలు,సి.టి.స్కాన్, ఎమ్.ఆర్.ఐ, మైలోగ్రఫి, స్పైనల్ ఎక్సర్‌సైజు.

చికిత్స:

1. వ్యాధి కారణం బట్టి చికిత్స.
2. మూత్ర విసర్జన సక్రమంగా ఉండేలా చూడడం.
3. విరోచనం రోజూ అయ్యేలా చూడడం.
4. కార్టికో స్టిరాయిడ్స్.
5. ఫిజియోథెరపి.

❑❑❑

# 12. పార్కిన్‌సోనిజం

పార్కిన్‌సోనిజంలో మూడు ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. (1) వణుకు (2) కండరాలలో బలహీనత (3) కండరాల బిగుతు (స్టిఫ్).

కారణాలు:

పార్కిన్‌సోనిజం మెదడు నరాలకి సంబంధించినది. మెదడులోని ఎసిటైల్ కోలిన్,డోపమిన్, అస్తవ్యస్తంగా తయారవుతాయి. దానివల్ల పార్కిన్‌సోనిజం కలుగుతుంది, ఎన్‌కెఫలైటిస్ (మెదడు వాపు జబ్బులు) రావడం. తలకి గాయాలు. కార్బోమోనాక్సైడ్ పాయిజనింగ్. మెదడు రక్తప్రసారం దెబ్బతినడం. మెదడులో ట్యూమర్ కూడా కారణాలు కావచ్చు.

లక్షణాలు:

* వణుకు: పార్కిన్‌సోనిజంలో మొదటగా కనబడేది వణుకు. సాధారణంగా వణుకు చేతుల్లో ప్రారంభమవుతుంది. ఈ వణుకు విలక్షణమైనది. ఏదైన చేత్తో పనిచేస్తున్నప్పుడు వణుకు ఉండదు. చేతులు ఖాళీగా ఉన్నప్పుడే వణుకు కనబడుతుంది. తల కూడా కొందరిలో ఊగిసలాడుతుంది. నిద్రలో వణుకు ఉండదు.
* కండరాలలో బిగుతు: కండరాలు బిగుతుగా మారతాయి. చేయిగానీ, కాలు గానీ కదపబోతే జర్క్ ఇచ్చినట్టు కదులుతాయి.
* కండరాలలో బలహీనత: కండరాలలో బలము ఉండదు. మాట నంగిగా వస్తుంది. కంటి చూపు తీక్షణంగా చూస్తున్నట్లు ఉంటుంది. కంటి రెప్పలు ఎక్కువగా మూసుకోవు. నోటి వెంట చొంగ కారవచ్చు. ఆహారాన్ని త్వరగా నమలలేకపోతారు. నడక సరిగ్గా ఉండదు. నడిచేటప్పుడు కాస్త ముందుకు వంగుతారు. ఒళ్ళు కూడా కాస్త తూలుతుంది.

  ***పార్కిన్‌సోనిజం వచ్చిన వాళ్ళలో మానసికంగా కూడా తేడా కనబడుతుంది. డిప్రెషన్ చోటు చేసుకుంటుంది.***

చికిత్స:

1. లివోడోపా 500 మి.గ్రా. టాబ్లెట్స్ రోజుకి ఒకసారి. నిదానంగా మోతాదు పెంచుకుంటూ వెళ్ళాలి.
2. పాసిటైన్ తడవకి ఒక బిళ్ళ చొప్పున రోజుకి మూడుసార్లు.
3. బ్రోమోక్రిప్టిన్ రోజుకి అరబిళ్ళ చొప్పున వాడుతూ నిదానంగా మోతాదు పెంచాలి.

□□□

# 13. సెరిబ్రల్‌పాల్సీ

సెరిబ్రల్ పాల్సీ పుట్టుకతోనే మెదడు నరాలలో వచ్చే జబ్బు. దీని వల్ల కండరాల పటిష్టత ఉండదు. తెలివితేటలు కూడా తక్కువగా ఉంటాయి. సెరిబ్రల్‌పాల్సీ పరిణామాలు కొందరిలో తక్కువలో ఉంటే మరికొందరిలో చాలా ఎక్కువలో ఉంటాయి. సెరిబ్రల్ పాల్సీ శాశ్వతంగా ఉండే నరాల జబ్బు. పుట్టుకతో కండరాల బలహీనత ఎంత ఉంటుందో అంతే తప్ప అది పెరగడం ఉండదు.

**కారణాలు:**

స్త్రీ గర్భవతిగా ఉండగానే గర్భస్థ శిశువు మెదడులో లోపం ఏర్పడుతుంది. ఈ లోపం జన్యుపరమైంది కావచ్చు. స్త్రీ గర్భవతిగా ఉండగా టాక్సోప్లాస్మోసిస్, రూబెల్లా, సైటోమెగాలిక్ ఇన్‌క్లూజన్ డిసీజ్, హెర్పిస్ సింప్లెక్స్, సిఫిలిస్, ఇన్‌ఫ్లూయింజా వ్యాధులు వస్తే మెదడు దెబ్బతింటుంది. దాని వల్ల సెరిబ్రల్‌పాల్సీ వస్తుంది. కాన్పు సమయంలో బిడ్డ ఎక్కువ అలసిపోవడం, ప్రాణవాయువు తగినంత అందకపోవడం సెరిబ్రల్‌పాల్సీకి మరొక కారణం. నెలలు నిండకుండా పుట్టిన పిల్లలకి మెదడు తగినంత పెరగదు. అది కూడా సెరిబ్రల్‌పాల్సీకి మరొక కారణం. పిల్లలు ఆరోగ్యంగా పుట్టిన కొందరు పిల్లలకి ఎన్‌కెఫలైటిస్, మెనింజైటీస్, డీప్ జాండీస్ రావడంతో మెదడు దెబ్బతిని సెరిబ్రల్ పాల్సీ వస్తుంది.

**లక్షణాలు:**

* సెరిబ్రల్‌పాల్సీ చైల్డ్‌నే స్పాస్టిక్ చైల్డ్ అని కూడా అంటారు. దానికి కారణం వాళ్ళ కండరాలు స్టిఫ్‌గా తయారవుతాయి. కొందరికి ఒక వైపే పక్షవాతం వచ్చినట్లు కండరాలు బిగుసుకుపోతాయి. మరికొందరికి రెండు వైపుల కాళ్ళు చేతులు స్టిఫ్‌గా తయారవుతాయి. నడవాలంటే కుదరకుండా అవుతుంది.
* సెరిబ్రల్ పాల్సీ పిల్లల్లో మాట స్పష్టంగా రాదు. నోటివెంట చొంగ కారుస్తుంటారు. కంటి గుడ్లు నిలకడగా ఉండవు. చూపు ఎటో చూస్తుంటారు. ఆహారం కూడా తినలేరు.
* సెరిబ్రల్‌పాల్సీ వచ్చిన పిల్లలందరిలోనూ పై లక్షణాలన్నీ తీవ్రంగా ఉండవు. ఎక్కువ మందిలో కొద్దిపాటిగా ఉంటాయి.
* సెరిబ్రల్‌పాల్సీ నిర్ధారణకు వేరే పరీక్షలు అవసరం లేదు. వారిలో కనపడే లక్షణాలను బట్టే తెలుసుకోవచ్చు.

**చికిత్స:**

సెరిబ్రల్ పాల్సీకి ప్రత్యేకంగా మందులు లేవు. ఫిజియోథెరపి ఒకటే మార్గం.

❑❑❑

# 14. మోటార్ న్యూరాన్ డిసీజ్

*మోటార్ న్యూరాన్ డిసీజ్ కండరాల క్షీణ జబ్బు. సాధారణంగా 40 సంవత్సరాల దాటిన వారిలో కనపడుతుంది. పురుషులలో ఈ వ్యాధి ఎక్కువగా కనపడుతుంది. వెన్నుపాములో నరాలకి సంబంధించిన కేంద్రం దెబ్బతినడంతో ఈ వ్యాధి కలుగుతుంది. ముఖ్యంగా ఈ కేంద్రం నుంచి వచ్చిన నరాలు కండరాలని కంట్రోలు చేస్తాయి.*

**లక్షణాలు:**

ఈ వ్యాధి వచ్చిన వారిలో శరీరంలో వివిధ చోట్ల కండరాలు టక్‌టక్ అంటూ అదురుతాయి. కండరాలలో బలహీనత ఉంటుంది. రోగి నడవలేక పోతాడు. కాళ్ళు, చేతుల్లో కండరాలు సన్నబడతాయి. మ్రింగుడు పడడం కష్టం అవుతుంది. మాట్లాడడం కూడా కష్టం అవుతుంది. రోజు రోజుకి రోగి పరిస్థితి క్షీణిస్తుంది.

**నిర్ధారణ:**ఇ.యం.జి, మజిల్ బయాప్సీ, మైలోగ్రామ్, సి.ఎస్.ఎఫ్. ఎగ్జామినేషన్.

**చికిత్స:**

మోటారు న్యూరాన్ డిసీజ్‌కి ప్రత్యేకమైన మందులు లేవు. రోగిలో కలిగే బాధ బట్టి ఉపశాంతిగా మందులు వాడాలి.

❑❑❑

# 15. సెరిబెల్లార్ డిసీజ్

*సెరిబెల్లంనే చిన్న మెదడు అంటారు. మనిషి నిలకడగా నిలబెట్టటానికి కండరాలు బలంగా ఉండటానికి శరీర అవయవాలు సమన్వయంగా పనిచేయడానికి గ్రావిటీ నిలకడగా ఉండి మనిషి తూలకుండా ఉంచటానికి సెరిబెల్లం కృషి చేస్తుంది.*

**సెరిబెల్లం డామేజికి కారణాలు:**

రక్త ప్రసారం ఆగిపోయి దెబ్బతినడం. ఎన్‌కెఫలైటిస్ వంటి వైరల్ వ్యాధులు. కొన్ని మందులు దుష్ప్రభావం. పుట్టుకతోనే సెరిబెల్లంలో లోపాలు. సెరిబెల్లం కేన్సర్. మద్యం సేవించడం.

**లక్షణాలు:** కండరాలలో పటుత్వం లేకపోవడం. వేళ్ళు వణకడం. వస్తువుని గట్టిగా పట్టుకోలేకపోవడం. అవయవాల పనిలో సమన్వయం లోపించడం. ఉదా॥ కుడిచేయి

చూపుడు వేలు సూటిగా ఒకదానికొకటి తాకించాలంటే కుదరకపోవడం. చూపుడువేలుతో ముక్కుకొనను ముట్టుకోవాలన్నా కుదరక పక్కకు పోవడం. త్వరితంగా పనిచేయలేకపోవడం. తల ఊగిసలాడడం. ఒళ్ళు తూలి పడిపోవడం. కంటి గుడ్లు ఊగిసలాడడం. మాట సరిగ్గా మాట్లాడలేకపోవడం.

**చికిత్స:**

కారణం బట్టి చికిత్స చేయాలి.

❑❑❑

# 16. కండరాల వ్యాధులు (మయోపథీస్)

*కండరాల వ్యాధులనే మయోపథీస్ అంటారు. కండరాలలో కూడా ప్రత్యేకంగా* కొన్ని వ్యాధులు వస్తాయి. అవి జీన్స్ వల్ల కావచ్చు. ఇన్‌ఫ్లమేషన్ వల్ల కావచ్చు. హార్మోన్ల వల్ల కావచ్చు.

కండరాల వ్యాధులలో సూడోహైపర్ ట్రాఫిక్ మస్క్యులార్ డిస్ట్రఫి ఒక ప్రధానమైన వ్యాధి. ఇది జన్యుపరంగా సంక్రమించే వ్యాధి. 5 నుంచి 10 సంవత్సరాల లోపు పిల్లల్లో ఈ వ్యాధి బయటపడుతుంది. ప్రధానంగా మగపిల్లల్లో ఈ వ్యాధి ఎక్కువ. అరుదుగా ఆడపిల్లల్లో కనబడుతుంది. వంశపారంపర్యంగా ఈ వ్యాధికి సంబంధించిన జీన్స్ స్త్రీలలో ఉన్న వ్యాధిని బహిర్గతం చేయవు.

సూడో హైపర్ ట్రాఫిక్ మస్క్యులర్ డ్రిస్ట్రఫి వ్యాధి లక్షణాలు నిదానంగా బయట పడతాయి. ఈ వ్యాధి ఉన్న పిల్లవాడు తరచూ పడిపోతూంటాడు. వెన్ను కండరాలలో పటుత్వం లేక గూనిలాగా వస్తుంది. గూడ ఎముక పొడుచుకుంటూ వస్తుంది. పిరుదులు పెద్దవిగా కనబడతాయి. పొట్ట కండరాలు ఉబ్బుగా కనబడతాయి.

సాధారణంగా సెరిబెల్లం రెండు వైపుల కాళ్ళకి గానీ, చేతులకి గానీ కండరాలు సమానంగా వ్యాధి గ్రస్తమవుతాయి. ఈ వ్యాధిలో కండరాలు లావుగా కనబడతాయి. కానీ వాటిలో సత్తువ ఉండదు. ముఖానికి సంబంధించిన కండరాలు, చేతివేళ్ళకి సంబంధించిన కండరాలు ఈ వ్యాధికి గురికావు.

ఈ వ్యాధి ఉన్న పిల్లవాడి నడక, కూర్చోవడం లేవడం విలక్షణంగా ఉంటాయి.

ఈ వ్యాధికి మందు లేదు. నిదానంగా పిల్లవాని పరిస్థితి క్షీణిస్తుంది. 18-22 సంవత్సరాలు వచ్చేసరికి మృత్యువు కబళిస్తుంది. వీరిలో శ్వాసకోశ వ్యాధులు, కార్డియాక్ ఫెయిల్యూర్ సహజం.

నిర్ధారణ : మజిల్ బయాప్సి, సి.కె.ఎస్టిమేషన్ - సి.కె. రీడింగు, (సీరమ్ క్రియాటిన్ కైనేజ్) ఎక్కువ అవుతుంది, ఇ.యం.జి.

ఇతర కండరాల వ్యాధులు:

* లింబ్ గర్డిల్ డిస్ట్రఫి:- ఈ కండరాల వ్యాధి స్త్రీ పురుషులిద్దరిలోనూ కనబడుతుంది. ముఖ్యంగా 30 ఏళ్ళు దాటిన వారిలో ఉంటుంది. భుజం కండరాలు గానీ, పిరుదులకి సంబంధించిన కండరాలు గానీ బలహీనం అవుతాయి.
* స్కాప్యులో పెరోనియల్ మస్క్యులార్ డిస్ట్రఫి :- ఈ వ్యాధి వున్నవారిలో పాదాలు వాలిపోయి ఉంటాయి. కండరాలలో బలం ఉండదు.
* కంజెనిటల్ మస్క్యులర్ డిస్ట్రఫి:- ఈ వ్యాధి చిన్నపిల్లలలోనే కనబడుతుంది.
* ఆక్యులార్, ఆక్యులో ఫిరంజియల్ మస్క్యులార్ డిస్ట్రఫి:- వీరిలో కంటి కండరాలు బలహీనం అవుతాయి. పై కంటిరెప్ప వాలిపోతుంది. గొంతు కండరాలు బలహీనం అవుతాయి. ముద్ద మింగడం కష్టం అవుతుంది.

*మస్క్యులార్ డిస్ట్రఫి వ్యాధులు వంశపారంపర్యంగా సంక్రమిస్తాయి కనుక రక్త సంబంధికుల్లో వివాహాలు పనికి రావు.*

□□□

# 17. మైస్తీనియా గ్రేవిస్

*మైస్తీనియా గ్రేవిస్ కండరాలకి సంబంధించిన వ్యాధి. ఈ వ్యాధి ఉన్నవారిలో కండరాలు బలహీనం అవుతాయి. తొందరగా అలసట అనిపిస్తుంది. స్త్రీలలో 40 సంవత్సరాల లోపు ఈ వ్యాధి కనబడుతుంది. పురుషులలో 50-60 సంవత్సరాల వారిలో కనబడుతుంది. ఎసిటైల్ కోలిన్ జీవ రసాయనికాలకి సంబంధించిన అస్తవ్యస్తత వల్ల వ్యాధి కలుగుతుంది.*

లక్షణాలు:

కంటికి సంబంధించిన కండరాలు త్వరగా అలసిపోతాయి. కంటి పై రెప్ప వాలిపోయి చూపుకి అడ్డం అవుతుంది. ఒకే వస్తువు రెండుగా కనబడుతుంది. కాళ్ళు, చేతుల కండరాలు బలహీనం అవుతాయి. ముఖానికి, గొంతుకకి సంబంధించిన కండరాలు బలహీనం అవుతాయి. దాని వల్ల కొద్దిగా మాట్లాడగానే గొంతు పూడుకుపోతుంది. వాయిస్ పూర్తిగా తగ్గిపోతుంది. చప్పరించాలన్నా, మింగాలన్నా కుదరదు. దవడ కింద చేతితో సపోర్టు ఇవ్వాల్సివస్తుంది. ఛాతికి సంబంధించిన కండరాలు బలహీనం అవుతాయి.

నిండుగా ఊపిరి తీయడం కష్టమవుతుంది. ఆవేశం కలిగినా, గర్భం వచ్చినా, వ్యాధులు కలిగినా, శారీరకంగా శ్రమ చేసినా వ్యాధి లక్షణాలు తేలికగా బయటపడతాయి.

రుమటాయిడ్ ఆర్థ్రైటిస్, హైపర్ థైరాయిడిజం, హైపోథైరాయిడిజం, మొదలైన వ్యాధులున్నప్పుడు వాటితోపాటు మైస్తీనియా గ్రేవిస్ ఉండటానికి అవకాశముంది. ఈ వ్యాధి చిన్నపిల్లల్లో కూడా రావచ్చు.

నిర్ధారణ: యాంటి ఎ.సి.హెచ్.ఆర్. యాంటీ బాడి టెస్ట్ - 90 శాతం రోగులలో ఇది పెరుగుతుంది, ఇ.యం.జి.

చికిత్స:

1. యాంటీ కోలీనెస్టరేజి థెరపి - నియోస్టిగ్మిన్ బ్రోమైడ్ ప్రతి మూడు గంటలకి 15-45 మి.గ్రా. ఇవ్వాలి.
2. ప్రెడ్నిసోలోన్ టాబ్లెట్సు 10 మి.గ్రా. చొప్పున రోజు విడిచి రోజు ఇవ్వాలి. వ్యాధిని బట్టి మోతాదును పెంచుకుంటూ వెళ్ళాలి.
3. కొందరిలో ఎమర్జన్సీ ట్రీట్‌మెంట్ అవసరమౌతుంది. యాంటీకోలినెస్టరేజి మందులతో పాటు శ్వాస సక్రమంగా ఆడటానికి వెంటిలేషన్ అవసరమౌతుంది.

❑❑❑

## 18. సింగిల్ నరాల వ్యాధులు

నరాల వ్యాధులు కేవలం ఒక నరానికి సంబంధించిందో, రెండు మూడు నరాలకి సంబంధించిందో కావచ్చు.

సింగిల్ నరానికి సంబంధించిన వ్యాధి అయినప్పుడు మోనో న్యూరోపతి అంటారు. ప్రత్యేకంగా ఒక నరం ఏ కారణం వల్లనైనా నొక్కుకుపోతే అది సప్లై అయ్యే క్రింది భాగం కండరాలు మొద్దుబారతాయి. కండరాలు క్షీణిస్తాయి. దెబ్బలు, ఎముకలు విరగడాలు, ఆపరేషన్లు, తుపాకి గుళ్ళు ప్రమాదాలలో ఇటువంటి పరిస్థితి కలుగుతుంది.

ఒకటి కంటే మించి నరాలు దెబ్బతిన్నప్పుడు కలిగే వ్యాధిని పాలీ న్యూరోపతి అంటారు. ఆల్కహాల్ ఎక్కువ సేవించే వారిలోనూ, రసాయనిక పదార్థాల విషప్రభావానికి గురి అయిన వారిలోనూ, కొన్ని మందులు సరిపడని వారిలోనూ, బి-కాంప్లెక్స్ లోపం ఉన్నవారిలోనూ; మధుమేహం, గేటు; మిక్సీడీమా; యురీమియా వ్యాధులు ఉన్నవారిలోనూ; డిఫ్తీరియా, టెటనస్, టైఫాయిడ్, గవద బిళ్ళలు, పొంగు, ఫ్లూ, టి.బి.

వంటి వ్యాధులు వచ్చిన వారిలోనూ; కేన్సర్ వచ్చిన వారిలోనూ - పాలి న్యూరోపతి కలుగుతుంది.

వీరిలో స్పర్శ జ్ఞానం లోపిస్తుంది. కండరాల పటుత్వం తగ్గుతుంది.

**నిర్ధారణ:** రక్త పరీక్షలు, మూలకారణాన్ని తెలుసుకుని దాని నిర్ధారణకు పరీక్షలు, నర్వ్ బయాప్సి.

**చికిత్స:**

1. నరాల వ్యాధి రావడానికి మూల కారణాన్ని గుర్తించి దానికి తగిన చికిత్స.
2. బి.కాంప్లెక్స్ విటమిన్లు, మాంసకృత్తుల ఆహారం, మల్టీవిటమిన్లు.
3. ఫిజియోథెరపి.

❑❑❑

# 19. సయాటికా

*సయాటికా నరాల వ్యాధి చాలా మందిలో కనబడుతుంది. సయాటికా నరం కాలుకి సంబంధించినది. ఈ నరం వ్యాధికి సంబంధించిన నొప్పి కలిగిన వారిలో నడవడం కష్టం అవుతుంది. కాళ్ళు తిమ్మిరి ఎక్కుతాయి. స్పర్శ తగ్గుతుంది. పాదాలు మొద్దుబారతాయి. రోగి కూర్చోవాలన్నా, నడవాలన్నా చాలా బాధపడతాడు. దగ్గినా, తుమ్మినా నరాలు షాక్ కొట్టినట్లు నొప్పి కలిగిస్తాయి.*

**నిర్ధారణ:** ఎక్స్‌రే, ఇ.యం.జి., మైలోగ్రామ్, సి.టి.స్కాన్.

**చికిత్స:**

1. నొప్పి ఎక్కువగా ఉన్నప్పుడు వెల్లికిలా పడుకుని ఉండాలి. కొన్ని రోజులు పూర్తి విశ్రాంతి తీసుకోవాలి.
2. నొప్పి తగ్గడానికి మందులు వాడాలి.
3. డయాథెర్మి.
4. సయాటిక్ నరం నొక్కుకుపోయినట్లయితే సర్జరీ చేయాలి.
5. ఫిజయోథెరపి.

❑❑❑

# 4. గుండె జబ్బులు

## 1. పుట్టుకతో వచ్చే గుండె జబ్బులు

రకాలు :

* గుండె గోడలకి రంధ్రాలు (ఎ.ఎస్.డి, వి.ఎస్.డి).
* పి.డి.ఎ, సన్నబడిన బృహద్ధమని, గుండెలో పెద్ద రక్తనాళాల నిర్మాణంలో లోపాలు.
* ఎడమ వైపు కాకుండా కుడివైపు ఉండే గుండె.
* పుట్టుకతో కవాటాలు దెబ్బతినడం.

పుట్టుకతో గుండెజబ్బు రావడానికి కారణాలు :

పిండ నిర్మాణంలో క్రోమోజోమ్సులో అస్తవ్యస్తత , గర్భిణీ స్త్రీకి రూబెల్లా వ్యాధి, గర్భిణి స్త్రీ అతిగా ఎక్స్‌రేలకి గురికావడం.

లక్షణాలు :

బిడ్డ తరచుగా అనారోగ్యానికి గురికావడం, అయాస పడడం , ఎదుగుదల లేకపోవడం, ఏడ్చినా, ఆడినా నీలంగా మారడం.

పరీక్షలు :

సాధారణ వైద్య పరీక్షలు , ఎక్స్‌రే, ఇ.సి.జి, ఎఖో , ఎమ్. అర్. ఐ.

చికిత్స :

1. కొన్ని గుండెజబ్బులు మందులతో కంట్రోలుకాగా మరికొన్నింటికి సర్జరీ అవసరం అవుతుంది.
2. గుండెజబ్బు ఉన్న బిడ్డకి ఎక్కువ విశ్రాంతి ఇవ్వడం, అలసిపోకుండా చూడడం, క్రమపద్ధతిలో మందులు వేయడం అవసరం.
3. పుట్టుకతో గుండె జబ్బు ఉన్నప్పుడు కార్డియాలజిస్ట్‌కి చూపించి తగిన సమయంలో శస్త్ర చికిత్స చేయించడం అవసరం.

❑❑❑

# 2. ఇన్‌ఫెక్టివ్ ఎండోకార్డైటిస్

*శరీరంలో ఇతర అవయవాలకి ఇన్‌ఫెక్షన్ (రోగక్రిముల వల్ల వ్యాధి) వచ్చినట్లే గుండెకి కూడా వస్తుంది. దీనినే ఇన్‌ఫెక్టివ్ ఎండోకార్డైటిస్ అంటారు.*

## ఇన్‌ఫెక్షన్ కలిగే తీరు :

పళ్ళు పీకించుకున్నప్పుడు, టాన్సిల్స్ ఆపరేషన్ చేయించుకున్నప్పుడు, మూత్రనాళం ద్వారా ట్యూబు వేయించుకున్నప్పుడు, కదలకుండా పడుకుంటే బెడ్‌సోర్స్ ఏర్పడినప్పుడు,కాన్పులైనప్పుడు, వారాల తరబడి నరం ద్వారా సెలైన్ ఎక్కించినప్పుడు,గుండె ఆపరేషన్ జరిగినప్పుడు వ్యాధి క్రిములు శరీరంలో ప్రవేశించి గుండెకి చేరే అవకాశం ఉంది.

## గుండెకి ఇన్‌ఫెక్షన్ కలిగించే క్రిములు :

బాక్టీరియా క్రిములు, రికెట్సియల్ క్రిములు, ఫంగస్, క్లామిడియా మొదలైనవి.

## గుండెకి ఇన్‌ఫెక్షన్ వస్తే :

సాధారణంగా జ్వరం ఉంటుంది. జ్వరంతో పాటు చలి ఉంటుంది. ఒళ్ళు నొప్పులు, తల నొప్పులు ఉంటాయి. రక్తహీనత ఉంటుంది. స్ప్లీన్ పెరుగుతుంది. కీళ్ళనొప్పులు ఉంటాయి. గుండెని పరీక్ష చేస్తే అసాధారణ ధ్వనులు వినబడతాయి.

## పరీక్షలు :

బ్లడ్ కల్చర్, యూరిన్ కల్చర్ చేసి ఏ రోగ క్రిమి కారణమైంది నిర్ధారించడం. ఎక్స్‌రే, ఇ.సి.జి, ఎకోకార్డియోగ్రఫీ ద్వారా వ్యాధి నిర్ధారించడం.

## చికిత్స :

1. గుండెకి ఇన్‌ఫెక్షన్‌ని మొదటి దశలోనే తెలుసుకుని చికిత్స ప్రారంభిస్తే కాంప్లికేషన్లు ఉండవు.
2. పెన్సిలిన్ **లేదా** జెంటామైసిన్ **లేదా** యాంపిసిలిన్ **లేదా** సెఫ్ట్రైరాక్సోన్ ఇంజక్షన్స్ నరం ద్వారా ఆరు వారాల పాటు ఇవ్వాలి.
3. గుండె స్పెషలిస్టు పర్యవేక్షణలో చికిత్స జరగాలి.

□□□

# 3. గుండెకు సిఫిలిస్ వ్యాధి

*గుండెకి సిఫిలిస్ వ్యాధి 35-50 సంవత్సరాలు దాటిన వారిలో కనబడుతుంది. సిఫిలిస్ వ్యాధి రాగా, చికిత్స పొందకుండా నిర్లక్ష్యం చేసిన కొందరిలో 15,20 సంవత్సరాలు గడిచిన తరువాత గుండెకు సిఫిలిస్ వ్యాధి వల్ల కలిగే హాని బయటపడుతుంది.*

**లక్షణాలు :**

గుండెకి సిఫిలిస్ వ్యాధి వచ్చినప్పుడు బృహద్ధమని (అయోర్టా) బలహీనమై ఉబ్బుతుంది. గుండె కండరాలకు రక్తం సరఫరా చేసే రక్త నాళాలు సన్నబడి యాంజైనా అనే గుండె నొప్పి వస్తుంది. గుండె పెరుగుతుంది. గుండె దడ, ఆయాసం ఉంటాయి.

**నిర్ధారణ :**

ఎక్స్‌రే, వి.డి.ఆర్.యల్. రక్త పరీక్ష , ఎకో కార్డియోగ్రామ్.

**చికిత్స :**

1. గుండెకి సిఫిలిస్ వ్యాధి వచ్చినప్పుడు, ప్రొకైన్ పెన్సిలిన్ 600 మి.గ్రా. ఇంజక్షన్ రోజుకి ఒకటి చొప్పున 2 రోజులు చేయాలి.
2. పెన్సిలిన్ పడనివారికి టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. కాప్సుల్స్ ప్రతి ఆరు గంటలకి వేయాలి. అలా 14 రోజులు వాడాలి.
3. అవసరం బట్టి గుండెకి ఆపరేషన్ చేసి ఎన్యురిజమ్ తిలకించడం, గ్రాఫ్ట్ చేయడం అవసరం.

## ఇష్కిమిక్ హార్ట్ డిసీజ్

*ఈ వ్యాధి మధ్యవయస్కుల్లో ఎక్కువగా కనబడుతుంది. ఇంతకంటే తక్కువ వయసు వారిలో కూడా అక్కడక్కడ కొందరిలో కనబడుతుంది. మగవాళ్ళల్లో ఈ వ్యాధి రావడం ఎక్కువ. స్త్రీలలో ముట్లు ఉడిగిపోయిన తరువాత మగవాళ్ళతో సమానంగా ఈ గుండె జబ్బు కనపడుతుంది. తల్లిదండ్రులలో ఈ వ్యాధి ఉంటే పిల్లల్లో కూడా కొందరికి రావచ్చు. రక్తంలో కొవ్వు శాతం ఎక్కువ ఉండే వారిలో ఈ వ్యాధి రావడం ఎక్కువ. రక్తపోటు ఉండేవారిలోనూ, స్థూలకాయం కలవారిలోనూ, ధూమపానం చేసేవారిలోనూ, మధుమేహంతో బాధపడే వారిలోనూ ఈ గుండె జబ్బు రావడం ఎక్కువ. శారీరక శ్రమ లేని వారిలోనూ, అతిగా మానసిక వత్తిడి కలవారిలోనూ ఈ వ్యాధి కనబడుతుంది.*

□□□

# 4. యాంజైనా పెక్టోరిస్

యాంజైనా పెక్టోరిస్‌నే యాంజైనా అని కూడా అంటారు. గుండె గోడలకు రక్తం సరఫరా చేసే రక్తనాళాలు సన్నబడటం, రక్తనాళం గోడ దళసరిగా మారడం, రక్త నాళాలలో రక్తంగడ్డ తయారై రక్త ప్రసరణకు అవరోధం ఏర్పడడం వల్ల యాంజైనా గుండె నొప్పి వస్తుంది. యాంజైనా గుండె నొప్పి వచ్చే వారిలో గుండె గోడలకు రక్త ప్రసరణ తగ్గడమే కాకుండా ప్రాణవాయువు అందడం కూడా తగ్గిపోతుంది.

**యాంజైనా గుండెనొప్పి ఎప్పుడు కనబడుతుంది :**

మామూలుగా మానసికంగా, శారీరకంగా విశ్రాంతిగా ఉన్నప్పుడు యాంజైనా గుండె నొప్పి కనబడదు. మెట్లు ఎక్కినా, స్పీడుగా నడిచినా, కడుపు నిండా భోజనం చేసినా, చల్లగాలికి ఎక్కువగా గురి అయినా, ఆవేశం, కోపం వచ్చినా, మలబద్ధకంతో ముక్కినా ఈ గుండె నొప్పి కనబడుతుంది. విశ్రాంతి తీసుకోవడంతో చాలామందిలో వెంటనే నొప్పి తగ్గిపోతుంది.

**లక్షణాలు :**

యాంజైనా గుండెనొప్పి వచ్చినప్పుడు, ఛాతి మధ్యలో పిండినట్లు, కత్తితో కోసినట్లు నొప్పి, మంట కలుగుతాయి. కొందరిలో ఈ నొప్పి ఎడం చేతికి, గొంతుకలోకి, పై కడుపులోకి ప్రాకుతుంది. సాధారణంగా ఈ నొప్పి ఒకటి నుంచి నాలుగు నిముషాల పాటు ఉంటుంది. యాంజైనా నొప్పి వచ్చినప్పుడు నాలుక కింద సార్బిట్రేట్ బిళ్ళ పెట్టుకుని కరగనిస్తే వెంటనే నొప్పి తగ్గుతుంది.

**నిర్ధారణ :**

ఇ.సి.జి ట్రేడ్‌మిల్‌టెస్ట్, 24- అవర్స్ హోల్టర్ మనిటరీ, ఎకో కార్డియోగ్రఫీ పరీక్షల ద్వారా యాంజైనాని నిర్ధారించవచ్చు.

**చికిత్స :**

1. గుండెనొప్పి రాగానే సార్బిట్రేట్ 5 మి.గ్రా. బిళ్ళ ఒకటి నాలిక కింద పెట్టుకోవాలి. మూడు, నాలుగు నిముషాలలో నొప్పి తగ్గిపోతుంది.
2. యాంజైనా గుండెనొప్పి ఉన్నవారు సార్బిట్రేట్ బిళ్ళలు వాడటమే కాకుండా

రోజువారిగా ఐసోసార్బైడ్ డై నైట్రేట్ 20 మి.గ్రా. చొప్పున రోజుకి మూడుసార్లు వేసుకోవాలి. ఎటెనోలాల్ 50 మి.గ్రా. చొప్పున రోజుకొక్కసారి వేయాలి. నిఫిడిపిన్ 10 మి.గ్రా క్యాప్సుల్స్ రోజుకి మూడుసార్లు వేయాలి. ఎమలోడిపిన్ 5 మి.గ్రా. టాబ్లెట్ రోజుకొకటి వేయాలి. యాస్పిరిన్ 50 మి.గ్రా. చొప్పున రోజుకి ఒక్కసారి వాడాలి. ఈ మందులు ఆపకుండా వేసుకోవాలి. మందులు వాడుతున్నా పూర్తి రిలీఫ్ ఉండకపోతే కరోనరీ యాంజోగ్రఫీ చేయించుకోవాలి.

3. కరోనరీ యాంజోగ్రఫీ ద్వారా రక్తనాళాలు ఎక్కువ శాతంలో మూసుకుపోయినట్లు తెలితే బైపాస్ సర్జరీ చేయించుకోవల్సి వస్తుంది.

## యాంజైనా రోగి తీసుకోవల్సిన జాగ్రత్తలు

* ధూమపానం పూర్తిగా మానివేయాలి.
* కొవ్వు పదార్థాలు మానివేయాలి. నెయ్యి, డాల్డా, కొవ్వు ఉండే మాంసం తీసుకోకూడదు. కోడిమాంసం, చేపలు, కోడిగ్రుడ్లు తీసుకోవచ్చు. కోడిగ్రుడ్లులోని పచ్చసొన పనికిరాదు.
* ఆకుకూరలు, కాయగూరలు మామూలుగా భుజించవచ్చు.
* వేపుడు కూరలు పనికిరావు.
* రక్తపోటు పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి.
* పరిమితికి మించి బరువు ఉండకూడదు.
* స్థూలకాయం తగ్గాలి.
* రోజూ తప్పనిసరిగా రెండు, మూడు కిలోమీటర్లు నడవాలి.
* చికాకు, కోపం, ఆందోళన, గాభరా, మానసిక వత్తిడి పనికిరావు.
* మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలి.
* మధుమేహం పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. ఆహారంలో నియమాలు పాటించాలి. షుగర్ అదుపులో ఉండటానికి బిళ్ళలుగానీ, ఇన్సులిన్ ఇంజక్షన్లు గానీ ఎప్పుడూ తీసుకోవాలి.
* ఏమైనా తేడా కనబడితే వెంటనే డాక్టర్‌కి చూపించుకోవాలి.

□□□

# 5. హార్ట్ ఎటాక్

*హార్ట్ ఎటాక్‌నే గుండెపోటు అంటారు. యాంజైనా గుండెజబ్బు ఉన్నవారిలో హార్ట్‌ఎటాక్ రావడం ఎక్కువ. యాంజైనా గుండె నొప్పితో పాటు రక్తపోటుగానీ, మధుమేహంగానీ ఉన్నవారిలో గుండెపోటు రావడం మరింత ఎక్కువ.*

*యాంజైనా గుండెపోటు ఉన్నవారు భుక్తాయాసం కలిగేటట్లు భోజనం చేసినా, ఎక్కువగా ఆవేశపడినా హార్ట్ ఎటాక్ వచ్చే అవకాశం ఉంది.*

**లక్షణాలు :**

గుండెపోటు వచ్చినప్పుడు ఛాతి మధ్యలో నొప్పి అనిపిస్తుంది. ఈ నొప్పి యాంజైనా నొప్పిలాగే ఉంటుంది. యాంజైనా నొప్పి రెండు మూడు నిముషాల పాటే ఉంటే గుండెపోటు నొప్పి అరగంట, గంట ఇంకా ఎక్కువ సమయం ఉంటుంది. వికారం అనిపించడం, వాంతి అవడం ఉంటుంది. శ్వాస అందక బాధపడడం ఉంటుంది. ఒళ్ళు అంతా చమటలు పోసేస్తాయి. షాక్ పరిస్థితి ఏర్పడుతుంది. బి.పి. పడిపోతుంది. నాడి అందకుండా అవుతుంది. తెలియకుండానే బట్టలలో విరోచనం, మూత్రం అయిపోతాయి. కండరాలలో సత్తువ లేకుండా అవుతుంది. కొందరికి క్షణాలలో ఊపిరితిత్తులలో నీరు చేరిపోతుంది.

**నిర్ధారణ :**

ఇ.సి.జిలో హార్ట్ ఎటాక్ లక్షణాలు తెలుస్తాయి. క్రియాటిన్ కైనైజ్ ఎంజైమ్ చాలా త్వరగా పెరిగిపోతుంది. ఎకోకార్డియోగ్రఫీ ద్వారా హార్ట్ ఫంక్షన్ తెలుసుకోవచ్చు.

1. హార్ట్ ఎటాక్ వచ్చినప్పుడు రోగిని నడిపించకూడదు.
2. వెంటనే ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌కి తరలించాలి.
   ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌కి తరలించే లోపల నొప్పి తగ్గడానికి పెథిడిన్ 100 మి.గ్రా. ఇంజక్షన్ ఇవ్వాలి. **లేదా** మార్ఫిన్ 15 మి.గ్రా ఇంజక్షన్ ఇవ్వాలి.
3. నరానికి గ్లూకోజ్ బాటిల్ స్లోగా ఎక్కిస్తూ ఉండాలి.
   ఆక్సిజన్ ముక్కు ద్వారా ఎక్కించాలి.
4. తాగడానికి, తినడానికి ఏమీ ఇవ్వకూడదు.
5. తక్కిన చికిత్స అంతా ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో జరుగుతుంది.

□□□



# 6. గుండె ఆగిపోవడం (కార్డియాక్ అరెస్ట్)

*అకస్మాత్తుగా గుండె ఆగిపోవడాన్ని కార్డియాక్ అరెస్ట్‌గా పేర్కొంటారు. ఇలా అకస్మాత్తుగా గుండె ఆగిపోవడానికి అనేక కారణాలు ఉంటాయి. గుండె పోటు రావడం, పెద్దశ్వాసనాళానికి ఏదైన అడ్డంకి ఏర్పడి గాలి పీల్చడం ఆగిపోవడం, మెదడుకి రక్త సరఫరా ఆగిపోయి మెదడు పనిచేయకపోవడం, ఆపరేషన్ సమయాల్లో మత్తు మందు దుష్ఫలితాలు కలగడం, అధిక రక్తస్రావం జరగడం, వాంతులు విరోచనాల వల్ల శరీరంలో ఎలక్ట్రోలైట్స్ అస్తవ్యస్తత విపరీతంగా కలగడం, ఎలక్ట్రిక్ షాక్, నీట మునగడం, కొన్ని మందుల విష ప్రభావం - అకస్మాత్తుగా గుండె ఆగిపోవడానికి ప్రధాన కారణాలు. కొన్ని సందర్భాలలో గుండె ఆగిపోవడానికి కారణం ఏదైనది స్పష్టంగా తెలియకుండా పోతుంది.*

**కార్డియక్ అరెస్ట్‌కి చేయవలసిన చికిత్స :**

1. అకస్మాత్తుగా గుండె ఆగిపోయినప్పుడు ఆ వ్యక్తిని వెల్లికిలా పడుకోపెట్టాలి. ఛాతి మధ్యలో గట్టిగా ఒక గుద్దు గుద్దాలి. ఆ గుద్దుతో ఒకోసారి తిరిగి గుండె కొట్టుకోవడం ప్రారంభమవుతుంది. అలా తిరిగి గుండె కొట్టుకోవడం కనపడినపుడు కార్డియాక్ మసాజ్ చేయాలి. కృత్రిమ శ్వాస విధానం అవలంబించాలి. ఎడ్రినలిన్ ఇంజక్షన్ నరానికి లేదా గుండెకి నేరుగా ఇవ్వాలి. సోడాబైకార్బో ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి. నరానికి గ్లూకోజ్ పెట్టాలి.
2. పై విధంగా కృషి చేసినప్పుడు మూడు నుంచి 10 నిమిషాలలోగా గుండె తిరిగి కోలుకోవచ్చు. కార్డియాక్ అరెస్ట్ వచ్చిన తరువాత 30 నిముషాల వరకు గుండెను తిరిగి కొట్టుకునేందుకు ప్రయత్నం చేస్తూనే ఉండాలి.

❑❑❑

# 7. గుండె పెరగడం (హార్ట్ ఫెయిల్యూర్)

గుండె పెరగడం, గుండె సక్రమంగా పనిచేయకపోవడాన్ని హార్ట్ ఫెయిల్యూర్ అంటారు. హార్ట్ ఎటాక్ వేరు, హార్ట్ ఫెయిల్యూర్ వేరు. అలాగే కార్డియాక్ అరెస్ట్ వేరు, కార్డియాక్ అరెస్ట్‌లో గుండె ఆగిపోతుంది. హార్ట్ ఫెయిల్యూర్‌లో గుండె ఆగిపోదు. ముఖ్యంగా గుండె సైజు పెరుగుతుంది. గుండె సాగిపోయి బలహీనంగా తయారవుతుంది.

*గుండె పోటు వచ్చి కోలుకున్న వారిలో, ఊపిరితిత్తులలో టిష్యూ గట్టిపడినవారిలో, కొన్ని రకాల మందులు వాడిన వారిలో, గుండె కండరాల జబ్బు వున్న వారిలో హార్ట్ ఫెయిల్యూర్ కనబడుతుంది.*

*హార్ట్ ఫెయిల్యూర్ ప్రారంభ దశలో కొందరికి అంతగా బాధ ఉండదు. గుండె పరిమాణం పెరుగుతున్న కొద్దీ బాధలు కనబడతాయి.*

**హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు :**

అయాసం ఉంటుంది. ముఖ్యంగా రాత్రి పూట ఆయాసం ఎక్కువ. రోగి వెల్లకిలా పడుకోలేకపోతాడు. కూర్చుంటేనే కాస్త ఉపశాంతిగా ఉంటుంది. ఊపిరితిత్తులలో నీరు చేరి గురగుర తెలుస్తుంది. దగ్గుతోపాటు తెమడ పడటం ఉంటుంది. కొందరికి రక్తం కూడా కనపడుతుంది. ఆయాసం, దగ్గు ఎక్కువగా ఉన్నవారిలో చెమటలు కూడా ఎక్కువగా పోస్తాయి.

**నిర్ధారణ :**

ఛాతి ఎక్స్‌రేలో గుండె పెరగడం తెలుస్తుంది,ఇ.సి.జి ఎకోకార్డియోగ్రఫీ ద్వారా కార్డియాక్ ఫెయిల్యూర్‌ని నిర్ధారణ చేయవచ్చు.

**హార్ట్ ఫెయిల్యూర్ తీవ్రంగా ఉన్నప్పుడు చికిత్స :**

1. రోగికి బ్యాక్‌రెస్ట్ ఇచ్చి ఏటవాలుగా కూర్చోపెట్టాలి.
2. రోగిలో ఉన్న ఆందోళనని తొలగించడానికి, బాధని తొలగించడానికి మార్ఫియా ఇంజక్షన్ ఇవ్వాలి.
3. ముక్కు ద్వారా ఆక్సిజన్ పెట్టాలి.
4. లాసిక్స్ ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి.
5. నరం ద్వారా ఎమైనోఫిలిన్ ఇంజక్షన్ స్లోగా ఇవ్వాలి.
6. నాలిక క్రింద సార్బిట్రేట్ టాబ్లెట్ పెట్టి కరగనివ్వాలి.
7. అవసరం బట్టి డోపమిన్ డ్రిప్ పెట్టాలి.

**హార్ట్ ఫెయిల్యూర్ క్రానిక్‌గా ఉన్నప్పుడు చికిత్స :**

1. రోగికి పూర్తి విశ్రాంతి ఇవ్వాలి.
2. ఆహారంలో ఉప్పు పూర్తిగా తగ్గించాలి. రోజుకి రెండు గ్రాములు కంటే ఉప్పు తీసుకోకూడదు.

3. రోజు మొత్తం మీద రెండు లేక మూడు లీటర్ల కంటే మించి నీరు త్రాగకూడదు.
4. ధూమపానం పూర్తిగా మానివేయాలి.
5. స్థూలకాయం ఉంటే తగ్గడానికి ఆహారంలో జాగ్రత్తలు తీసుకోవాలి.
6. పరిమితంగా వ్యాయామం చేయాలి.
7. డిజాక్సిన్ 0.5 మి.గ్రా. టాబ్లెట్స్ ప్రతి ఎనిమిది గంటలకు ఒకటి చొప్పున వాడుతూ నిదానంగా మోతాదు తగ్గించాలి.
8. లాసిక్స్ టాబ్లెట్స్ వాడాలి.
9. ఎనాల్ప్రిల్ టాబ్లెట్స్ రోజూ వాడాలి. అవసరం బట్టి కాల్షియం ఎంటాగోనిస్ట్ మందులు వాడాలి.

□□□

# 8. మెడికల్ షాక్

*షాక్ అనేది ప్రాణాపాయ పరిస్థితి. షాక్ పరిస్థితి ఏర్పడిన వ్యక్తిలో గుండె తగినంత రక్తాన్ని పంప్ చేయలేకపోతుంది. దాంతో మెదడు, మూత్రపిండాలు, కాలేయం మొదలైన ప్రధాన శరీరభాగాలు పనిచేయకుండా అవుతాయి. గుండె తగినంత రక్తాన్ని పంప్ చేయకపోవడానికి షాక్ పరిస్థితి ఏర్పడినపుడు గుండెకు తగినంత రక్తం చేరకపోవడమే కారణం. రక్తం గుండెకు తిరిగి రాకుండా కండరాలలోనూ, ఇతర భాగాలలోనూ నిలబడిపోతుంది. లేదా ఏదైన గాయం వల్ల బయటకు పోతుంది.*

**కారణాలు:**

గుండెకి రక్తం చేరకపోవడం. పేగుల్లో పుండు వుండి రక్తస్రావం జరగడం. రక్తనాళాలు పగిలి రక్తం గుండెకు చేరకపోవడం, వాంతులు, విరోచనాలు, ఒళ్ళు కాలడం వల్ల రక్తంలో నీరు తగ్గిపోయి రక్తం తక్కువ అవడం. గుండె సక్రమంగా పనిచేయకపోవడం, గుండె విపరీతంగా కొట్టుకోవడం వల్ల తగినంత రక్తం పంప్ కాకపోవడం. శరీరంలో వ్యాధి క్రిములు చేరి విషప్రభావం ఎక్కువై చిన్న చిన్న రక్తనాళాలు అధికంగా వ్యాకోచించి సర్క్యులేషన్‌లోకి రక్తం రాకుండా ఆగిపోవడం. కొన్ని మందులు వల్ల ఎలర్జిక్ షాక్ కలగడం. ఊపిరితిత్తులు, మరికొన్ని చోట్ల రక్తనాళాలకి అడ్డు ఏర్పడి రక్త ప్రసరణ ఆగిపోవడం. పిట్యూటరీ, థైరాయిడ్, ఎడ్రినల్ గ్రంథి విపరీతంగా పనిచేసి షాక్ పరిస్థితి ఏర్పడటం. మెదడులో నరాల వ్యాధి వచ్చి రక్త ప్రసరణలో అస్తవ్యస్తత కలగడం. షాక్ రావడం. కొన్ని మందులు కూడా షాక్‌కి కారణాలు.

**షాక్‌కి లక్షణాలు:**

అతిగా చెమటలు పోయడం, పాలిపోవడం, రక్తపోటు పడిపోవడం, నాడి వేగంగా కొట్టుకోవడం, నీలంగా మారడం, ఒళ్ళు చల్లబడిపోవడం ప్రధాన లక్షణాలు. మూత్ర విసర్జన తగ్గిపోవడమో అసలు అవకపోవడమో జరుగుతుంది. కోమా పరిస్థితి ఏర్పడుతుంది.

**చికిత్స:**

1. షాక్ రావడానికి పరిస్థితి ఏదైనది గుర్తించి దానికి తగిన చికిత్స చేయాలి.
2. రోగిని వెల్లకిలా పడుకోబెట్టి పాదాల వైపు బెడ్ ఎత్తుగా ఉంచాలి.
3. నొప్పి తగ్గడానికి మార్ఫియా ఇంజక్షన్ ఇవ్వాలి.
4. ఆక్సిజన్ ముక్కు ద్వారా పెట్టాలి.
5. అవసరం బట్టి రక్తం ఎక్కించాలి. ఎలక్ట్రోలైట్ ఇన్‌బాలెన్స్‌ని సరిదిద్దాలి.
6. ఇన్‌ఫెక్షన్ తీవ్రంగా ఉన్నప్పుడు శక్తివంతమైన యాంటిబయోటిక్ ఇవ్వాలి.
7. రక్తపోటుని పెంచడానికి మందులు వాడాలి.
8. కార్టికో స్టెరాయిడ్స్ ఇవ్వాలి.

❑❑❑

# 9. రక్తపోటు

*గుండె పంపు చేసిన రక్తం - రక్తనాళాల (ధమనుల) ద్వారా ప్రసరిస్తుంది. ఇలా రక్తం ప్రవహించుచున్నప్పుడు ధమనుల గోడలపై వత్తిడి ఏర్పడుతుంది. ఈ వత్తిడినే రక్తపోటు లేదా బ్లడ్ ప్రెషర్ అంటారు. గుండె రక్తాన్ని పంపు చేసిన సమయంలో ధమనుల గోడలపై ఏర్పడిన వత్తిడిని సిస్టాలిక్ బ్లడ్ ప్రెషర్ అంటారు. గుండె రక్తం పంపు చేసే ఒక స్ట్రోక్‌కి మరొక స్ట్రోక్‌కి మధ్య కాలంలో ధమనుల గోడలపై వున్న రక్త ప్రసరణ వత్తిడిని డయాస్టొలిక్ ప్రెషర్ అంటారు.*

*రక్తపోటు 140/90 కి మించి ఉన్నట్లయితే ఆ వ్యక్తిలో రక్తపోటు ఉన్నట్లుగా భావించడం జరుగుతుంది. ఇక్కడ పైన ఉన్న 140 రీడింగు సిస్టాలిక్ బ్లడ్‌ప్రెషర్‌కి సంబంధించినది. క్రింది 90 అనేది డయాస్టొలిక్ బ్లడ్‌ప్రెషర్‌కి సంబంధించిన రీడింగ్.*

*బ్లడ్ ప్రెషర్‌ని హైపర్ టెన్షన్ అని కూడా అంటారు.*

1. ప్రైమరీ లేదా ఎస్సెన్షియల్ హైపర్ టెన్షన్ 2. సెకండరీ హైపర్ టెన్షన్

ఎక్కువ మందిలో ఉండేది ఎస్సెన్షియల్ హైపర్ టెన్షన్. సెకండరీ హైపర్ టెన్షన్ చాలా తక్కువ మందిలో ఉంటుంది.

సెకండరీ హైపర్ టెన్షన్‌కి స్పష్టమైన కారణం తెలుస్తూ ఉంటుంది. మూత్ర పిండాల జబ్బు, వినాళ గ్రంథుల జబ్బు, సన్నబడిన బృహద్ధమని మొదలైనవి సెకండరీ హైపర్ టెన్షన్‌కి కారణాలు. వీటిని సరిదిద్దగలిగితే రక్తపోటు క్యూర్ అవుతుంది.

ఎస్సెన్షియల్ హైపర్ టెన్షన్‌లో రక్తపోటుకి స్పష్టమైన కారణం కనబడదు. రక్తపోటుకి మూలకారణాన్ని సరిదిద్దడం జరగదు. కనుక ఈ రకానికి చెందిన రక్తపోటు ఎప్పటికీ ఉంటుంది. ఎస్సెన్షియల్ హైపర్ టెన్షన్‌కి జీవితాంతం మందు వాడవలసిందే. అలా వాడితేనే రక్తపోటు అదుపులో ఉండి నార్మల్‌గా ఉంటుంది. మందు మానేస్తే వెంటనే రక్తపోటు పెరిగిపోతుంది. రక్తపోటు పెరగడం వల్ల దుష్ఫలితాలు కలుగుతాయి.

ఎస్సెన్షియల్ హైపర్ టెన్షన్‌నే ప్రైమరీ హైపర్ టెన్షన్ లేదా సాధారణ రక్తపోటు అంటారు.

**కారణాలు :**

సాధారణంగా వచ్చే రక్తపోటు వంశపారంపర్య లక్షణం కలిగి ఉంటుంది. జీన్స్ ద్వారా ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తుంది, మానసికంగా ఒత్తిడి, ఆందోళన ఉన్నవారిలో రక్తపోటు బయటపడే అవకాశం ఉంది. ఉప్పు ఎక్కువ తీసుకునే వారిలో రక్తపోటు రావచ్చు. స్థూలకాయం ఉన్నవారిలో రక్తపోటు కనబడుతుంది. ధూమపానం రక్తపోటుకి కారణమవుతుంది. శారీరక శ్రమలేని వారిలో రక్తపోటు వచ్చే అవకాశం ఉంది.

**లక్షణాలు :**

రక్తపోటు ఉన్నవారిలో తల తిరగడం, ఒళ్ళు తూలడం, తలనొప్పి, ఆయాసం, ఛాతిలో బరువు, మానసికంగా గందరగోళం త్వరగా అలసిపోవడం ఉంటాయి. అయితే ఏ లక్షణాలు లేకుండా కూడా రక్తపోటు ఉండవచ్చు. అటువంటి రక్తపోటు కూడా పైకి తెలియకుండా లోలోపల నష్టం చేస్తుంది. అకస్మాత్తుగా దుష్ఫలితాన్ని కలిగిస్తుంది.

**రక్తపోటు దుష్పరిణామాలు :**

హార్ట్ ఎటాక్, హార్ట్ ఫెయిల్యూర్, యాంజైనా గుండెనొప్పి, మెదడులో రక్తనాళాలు చిట్లడం, మెదడులో రక్తం గడ్డకట్టడం, పక్షవాతం రావడం, మూత్రపిండాలు దెబ్బతినడం, ముక్కువెంట రక్తం కారడం, మెలిగ్నెంట్ హైపర్ టెన్షన్.

అదుపులో ఉంచుకోవాలంటే :

ఆహారంలో ఉప్పు తగ్గించాలి, పొగత్రాగడం మానివేయాలి, మద్యం సేవించడం బాగా తగ్గించాలి లేదా మానేయాలి, రోజూ వ్యాయమం చేయాలి.

చికిత్స :

1. డైయూరిటిక్స్ : రక్తపోటు వ్యాధి తక్కువలో ఉన్నప్పుడు డైటైడ్ **లేదా** లాసిక్స్ **లేదా** ఎసిడ్రిక్స్ రోజూ ఒకటి వేసుకుంటే రక్తపోటు అదుపులో ఉంటుంది.
2. బీటాబ్లాకర్స్ : ఎటినలాల్, ప్రొపరనలాల్ వంటివి బీటాబ్లోకర్స్. "ఎటినలాల్ - 50" **లేదా** "ఎటినలాల్ -100" **లేదా** "బీటాకాప్ - టి. ఆర్" మందులు రోజుకొక్కటి చొప్పున వేసినట్లయితే రక్తపోటు కంట్రోల్ అవడమే కాకుండా యాంజైనా వంటి గుండెజబ్బు రాకుండా అదుపు అవుతుంది.
3. కాల్షియమ్ ఛానల్ బ్లాకర్స్ : నిఫెడిపిన్, నికార్డిపిన్ వంటి కాల్షియమ్ ఛానల్ బ్లాకర్స్ రక్తపోటుని కంట్రోల్‌లో ఉంచుతాయి.
4. ఏ.సి.ఇ. ఇన్‌హిబిటార్స్ : ఎనాల్‌ప్రిల్ వంటి ఏ.సి.ఇ. ఇన్‌హిబిటార్స్ రక్తపోటుని కంట్రోలు చేయడమే కాకుండా హార్ట్ ఫెయిల్యూర్‌ని కూడా తగ్గిస్తాయి.

రక్తపోటు ఒక రకమైన మందులకి తగ్గనప్పుడు, రెండవ రకం మందులు కూడా కలిపి వాడవలసి ఉంటుంది.

వైద్య పరీక్షలు :

| | | |
|---|---|---|
| మూత్ర పరీక్ష | : | మూత్రంలో ఆల్బుమిన్, ఎర్ర కణాలు ఉన్నట్లయితే రక్తపోటు జబ్బుకి దారితీసే మూత్రపిండాల జబ్బు ఉన్నట్లు భావించవచ్చు. ప్రతి రక్తపోటు రోగికి విధిగా మూత్ర పరీక్ష చేయాలి. |
| ఛాతి ఎక్స్‌రే | : | ఛాతి ఎక్స్‌రేలో రక్తపోటు వల్ల గుండె పెరగడం కనబడుతుంది. |
| ఇ.సి.జి. పరీక్ష | : | ఇందులో రక్తపోటు గుండె మీద కలిగించే దుష్పరిమాణాలు తెలుస్తాయి. |
| బ్లడ్ షుగర్ | : | మధుమేహం ఉన్నవారికి రక్తపోటు రావడం సహజం. మధుమేహాన్ని అదుపులో ఉంచకపోతే రక్తపోటు కూడా అదుపులోకి రాదు. |
| సీరమ్ కొలస్ట్రాల్ పరీక్ష | : | దీనివల్ల రక్తనాళాలు ఎంత గట్టి పడుతుందీ తెలుస్తుంది. కొలస్ట్రాల్ శాతం ఎక్కువ ఉన్నవారిలో రక్తపోటు వస్తుంది. |



స్పెషల్ టెస్ట్‌లు :

1. ఐ.వి.పి పరీక్ష : దీని ద్వారా మూత్ర పిండాల పరిస్థితి తెలుస్తుంది. మూత్ర పిండాల వ్యాధి రక్తపోటుకి ప్రధాన కారణం.

2. సి.టి.స్కాన్ : మూత్ర పిండాలకి సి.టి.స్కాన్ తీస్తే దానికి సంబంధించిన కంతులు లేదా ట్యూమర్స్ ఎడ్రినలిన్ గ్రంథి ట్యూమర్స్ తెలుస్తాయి.

3. రీనల్ బైయాప్సి

4. రక్తపోటుకి కారణమయ్యే హార్మోన్ల పరీక్ష.

❑❑❑

# 10. గుండె కండరాల వ్యాధి (ఎక్యూట్ మయోకార్డైటిస్)

*మన శరీరంలో కండరాలు బలంగా ఉండి నడవడానికి, పని చేయడానికి చక్కగా తోడ్పడినట్లే గుండె కూడా కండరాలతో నిర్మితమై పని చేస్తుంది. ఒక్కొక్కప్పుడు గుండె కండరాలు బలహీనమవడం, సాగిపోవడం, రక్తాన్ని తగిన విధంగా పంప్ చేయలేకపోవడం జరుగుతుంది. ఇటువంటి పరిస్థితిని గుండె కండరాల వ్యాధి అంటారు.*

**అకస్మాత్తుగా వచ్చే గుండె కండరాల వ్యాధి :**

ఈ వ్యాధిని ఎక్యూట్ మయోకార్డైటీస్ అంటారు. అకస్మాత్తుగా గుండె కండరాలు వాచడం వల్ల ఈ వ్యాధి వస్తుంది. దీని వల్ల గుండె సక్రమంగా పనిచేయదు. హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు ఏర్పడతాయి. గుండె పెరుగుతుంది.

**కారణాలు :**

డిఫ్తీరియా, న్యుమోనియా మొదలైన బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్స్, రూబెల్లా, గవద బిళ్ళలు, ఫ్లూ మొదలైన వైరల్ జ్వరాలు, ఇతర వ్యాధుల వల్ల గుండె కండరాలు అకస్మాత్తుగా బలహీనమవుతాయి. కొన్ని మందుల చెడు ప్రభావం వల్ల, రుమాటిక్ ఫీవర్, కొన్ని కండరాల వ్యాధుల వల్ల ఎక్యూట్ మయోకార్డైటీస్ వస్తుంది.

**లక్షణాలు :**

చక్కని ఆరోగ్యంగా ఉన్న వ్యక్తిలో ఈ వ్యాధి వచ్చినప్పుడు కదిలితే, మెదిలితే ఆయాసం అనిపిస్తుంది. చిన్న పనికి అలసిపోవడం ఉంటుంది. ఛాతిలో నొప్పి అనిపిస్తుంది.

రోగిని పరీక్ష చేస్తే రక్తపోటు చాలా తగ్గిపోయి కనపడుతుంది. గుండె పెరుగుతుంది. గుండెలో అసాధారణ ధ్వనులు వినపడతాయి.

**వైద్య పరీక్షలు :**

ఛాతి ఎక్స్‌రే : ఇందులో గుండె పెరిగి కనబడుతుంది.

ఇ.సి.జి : గుండెలో తేడాలు కనబడతాయి.

ఎకోకార్డియోగ్రఫీ : ఇందులో గుండె పెరగడం, గుండె పై పొరల్లో నీరు, గుండె కవాటాల్లో వ్యాధి తెలుస్తుంది.

రక్త పరీక్షలు : కార్డియాక్ సీరమ్ ఎంజైమ్స్ పెరుగుతాయి.

**చికిత్స :**

1. రోగికి పూర్తి బెడ్‌రెస్ట్ అవసరం.
2. వ్యాధి మూలకారణం బట్టి చికిత్స చేయాలి.
3. ఇన్‌ఫెక్షన్ అయినట్లయితే వ్యాధి బట్టి యాంటీబయోటిక్ వాడాలి.
4. కార్డిజోన్ మందులు వాడాలి.

□□□

# 11. కార్డియోమయోపథీస్

*కొన్ని జబ్బులు గుండె కండరాల్ని నిదానంగా బలహీనపరుస్తాయి. ఆ జబ్బులు గుండెకే రానవసరం లేదు. శరీరంలో ముందుగా ఇతర చోట్ల వచ్చి తరువాత గుండెను దెబ్బతీస్తాయి. దాని వల్ల గుండె కండరాలు సాగిపోతాయి.*

*మద్యం సేవించడం, దీర్ఘకాలంగా రక్తపోటు, వైరల్ ఇన్‌ఫెక్షన్స్, ఇతర వ్యాధుల వల్ల గుండె కండరాలు దెబ్బతినడం, సాగిపోవడం ఉంటాయి.*

**లక్షణాలు :**

ఆయాసం, ఛాతిలో నొప్పి, గుండె దడ.

**రోగ నిర్ధారణ :**

ఎక్స్‌రే, ఇ.సి.జి, ఎకోకార్డియోగ్రఫీ.

**చికిత్స :**

హార్ట్ ఫెయిల్యూర్‌కి చేసే చికిత్స విధంగానే దీనికి చికిత్స చేయాలి.

□□□

# 12. గుండెలో కంతులు

గుండెలో ఏర్పడే కంతులని కార్డియాక్ మిక్సోమా అంటారు. ఈ కంతులు గుండె లోపల గదుల్లో ఏర్పడుతాయి.

కార్డియాక్ మిక్సోమా ఉన్నవారిలో తరచు జ్వరం, రక్తహీనత, బరువు కోల్పోవడం ఉంటాయి. ఆయాసం, తలతిరగడం ఉంటాయి. ఊపిరితిత్తుల్లో నీరు వస్తుంది.

పరీక్షలు - చికిత్స :

ఎకోకార్డియోగ్రఫీ ద్వారా గుండెలోని కంతులను తెలుసుకోవచ్చు. కార్డియాక్ సర్జరీ ద్వారా కంతులను తొలగించాల్సి వస్తుంది.

❑❑❑

# 13. కార్డియాక్ న్యూరోసిస్

కొందరిలో ఎటువంటి గుండె జబ్బు ఉండదు. కానీ గుండె జబ్బు ఉన్నవారిలో వలె బాధలు కనపడతాయి. సాధారణంగా న్యూరోటిక్ పర్సనాలిటీ కలవారిలో ఇటువంటి పరిస్థితి ఉంటుంది. ముఖ్యంగా 20-30 సంవత్సరాలు వయసు ఉన్నవారిలో కనపడుతుంది. కార్డియాక్ న్యూరోసిస్ స్త్రీలలో ఎక్కువ. అనవసర భయం, ఆందోళన, కంగారు, మానసిక వత్తిడి ఉన్నవారిలో ఎక్కువ కనబడుతుంది. భయాందోళన పరిస్థితులు ఏర్పడినప్పుడు కూడా కార్డియాక్ న్యూరోసిస్ ఏర్పడుతుంది. హార్ట్ ఎటాక్ వచ్చినట్లుగా విలవిలలాడిపోతారు.

లక్షణాలు :

1. ఛాతిలో సూదులు పెట్టి పొడుస్తున్నట్లు, గిల్లుతున్నట్లు నొప్పి అనిపిస్తుంది. ఛాతిలో ప్రత్యేకంగా ఒక ప్రదేశం అని కాకుండా మొత్తం నొప్పి అనిపిస్తుంది. ముఖ్యంగా ఛాతిలో ఎడం వైపు నొప్పి అన్పిస్తుంది. ఎంత తీవ్రంగా నొప్పి ఉన్నా చేతికి గానీ, మెడకి గానీ, ఛాతి వెనక గానీ నొప్పి ప్రాకడం ఉండదు. విడవకుండా నొప్పి చాలా సమయం ఉంటుంది. ఆ వ్యక్తిని అలసిపోయేటట్లు చేస్తుంది. హార్ట్ ఎటాక్ లక్షణాలు తెలిసిన కొందరు ఛాతిలో వచ్చిన నొప్పి చేతికి, పొట్టకి, మెడకి పాకుతున్నట్లు చెబుతారు. కానీ గుండె పోటు వచ్చినవారిలో ఉండే లక్షణాలు వీరిలో ఏ మాత్రం ఉండవు.

2. కొందరు గాలి అందనట్లుగా విలవిలలాడిపోతారు. గుండె వేగంగా కొట్టుకుంటుంది. కొందరు కళ్లు తిరిగి పడిపోతారు. చెమటపోయడం, నీరస పడిపోవడం ఉంటాయి.
3. ఇ.సి.జి తీసినా, ఎకోకార్డియోగ్రఫీ చూసినా తేడా ఏమీ ఉండదు. కార్డియాక్ న్యూరోసిస్ ఏ రకంగానూ గుండెపోటుకి దారి తీయదు.
4. కార్డియాక్ న్యూరోసిస్‌తో విలవిలలాడిపోతున్నప్పుడు కాంపోజ్ ఇంజక్షన్ నరానికి ఇస్తే చాలావరకు మామూలు అయిపోతారు.
5. కార్డియాక్ న్యూరోసిస్ ఉన్నవారికి మానసిక చికిత్స అవసరం. వారిలో ఉన్న భయాందోళనలని తొలగించి సరైన విజ్ఞానాన్ని కలిగించాలి.

❑❑❑

# 14. పెరికార్డైటిస్

*గుండెనంటుకుని ఉల్లిపొరల్లాంటి రెండు పొరలు ఉంటాయి. ఈ పొరల అంచులు అంటుకుని ఉండి మధ్య భాగంలో విడివడి ఉంటాయి. ఆ రెండు పొరల మధ్య కొద్దిపాటి ద్రవం ఉంటుంది. గుండెని చుట్టుకుని ఉండే ఈ పొరలని పెరీకార్డియమ్ అంటారు. బాక్టీరియా, వైరస్, ఫంగస్, ప్రోటోజోవా మొదలైన వ్యాధి క్రిములవల్ల కొందరిలో ఈ పొర వాస్తుంది. గుండె నొప్పిని కలిగిస్తుంది.*

**కారణాలు :**

పెరీకార్డియమ్ వాపు వ్యాధి క్రిముల వల్లనే కాకుండా గుండె ఆపరేషన్లప్పుడు దానికి కలిగిన గాయం వల్ల, రక్తంలో యూరియా శాతం పెరగడం వల్ల, థైరాయిడ్ గ్రంథి తక్కువ శాతంలో థైరాక్సిన్ హార్మోన్‌ని తయారు చేయడం వల్ల కూడా వస్తుంది. రుమాటిక్ ఫీవర్ అనే కీళ్ళవాపు జ్వరంలోనూ, కొన్ని కేన్సర్ వ్యాధుల్లోనూ, కొన్ని మందుల దుష్ప్రభావం వల్లనూ, పెరికార్డియమ్ వాచి బాధను కలగచేస్తుంది.

**లక్షణాలు :**

పెరికార్డైటీస్ నిదానంగానూ కలగొచ్చు, అకస్మాత్తుగానూ రావచ్చు. అకస్మాత్తుగా పెరీకార్డైటీస్ వచ్చినవారిలో ఛాతి మధ్యలో నొప్పి, చలితో కూడిన జ్వరం ఉంటాయి. ఆయాసం, దగ్గు ఉంటాయి. చమటలు విపరీతంగా పోస్తాయి. ఛాతి మధ్యలో నొప్పి, ఆయాసం, చెమటలు ఉండటంతో ఒకోసారి దీనిని హార్ట్ ఎటాక్‌గా పొరబడే అవకాశం ఉంది.

**వ్యాధి నిర్ధారణ :**

ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ ద్వారా పెరీకార్డైటీస్‌ని నిర్ధారించవచ్చును.

**చికిత్స :**

1. పెరీకార్డైటీస్ వచ్చిన వారికి పూర్తి బెడ్‌రెస్ట్ ఇవ్వాలి.
2. బ్రూఫెన్ 600 మి.గ్రా. **లేదా** ఇండోమెథాసిన్ 100 మి.గ్రా చొప్పున రోజుకి మూడుసార్లు ఇవ్వాలి.
3. ప్రెడ్నిసొలోన్ 20 మి.గ్రా. చొప్పున రోజుకి 3సార్లు ఇవ్వాలి.

❑❑❑

# 15. పెరికార్డియల్ ఎఫ్యూజన్

*కొందరికి పెరికార్డియమ్ పొరల మధ్య నీరు ఎక్కువగా చేరుతుంది.*

**లక్షణాలు :**

పెరికార్డియమ్‌లో నీరు చేరిన పరిస్థితిని పెరికార్డియల్ ఎఫ్యూజన్ అంటారు. ఇలా నీరు చేరిన వారిలో ఛాతి మధ్యలో తీవ్రమైన నొప్పి ఉంటుంది. దగ్గినా, గట్టిగా గాలి పీల్చినా, ఛాతిని ఇటూ అటూ తిప్పినా, ఏదైనా మ్రింగినా నొప్పి మరింత ఎక్కువవుతుంది. ఈ నొప్పి చేతులకి, ఛాతి వెనుకకి, మెడకి కూడా ప్రాకుతుంది. గుండె చుట్టూ నీరు చేరడంతో గుండె కూడా శక్తివంతంగా పనిచేయలేకపోతుంది.

**నిర్ధారణ :**

ఛాతి ఎక్స్‌రే : ఛాతి ఎక్స్‌రే తీసినప్పుడు గుండె చాలా పెద్దదిగా కనపడుతుంది.
ఇ.సి.జి, ఎకోకార్డియోగ్రఫీ : దీని ద్వారా గుండె చుట్టూ చేరిన నీరు స్పష్టంగా తెలుస్తుంది.
ఎమ్.ఆర్.ఐ : దీని ద్వారా కూడా పెరికార్డియమ్‌లో చేరిన నీరు స్పష్టంగా తెలుస్తుంది.
పెరికార్డియో సెంటసిస్ : పెరికార్డియమ్‌లోకి నేరుగా సూదివేసి అందులోని నీరును సిరంజి ద్వారా బయటకు తీసి లేబరేటరీలో పరీక్ష చేస్తే చాలావరకు వ్యాధి నిర్ధారణ అవుతుంది.

**చికిత్స :**

1. పూర్తి విశ్రాంతి.
2. నొప్పి తగ్గడానికి మందులు.

3. పెరికార్డియమ్‌లో నీరు చేరడానికి కారణమైన వ్యాధిని గుర్తించి దానికి తగిన మందులు వాడాలి. సాధారణంగా క్షయ వ్యాధి వల్ల ఇతర బాక్టీరియా క్రిములవల్ల పెరికార్డియమ్ వాచి నీరు చేరుతుంది. ఈ వ్యాధులకి సంబంధించిన మందులు వాడితే నీరు తగ్గిపోతుంది.
4. పెరికార్డియమ్‌లో నీరు ఎక్కువగా చేరి గుండెను ముఖ్య రక్తనాళాలను నొక్కి వేస్తున్నప్పుడు, సూది వేసి నీరుని బయటకు తీసివేసినట్లయితే చాలావరకు వెంటనే ఉపశాంతి కలుగుతుంది.
5. ప్రెడ్నిసాలోన్ 20 మి.గ్రా. టాబ్లెట్లు రోజుకి 3 సార్లు చొప్పున ఇవ్వాలి.
6. దీర్ఘకాలంగా పెరికార్డియమ్‌లో నీరు ఉన్నా, తరచుగా నీరు చేరుతూ ఉన్నా, ఆపరేషన్ చేసి పెరికార్డియమ్ తొలగించాలి.

❑❑❑

# 16. కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్

*గుండె పై పొరైన పెరికార్డియమ్ గుండె నుంచి రక్తాన్ని బయటకు తీసుకువెళ్ళే పెద్ద రక్తనాళాన్నీ, గుండెకు రక్తాన్ని తిరిగి చేరవేసే మరొక పెద్ద రక్తనాళాన్నీ నొక్కివేసే పరిస్థితిని కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్ అంటారు.*

*పెరికార్డియమ్‌కి క్షయ వ్యాధి క్రిములు సోకడం వల్ల, ఇతర బాక్టీరియా క్రిములు సోకడం వల్ల వ్యాధి కలిగి ఈ పరిస్థితి ఏర్పడుతుంది.*

లక్షణాలు :

గుండెకు తిరిగి రక్తాన్ని చేరవేసే రక్తనాళాలు నొక్కివేయబడటం వల్ల మెడ దగ్గర సిరలు ఉబ్బి కనబడతాయి. రోగికి దడ, ఆయాసం ఉంటాయి. నాడి చాలా బలహీనంగా తగులుతుంది. కాలేయం పెరుగుతుంది. చేతితో నొక్కితే సలపరం కలుగుతుంది. స్ప్లీన్ పెరుగుతుంది. కడుపుకి నీరు చేరుతుంది.

నిర్ధారణ :

ఛాతి ఎక్స్‌రే, ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ , ఎమ్.ఆర్.ఐ. వీటి ద్వారా కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్ తెలుసుకోవచ్చు.



**చికిత్స :**

1. పెరికార్డియక్టమీ అనే ఆపరేషన్ ద్వారా రక్తనాళాలని నొక్కి వేస్తున్న పెరికార్డియమ్‌ను కట్ చేసి రక్త సరఫరా సక్రమంగా జరిగేటట్లు చేయడం.
2. పెరికార్డైటిస్‌కి క్షయ వ్యాధి కారణమయ్యేటట్లయితే దానికి పూర్తి కోర్స్ మందులు వాడడం.

❑❑❑

# 17. పల్‌మనరీ హైపర్‌టెన్షన్

*కుడివైపు గుండె నుంచి ఊపిరితిత్తుల్లో రక్తాన్ని శుద్ధి చేయడానికి తీసుకువెళ్ళే, పెద్ద రక్తనాళాన్ని పల్‌మనరీ ఆర్టరీ అంటారు.*

*ఊపిరితిత్తులు కొన్ని కారణాల వల్ల గట్టిపడినప్పుడు గుండె నుంచి రక్తాన్ని తీసుకువచ్చే పల్‌మనరీ ఆర్టరీ మీద ప్రెషర్ ఎక్కువవుతుంది. ఊపిరితిత్తులలోకి రక్తాన్ని పంప్ చేయడానికి గుండె ఎక్కువ శ్రమ చెందవలసి వస్తుంది. అటువంటప్పుడు పల్‌మనరీ ఆర్టరీలో ప్రెషర్ ఎక్కువ పెరుగుతుంది. దీనినే పల్‌మనరీ హైపర్ టెన్షన్ అంటారు.*

*ఊపిరితిత్తులలో ఫైబ్రోసిస్, బ్రోంకైటిస్ ఏర్పడినప్పుడు, ఊపిరితిత్తులు కుదించుకుపోయినప్పుడు పల్‌మనరీ హైపర్ టెన్షన్ ఏర్పడుతుంది.*

*గుండెలోని మైట్రల్ వాల్వ్ మూసుకుపోయినప్పుడు కూడా పల్‌మనరీ హైపర్‌టెన్షన్ వస్తుంది*

**లక్షణాలు :**

పల్‌మనరీ హైపర్ టెన్షన్ ఏర్పడిన వారిలో కళ్ళు తిరగడం, బైర్లు కమ్మటం, బాగా అలసట అనిపించడం, ఛాతిలో నొప్పి అనిపించడం హార్ట్ ఎటాక్‌లాగా బాధ రావడం ఉంటాయి.

**వ్యాధి నిర్ధారణ :**

ఛాతి ఎక్స్‌రే, ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ, కార్డియాక్ కెథిట్రైజేషన్, లంగ్ ఫంక్షన్ పరీక్షలు, లంగ్ బయాప్సీ పరీక్షల ద్వారా పల్‌మనరీ హైపర్ టెన్షన్‌ని తెలుసుకోవచ్చు.

చికిత్స :

1. గుండెకు రక్తం సరఫరా చేసే రక్తనాళాలలో రక్తం గడ్డ కట్టి. రక్తం సరఫరాలో ఆటంకం ఏర్పడితే అవి కరగడానికి మందులు వాడాలి.
2. రక్తనాళాలు వ్యాకోచించడానికి నిఫెడిపిన్ మందు వాడాలి.
3. ప్రాణ వాయువుని ముక్కు ద్వారా తరచు అందించాలి.
4. చాలా సందర్భాలలో పల్మనరీ హైపర్ టెన్షన్‌కి ఉపశాంతే చికిత్సగా కుదురుతుంది.

□□□

# 18. కార్డియాక్ ఎర్‌థీమియాస్

*గుండె లయబద్ధంగా కొట్టుకుంటూ ఉంటుంది. ఈ లయలో తేడా వచ్చి ఎక్కువ కొట్టుకోవడమో, తక్కువ కొట్టుకోవడమో, అస్తవ్యస్తంగా కొట్టుకోవడమో జరగడాన్ని కార్డియాక్ ఎర్‌థీమియాస్ అంటారు.*

కారణాలు :

గుండె జబ్బు రావడం వల్ల కార్డియాక్ ఎర్‌థీమియాస్ కలగవచ్చు. గుండెజబ్బు కాకుండా, కొన్ని మందుల ప్రభావం వల్ల, షాక్ పరిస్థితి ఏర్పడడం వల్ల కార్డియాక్ ఎర్‌థీమియాస్ కలగవచ్చు. చిన్న పిల్లల్లోనూ, ఆవేశం, ఉద్రేకం అతిగా కలిగేవారిలోనూ, రక్తహీనత ఉన్నవారిలోనూ, గర్భిణీ స్త్రీలలోనూ, మద్యం సేవించేవారిలోనూ కార్డియాక్ ఎర్‌థీమియాస్ కలుగుతాయి. గుండె పోటు, మయోకార్డైటిస్ వచ్చిన వారిలో కార్డియాక్ ఎర్‌థీమియాస్ సహజం.

లక్షణాలు :

కార్డియాక్ ఎర్‌థీమియాస్ ఉన్నవారిలో 50 శాతం మందికి ఎటువంటి బాధలూ ఉండవు. కొందరిలో గుండె దడ, తల తిరగడం ఉండడం, ఛాతిలో నొప్పి ఉంటాయి.

చికిత్స :

1. కార్డియాక్ ఎర్‌థీమియాస్ రావడానికి కారణం బట్టి, గుండెలో అవి కలిగే ప్రాంతము తీరు బట్టి చికిత్స ఉంటుంది.
2. కార్డియాక్ ఎర్‌థీమియాస్‌కి నాలుగు రకాల మందులు ఉన్నాయి. ఇందులో సోడియమ్ ఛానల్ బ్లాకర్స్, బీటా బ్లాకర్స్, కాల్షియం ఏంటాగొనిస్ట్స్, ఇతర మందులు వాడతారు.

3. గుండె జబ్బుకు సంబంధం లేకుండా, ఇతర వ్యాధులకు సంబంధం లేకుండా, మామూలుగా కలిగే కార్డియాక్ ఎర్థీమియాస్ ఏ విధంగానూ ప్రమాదం చేయవు. వాటి గురించి పట్టించుకోనవసరం లేదు.
4. గుండె జబ్బుకు సంబంధం లేని కార్డియాక్ ఎర్థీమియాస్ విశ్రాంతి తీసుకోవడం ద్వారా.
   మద్యం, కాఫీ, ధూమపానం మానేయడంతోనూ.
   మనసు ఉల్లాసంగా ఉంచుకోవడం, టెన్షన్స్, ఆందోళనలు లేకుండా చేసుకోవడంతోనూ సరిదిద్దుకోవచ్చు.

□□□

# 19. కంజెనిటల్ హార్ట్ డిసీజెస్

*పుట్టుకతో వచ్చే గుండె జబ్బులను కంజెనిటల్ హార్ట్ డిసీజ్ అంటారు.*

**కారణాలు :**

తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు రూబెల్లా వ్యాధి రావటం, మేనరికాల వల్ల వంశపారపర్యంగా జీన్స్ ద్వారా సంక్రమించడం. క్రోమోజోమ్స్‌లో తేడాల వల్ల డౌన్స్ సింగ్రోమ్, టర్నర్స్ సింగ్రోమ్ రావడం. ఇటువంటి వారిలో గుండె గోడల్లో రంధ్రాలు. బృహద్ధమనిలో లోపాలు. గర్భవతిగా ఉన్నప్పుడు గర్భంలో ఉన్న పిండానికి ఆక్సిజన్ తక్కువ అందడం. గర్భిణీ స్త్రీ ఎక్స్‌రేకి గురికావడం, గుఱ్ఱపువాతం రావడం, ఫోలిక్ యాసిడ్ లోపం, మద్యం సేవించడం, పొగత్రాగడం మొదలైనవి పుట్టుకతో గుండె జబ్బు రావడానికి కారణాలు.

* డెక్ట్రోకార్డియా

గుండె మామూలుగా ఎడంవైపు ఉంటుంది. కాని డెక్ట్రోకార్డియా ఉన్నవారిలో గుండె కుడివైపు ఉంటుంది.

* కో ఆర్టేక్షన్ అయోర్టా

గుండె నుండి బృహద్ధమని అనే పెద్ద రక్తనాళం బయలుదేరి శరీరానికి రక్తం సరఫరా అయ్యేందుకు తోడ్పడుతుంది. ఈ బృహద్ధమని ప్రారంభంలోనే సన్నబడటం వల్ల తగిన రక్తం శరీరంలో దిగువ భాగాన అందదు. ఇటువంటి వారిలో రక్తపోటు ఎక్కువగా ఉంటుంది. ఎకోకార్డియోగ్రఫీ ద్వారా సన్నబడిన రక్తనాళాన్ని కనుగొని, శస్త్రచికిత్స ద్వారా సరిదిద్దవచ్చు.

* ఎ.ఎస్.డి

గుండెలో మొత్తం నాలుగు గదులుంటాయి. కుడివైపు పై గది నుండి క్రింది గదికి ట్రైకస్పిడ్ వాల్వ్ ద్వారా కనెక్షన్ ఉంటుంది. ఎడం వైపు పై గది నుండి క్రింది గదికి మైట్రల్ వాల్వ్ ద్వారా కనెక్షన్ ఉంటుంది. గుండె పైరెండుగదుల మధ్య అడ్డుగోడ ఉంటుంది. వాటి మధ్య ఎటువంటి కనెక్షన్ ఉండదు. అలాగే గుండె క్రింది రెండు గదుల మధ్య అడ్డుగోడ ఉంటుంది. వాటి మధ్య కూడా ఎటువంటి కనక్షన్ ఉండదు. గుండె పై గదులని ఏట్రియా అంటారు. క్రింది గదులని వెంట్రికల్ అంటారు.

*పై గదులైన ఏట్రియా మధ్య అడ్డుగోడకి కన్నం ఏర్పడటాన్ని ఏట్రియల్ సెప్టల్ డిఫెక్ట్ (ఎ.ఎస్.డి) అంటారు. ఈ పరిస్థితి పుట్టుకతోనే ఉంటుంది. ఇందులో ఎడం వైపు ఉన్న గదిలోంచి మంచి రక్తం (ప్రాణ వాయువు నింపుకున్న రక్తం) కుడివైపు గదిలోకి కొంత చేరుతుంది.*

లక్షణాలు :

మొదట్లో ఎటువంటి బాధ ఉండదు. కొంత వయస్సు పెరిగిన తరువాత ఆయాసం, తేలికగా అలసిపోవడం ఉంటాయి.

నిర్ధారణ :

ఛాతి ఎక్స్‌రే, ఇ.సి.జి. ఎకోకార్డియోగ్రఫీ , కెథ్రైజేషన్

* వి.ఎస్.డి

క్రింది గదులైన వెంట్రికల్స్ మధ్య ఉన్న గోడకి రంధ్రం ఏర్పడటాన్ని వెంట్రుక్యులార్ సెప్టల్ డిఫెక్టు (వి.ఎస్.డి) అంటారు. 60 శాతం మందిలో వయసు పెరుగుతున్న కొద్దీ ఈ లోపం దానికదే సర్దైపోతుంది. రంధ్రం పూడిపోతుంది. రంధ్రం మూసుకోనివారికి ఆపరేషన్ చేయాల్సి వస్తుంది.

* పి.డి.ఎ

*పల్మనరీ ఆర్టరీ, అయోర్టా రెండింటిని కలుపుతూ ఒక రక్తనాళం పుట్టుకతో ఏర్పడుతుంది. ఇది సాధారణంగా గర్భంలో బిడ్డ ఎదుగుతూండగానే మూసుకుపోతుంది. కానీ కొందరిలో ఆ కనక్షన్ మిగిలే ఉంటుంది. ఇలా ముఖ్యమైన రెండు రక్తనాళాల మధ్య మిగిలి ఉన్న కనక్షన్‌ని పేటెంట్ డక్టస్ ఆర్టీరియోసస్(పి.డి.ఎ) అంటారు.*



నిర్ధారణ :

ఛాతి ఎక్స్‌రే, ఇ.సి.జి , ఎకోకార్డియాక్ కెథరైజేషన్

* **ఫాలెట్ టెట్రాలజీ**

ఇందులో పల్మనరీ వాల్వ్ పుట్టుకతోనే మూసుకుపోయి ఉంటుంది. కుడివైపు వెంట్రికల్ పెరిగి ఉంటుంది. వెంట్రుకల్స్ మధ్యగోడకి రంధ్రం ఉంటుంది. బృహద్ధమని పొజిషన్ మారుతుంది. ఈ రకంగా ప్రధానంగా నాలుగు లోపాలు పుట్టుకతో ఏర్పడుతాయి.

**లక్షణాలు :**

ఆయాసం, దడ ఉంటాయి. చేతి గోళ్ళు ఉబ్బుగా కనబడతాయి.

నిర్ధారణ :

ఎక్స్‌రే, ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ, కార్డియాక్ కెథరైజేషన్

* **జన్మతః వచ్చే గుండె జబ్బులకి చికిత్స**

పుట్టుకతో వచ్చే గుండె లోపాలన్నీ సీరియస్ కావు. కొన్ని లోపాలు నిదానంగా అవే చక్కబడిపోతాయి. మరికొన్ని లోపాలు మిగిలి ఉన్నప్పటికి పెద్దగా హాని కలిగించవు. కొందరిలో పుట్టుకతో గుండెలోపాలు ఉన్నప్పుడు ఏమాత్రం అలసినా, శ్రమ చెందినా నీలంగా మారడం ఉంటుంది. ఎదుగుదల లేకుండా పోతుంది. ఛాతి నిర్మాణంలో కూడా తేడా వస్తుంది.

వ్యాధి తీవ్రత బట్టి గుండెకు శస్త్ర చికిత్స చేయవలసి వస్తుంది. గుండెకు శస్త్ర చికిత్స చేసిన తరువాత వ్యాధి లక్షణాలు చాలావరకు తగ్గిపోతాయి.

❑❑❑

# 20. గుండె కవాటాల వ్యాధులు

* **మైట్రల్ స్టినోసిస్**

గుండెలో మైట్రల్ వాల్వ్ (కవాటం) ఎడం వైపు ఏట్రియం, వెంట్రికల్ మధ్య ఉంటుంది. ఇది సన్నబడటాన్ని మైట్రల్ స్టినోసిస్ అంటారు.

**కారణాలు :**

రుమాటిక్ ఫీవర్, పుట్టుకతోనే మైట్రల్ స్టినోసిస్ ఉండటం.

**లక్షణాలు :**

కొందరికి ఎటువంటి బాధలు ఉండవు. మరికొందరికి ఆయాసం ఉంటుంది. వ్యాధి

తీవ్రత బట్టి గుండెకి నీరు చేరడం, నోటి వెంట రక్తం పడటం ఉంటాయి. గుండె దడ ఉంటుంది. తేలికగా అలసిపోతారు. నీలంగా మారతారు. యాంజైనా గుండె నొప్పి వస్తుంది. గొంతు బొంగురుపోవడం. సరిగ్గా మింగుడు పడకపోవడం ఉంటాయి.

నిర్ధారణ :

ఛాతి ఎక్స్‌రే , ఇ.సి.జి. ఎకోకార్డియోగ్రఫీ , కార్డియాక్ కెథరైజేషన్.

చికిత్స :

1. రుమాటిక్ ఫీవర్ వచ్చిన వారికి పెనిడ్యూర్ ఎల్.ఎ, 12 ఇంజక్షన్ నెలకొకటి చొప్పున 20 సంవత్సరాలు వచ్చేవరకు చేయాలి. ఉపశాంతికి మందులు వాడాలి.
2. మైట్రల్ స్టినోసిస్ వల్ల బాధలు ఎక్కువగా ఉంటే మైట్రల్ వాల్వ్ వాటమి అనే శస్త్ర చికిత్స చేయాలి.

* మైట్రల్ రీగర్జిటేషన్

*మైట్రల్ వాల్వ్ పటుత్వం కోల్పోయి బ్లడ్ లీక్ అయిపోవడాన్ని మైట్రల్ రీగర్జిటేషన్ అంటారు. రుమాటిక్ ఫీవర్, బాక్టీరియల్ ఎండోకార్డైటీస్ వల్ల ఈ గుండె జబ్బు వస్తుంది. మైట్రల్ రీగర్జిటేషన్ వల్ల గుండె పెరుగుతుంది. హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు ఏర్పడుతాయి.*

చికిత్స :

1. గుండె జబ్బు తక్కువలో ఉన్నప్పుడు మందులతో ఉపశాంతి కలిగించవచ్చు.
2. ఎక్కువగా ఉన్నప్పుడు శస్త్ర చికిత్స చేయాలి. ఆర్టిఫిషియల్ మైట్రల్ వాల్వ్ పెట్టాలి.

* అయోర్టిక్ రీగర్జిటేషన్

*అయోర్టా (బృహద్ధమని)కి సంబంధించిన వాల్వ్ లీక్ అవడాన్ని అయోర్టిక్ రీగర్జిటేషన్ అంటారు.*

కారణాలు :

రుమాటిక్ ఫీవర్, సబ్ ఎక్యూట్ బాక్టీరియల్ ఎండోకార్డైటీస్, సిఫిలిస్ వ్యాధుల వల్ల అయోటిక్ రీగర్జిటేషన్ వస్తుంది.



**లక్షణాలు :**

ఆయాసం, గుండె దడ, ఛాతీలో నొప్పి ఉంటాయి.

**నిర్ధారణ :**

ఛాతి ఎక్స్‌రే, ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ, కార్డియాక్ కెథటరైజేషన్.

**చికిత్స :**

1. హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు ఏర్పడితే కొన్ని మందులు కొంత ఉపశాంతి కలిగిస్తాయి.
2. ఆర్టిఫిషియల్ వాల్వ్ పెట్టడమే దీనికి సరైన చికిత్స.

* **అయోర్టిక్ స్టినోసిస్**

*అయోర్టిక్ వాల్వ్ మూసుకుపోవడాన్ని అయోర్టిక్ స్టినోసిస్ అంటారు. ఈ వాల్వ్ మూసుకుపోవడమనేది పుట్టుకతోనే ఉండడం ఎక్కువ. అయోర్టిక్ వాల్వ్ గట్టిపడి మూసుకుపోవడం ఎక్కువ. రుమాటిక్ ఫీవర్ వల్ల మూసుకుపోవడం అరుదు.*

**లక్షణాలు :**

అయోర్టిక్ వాల్వ్ బాగా మూసుకుపోయినప్పుడు రోగ లక్షణాలు కనబడతాయి. అంతవరకు ఏ బాధ కనబడదు. అయోర్టిక్ స్టినోసిస్‌లో తగిన రక్తం పంప్ చేయబడక పడిపోవడం, గుండెలో నొప్పి రావడం ఉంటాయి. ఆయాసం కూడా అనిపిస్తుంది.

**నిర్ధారణ :**

ఛాతి ఎక్స్‌రే, కేథటరైజేషన్, ఇ.సి.జి., ఎకోకార్డియోగ్రఫీ.

**చికిత్స:**

1. శస్త్ర చికిత్స ద్వారా లోపాన్ని సరిదిద్దాలి.
2. బెలూన్ వాల్యులలో ప్లాస్టీ ద్వారా కొంత రిలీఫ్ వస్తుంది.

* **ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్**

*కుడి ఏట్రియం వెంట్రుకల మధ్య ట్రైకస్పిడ్ వాల్వ్ ఉంటుంది. ఈ వాల్వ్ లీకేజి పరిస్థితిని ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్ అంటారు.*

**కారణాలు :**

మైట్రల్ వాల్వ్స్ లోపాలు, పల్మనరీ స్టినోసిస్, పల్మనరీ హైపర్ టెన్షన్ మొదలైన పరిస్థితుల వల్ల ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్ కలుగుతుంది.

**లక్షణాలు :**

అలసట, కాలేయం నొప్పి, కాళ్ళకు నీరు, మెడ దగ్గర నరాల ఉబ్బు.

**చికిత్స:**

1. విశ్రాంతి.
2. ఉపశాంతికి మందులు.
3. పాడైపోయిన వాల్వ్‌ని తొలగించి కృత్రిమ వాల్వ్‌ని పెట్టడం.

* **ట్రైకస్పిడ్ స్టినోసిస్**

**కారణాలు :** రుమాటిక్ ఫీవర్, మైట్రల్ స్టినోసిస్ పుట్టుకతో మూసుకుపోయి ఉండడం.

**లక్షణాలు :** కాలేయం నొప్పి, పాదాలకు నీరు, ఆయాసం.

**చికిత్స** : కృత్రిమ వాల్వ్‌ని పెట్టడం.

* **పల్మనరీ రీగర్జిటేషన్**

**కారణాలు :**

- పుట్టుకతోనే పల్మనరీ వాల్వ్‌లో లోపం.
- జన్మతః వచ్చే గుండె జబ్బులు.
- రుమ్మాటిక్ ఫీవర్.

**లక్షణాలు :** ఆయాసం, గుండె దడ, పాదాలకు నీరు.

**చికిత్స** : శస్త్ర చికిత్స.

* **పల్మనరీ స్టినోసిస్**

**కారణాలు :** పుట్టుకతోనే ఈ పరిస్థితి రావడం ఎక్కువ.

**లక్షణాలు :** ఆయాసం, దడ, కాలేయం నొప్పి, పాదాలకు నీరు.

**చికిత్స** : పల్మనరీ వాల్వ్ సర్జరీ.

❑❑❑

# 21. గుండె జబ్బు రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు

1. ధూమపానం పనికి రాదు. చుట్టలు, బీడీలు, సిగరెట్లు అలవాటు ఉంటే పూర్తిగా మానివేయాలి. ధూమపానం చేస్తున్నవారి ప్రక్కన కూర్చుని వారు వదిలిన పొగని కూడా పీల్చడం పనికిరాదు.
2. నశ్యం అలవాటు పనికి రాదు.
3. పాన్‌పరాగ్, గుట్కా, జర్దా అలవాటు మానుకోవాలి.
4. క్రొవ్వు పదార్థం కలిగిన ఆహారం తక్కువగా తీసుకోవాలి. నెయ్యి, డాల్డా మంచివి కాదు. సన్‌ఫ్లవర్ ఆయిలు వాడడం మంచిది.
5. రోజూ కొంత సేపు వ్యాయామం చేయాలి. నడక, పరుగు, ఈత, సైక్లింగు, ఆటలు ఆరోగ్యానికి మంచివి.
6. స్థూలకాయం ఉండకూడదు.
7. రక్తంలో కొలెస్ట్రాల్ ఉండవలసిన దానికంటే ఎక్కువ ఉండకూడదు. కొలెస్ట్రాల్ శాతం తగ్గడానికి కొవ్వు పదార్థాలు మానివేయాలి. ఆకు కూరలు ఎక్కువ తీసుకోవాలి. వ్యాయామం చేయాలి.
8. ఒళ్ళు అలవకుండా ఎప్పుడూ విశ్రాంతిగా ఉండడం మంచిదికాదు. కొంత అయినా శారీరక శ్రమ చేయాలి.
9. రక్తంలో ఎల్.డి.యల్ శాతం, ట్రైగ్లిసరైడ్స్ శాతం తక్కువగా ఉండేటట్టు చూసుకోవాలి. ఇందుకోసం వ్యాయామం అవసరం. క్రొవ్వు పదార్థాలు తక్కువలో తీసుకోవాలి.
10. రక్తపోటు ఉన్నవారు ఎప్పుడూ అదుపులో ఉంచుకోవాలి.
11. షుగర్ వ్యాధి ఉంటే ఎప్పుడూ అదుపులో ఉంచుకోవాలి. ఆహారంలో దుంప కూరలు, పళ్ళు, తీపి పదార్థాలు తీసుకోకూడదు.
12. ఉప్పు తక్కువగా వాడాలి.
13. యూరిక్ యాసిడ్ శాతం ఎక్కువగా ఉంటే తగ్గించుకోవాలి.

14. వంశపారంపర్యంగా రక్తపోటు, మధుమేహం, కొలెస్ట్రాల్ వచ్చేవారు మొదటి నుంచి ఆహారం విషయంలోనూ, అలవాట్లు విషయంలోనూ జాగ్రత్తగా ఉండాలి. 20 సంవత్సరాల వయసు వచ్చినప్పటి నుంచి రక్తపోటు ఉన్నా లేకపోయినా రక్తపోటు చూపించుకుంటూ ఉండాలి. అప్పుడప్పుడు షుగర్ పరీక్ష చేయించుకుంటూ ఉండాలి. రక్తంలో కొలెస్ట్రాల్, యల్.డి.యల్, హెచ్.డి.యల్., ట్రైగ్లిసరైడ్స్ పరీక్ష చేయించుకుంటూ ఉండాలి.
15. రక్తపోటు, మధుమేహం, రక్తనాళాల వ్యాధులు ఉన్న స్త్రీలు, గర్భనిరోధక నోటిమాత్రలు వాడకూడదు.
16. కాఫీ, టీలు 1-2 సార్లుకన్నా ఎక్కువ త్రాగటం మంచిదికాదు.
17. మద్యం తీసుకోకూడదు.
18. మానసికంగా, ప్రశాంతంగా ఉండాలి. కోపాలు, తాపాలు పనికిరావు.
19. మానసిక వత్తిడి తగ్గించుకోవాలి. కంగారు, గాభరా, ఆందోళన ఉండకూడదు.
20. మనస్సుని ఎప్పుడూ ఉల్లాసంగా ఉంచుకోవాలి.
21. గర్భిణీ స్త్రీలు డాక్టరు సలహా లేనిదే ఏ మందులు వాడకూడదు. విచక్షణా రహితంగా గర్భిణీ స్త్రీ మందులు వాడితే గర్భస్థ శిశువుకి అంగవైకల్యం కలగవచ్చు.
22. చిన్నపిల్లల్లో రుమాటిక్ ఫీవర్ (కీళ్ళవాతం జ్వరం) వస్తే పూర్తి చికిత్స పొందాలి.
23. మాంసాహారం కంటే శాఖాహారం మంచిది.
24. ఆరోగ్యకరమైన పరిసరాల్లో నివసించాలి. ఆరోగ్యకరమైన అలవాట్లు పెంపొందించుకోవాలి.
25. మితంగా భుజించడం, కంటి నిండా నిద్రపోవడం, ఆహ్లాదంగా ఉండటం గుండె ఆరోగ్యానికి అవసరం.

❑❑❑

# 5. శ్వాసకోశ వ్యాధులు

## 1. దగ్గు

***దగ్గుకి కారణాలు :*** *రకరకాల వ్యాధి క్రిముల వల్ల శ్వాసకోశాలకి ఇన్‌ఫెక్షన్ కలుగుతుంది. కొందరిలో ఈ ఇన్‌ఫెక్షన్ అకస్మాత్తుగానూ, తీవ్రంగానూ కలగొచ్చు. ఇటువంటి పరిస్థితిని ఎక్యూట్ ఇన్‌ఫెక్షన్ అంటారు. మరికొందరిలో నిదానంగానూ, తక్కువగానూ ఇన్‌ఫెక్షన్ ఉండడమే కాకుండా దీర్ఘకాలంగా వ్యాధి ఉంటుంది. ఇటువంటి పరిస్థితిని క్రానిక్ ఇన్‌ఫెక్షన్ అంటారు.*

* ఎక్యూట్ ఇన్‌ఫెక్షన్: లెరింజైటిస్ (స్వరపేటికకి వ్యాధి), ట్రేకిఐటిస్ (పెద్దగాలి గొట్టంలో వ్యాధి), బ్రోంకైటిస్ (శ్వాసనాళాలలో వ్యాధి), బ్రోంఖ్యోలైటిస్ (చిన్న శ్వాస నాళాలలో వ్యాధి), న్యుమోనియా వంటి వ్యాధులు ఇందుకు ఉదాహరణ.
* క్రానిక్ ఇన్‌ఫెక్షన్ : పల్మొనరీ ట్యూబర్ క్యూలోసిస్ (క్షయవ్యాధి), క్రానిక్ బ్రోంకైటిస్, క్రానిక్ లెరిన్‌జైటిస్, బ్రోంకిఎక్టైసిస్, లంగ్ యాప్సిస్, ఇందుకు ఉదాహరణలు.
* ఇన్‌ఫెక్షన్ లేకుండా దగ్గు: దుమ్ము, ధూళి పీల్చడం వల్ల కలిగే వ్యాధి న్యూమోకోనియోసిస్. రసాయనికాల ఘాటు, పొగ త్రాగడం వల్ల ఇన్‌ఫెక్షన్ లేకుండా దగ్గు వస్తుంది.
* గొంతుకలో గానీ, గాలి గొట్టాలలో గానీ బయట పదార్థం అడ్డుపడటం (ఫారిన్ బాడి). కొన్ని వ్యాధులలో ఊపిరితిత్తులు, గాలి గొట్టాలు నొక్కుకు పోవడం వల్ల కూడా ఇన్‌ఫెక్షన్ లేకుండా దగ్గు వస్తుంది.
* రిఫ్లెక్స్ యాక్షన్: వేగస్ నెర్వ్ ఇరిటేషన్ వల్ల దగ్గు, చెవిలో పుల్లపెట్టి తిప్పితే దగ్గు వస్తుంది. చెవిలో గులివి, చీము ఉన్నా దగ్గు వస్తుంది. డయాఫ్రమ్ క్రింద ఇన్‌ఫెక్షన్ ఉన్నా దగ్గు వస్తుంది. చల్లగాలి తగలడం వల్ల దగ్గు వస్తుంది. ముఖ్యంగా ఉబ్బసం ఉన్నవాళ్ళలో చల్లగాలికి దగ్గు రావడం ఎక్కువ.
* దీర్ఘవ్యాధులలో దగ్గు: కొందరికి కొన్ని వ్యాధుల వల్ల చాలా కాలంపాటు దగ్గు వస్తుంది. ఆ వ్యాధి తగ్గిపోయినా దగ్గు కంటిన్యూ అవుతూ ఉంటుంది. దగ్గు

అలవాటుగా మారడానికి ఇది కారణం. కొన్ని సైకలాజికల్ పరిస్థితుల్లో కూడా ఎటువంటి వ్యాధి లేకుండా కూడా దగ్గు వస్తుంది.

దగ్గులో రకాలు :

* పొడి దగ్గు : క్షయ మొదటి దశలో, లంగ్ కేన్సర్‌లో, ధూమపానం చేసేవారిలో, ఈస్నోఫిలియా ఉన్నవారిలో, క్రానిక్‌గా ఉబ్బసం ఉన్నవారిలో పొడి దగ్గు ఉంటుంది. మానసిక వ్యాధులు ఉన్న కొందరిలో పొడి దగ్గు వస్తుంది.
* తెమడతో కూడిన దగ్గు : కొందరికి దగ్గుతోపాటు తెమడ (మ్యూకస్) కళ్ళె పడతాయి. వారికి శ్వాసకోశాల వ్యాధి ఉండటం కారణం.
* అకస్మాత్తుగా తీవ్రమైన దగ్గు : కొందరికి ఆగి ఆగి అకస్మాత్తుగా తీవ్ర రూపంలో దగ్గు వస్తుంది. కోరింత దగ్గు, ఉబ్బసం, హార్ట్ ఫెయిల్యూర్‌లో ఇటువంటి పరిస్థితి ఉంటుంది.
* పిల్లి కూతతో కూడిన దగ్గులు : ఉబ్బసం, ఈస్నోఫిలియా, క్రానిక్ బ్రోంకైటిస్‌లో ఇటువంటి జబ్బు ఉంటుంది.
* పెద్దగా దగ్గు : దీనినే 'బార్కింగ్ కాఫ్'అంటారు. ఇటువంటి దగ్గు, సాధారణంగా హిస్టీరియా అనే మానసిక వ్యాధికి సంబంధించినదే అవుతుంది.
* రాత్రిపూట దగ్గు : ఉబ్బసం, ఊపిరితిత్తులలో నీరు, క్రానిక్ సైనుసైటిస్ ఉన్నవాళ్ళలో రాత్రిపూట దగ్గు ఉంటుంది.
* దగ్గలేక దగ్గు : కొందరికి ప్లూరసీ ఉంటుంది, దగ్గితే ఛాతిలో నొప్పి వస్తుంది. కాని ఆ వ్యాధి వల్ల దగ్గు రావడం, దగ్గితే నొప్పి అనిపించడంతో పూర్తిగా దగ్గలేకపోవడం జరుగుతుంది.
* ఆహారం తీసుకుంటే దగ్గు : హయాటల్ హెర్నియా, ట్రేకియో యూసోఫేగల్ ఫిస్టులా ఉన్నవారిలో ఆహారం తీసుకుంటే దగ్గు వస్తుంది.

దగ్గు దుష్పరిణామాలు:

విడవకుండా దగ్గడం వల్ల మెదడుకి రక్త ప్రసారణ తగ్గి కళ్ళు బైర్లు కమ్ముతాయి. కొందరిలో ప్రక్కటెముకలు బలహీనంగా ఉండి గట్టిగా దగ్గినప్పుడు విరుగుతాయి. ఇంకొందరిలో అతిగా దగ్గడం వల్ల ఊపిరితిత్తులకి కన్నం ఏర్పడి న్యూమోథొరాక్స్ ఏర్పడుతుంది.



చికిత్స :

1. దగ్గు రావడానికి మూలకారణాన్ని తెలుసుకుని చికిత్స చేయాలి. ఉపశాంతిగా దగ్గు మందులు (కాఫ్ సిరప్స్) పనిచేస్తాయి.
2. పొడి దగ్గు అయినప్పుడు లింక్టస్‌కొడీన్ సిరప్ ప్రతి 6 గం॥కి ఒకసారి తీసుకోవాలి.
3. దగ్గుతోపాటు తెమడ, కళ్ళె ఉన్నప్పుడు బ్రోమ్ హెక్సిన్, ఇతర మ్యూకోలైటిక్స్ కలిగిన దగ్గు మందులు వాడాలి.

❑❑❑

## 2. కళ్ళె

*కొందరిలో కళ్ళె పలచగా కొద్దిగా ఉంటే మరికొందరిలో ఎక్కువ మోతాదులో ఉంటుంది.*

*కొందరిలో కళ్ళె నీరులాగా ఉంటుంది. పల్మొనరీ కంజెషన్, పల్మొనరీ ఎడిమా, హైడాటిడ్ సిస్ట్ రప్చర్‌లో కళ్ళె నీరులాగా ఉంటుంది.*

*కొందరిలో కళ్ళె జిగురుగా ఉంటుంది. ఎంత దగ్గినా తెమడ తెగినట్లు కనబడదు. క్రానిక్ బ్రోంకైటిస్, ఉబ్బసం ఉన్నవాళ్ళలో కళ్ళె జిగురుగా ఉంటుంది.*

సుద్దగా, జిగురుగా కళ్ళె : శ్వాసకోశ వ్యాధులలో ముఖ్యంగా గాలి గొట్టాలలో వ్యాధి వచ్చినప్పుడు ఈ విధమైన కళ్ళె పడుతుంది.

దుర్వాసనతో కూడి చీములాగా కళ్ళె : దీన్నే పురులెంట్ స్పూటమ్ అంటారు. బ్రోంకై ఎక్టైసిస్, లంగ్ యాప్సిస్, లంగ్స్ టి.బి. లలో ఇటువంటి కళ్ళె ఉంటుంది.

కళ్ళెరంగు : బొగ్గుకి సంబంధించిన ధూళి పీల్చిన వాళ్ళలో నలుపు రంగులో ఉంటుంది. న్యుమోనియా వ్యాధిలో తుప్పు రంగులో ఉంటుంది.( తుప్పు రంగులో కళ్ళె ఉండటానికి కారణం అందులో రక్తం కూడా కలిసి ఉండడం.)కొందరిలో పసుపు రంగులో ఉంటుంది.(యాక్టినోమైకోసిస్ ఇందుకు కారణం.) ఎరుపు రంగులో ఉండటానికి శ్వాసకోశాలలో రక్త స్రావం జరగడం కారణం. పల్మొనరీ ఎడిమా ఉన్నవారిలో తెల్లనురుగులా ఉంటుంది. స్టైఫలోకోకస్ ఇన్‌ఫెక్షన్ ఉన్నవారిలో కళ్ళె ఎల్లో కలర్‌లో ఉంటుంది. లంగ్ కేన్సర్ ఉన్నవారిలో రెడ్ కలర్‌లో ఉంటుంది. సూడోమొనాస్ ఇన్‌ఫెక్షన్‌లో ఆకుపచ్చగా ఉంటుంది.

**కళ్ళెలో ఇతర దోషాలు:**

కొందరి కళ్ళెలో గట్టి పదార్థాలు ఉంటాయి. మ్యూకస్ ప్లగ్స్, స్పూటమ్ ప్లగ్స్, ఫైబ్రినస్ కాస్ట్స్, యాస్‌బెస్టాస్ బాడీస్, కాల్సిఫైడ్ బాడీస్ ఈ కోవకి చెందినవే.

**కళ్ళె వాసన:** కొందరిలో కళ్ళె చాలా దుర్వాసన వేస్తుంది. ఎనరోబ్స్, ఫ్యూజిఫామ్ బేసలై ఇందుకు కారణం. లంగ్ యాబ్సస్, బ్రోంకి యక్టైసిస్, లంగ్ కేన్సర్, గాంగ్రీన్ లంగ్ ఉన్నవారిలో కళ్ళె చాలా దుర్వాసన వేస్తుంది.

**చికిత్స :**

1. మైక్రోస్కోప్‌లో కళ్ళెను పరీక్ష చేస్తే చాలావరకు వ్యాధి క్రిమి ఏదైనది తెలుస్తుంది.
2. కల్చర్ టెస్ట్ చేస్తే కూడా వ్యాధి క్రిమిని గుర్తించవచ్చు.
3. కళ్ళె పరీక్ష, ఎక్స్‌రే, బ్రోంకోస్కోపి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారించి మందులు వాడినట్లయితే వ్యాధి తగ్గుతుంది. కళ్ళె పడడం ఆగిపోతుంది.

❑❑❑

# 3. దగ్గుతో పాటు రక్తం

*కళ్ళెతోపాటు రక్తం పడడం గానీ, దగ్గితే కేవలం రక్తం పడటం గానీ ఉంటే హీమోప్టసిస్ అంటారు.*

**కారణాలు :**

ఊపిరితిత్తుల వ్యాధులు - క్షయ, బ్రోంకియక్టైసిస్, లంగ్‌యాబ్సిస్; గుండె జబ్బులు - మైట్రల్‌స్టినోసిస్ (గుండె కవాటాల వ్యాధి); కంతులు - కేన్సర్, ఎడినోమా, ఊపిరితిత్తులలో కేన్సర్ సెకండ్రీస్; శ్వాసకోశాలకి గాయాలు - యాక్సిడెంట్స్ జరిగినప్పుడు ఊపిరితిత్తులకు గాయాలు అయినప్పుడు దగ్గితే రక్తం పడుతుంది; రక్తానికి సంబంధించిన వ్యాధులు - పర్ప్యూర, లుకీమియా (బ్లడ్ కేన్సర్), హీమోఫిలియా; ఇతర కారణాలు - హెమరేజిక్ ఫీవర్స్, యాంటీ కొయాంగ్యులెంట్స్. దగ్గినప్పుడు రక్తం పడినప్పుడు రక్తం ఎర్రగా ఉంటుంది. కొందరిలో రక్తంతో పాటు కొంత నురుగు, కొంత తెమడ కలిసి ఉంటాయి. న్యుమోనియా వంటి వ్యాధులలో రక్తం కళ్ళెతో కలిసి తుప్పు రంగులో కనపడుతుంది. కొందరి విషయంలో రక్తం ఊపిరితిత్తులలోంచి వచ్చిందా, కడుపులో పుండు వల్ల వచ్చిందా అన్న సందేహం కలుగుతుంది. కడుపులో పుండు వల్ల పడే రక్తం ఎర్రగా, నల్లగా ఉంటుంది.

ఎక్కువ మందిలో కాఫీ డికాక్షన్ రంగులో ఉంటుంది. వాంతి అవడం తెలుస్తుంది. సాధారణంగా దగ్గు ఉండదు. వాంతిలో రక్తం పడ్డవారిలో మరుసటి రోజు విరోచనం నల్లగా ఉంటుంది. ఈ రకంగా రక్తం ఎక్కడ నుంచి పడింది గుర్తించవచ్చు.

**నిర్ధారణ:**

రోగి చెప్పినదానిబట్టి, అతనికున్న వ్యాధిబట్టి చాలావరకు నిర్ధారించవచ్చు. కళ్ళె పరీక్ష, ఛాతీ, ఎక్స్‌రే పరీక్ష, రక్త పరీక్ష బ్రోంకోస్కోపి, బ్రోంకోగ్రఫి, లంగ్ స్కాన్ మొదలైన పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చును.

**చికిత్స:**

1. దగ్గుతోపాటు రక్తం పడుతున్నప్పుడు రోగికి పూర్తి విశ్రాంతి ఇవ్వాలి. కాంపోస్ **లేదా** పెథిడిన్ **లేదా** మార్ఫిన్ ఇంజక్షన్ ఇవ్వాలి.
2. రక్తం ఎక్కువగా పడితే రక్తం ఎక్కించాలి.
3. దగ్గును తగ్గించడానికి లింక్టస్‌కొడీన్ చెమ్చా మందును రోజుకి 3 సార్లు ఇవ్వాలి.
4. వ్యాధిని బట్టి యాంటీబయోటిక్ వాడాలి.
5. టి.బి. జబ్బు అయినట్టయితే ఆ వ్యాధికి సంబంధించిన చికిత్స మొదలుపెట్టాలి.
6. బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ అయితే శక్తివంతమైన యాంటీబయోటిక్స్ వాడాలి. అరుదుగా కొందరిలో శస్త్ర చికిత్స అవసరమవుతుంది.

❑❑❑

# 4. ఎక్యూట్ బ్రోంకైటిస్

*వైరస్, బాక్టీరియా క్రిములవల్ల శ్వాసకోశాలకు సంబంధించిన గొట్టాలలోని మ్యూకస్ పొర ఉబ్బుతుంది. ఈ పరిస్థితి అకస్మాత్తుగానూ, ఎక్కువగానూ వచ్చిన దాన్ని ఎక్యూట్‌బ్రోంకైటిస్ అంటారు. 5 సంవత్సరాల పిల్లల్లోనూ, వృద్ధులలోనూ ఎక్యూట్ బ్రోంకైటీస్ రావడం ఎక్కువ.*

**కారణాలు :**

ఫ్లూ, జ్వరం, గుండె జబ్బులు, ఇతర అనారోగ్య పరిస్థితులు ఉన్నవారిలో ఎక్యూట్ బ్రోంకైటిస్ ఎక్కువగా కనపడుతుంది. క్రానిక్ బ్రోంకైటిస్ ఉన్నవారిలో కూడా అప్పుడప్పుడు ఎక్యూట్ బ్రోంకైటిస్‌గా రూపం ఎత్తుతుంది.

పొంగు, కోరింత దగ్గు వచ్చిన వారిలోనూ, దుమ్మ్కు, ధూళికి, రసాయనికాల ఘాటుకి ఎక్కువగా గురైన వారిలోనూ పూల పుప్పొడికి ఎలర్జీ ఉన్నవారిలోనూ ఎక్యూట్ బ్రోంఖైటిస్ రావడం ఉంటుంది.

లక్షణాలు :

జ్వరం, నీరసం, అలసట, చెమటలు అతిగా పట్టడం ఉంటాయి. దగ్గుతూంటే తెమడగాని, కళ్ళెగానీ పడుతుంది. కొందరిలో కళ్ళె ఎక్కువ మోతాదులో పడుతుంది. ఛాతిలో నొప్పి ఉంటుంది. కొందరికి అది గుండెపోటు అనిపిస్తుంది. దగ్గితే ఛాతి నొప్పి ఎక్కువవుతుంది. కొందరికి గొంతుకలో గురగురా పిల్లి కూతలు ఉంటాయి.

చికిత్స :

1. ఎక్యూట్ బ్రోంఖైటిస్ ఉన్నవారు విశ్రాంతి తీసుకోవాలి
2. తేలికగా అరిగే ఆహారం తీసుకోవాలి. ముఖ్యంగా పాలు, హార్లిక్స్. పండ్ల రసాలు, ఇతర ద్రవ పదార్థాలు ఎక్కువగా తీసుకోవాలి.
3. ఆవిరి పట్టడం మంచిది. లింక్టస్ కొడీన్ దగ్గుమందు వాడాలి. యాంపిసిలిన్ **లేదా** ఎమాక్సిలిన్ **లేదా** సెఫ్లక్సిన్ 250మి.గ్రా. క్యాప్సుల్స్ ప్రతి 8 గం॥లకు వేసుకోవాలి.
4. వ్యాధి లక్షణాలు ఎక్కువ ఉన్నప్పుడు 500 మి.గ్రా. చొప్పున 8 గంటలకి ఒకసారి వాడాలి. ఇలా వారం రోజులు వాడాలి.
5. వ్యాధి ఎక్కువగా ఉన్నప్పుడు ప్రెడ్నిసోలోన్ **లేదా** బెటనలాన్ బిళ్ళలు వాడాలి.

❑❑❑

# 5. క్రానిక్ బ్రోంఖైటిస్

*ఊపిరితిత్తులలోని గాలి గొట్టాలలో క్రానిక్‌గా వాపు ఉండడం, ఇన్‌ఫెక్షన్ రావడం వల్ల దగ్గు, దగ్గుతోపాటు కాస్త తెమడ (మ్యూకస్) ఉండే పరిస్థితిని క్రానిక్ బ్రోంఖైటీస్ అంటారు.*

కారణాలు :

ఇన్‌ఫెక్షన్:- ఎక్యూట్ బ్రోంఖైటీస్ క్రానిక్ బ్రోంఖైటీస్‌గా మారవచ్చు. ఎక్యూట్ బ్రోంఖైటీస్‌కి బాక్టీరియా, వైరస్ వంటి క్రిములు ఇన్‌ఫెక్షన్‌కి కారణాలు కావచ్చు. గొంతులో ఇన్‌ఫెక్షన్, ట్రాన్సిల్స్ వాపు, ముక్కులో ఇన్‌ఫెక్షన్, శ్వాసకోశాలకి ప్రాకి క్రానిక్

బ్రోంఖైటీస్‌గా మారవచ్చు. వాయు కాలుష్యం కూడా క్రానిక్ బ్రోంఖైటీస్‌కి ఒక కారణం. దుమ్ము, ధూళి ఎక్కువ ఉండడం, జన నివాసాల దగ్గర సిమెంట్ ఫ్యాక్టరీ, బొగ్గు ఫ్యాక్టరీ ఉండడం క్రానిక్ బ్రోంఖైటీస్‌కి ఒక కారణం. దీర్ఘవ్యాధులైన టి.బి. బ్రోంఖిఎక్టైసిస్, క్రానిక్ బ్రోంఖైటిస్‌కి కారణమవుతాయి. చుట్ట, బీడి, సిగరెట్టు త్రాగే అలవాటు కూడా క్రానిక్ బ్రోంఖైటీస్‌కి కారణమవుతుంది.

**లక్షణాలు:**

తరచుగా దగ్గు రావడం, దగ్గుతోపాటు కళ్ళెపడటం ఉంటాయి. మధ్యలో కొంత కాలం ఏ బాధ లేకపోయినా, వర్షాకాలంలో, చలికాలంలో వ్యాధి లక్షణాలు బయట పడతాయి. దగ్గుతో పాటు పలచగా గానీ, జిగురుగా గానీ తెమడ పడుతుంది. దీర్ఘకాలంగా క్రానిక్ బ్రోంఖైటీస్ ఉన్నవారిలో గొంతులో గురగుర, ఆయాసం ఉంటాయి. అప్పుడప్పుడు జ్వరం కనపడుతుంది. క్రానిక్ బ్రోంఖైటీస్ ఉన్నవారిలో దగ్గినప్పుడు రక్తం పడే అవకాశం ఉంది.

**పరీక్షలు:** ఛాతి ఎక్స్‌రే, రక్త పరీక్షలు, లంగ్ కెపాసిటి పరీక్షలు.

**చికిత్స:**

1. క్రానిక్ బ్రోంఖైటీస్ రావడానికి ధూమపానం, పరిసరాల్లో దుమ్ము, ధూళి ఉండటం కారణమయితే వాటికి దూరంగా ఉండాలి. ముక్కు వ్యాధులు, గొంతు వ్యాధులు కారణమయితే వాటికి పూర్తి చికిత్స పొందాలి.

2. రోగిలో అనారోగ్య పరిస్థితి ఉన్నట్లయితే చక్కదిద్దాలి. మంచి ఆహారం తీసుకోవాలి. శారీరక వ్యాయామం చేయాలి. బ్రీతింగ్ ఎక్సర్‌సైజు ప్రాక్టీసు చేయాలి. దగ్గు మందులు వాడాలి. ఇన్‌ఫెక్షన్ ఉన్నట్లయితే యాంటీబయోటిక్ మందులు వాడాలి. అవసరం బట్టి కార్టిజోన్ మందులు వాడాలి.

❑❑❑

# 6. బ్రోంఖిఎక్టేసిస్

*ఊపిరితిత్తులలోని కొన్ని గాలి గొట్టాలు అతిగా సాగిపోయి అందులో తయారయ్యే ద్రవాలని బయటకు నెట్టలేని పరిస్థితిని బ్రోంఖిఎక్టేసిస్ అంటారు. ఇటువంటి పరిస్థితుల్లో ఇన్‌ఫెక్షను క్రానిక్‌గా ఉంటుంది.*

**కారణాలు:**

బ్రోంఖిఎక్టేసిస్ ఏర్పడిన ప్రతి కేసులోనూ స్పష్టమైన కారణం తెలుసుకోవడం కష్టం. సాధారణంగా పొంగు, కోరింత దగ్గు, న్యుమోనియా, టి.బి.క్రానిక్ బ్రోంఖిఎక్టేసిస్‌కి కారణాలు. గాలి గొట్టాలకి ఏ కారణం వల్లనైన అడ్డంకి ఏర్పడితే గొట్టాలు ఉబ్బిపోయి ఈ వ్యాధి కలుగుతుంది. ఇమ్యూన్ డిఫెషియన్సీ వ్యాధులలోనూ, సిస్టిక్ ఫైబ్రోసిస్‌లోనూ వ్యాధి కలగవచ్చు.

**లక్షణాలు:**

బ్రోంఖిఎక్టేసిస్ క్రానిక్ వ్యాధి. ఈ వ్యాధి ఉన్నవారిలో కళ్ళె ఎక్కువ మోతాదులో పడుతుంది. వాసన ఉంటుంది. శీతాకాలంలో ఈ వ్యాధి తీవ్రంగా ఉంటుంది. చాలా కాలం నుంచి ఈ వ్యాధి ఉన్నవాళ్ళలో చేతి గోళ్ళు ఉబ్బి కనబడతాయి. దీనినే క్లబ్బింగ్ ఆఫ్ ఫింగర్స్ అంటారు. బ్రోంకిఎక్టేసిస్ ఉన్నవారిలో దగ్గుతోపాటు రక్తం పడుతుంది.

**నిర్ధారణ:**

కళ్ళె పరీక్ష:- బ్రోంఖిఎక్టేసిస్ ఉన్నవాళ్ళలో క్షయ వ్యాధి ఉండటం ఎక్కువ. ఇతర బాక్టీరియా క్రిములు కూడా చేరతాయి. కళ్ళె పరీక్ష ద్వారా వాటిని తెలుసుకోవచ్చు.

ఛాతీ ఎక్సరే ద్వారా వ్యాధితో ఉబ్బిపోయిన శ్వాసనాళాలు కనపడతాయి.

బ్రోంఖోగ్రఫి, బ్రోంఖోస్కోపి ద్వారా కూడా వ్యాధిని తెలుసుకోవచ్చు.

**కాంప్లికేషన్లు:**

బ్రోంఖిఎక్టేసిస్ ఉన్నవారిలో తరచు న్యుమోనియా, లంగ్ యాబ్సస్, దగ్గుతో రక్తం పడటం ఉంటాయి.

ప్లూరసి, ప్లూరల్ ఎఫ్యూజన్ (ఊపిరితిత్తులలో నీరు) రావచ్చు. పెరికార్డైటిస్, సైన్‌సైటిస్, సెరిబ్రల్ యాబ్సస్ వంటి దుష్పరిణామాలు కలగవచ్చు.

**చికిత్స:**

1. పాస్చురల్ డ్రైనేజి: బ్రోంఖిఎక్టేసిస్‌లో ఎక్కువగా ఊపిరితిత్తుల దిగువ భాగాల్లోని గాలి గొట్టాలు వ్యాకోచిస్తాయి. అందులో కళ్ళె చేరిపోయి బయటికి రాకుండా ఇబ్బంది కలుగుతుంది. ముఖ్యంగా ఉదయం లేచేసరికి ఈ బాధ ఎక్కువవుతుంది. అలా చేరిపోయిన కళ్ళె బయటకి రావటానికి బెడ్ మీద పడుకొని తల, ఛాతి బెడ్ నుంచి క్రిందికి వంచి గట్టిగా దగ్గాలి. దానితో ఊపిరితిత్తులలోని కళ్ళె క్రిందికి వస్తుంది. కనీసం 15, 20

నిముషాలు అలా పడుకుని దగ్గాలి. ఇలా చేసేముందు దగ్గుమందు (ఎక్స్‌పెక్టోరెంట్) వాడితే మంచిది. దానివల్ల కళ్ళె తేలికగా బయటకు నెట్టబడుతుంది. అంతేకాకుండా బెడ్ మీద బోర్లా పడుకుని తల క్రిందికి వంచి పడుకుని ఉండగా ఛాతీ మీద గట్టిగా నొక్కి వదిలిపెడితే కూడా కళ్ళె బయటికి నెట్టబడుతుంది. దీనినే పాస్చురల్ డ్రైనేజి అంటారు. ఇలా ఉదయం 15 నిముషాలు, సాయంత్రం 15 నిముషాలు చేయాలి.

2. మందులు:- ఇన్‌ఫెక్షన్ ఉన్నప్పుడు యాంపిసిలిన్ 500మి.గ్రా. **లేదా** ఎమాక్సిసిలిన్ 500 మి.గ్రా. **లేదా** ఎరిత్రోమైసిన్ 500 మి.గ్రా. **లేదా** టెట్రామైసిన్ 500 మి.గ్రా. క్యాప్సుల్స్ ప్రతి 8 గంటలకి ఒకసారి చొప్పున 10,15 రోజులు వాడాలి. బ్రోంఖిఎక్టేసిస్‌తో టి.బి. ఉన్నట్టయితే పూర్తి కోర్సు మందు వాడాలి.

3. బ్రోంఖిఎక్టేసిస్ ఉన్నవారు పొగ త్రాగరాదు. ఆరోగ్యకరమైన పరిసరాల్లో నివసించాలి. పోషకాహారం తీసుకోవాలి. శ్వాసకోస వ్యాధులు ఏమి వచ్చినా చికిత్స పొందాలి.

సర్జరీ :మందులతో వ్యాధి తగ్గనప్పుడు, కొందరికి శస్త్ర చికిత్స అవసరం అవుతుంది.

❑❑❑

# 7. ఉబ్బసం

*ఉబ్బసాన్ని బ్రోంఖియల్ అస్త్మా అంటారు. ఉబ్బసంలో ఊపిరితిత్తులలోని చిన్న, పెద్ద శ్వాసనాళాలు మూసుకోవడం జరుగుతుంది. శ్వాసనాళాల లోపల పొరలు బాగా ఉబ్బుతాయి. వాటినుంచి నీరు ద్రవిస్తుంది. శ్వాసనాళాల గోడలకి సంబంధించిన మ్యూకస్ పొర జారి అడ్డుపడుతుంది. దీనివల్ల ఊపిరితిత్తులలోకి గాలి ప్రవేశించడం, బయటకు రావడం ఇబ్బంది అవుతుంది. ముఖ్యంగా ఊపిరితిత్తులలోకి జేరిన గాలి బయటకు రావటానికి ఎక్కువ సమయం పడుతుంది.*

కారణాలు:

ఉబ్బసం చిన్న పెద్ద తేడా లేకుండా ఎవరికైనా వస్తుంది. వంశంలో ఎవరికైనా ఉన్నా లేకపోయినా ఉబ్బసం వస్తుంది. తల్లిదండ్రులలో ఉబ్బసం ఉన్నట్లయితే పిల్లలకి రావడం ఎక్కువ.

ఎలర్జీ - కొన్ని పదార్థాలు సరిపడక పోవడం వల్ల ఊపిరితిత్తులలోని గొట్టాలు

వాచడం, ఉఛ్ఛ్వాస నిశ్వాసాలకి అడ్డంకి ఏర్పడడం జరుగుతుంది. ఈ ఎలర్జీ అనేది వంశపారపర్యంగా రావచ్చు లేకపోయినా రావచ్చు. ఎక్కువమంది ఉబ్బసం రోగుల్లో దేనికి ఎలర్జీ ఉందో తెలుసుకోవడం కష్టం. సాధారణంగా పూలపుప్పొడి, ఇంట్లో దుమ్ము, పక్షుల ఈకలు, పశువుల పేడ, మూత్రము, వార్నిష్‌లు, పెంపుడు జంతువుల వెంట్రుకలు కారణం.

**ఇన్‌ఫెక్షన్స్:**

వైరస్, బాక్టీరియా కూడా ఉబ్బసం రావడానికి కారణం అవుతాయి. 5 నుంచి 50 శాతం ఉబ్బసం కేసులలో ఇన్‌ఫెక్షన్ కారణం అవుతుంది. ధూమపానం కూడా ఉబ్బసంకు కారణం అవుతుంది. ముఖ్యంగా 2 సంవత్సరాల పిల్లల దగ్గర పెద్దవాళ్ళు స్మోకింగ్ చేస్తే పిల్లలకు ఉబ్బసం రావచ్చు.

**ఉబ్బసాన్ని పెంచే పరిస్థితులు:**

మానసికంగా యాంగ్జయిటీ, టెన్షన్‌కి లోనైతే ఉబ్బసం ఉన్నవారిలో ఒక్కసారిగా బయటపడుతుంది. ఉబ్బసం ఉండేవారు ఎక్కువ పరుగెట్టినా, వ్యాయామం చేసినా ఉబ్బసం బయటపడవచ్చు. అలాగే అతిగా నవ్వినా, దగ్గినా, ఏడ్చినా ఒక్కసారిగా ఉబ్బసం కనపడవచ్చు. వాతావరణం అకస్మాత్తుగా చల్లబడినా, వర్షం కురిసినా ఉబ్బసం రావచ్చు. బీటాబ్లాకర్స్ మందులు వాడే కొందరిలో ఉబ్బసం కనపడవచ్చు. ఉబ్బసం ఉండే కొందరిలో అది కనబడటానికి కొంత ముందు తుమ్ములు ప్రారంభమవుతాయి. ముక్కు దురద అనిపిస్తుంది. కడుపు ఉబ్బరం అనిపిస్తుంది. మగతగా అనిపించవచ్చు. మానసికంగా చిరాకు, కోపం వస్తాయి. పొడి దగ్గు వస్తుంది. గొంతులో ఏదో బాధ అనిపిస్తుంది.

**ఉబ్బసం ఎప్పుడు వస్తుంది:**

సాధారణంగా ఉబ్బసం రాత్రిపూట బయట పడుతుంది. నిద్ర పోతున్న వ్యక్తి ఆయాసంతో లేచి కూర్చుంటాడు. గాలి అందనట్లు ఫీలవుతాడు. చెమటలుపోస్తాయి. కాళ్ళు చేతులు చల్లగా అనిపిస్తాయి. పిల్లి కూతలాగా గురగుర అనిపిస్తుంది. కొందరికి కొద్దిసేపు బాధ అనిపించి నిదానంగా తగ్గిపోతే మరికొందరికి మందు వాడితేనే తగ్గుతుంది. ఉబ్బసం కనబడిన తరువాత కొద్ది నిముషాలలోనే తగ్గిపోవచ్చు **లేదా** గంటల తరబడి



ఉండిపోవచ్చు. స్టేటస్ ఆస్మాటికస్ పరిస్థితి ఏర్పడినవారికి రోజులు తరబడి ఉబ్బసం తీవ్ర రూపంలో ఉంటుంది.

**పరీక్షలు:** ఛాతి ఎక్స్‌రే, కళ్ళె పరీక్ష, రక్త పరీక్ష, స్కిన్ టెస్ట్స్, ఇమ్యునోగ్లోబిన్ - ఇ పరీక్ష

**చికిత్స:**

1. ఉబ్బసం పరిస్థితి బట్టి వివిధ రకాల మందులు వాడతారు. వాడే మందులను బ్రోంఖోడైలేటార్స్ అంటారు.
2. ఉబ్బసంలో స్పాజమ్ వచ్చి మూసుకుపోయినటువంటి శ్వాసనాళాలని స్పాజమ్‌ని పోగొట్టి వ్యాకోచింపచేస్తాయి. దానితో టైట్‌గా మారిన చెస్ట్ రిలాక్స్ అవుతుంది. గాలి తేలికగా తీసుకోబడుతుంది. లోపల తయారయిన తెమడ దగ్గుతో తేలికగా బయటకు వస్తుంది.

**ఉబ్బసం మందుల్లో రకాలు - చికిత్స**

1. బీటా ఎగోనిస్ట్స్

* సాల్‌బుటమాల్ 2-4 మి.గ్రా. టాబ్లెట్సు. ప్రతి 12 గంటలకు ఒకటి **లేదా** సాల్‌బుటమాల్ ఇంజక్షను నరానికి రోజుకి రెండుసార్లు ఇవ్వాలి. సాల్‌బుటమాల్ ఏరోసాల్స్ కూడా ఉన్నాయి.
* టెరుబుటలిన్ 5 మి.గ్రా. టాబ్లెట్స్ **లేదా** ఇంజక్షన్లు **లేదా** ఏరోసాల్ రోజుకి రెండుసార్లు ఇవ్వాలి.

2. యాంటికొలినర్జిక్ డ్రగ్స్

3. ఎమైనోఫిలిన్ 250 మి.గ్రా. టాబ్లెట్స్ 6 గం॥లకు ఒకసారి **లేదా** ఇదే మందు ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి.

4. థీయోఫిలిన్ 200 మి.గ్రా. టాబ్లెట్సు 6 గం॥లకు ఒకసారి ఇవ్వాలి **లేదా** థియోఫిలిన్ ఇంజక్షన్ 6 గం॥లకు ఒకసారి ఇవ్వాలి.

5. కార్టికో స్టిరాయిడ్స్: పై మందులకి గుణం కనపడనప్పుడు కార్టికో స్టిరాయిడ్స్ వాడతారు. ప్రెడ్నిసాలాన్ టాబ్లెట్స్ 10 మి.గ్రా. చొప్పున రోజుకి మూడుసార్లుగానీ, నాలుగుసార్లుగానీ వాడాలి. కార్టికోస్టిరాయిడ్స్ ఇన్‌హేలర్స్ కూడా ఉన్నాయి.

6. ఉబ్బసంతో పాటు ఇన్‌ఫెక్షన్ కూడా కలిసి ఉంటుంది. ఇటువంటప్పుడు యాంటీబయోటిక్ మందులు వాడాలి.

□□□

# 8. స్టాటస్ ఆస్త్మాటికస్

*కొందరికి ఉబ్బసం మామూలు మందులికి తగ్గకుండా రోజులు తరబడి తీవ్రంగా ఉంటుంది.*

చికిత్స:

1. ఉబ్బసం తగ్గేవరకు ముక్కు ద్వారా ఆక్సిజన్ పెట్టాలి.
2. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.
3. ఎలక్ట్రోలైట్స్ కూడా నరానికి పెట్టాలి.
4. ఎసిడోసిస్ తగ్గించడానికి సోడా బైకార్బ్ 80-100 యం.యల్ నరానికి ఇవ్వాలి.
5. హైడ్రోకార్టిజోన్ ఇంజక్షన్ 6 గం॥లకి ఒకసారి నరానికి ఇవ్వాలి.
6. ఎడ్రినలిన్ ఇంజక్షన్ 0.5 యం.యల్. చర్మం క్రిందికి ఇవ్వాలి. **లేదా** సాల్‌బుటమాల్ నరానికి ఇవ్వాలి. **లేదా** యమైనోఫిలిన్ 1 **లేదా** 2 యాంపిల్స్ గ్లూకోజ్‌లో కలిపి నిదానంగా నరానికి ఎక్కించాలి.
7. ఇన్‌ఫెక్షన్‌ని కంట్రోల్ చేయడానికి యాంటిబయోటిక్ మందులు వాడాలి.
8. రోగి ఎక్కువ ఆందోళన చెందుతూంటే కాంపోజ్ ఇంజక్షను ఇవ్వాలి.

❑❑❑

# 9. క్రానిక్ ఆస్త్మా

*కొందరికి ఉబ్బసం రోజూ గానీ తరచూ గానీ కనపడుతుంది.*

చికిత్స:

1. ఉబ్బసానికి ఫలాన కారణం అని తెలిస్తే దానిని తొలగించాలి.
2. హైపో సెన్సిటైజేషన్ - ఉబ్బసానికి కారణమైన ఎలర్జీని తెలుసుకుని దాని ప్రభావం లేకుండా చేయడానికి కోర్సుగా యాంటిఎలర్జిన్స్ ఇంజక్షన్లు ఇచ్చినట్లయితే కొందరిలో ఉబ్బసం తగ్గుతుంది.
3. ఏరోసాల్స్ - సాల్‌బుటమాల్ లేదా బెక్లోమెథాసోన్ ఏరోసాల్స్ రెగ్యులర్‌గా వాడినట్లయితే ఉబ్బసం కంట్రోల్‌లో ఉంటుంది.
4. కీటోటెఫిన్ 1 మి.గ్రా. బిళ్ళలు రోజు 2 సార్లు వాడాలి.

5. సాల్‌బుటమాల్ **లేదా** థియోఫిలిన్ బిళ్ళలు ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి వాడాలి. రెగ్యులర్‌గా బ్రీథింగ్ ఎక్సర్‌సైజ్ చేయాలి.
6. ఆందోళన కంగారు లేకుండా ఉండాలి.
7. కొందరు కార్టికోస్టిరాయిడ్స్ వాడితే తప్ప ఉబ్బసం తగ్గదు. ఇటువంటివారు లాంగ్ యాక్టింగ్ కార్టికో స్టిరాయిడ్ టాబ్లెట్స్ కానీ, ఇంజక్షన్ కానీ వాడాలి.
8. స్మోకింగ్ పూర్తిగా మానేయాలి.

□□□

# 10. ఎంఫసీమా

*ఊపిరితిత్తులు మామూలుకన్నా సైజు పెరగడాన్ని ఎంఫసీమా అంటారు. ఇలా సైజు పెరగడానికి గాలి గొట్టాల కొసలలో అనేకం చిన్న చిన్న గాలి గదులుంటాయి. మనం పీల్చిన గాలి ఈ గాలి గదుల్లోకి చేరి రక్తంలోకి ప్రాణవాయువుగా రూపాంతరం చెందుతుంది. గాలి గదులు పరిమితికి మించి విపరీతంగా ఉబ్బిపోవడం ఒక విధమైన వ్యాధి. దీనివల్ల అనేక బాధలు కలుగుతాయి. ఇలా ఊపిరితిత్తుల గాలి గదులు విపరీతంగా వ్యాకోచించే పరిస్థితినే 'ఎంఫసీమా' అంటారు.*

**ఎంఫసీమాలో రకాలు:**

1. గాలి గొట్టాలలో అడ్డంకి ఏర్పడటం వల్ల కలిగిన ఎంఫసీమా.
2. గాలి గొట్టాలలో అడ్డంకి ఏర్పడకుండా ఏర్పడిన ఎంఫసీమా.

ఎంఫసీమా ఏర్పడినప్పుడు ఆ పరిస్థితిని కొన్నింటిలో తిరిగి నయం చేయవచ్చు. మరికొన్నింటిలో నయం చేయటం కుదరదు.

**లక్షణాలు:** ఆయాసం, దగ్గు, ఛాతి టైట్‌నెస్

**నిర్ధారణ:** ఛాతి ఎక్స్‌రే, గ్యాస్ ట్రాన్స్ఫర్ మెంట్.

**కాంప్లికేషన్స్:** రెస్పిరేటరీ ఫెయిల్యూర్, హార్ట్ ఫెయిల్యూర్, ఇన్‌ఫెక్షన్, న్యూమోథెరక్స్

**చికిత్స:**

1. బ్రోంఖోడైలాటార్ మందులు
2. శస్త్ర చికిత్స

□□□

# 11. న్యుమోనియా

న్యుమోనియా వ్యాధిలో ఊపిరితిత్తులలోని టిష్యూలు ఉబ్బి నీరు పట్టినట్లు అవుతాయి.

న్యుమోనియా వ్యాధి అంతకుముందు ఎటువంటి శ్వాసకోశ వ్యాధులు లేకుండా అకస్మాత్తుగా ఇన్‌ఫెక్షన్ వల్ల రావచ్చు. లేదా ఊపిరితిత్తులలో క్రానిక్‌గా ఏదైన వ్యాధి ఉండి రావచ్చు, లంగ్స్‌లో ఫైబ్రోసిస్, బ్రోంఖిఎక్టైసిస్, కేన్సర్, టి.బి.ఉన్నవారిలో న్యుమోనియా కూడా రావచ్చు, ఫ్లూ జ్వరం వల్ల కూడా న్యుమోనియా రావచ్చు, పొలమారి కడుపులోని ఆహారం గొంతులోకి వచ్చి ఆ పైన ఊపిరితిత్తులలోకి పోతే న్యుమోనియా రావచ్చు, బాక్టీరియల్, వైరల్, ప్రోటోజోవల్, ఫంగస్ ఇన్‌ఫెక్షన్స్ న్యుమోనియాని కలగజేస్తాయి.

## బాక్టీరియల్ న్యుమోనియా:

బాక్టీరియా క్రిములు వల్ల కలిగే న్యుమోనియా ఏ వయస్సువారికైనా రావచ్చు. చిన్న పిల్లల్లో,వృద్ధులలో, బలహీనంగా ఉన్నవారిలో బాక్టీరియల్ న్యుమోనియా రావడం ఎక్కువ. దీర్ఘకాలంగా ఉబ్బసం, బ్రోంకైటీస్ ఉన్నవారిలో న్యుమోనియా రావడం ఉంటుంది. మద్యం సేవించే వారిలో కూడా న్యుమోనియా రావడం ఎక్కువ.

## లక్షణాలు:

బాక్టీరియల్ న్యుమోనియా వ్యాధి సాధారణంగా అకస్మాత్తుగా వస్తుంది. న్యుమోనియా వచ్చినప్పుడు జ్వరం వస్తుంది. చలి, వణుకు ఉంటాయి. వాంతులు అవుతాయి. రోగి చాలా బలహీనంగా కనపడతాడు. ఆయాసం, దగ్గు, కళ్ళె ఉంటాయి. కళ్ళె తుప్పు రంగులో ఉంటుంది. ఛాతీలో నొప్పి ఉంటుంది. దగ్గినా, తుమ్మినా, నిండుగా గాలి పీల్చినా నొప్పి ఎక్కువ అవుతుంది.

న్యుమోనియా వచ్చిన రోగిలో నాడి ఎక్కువసార్లు కొట్టుకుంటుంది. ఊపిరి ఎక్కువసార్లు తీసుకోవడం ఉంటుంది.

**నిర్ధారణ:** రక్త పరీక్షలు, ఛాతి ఎక్స్‌రే , బ్లడ్ గ్యాస్ ఎస్టిమేషన్, కళ్ళె పరీక్ష , బ్లడ్ కల్చర్, కళ్ళె కల్చర్.

**కాంప్లికేషన్లు:**

లంగ్ యాబ్సిస్ , ప్లూరసి, ప్లూరల్ ఎఫ్యూజన్ (ఊపిరితిత్తులలో నీరు), ఎంఫసీమా, మయోకార్డైటీస్, జాండీస్, సెప్టిసీమియా.

కొందరిలో తరచుగా న్యుమోనియా వస్తుంది. వీరిలో ఊపిరితిత్తులలోని గాలి గొట్టాలలో ఏదైనా అడ్డంకి ఉండడం ఒక ప్రధాన కారణం.

**చికిత్స:**

1. యాంపిసిలిన్ **లేదా** ఎమాక్సిలిన్ **లేదా** సెఫలెక్సిన్ 250 నుంచి 500 మి.గ్రా. క్యాప్సుల్స్ గానీ ఇంజక్షన్ గానీ ప్రతి 8 గంటలకు ఇవ్వాలి **లేదా** జెంటామైసిన్ ఇంజక్షన్ ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి ఇవ్వాలి **లేదా** సెఫటాక్సిమిన్ ఒక గ్రాము ఇంజక్షన్లు ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి ఇవ్వాలి. ఈ మందులు న్యుమోనియా పూర్తిగా తగ్గేవరకు వాడాలి. న్యుమోనియా వచ్చినప్పుడు బ్లడ్ కల్చర్, కళ్ళె కల్చర్ చేసి దాని ప్రకారం మందులు పూర్తి కోర్సు వాడాలి.
2. న్యుమోనియా వచ్చిన వ్యక్తికి పూర్తి విశ్రాంతి ఇవ్వాలి. చల్లగాలి, వర్షపుగాలి తగలకుండా వెచ్చగా ఉండే ఆరోగ్యకరమైన గదిలో ఉంచాలి. తేలికగా అరిగే ఆహారం తినిపించాలి. ఛాతిలో నొప్పికి, దగ్గుకి ఉపశాంతిగా మందులు వాడాలి.
3. ఆయాసం ఉంటే ఆక్సిజన్ పెట్టాలి.
4. జ్వరం ఉంటే పెరాసెటిమాల్ వాడాలి.
5. కొందరిలో న్యుమోనియా వల్ల కార్డియాక్ ఫెయిల్యూర్, పెరిఫెరల్ సర్క్యులేటరీ ఫెయిల్యూర్ రావచ్చు. దానికి వెంటనే చికిత్స చేయాలి.
6. వైరల్ న్యుమోనియాలో కూడా పై విధంగానే చికిత్స చేయాలి. వైరల్ న్యుమోనియా వచ్చిన వారిలో కళ్ళె కల్చర్, బ్లడ్ కల్చర్ నెగిటీవ్ వస్తాయి. బాక్టీరియల్ న్యుమోనియా వచ్చిన వారిలోలాగా తెల్లకణాల సంఖ్య పెరగడం ఉండదు. వైరస్‌కి సరైన మందులు లేవు కనుక రోగి విషయంలో జాగ్రత్తగా ఉండాలి.

❑❑❑

# 12 . లంగ్ యాబ్సస్

*బ్యాక్టీరియా క్రిముల వల్ల ఊపిరితిత్తులలో కొంత మేర టిష్యు కుళ్ళిపోయి పుండుగా పడడం, గుంటగా మారడం లంగ్ యాబ్సస్‌లో ఉంటుంది.*

**కారణాలు:**

లంగ్ యాబ్సస్‌కి సంబంధించిన క్రిములు గొంతులో నుండి శ్వాసకోశాలలో చేరవచ్చు. లేదా శ్వాసకోశాలలోనే వ్యాధి కలగవచ్చు. క్షయ, న్యుమోనియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్ వల్ల లంగ్ యాబ్సస్ రావచ్చు. కేన్సర్ వల్ల కూడా లంగ్ యాబ్సస్ రావచ్చు.

**లక్షణాలు:**

అకస్మాత్తుగా జ్వరం వస్తుంది. ఛాతిలో నొప్పి ఉంటుంది. దగ్గినప్పుడు ఎక్కువ మోతాదులో కళ్ళె పడుతుంది. రోగి దగ్గినా, మాట్లాడినా దుర్వాసన వెలువడుతుంది. కొందరికి దగ్గుతో పాటు రక్తం పడుతుంది. రోగిలో వ్యాధి తీవ్రతకి సంబంధించిన లక్షణాలు కనబడతాయి.

లంగ్ యాబ్సస్ ప్రారంభంలో ఛాతిలో కొద్దిపాటినొప్పి ఉంటుంది. ఆ తరువాత ఎక్కువ మోతాదులో కళ్ళె పడటం ఉంటుంది. లంగ్ యాబ్సస్ ఎక్కువ రోజుల పాటు ఉన్నవారిలో గోళ్ళు ఉబ్బుగా కనపడతాయి. (క్లబ్బింగ్ ఆఫ్ ఫింగర్స్)

**కాంప్లికేషన్లు :** దగ్గుతో పాటు అతిగా రక్తం పడడం, సెరిబ్రల్ యాబ్సస్ (మెదడులో చీము గడ్డలు) ఊపిరితిత్తులు పై పొరల్లోకి పుండు పగిలి చీము చేరడం.

**నిర్ధారణ:** ఛాతి ఎక్స్‌రే , కళ్ళె పరీక్ష, రక్త పరీక్ష , బ్రోంఖోస్కోపి.

**చికిత్స:**

1. పూర్తి విశ్రాంతి
2. పౌష్టికాహారం
3. రక్తహీనత ఉంటే రక్తం ఎక్కించడం
4. బ్రీథింగ్ ఎక్సర్‌సైజెస్
5. పాస్చ్యురల్ డ్రైనేజి
6. యాంపిసిలిన్ క్లోక్సాసిలిన్ 500 మి.గ్రా. ఇంజక్షన్ గానీ, క్యాప్సుల్స్ కానీ ప్రతి ఆరు గంటలకి ఒకసారి ఇవ్వాలి.
7. 3 -4 వారాలు మందులు వాడినా ఏ మాత్రం ఫలితం కనపడని వారిలో శస్త్ర చికిత్స అవసరమౌతుంది.

❑❑❑

# 13. క్షయ (టి.బి)

క్షయ వ్యాధి శరీరంలో ఏ భాగానికైనా రావచ్చు. మైకోబ్యాక్టీరియమ్ ట్యూబర్క్యులోసిస్ అనే బ్యాక్టీరియా క్రిమి వల్ల క్షయ వ్యాధి వస్తుంది. క్షయ వ్యాధినే టి.బి. అని కూడా అంటారు. ట్యూబర్క్యులోసిస్ బ్యాక్టీరియా ఈ వ్యాధి రావడం వల్ల టి.బి. అంటారు. ఊపిరితిత్తులకి టి.బి. వచ్చినప్పుడు పల్మోనరీ ట్యూబర్క్యులోసిస్ అంటారు.

* పల్మనరి ట్యూబర్క్యులోసిస్

**కారణాలు:**

మైకో బ్యాక్టీరియమ్ ట్యూబర్క్యులోసిస్ క్రిమి అందరిలోనూ కాకుండా కొందరిలోనే ఈ వ్యాధిని కలగచేస్తుంది. దానికి ప్రధానంగా పరిసరాల అపరిశుభ్రత, అనారోగ్యం.

మురికివాడలలో నివసించేవారిలోనూ, దుమ్ము, ధూళి ఎక్కువ ఉండే ప్రాంతాలలో నివసించేవారిలోనూ, పౌష్టికాహారం లోపం ఉన్నవారిలోనూ, మద్యం సేవించే వారిలోనూ, మత్తు పదార్థాలకి అలవాటుపడినవారిలోనూ, చుట్ట, బీడి సిగరెట్టు త్రాగేవారిలోనూ పల్మనరీ ట్యూబర్క్యులోసిస్ రావడం ఎక్కువ.

కోరింత దగ్గు, ఫ్లూ జ్వరాలు వచ్చి నీరసపడిన వారిలో క్షయ వ్యాధి రావడం ఎక్కువ. మధుమేహం, సిర్రోసిస్ లివర్, ఊపిరితిత్తుల వ్యాధులు ఉన్నవారిలో క్షయ వ్యాధి రావడం ఎక్కువ.

ఎయిడ్స్ వంటి ఇమ్యునో డెఫిషన్సీ వ్యాధులలో టి.బి. ఎక్కువగా వస్తుంది.

**వ్యాధి కలిగే తీరు:**

క్షయ రోగి ఉమ్మిన కళ్ళెలోని క్రిములు దుమ్ములో కలసిపోయి ఆ తరువాత గాలితోపాటు లేచి మరొకరికి సంక్రమిస్తాయి. పీల్చిన గాలి ద్వారా శ్వాస కోశాల్లోకి చేరిన టి.బి. క్రిములు పల్మనరీ ట్యూబర్క్యులోసిస్ కలగచేస్తాయి.

* ప్రైమరీ పల్మనరీ ట్యూబర్క్యులోసిస్:

దీనినే ప్రైమరీ కాంప్లెక్స్ అంటారు. ఇది చిన్నపిల్లల్లో ఎక్కువ. మొదటిసారిగా గాలి ద్వారా శ్వాసకోశాలలోకి చేరిన క్రిములు ఊపిరితిత్తుల్లో కొంత వ్యాధిని కలగచేసి ఆ పైన నిరాటంకంగా చంకల్లోనూ. మెడల్లోనూ ఉన్న లింపు గ్లాండ్స్కి చేరుతాయి. దానివల్ల ఆ గ్లాండ్స్ వస్తాయి. సాధారణంగా మొదటిసారిగా చేరిన ఈ వ్యాధి క్రిములు శరీరంలో రోగ

నిరోధకకణాలని పెంపొందింపచేస్తాయి. అధికసంఖ్యాకుల్లో ఈ వ్యాధి త్వరగా తగ్గిపోతుంది. కొందరిలోనే పూర్తి టి.బి. వ్యాధిగా బహిర్గతమవుతుంది.

రోగ నిరోధక శక్తి లేనివారిలోనూ, బలహీనంగా ఉన్నవారిలోనూ, మళ్ళీ మళ్ళీ ఈ క్రిములు శ్వాసకోశాలలో చేరినప్పుడు సాధారణంగా ఈ క్రిములు శ్వాసకోశాలకే పరిమితం అవుతాయి. అక్కడే ఉండిపోయి లంగ్స్ టి.బి.గా లక్షణాలు కలగచేస్తాయి.

**లక్షణాలు:**

రోగి త్వరగా అలసిపోవడం ఉంటుంది. ఆకలి తగ్గిపోతుంది. బరువు కోల్పోతాడు. సాయంత్రం పూట జ్వరం వస్తుంది. దగ్గు ఉంటుంది. కొందరిలో దగ్గుతోపాటు కళ్ళె మరికొందరిలో రక్తం పడుతుంది. ఆయాసం ఉంటుంది. రాత్రిపూట చెమటలు ఎక్కువగా పోస్తాయి.

నిర్ధారణ : మాంటో టెస్ట్ పాజిటివ్ వస్తుంది, ఛాతి ఎక్స్‌రే, కళ్ళె పరీక్ష, కళ్ళెలో టి.బి. క్రిములు కనబడతాయి. రక్త పరీక్షలు, బ్రోంఖోస్కోపి.

**కాంప్లికేషన్స్** : ప్లూరసి, ప్లూరల్ ఎఫ్యూజన్ (ఊపిరితిత్తులలో నీరు),ఎంపచీమా (ఊపితిత్తుల పై పొరలలో చీము), న్యూమోథొరాక్స్ , మెనింజైటీస్.

**చికిత్స:**

1. రోగి పరిస్థితి మెరుగుపడేవరకు విశ్రాంతి తీసుకోవాలి. మంచి ఆహారం తీసుకోవాలి. **మందులు:-** సాధారణంగా మందులు ప్రారంభించిన కొద్ది వారాలలో రోగి పూర్తిగా కోలుకుంటాడు. కానీ మందులు కనీసం పది మాసాలు లేదా ఇంకా ఎక్కువ కాలం వాడాలి.
2. మొదటి రెండు మాసాలు రిఫాంపిసిన్, ఇసోనియాజైడ్, పైరాజెనమైడ్, ఇథమ్‌బుటాల్ మందులు వాడాలి. ఇథమ్‌బుటాల్ బదులుగా స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్ కూడా వాడవచ్చు.
   తరువాత ఆరు నుంచి ఎనిమిది మాసాలు రిఫాంపిసిన్ మరియు ఐసోనియాజైడ్ వాడాలి.
3. **మందుమోతాదు** :- రిఫాంపిసిన్ : 50కే.జి.లుమించి బరువుఉన్నవారు 600 మి.గ్రా. క్యాప్సూల్‌ను రోజూ ఉదయం పూట పరగడుపున వేసుకోవాలి. ఈ మందు వేసుకున్న గంట గడిచేవరకు ఏదీ తినకూడదు.50 కే.జి.ల కంటే బరువు తక్కువ ఉన్నవారు రిఫాంపిసిన్ 450 మి.గ్రా. వేసుకోవాలి.

రిఫాంపిసిన్ మందుతోపాటు ఐసోనియాజైడ్ కలిపి తీసుకోవచ్చు. ఈ రెండు మందులు కలిపి ఉన్న బిళ్ళలు, క్యాప్సుల్స్ ఉంటాయి. ఈ మందుని రోజూ ఉదయం ఒకటి చొప్పున కనీసం పది నెలలు వాడాలి.

4. ఐసోనియాజైడ్ రోజుకి 300 మి.గ్రా. వేసుకోవాలి. ఈ మందు వేరే బిళ్ళగాను వేసుకోవచ్చు **లేదా** రిఫాంపిసిన్‌తో కలిపి తయారుచేసిన మందుగా వేసుకోవచ్చు.
5. ఇథమ్‌బుటాల్ వ్యాధి అదుపులోకి వచ్చేవరకు ఒక కే.జి. బాడీ వెయిట్‌కి రోజుకి 25 మి.గ్రా. చొప్పున తీసుకోవాలి. వ్యాధి అదుపులోకి వచ్చిన తరువాత ఒక కే.జి. బాడీ వెయిట్‌కి రోజుకి 15 మి.గ్రా. చొప్పున తీసుకోవాలి. సాధారణంగా 50 కి.గ్రా. కంటే బరువు ఉన్నట్లయితే రోజుకి 1200-1400 మి.గ్రా. ఇథమ్‌బుటాల్ తీసుకోవలసి ఉంటుంది. వ్యాధి అదుపులోకి వచ్చిన తరువాత 800 మి.గ్రా. సరిపోతుంది.
6. స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్ 40 సంవత్సరాల వయస్సులోపు వారికి 1.40 గ్రా. సంవత్సరాల పైబడిన వారికి 0.75 గ్రా. వాడాలి.
7 .పైరజెనమైడ్ టాబ్లెట్లు 50 కేజీల పైన ఉన్నవారికి రోజుకి రెండు గ్రాములు, 50 కేజీల కన్నా తక్కువ ఉన్నవారికి రోజుకి 1.5 గ్రా. వాడాలి.
8. సాధారణంగా పై మందులతో వ్యాధి తగ్గిపోతుంది. కొన్ని సందర్భాలలో కార్టికోస్టిరాయిడ్స్ వాడవలసి వస్తాయి.

**కార్టికోస్టిరాయిడ్స్ ఎందులో అవసరం?**

ట్యూబర్‌క్యులోసిస్ న్యుమోనియా , మిలియరీ ట్యూబర్‌క్యులోసిస్, వైడ్ స్ప్రెడ్ ఇన్‌ఫిల్ట్రేషన్ , ప్లూరసి, పెరికార్డియల్, పెరిటోనియల్ ఎఫ్యూజన్ , టి.బి. మెనింజైటీస్.

❑❑❑

# 14. పల్‌మనరీ ఈసినోఫిలియా

పల్‌మనరీ ఈస్నోఫిలియాలో ఊపిరితిత్తులు వ్యాధిగ్రస్తమవుతాయి. ఛాతి ఎక్స్‌రేలో మచ్చలు మచ్చలుగా స్పష్టంగా తెలుస్తాయి. రక్తంలో ఈస్నోఫిలియా సంఖ్య విపరీతంగా పెరుగుతుంది.ఫైలేరియా క్రిములు, కడుపులో పాములు, శ్వాసకోశాలలో ఫంగస్ వల్ల వ్యాధులు, కొన్నిరకాల మందులు, ఈస్నోఫిలియాని కలగచేస్తాయి.

**లక్షణాలు:**

కొందరిలో వ్యాధి లక్షణాలు నిదానంగా కనపడితే మరికొందరిలో అకస్మాత్తుగా

బయటపడతాయి. అకస్మాత్తుగా వ్యాధి లక్షణాలు కనబడిన వారిలో దగ్గు, ఆయాసంతోపాటు జ్వరం, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు ఉంటాయి.

ఈస్నోఫిలియాలో దగ్గు ప్రధాన లక్షణం - సాధారణంగా పొడి దగ్గు అవుతుంది. రాత్రిపూట ఎక్కువగా ఉంటుంది. పగలంతా దగ్గు లేకుండా అర్ధరాత్రి కానీ తెల్లవారుఝామున కానీ దగ్గు తీవ్రంగా ఉండొచ్చు. కొందరిలో దగ్గుతో పాటు కళ్ళె కూడా పడుతుంది.

ఉబ్బసంలో వలె ఆయాసం ఉంటుంది. గాలి పీల్చుటకంటే బయటికి వదల డానికి ఎక్కువ సమయం తీసుకుంటుంది.ఈస్నోఫిలియా ఉన్నవారిలో ఆకలి తగ్గుతుంది. ఆహారం సరిగ్గా తీసుకోకపోవటంతో బరువు కోల్పోతారు. నీరసం, అలసట ఉంటాయి. ఛాతిలో నొప్పి ఉంటుంది. కడుపులో వికారం ఉంటుంది.

నిర్ధారణ: రక్తంలో తెల్లకణాలు 20,000 - 50,000/ సి.సి. ఉంటాయి.

ఈస్నోఫిల్స్ 20-90% ఉంటాయి .ఎక్స్‌రే.

చికిత్స:

1. హెట్రాజన్ 100 మి.గ్రా. టాబ్లెట్లు ఉదయం - ఒకటి, మధ్యాహ్నం-ఒకటి, రాత్రి-ఒకటి చొప్పున నెలరోజులు వాడాలి.
2. నెల రోజుల విరామం ఇచ్చి మరొక నెల రోజులు వాడాలి.
3. అవసరం బట్టి కార్టికోస్టిరాయిడ్స్ వాడాలి.
4. కడుపులో పాములు ఉంటే పడిపోవటానికి మందులు వాడాలి.

❑❑❑

# 15. లంగ్ కేన్సర్

*లంగ్ కేన్సర్ ధూమపానం చేసేవారిలో రావడం ఎక్కువ. స్త్రీలలో కంటే పురుషులలో లంగ్ కేన్సర్ కేసులు నాలుగు రెట్లు ఎక్కువ. సాధారణంగా లంగ్ కేన్సర్ 40-50 సంవత్సరాల వయసు దాటిన వారిలో కనపడుతుంది.*

లక్షణాలు: లంగ్ కేన్సర్ వచ్చినవారు త్వరగా బరువు కోల్పోతారు. ఆకలి తగ్గిపోతుంది. నీరసంగా ఉంటారు. కొద్దిపాటి జ్వరం ఉంటుంది. లంగ్ కేన్సర్‌లో దగ్గు ఉంటుంది.

దగ్గుతో పాటు రక్తం పడడం ఎక్కువ. ఆయాసం ఉంటుంది. గొంతులో గురగుర ఉంటుంది. ఛాతిలో నొప్పి ఉంటుంది.

లంగ్‌కేన్సర్ ఉన్న వారిలో నరాల మీద ఒత్తిడి ఏర్పడుతుంది. అన్నవాహిక నొక్కివేయబడి ముద్ద మింగుడుపడడం కష్టం అవుతుంది. రక్త నాళాలు నొక్కుకుపోతాయి. లంగ్ కేన్సర్‌కు సంబంధించిన సెకండరీస్ ప్రక్కటెముకలలోనూ లివర్, జీర్ణాశయములలోనూ పెంపొందుతాయి.

అంతేకాకుండా శరీరంలోని ఇతర అవయవాలలో కూడా సెకండరీస్ డెవలప్ అయి అక్కడ కూడా కేన్సర్ కలుగుతుంది.

**నిర్ధారణ:** ఛాతి ఎక్సరే, బ్రోంఖోస్కోపి, కళ్లె పరీక్ష , లంగ్ స్కానింగ్ , లంగ్ బయాప్సి.

**చికిత్స:**

1. రేడియో థెరపి.
2. కీమో థెరపి.
3. శస్త్ర చికిత్స.

❑❑❑

# 16. నీరు పట్టిన ఊపిరితిత్తి (పల్మొనరీ ఎడిమా)

*కొన్ని పరిస్థితుల్లో ఊపిరితిత్తులలోని కణాల మధ్య నీరు చేరుతుంది. దానివల్ల ఊపిరితిత్తులు సక్రమంగా పనిచేయకుండా అవుతాయి. ఇలా నీరు పట్టిన ఊపిరితిత్తుల పరిస్థితిని పల్మొనరీ ఎడిమా అంటారు.*

**కారణాలు:**

సాధారణంగా గుండె పోటు, గుండె జబ్బుల వల్ల పల్మొనరీ ఎడిమా తలెత్తుతుంది. ఎడమవైపు గుండె పెరగడం, మైట్రల్ కవాటాలు సన్నబడటం, హార్ట్ ఎటాక్ రావడం, ఊపిరితిత్తులలో రక్త ప్రసరణ ఆగిపోవడం వంటి పరిస్థితుల్లో ఊపిరితిత్తులలో నీరు చేరుతుంది. నరానికి అధికంగా సెలైన్ ఎక్కించినా, నీళ్ళల్లో మునిగినా, తలకి గట్టిగా దెబ్బతగిలినా, షాక్ పరిస్థితి ఏర్పడినా, న్యుమోనియా, సెప్టిసీమియా కలిగినా, విషవాయువులు పీల్చినా, యురేమియా వచ్చినా, కొన్ని మందులు వికటించినా పల్మొనరీ ఎడిమా వస్తుంది.

**లక్షణాలు:**

పల్మొనరీ ఎడిమా అకస్మాత్తుగా ఏర్పడుతుంది. ఛాతి నొక్కివేయబడినట్లుగా అనిపిస్తుంది. తీవ్రంగా ఆయాసం ఉంటుంది. దగ్గుతో పాటు నీరులాగా తెమడ పడుతుంది. విడవకుండా దగ్గు, దగ్గిన తరువాత తెమడని ఉమ్మడం ఇందులో ప్రధాన లక్షణం. చెమటలు విపరీతంగా పోస్తాయి. నాడి చాలా బలహీనంగా ఉంటుంది. ఒళ్ళు చల్లగా తయారవుతుంది. రోగి పరిస్థితి విషమంగా మారుతుంది. రక్తపోటు పడిపోతుంది.

**నిర్ధారణ :** ఛాతి ఎక్సరే. రోగిలో కనబడే లక్షణాలు.

**చికిత్స:**

1. హార్ట్ ఫెయిల్యూర్‌కి చికిత్స చేయాలి.
2. ఆక్సిజన్ పెట్టాలి.
3. గొంతులో అడ్డం పడే తెమడని తొలగించాలి.
4. నరానికి లాసిక్స్ ఇంజక్షన్ ఇవ్వాలి.
5. హైడ్రో కార్టిజోన్ ఎక్కువ మోతాదులో ఇవ్వాలి.
6. బి.పి. నార్మల్‌గా రావడానికి డోపమిన్ డ్రిప్ పెట్టాలి.
7. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.
8. పల్మొనరీ ఎడిమా రావడానికి మూలకారణం తెలిస్తే దానికి చికిత్స చేయాలి.

❑❑❑

## 17. ఊపిరితిత్తులకి ఫంగల్ ఇన్‌ఫెక్షన్

*ఊపిరితిత్తుల్లోకి ఫంగస్ ప్రవేశించడంతో అక్కడ ఇన్‌ఫెక్షన్ ఏర్పడుతుంది. గాలి పీల్చడం ద్వారానే కాకుండా రక్తం ద్వారా కూడా ఫంగస్ లంగ్స్‌కి చేరుతుంది. లంగ్స్‌కి ఫంగస్ ఇన్‌ఫెక్షన్ నాలుగు రకాల ఫంగస్ ద్వారా కలుగుతుంది.*

*యాక్టినోమైసెట్స్ ఫంగస్ ద్వారా యాక్టినోమైకోసిస్, నొకార్డియోసిస్ అనే వ్యాధులు వస్తాయి. ఈస్ట్ లేదా ఈస్ట్లు వంటి ఫంగస్ ద్వారా మొనిలియాసిస్, టోరులోసిస్ అనే వ్యాధులు కలుగుతాయి, ఫిల్‌మెంటస్ ఫంగస్ ద్వారా యాస్పిర్ జిలోసిస్, ఫైకోమైకోసిస్ అనే వ్యాధులు కలుగుతాయి. డైమార్ఫిక్ ఫంగస్ ద్వారా హిస్టోప్లాస్మోసిస్, కోకిడైడోమైకోసిస్, బ్లాస్టోమైకోసిస్, స్పోరోట్రైకోసిస్ అనే వ్యాధులు కలుగుతాయి.*

**ఫంగస్ వ్యాధి రావడానికి కారణాలు:**

అనారోగ్యం, పౌష్టికాహారలోపం, మధుమేహం, కేన్సర్, లింఫోమా, ఎయిడ్స్ ,

టెట్రాసైకిలిన్స్, కార్టికోస్టిరాయిడ్స్ అధికంగా వాడడం, బ్లడ్ కేన్సర్ మందులు అధికంగా వాడడం, ఇమ్యునో సప్రెస్సివ్ డ్రగ్స్.

**లక్షణాలు:** దగ్గు, జ్వరం, కళ్ళె, నీరసం.

**నిర్ధారణ:** ఛాతి ఎక్స్‌రే. కళ్ళె పరీక్ష.

**చికిత్స:**

1. యాక్టినోమైసిడ్స్ ద్వారా కలిగే ఫంగస్ వ్యాధులకు బెంజైల్ పెన్సిలిన్ 2 మెగా యూనిట్స్ 8 గం॥లకు ఒకసారి చొప్పున ఆరు వారాలు వాడాలి. స్ట్రెప్టోమైసిన్ **లేదా** టెట్రాసైకిలిన్ **లేదా** సల్ఫనోమైడ్ మందులు బెంజైన్ పెన్సిలిన్‌తో కలిపి వాడాలి.

2. ఈస్ట్ **లేదా** స్ప్లు వంటి ఫంగస్ ద్వారా వచ్చే వ్యాధులకు నిస్టాటిన్ లేదా యాంఫోటెర్షియన్ - బి మందులు వాడాలి.

3. ఫిలమెంటస్ ఫంగస్ ద్వారా వచ్చే వ్యాధులకు నిస్టాటిన్, యాంఫోటెర్షియన్-బి మందులు వాడాలి. డైమార్ఫిక్ ఫంగస్ ద్వారా వచ్చే వ్యాధులకు యాంఫోటెర్షియన్-బి పొటాషియమ్ హైడ్రేడ్ వాడాలి.

❑❑❑

# 18. పల్‌మొనరి ఫైబ్రోసిస్

*ఈ వ్యాధిలో ఊపిరితిత్తులలోని సున్నితమైన గాలి గొట్టాలు, గాలి బుడగలు దళసరిగా మారతాయి. దానివల్ల ఉచ్ఛ్వాస నిశ్వాస సమయాల్లో ఈ సున్నితమైన గాలి గొట్టాలు వ్యాకోచ సంకోచాలు తగినంత లేకుండా అవుతాయి. దానివల్ల ఊపిరితిత్తులు తగినంత గాలి నింపుకోవడం తగ్గిపోతుంది. ఇటువంటి పరిస్థితినే లంగ్ ఫైబ్రోసిస్ లేదా పల్‌మొనరీ ఫైబ్రోసిస్ అంటారు. ఊపిరితిత్తులలో ఎక్కడో ఒకటి రెండు చోట్లే ఇటువంటి పరిస్థితులు ఏర్పడవచ్చు లేదా మొత్తం ఊపిరితిత్తులలో ఈ పరిస్థితి ఏర్పడవచ్చు.*

**కారణాలు:**

లంగ్ ఎలర్జి, ఊపిరితిత్తులలోకి దుమ్ము, ధూళి ప్రవేశించడం, లంగ్ ఇన్‌ఫెక్షన్, లంగ్ కేన్సర్, రేడియేషన్‌కి గురి కావడం, కొన్ని రకాల మందులు, కొన్ని సాధారణ వ్యాధులు.

**లక్షణాలు:**

ఆయాసం, దీర్ఘకాలంగా దగ్గు. ఎక్కువ మందిలో పొడిదగ్గు ఉంటుంది. ఇంకొందరిలో

దగ్గుతోపాటు తెమడ కూడా పడుతుంది. రక్తం కూడా పడవచ్చు , బరువు కోల్పోవటం , అలసట.

పల్‌మొనరీ ఫైబ్రోసిస్ ఉన్నవాళ్లలో ఎక్కువగా పనిచేసినప్పుడు తగినంత ప్రాణవాయువు అందక పెదవులు, చేతి గోళ్ళు నీలంగా మారే అవకాశం ఉంది. ఈ వ్యాధి ఉన్నవాళ్ళల్లో చేతి వేళ్ళు ఉబ్బుగా కూడా కనబడతాయి. గాలి నిండుగా పీల్చినా, ఛాతి పూర్తిగా వ్యాకోచించడం ఉండదు.

నిర్ధారణ:

ఛాతి ఎక్స్‌రే, లంగ్ ఫంక్షన్ టెస్ట్, లంగ్ బైయాప్సి . బ్లడ్ టెస్ట్ , స్కానింగ్.

చికిత్స:

1. ప్రెడ్నిసోలోన్ టాబ్లెట్లు తడవకి 20 మి.గ్రా.చొప్పున రోజుకి 3 సార్లు. ఇలా కనీసం నెల రోజులు వాడాలి. తరువాత నిదానంగా మోతాదు తగ్గించాలి.
2. ఆయాసం ఎక్కువగా ఉన్నప్పుడు ఆక్సిజన్ పెట్టాలి.
3. లంగ్ ట్రాన్స్‌ప్లాంటేషన్.

❑❑❑

## 19. దుమ్ము, ధూళి పరిశ్రమల్లో పనిచేసేవారికి వచ్చే శ్వాసకోశ వ్యాధులు

* ఎక్యూట్ పల్‌మొనరీ ఎడీమా
* ఎక్యూట్ ట్రెకిఐటీస్
* ఎక్యూట్ బ్రోంకైటీస్
* పల్‌మొనరీ ఎంపసీమా
* బ్రోంఖియల్ ఆస్త్మా
* పల్‌మొనరీ ఫైబ్రోసిస్
* లంగ్ కేన్సర్

పరిశ్రమల్లో వెలువడే దుమ్ము, ధూళి రసాయనికాల బట్టి కలిగే శ్వాసకోశ వ్యాధులు, వ్యాధి లక్షణాలు ఉంటాయి.

నిర్ధారణ : ఛాతి ఎక్స్‌రే, రక్త పరీక్షలు, కళ్ళె పరీక్ష, లంగ్ స్కానింగ్.

చికిత్స:

1. కలిగిన వ్యాధి బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది. అయితే వ్యాధి లక్షణాలు



తీవ్రంగా ఉన్నప్పుడు ఉపశమనం కోసం చికిత్స చేయవలసి ఉంటుంది.

2. వ్యాధి లక్షణాలు ఎక్కువగా ఉన్నప్పుడు రోగి విశ్రాంతి తీసుకోవాలి.
3. ఆయాసం ఎక్కువగా ఉన్నప్పుడు ఆక్సిజన్ పెట్టాలి. హైడ్రోకార్టిజోన్ ఇంజక్షన్ ఇవ్వాలి. నరానికి గ్లూకోజ్ పెట్టాలి. తగిన యాంటిబయోటిక్ ఇవ్వాలి
4. రోగికి ఆందోళన ఎక్కువగా ఉంటే తగ్గడానికి కాంపోజ్ ఇంజక్షన్ ఇవ్వాలి.

❑❑❑

# 20. ఎటలెక్టేసిస్ ఆఫ్ లంగ్

*ఊపిరితిత్తిలో కొంత భాగం గానీ, పూర్తిగా కానీ కుదించుకుపోవటాన్ని ఎటలెక్టేసిస్ ఆఫ్ లంగ్ అంటారు.*

**కారణాలు:**

శ్వాస నాళాల్లో చిన్న దానిలో గానీ పెద్ద దానిలోగానీ అడ్డంకి ఏర్పడినప్పుడు గాలి ప్రసారం ఉండక ఆ భాగం కుదించుకుపోవచ్చు. క్రానిక్‌గా ఇన్‌ఫెక్షన్ ఉన్నప్పుడు ఆ భాగంలో టిష్యు డామేజి అయి ఫైబ్రస్ టిష్యు తయారయి కుదించుకుపోవచ్చు. శ్వాస నాళాల్లో ఏర్పడే ఈ అడ్డంకి దానిలోపల జరగవచ్చు లేదా దానిపైన ట్యూమర్ నొక్కి వేయబడడం వల్ల జరగొచ్చు.

ఊపిరితిత్తుల పై పొరల్లో నీరు చేరడం వల్ల కలిగే ప్లూరల్ ఎఫ్యూజన్ వల్ల ఊపిరితిత్తులు నొక్కివేయబడవచ్చు. న్యూమోథోరాక్స్ వల్ల కూడా ఊపిరితిత్తులు నొక్కివేయబడి ఎటలక్టేసిస్ ఆఫ లంగ్ ఏర్పడవచ్చు.

**లక్షణాలు:**

ఎటలక్టేసిస్ లంగ్ కొంత మేరకే పరిమితం అయినప్పుడు వ్యాధి లక్షణాలు తక్కువలో ఉంటాయి. శ్వాస కోశాలు మొత్తంగా నొక్కివేయబడినప్పుడు ఆయాసం ఎక్కువగా ఉంటుంది. దగ్గు ఉంటుంది. ఛాతిలో నొప్పి ఉంటుంది. రోగి అలసట చెంది నీలంగా మారతాడు.

అధికంగా పొగత్రాగేవారిలోనూ, ఉబ్బసం, క్రానిక్ బ్రోంకైటీస్ ఉన్నవారిలోనూ ఎటలక్టేసిస్ రావచ్చు.

**నిర్ధారణ:** ఛాతి ఎక్స్‌రే, బ్రోంఖోస్కోపి , రక్త పరీక్షలు.

చికిత్స:

1. ఆయాసం తగ్గేవరకు ఆక్సిజన్ పెట్టాలి.
2. నొప్పి తగ్గేవరకు మార్ఫియాగానీ పెథిడిన్ ఇంజక్షన్‌గానీ ఇవ్వాలి.
3. ఎటలక్టేసిస్ రావడానికి మూలకారణాన్ని కనుగొని దానికి చికిత్స చేయాలి. ప్లూరల్ ఎఫ్యూజన్ ఉంటే సూదివేసి నీరు తీసివేయాలి, న్యూమోథొరాక్స్ ఉంటే గాలిని తొలగించాలి, శ్వాసకోశాలు అడ్డంగా ఉంటే శస్త్ర చికిత్స ద్వారా తొలగించాలి.

□□□

# 21. రెస్పిరేటరీ ఫెయిల్యూర్

*రెస్పిరేటరీ ఫెయిల్యూర్‌లో ప్రాణ వాయువు తగ్గిపోతుంది. కార్బన్ డై ఆక్సైడ్ ఎక్కువ అయిపోతుంది. రోగి పరిస్థితి విషమిస్తుంది.*

కారణాలు:

తీవ్రంగా ఉబ్బసం రావడం, పల్మొనరీ ఎడీమా, న్యుమోనియా, క్రానిక్ బ్రోంకైటీస్, ఎంపసీమా, పల్మొనరీ ఫైబ్రోసిస్, గొంతుకి ఏదైన అడ్డుపడడం, పల్మొనరీ ఎంబలిజం, మెదడులో రక్తనాళాలుచిట్లడం, మత్తు బిళ్ళలు ఎక్కువగా మింగడం, తలకు దెబ్బ, విషం తాగడం, ప్రమాదకరమైన వ్యాధులు, మెదడు వాపు వ్యాధులు, ప్రమాదాల్లో ఛాతి నొక్కుకుపోవడం.

లక్షణాలు:

అతిగా ఆయాసం, విపరీతంగా చెమటలు, వేగంగా నాడి , నీలంగా మారడం, అయోమయ పరిస్థితి.

చికిత్స:

1. వ్యాధిని బట్టి శక్తివంతమైన యాంటిబయోటిక్ మందులు వాడాలి.
2. ప్రాణ వాయువు పెట్టాలి.
3. రెస్పిరేటరీ స్టిమ్యులెంట్స్-నిఖతమైడ్ 2-10 యం.యల్ నరానికి ఇవ్వాలి.
4. బ్రోంఖోడైలాటార్స్ - సాల్‌బుటమాల్ నరానికి ఇవ్వాలి.
5. హైడ్రోకార్టిజోన్ ఇంజక్షన్ ఇవ్వాలి.
6. యసిడోసిస్ తగ్గడానికి సోడా బైకార్బనేట్ నరానికి ఇవ్వాలి.
7. రోగి పరిస్థితి బాగుపడకుండా ఉంటే వెంటిలేటర్లో ఉంచాలి.

□□□

# 22. న్యూమోథొరాక్స్

ఊపిరితిత్తులపైన 'ప్లూరా' అనేది రెండు పొరలు కలిగి ఉంటుంది. ఈ పొరలు అంచులు అంటుకుని ఉంటాయి. పొరలు రెండింట మధ్య కొద్దిపాటిగా ఖాళీ స్థలం ఉంటుంది. మామూలుగా రెండు పొరలు దగ్గరగా ఉంటాయి. ఊపిరితిత్తులకు అంటుకుని ఉంటాయి. ఈ పొరలకి క్షయ వ్యాధి క్రిములు, ఇతర బాక్టీరియా క్రిములు సోకినప్పుడు అందులో నీరు చేరుతుంది. కేన్సర్ వచ్చినప్పుడు కూడా నీరు చేరుతుంది. కొన్ని పరిస్థితుల్లో ఈ పొరల్లోకి కన్నం ఏర్పడి గాలి చేరుతుంది. దాంతో ప్లూరాకి సంబంధించిన రెండు పొరలు విడివడి బూరల్లా ఉబ్బుతాయి. ఈ రకంగా ప్లూరల్ స్పేస్‌లోకి గాలి చేరి ఉబ్బడాన్ని న్యూమో థొరాక్స్ అంటారు.

ప్లూరల్ స్పేస్‌లోకి ఛాతిపైనా గాయం కలిగి గాలి వెళ్ళవచ్చు లేదా ఊపిరితిత్తులోంచి గాలి చేరవచ్చు లేదా కడుపులోంచి డయాఫ్రమ్‌కి కన్నం ఏర్పడి దాని గుండా గాలి చేరవచ్చు.

**కారణాలు:**

ఊపిరితిత్తుల్లో క్షయ వ్యాధి ఉన్నప్పుడు ఊపిరితిత్తులకి కన్నం ఏర్పడి దానినుంచి గాలి ప్లూరల్ స్పేస్‌లోకి చేరవచ్చు. ఉబ్బసం, లంగ్‌కేన్సర్ కేసుల్లో కూడా న్యూమోథొరాక్స్ కావచ్చు.

**లక్షణాలు:**

ఛాతి టైట్‌గా మారుతుంది. ఛాతిలో చాలా నొప్పి వస్తుంది. షాక్ కలుగుతుంది. గాలి తీయడం కష్టం అవుతుంది. పెదవులు, గోళ్ళు నీలంగా మారతాయి. రోగి పరిస్థితి విషమంగా మారుతుంది. రోగికి న్యూమోథొరాక్స్ నిదానంగా ఏర్పడినప్పుడు అంతగా ప్రమాదం ఉండదు. అకస్మాత్తుగా ఎక్కువ మోతాదులో న్యుమోథొరాక్స్ ఏర్పడినప్పుడు విషమంగా మారుతుంది.

**నిర్ధారణ:** ఛాతి ఎక్స్‌రే, క్లినికల్ ఎగ్జామినేషన్.

కొందరిలో న్యూమోథొరాక్స్ ఏర్పడినప్పుడు నిదానంగా ప్లూరల్ ఎఫ్యూజన్ కలగవచ్చు.

**చికిత్స:**

1. కొద్దిపాటిగా న్యూమోథొరాక్స్ ఏర్పడినప్పుడు అంతగా బాధలుండవు. నిదానంగా దానికంతటదే తగ్గిపోతుంది.

2. స్పెషల్ టెక్నిక్ ద్వారా ప్లూరల్ స్పేస్‌లో చేరిన గాలిని తీసివేయడం జరుగుతుంది. దానితో రోగి పరిస్థితి మెరుగవుతుంది. నొక్కివేయబడిన ఊపిరితిత్తి తిరిగి కోలుకుంటుంది.
3. కొందరిలో శస్త్ర చికిత్స అవసరమౌతుంది.
4. మందుల ద్వారా న్యూమోథొరాక్స్ తగ్గదు.

□□□

# 23. ప్లూరసి

ప్లూరాకి ఇన్‌ఫెక్షన్ రావడాన్ని ప్లూరసి అంటారు.

**కారణాలు:**

క్షయ వ్యాధి, న్యుమోనియా, బ్రోంఖిఎక్టైసిస్, లంగ్‌యాబ్సస్, వైరల్ ఇన్‌ఫెక్షన్స్‌లో ప్లూరసి వస్తుంది, లంగ్ కేన్సర్, ఛాతికి గాయాలు , టమటైడ్ ఆర్థ్రైటీస్ , యురీమియా

**లక్షణాలు:**

ప్లూరసి ఏర్పడిన వైపు ఛాతిలో నొప్పి ఉంటుంది. ఈ నొప్పి చాలా తీవ్రంగా అనిపిస్తుంది. గాలి పీల్చినప్పుడు నొప్పి మరింత ఎక్కువ అవుతుంది. దగ్గు ఉంటుంది. దగ్గినప్పుడు నొప్పి ఎక్కువవుతుంది. ప్లూరసి వచ్చిన వైపు ఛాతి కదలిక తగ్గుతుంది.

**నిర్ధారణ:** రక్త పరీక్షలు, ఎక్స్‌రే.

**చికిత్స:**

1. వ్యాధి తగ్గేవరకు రోగికి పూర్తి విశ్రాంతి ఇవ్వాలి.
2. నొప్పి తగ్గడానికి మందులు ఇవ్వాలి.
3. దగ్గుకి లింక్టస్ కొడీన్ వాడాలి.
4. ప్లూరసి రావడానికి మూల కారణాన్ని తెలుసుకుని దానికి చికిత్స చేయాలి.

□□□

# 24. ప్లూరల్ ఎఫ్యూజన్

ప్లూరల్ స్పేస్‌లోకి అసాధరణంగా నీరు చేరడాన్ని ప్లూరల్ ఎఫ్యూజన్ అంటారు.

**కారణాలు:**

టి.బి, కేన్సర్, వైరల్ ఇన్‌ఫెక్షన్స్ , ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్ ,న్యుమోనియా, బ్రోంఖిఎక్టైసిస్, లంగ్ యాబ్సిస్,గుండె జబ్బులు , సిర్రోసిస్ లివర్, నెఫ్రొటిక్ సిండ్రోమ్.

లక్షణాలు:ఛాతిలో నొప్పి, ఆయాసం, పొడిదగ్గు , బరువు కోల్పోవడం , ఆకలి తగ్గిపోవడం, జ్వరం.

ప్లూరల్ స్పేస్‌లోకి కనీసం 500 యం.యల్ నీరు చేరితే తప్ప వ్యాధి లక్షణాలు అంతగా కనబడవు.

నిర్ధారణ:

ఛాతి ఎక్సరే , ప్లూరల్ స్పేస్‌లోకి సూది వేసి, నీరు తీసి లేబరేటరీలో పరీక్ష చేయడం, అల్ట్రాసౌండ్ స్కానింగు , సి.టి.స్కానింగు.

చికిత్స:

1. ప్లూరల్ స్పేస్‌లోని నీరు తగ్గిపోయేవరకు రోగి పూర్తి విశ్రాంతి తీసుకోవాలి. బలమైన ఆహారం తీసుకోవాలి.
2. ప్లూరల్ ఎఫ్యూజన్ రావడానికి మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయాలి.
3. ప్లూరల్ స్పేస్‌లో నీరు ఎక్కువగా ఉన్నప్పుడు దానిని బయటకు తీసివేయాలి.
4. బ్రీథింగ్ ఎక్సర్‌సైజు చేయాలి.

❑❑❑

## 25 . ఎంపయీమా

ప్లూరల్ స్పేస్‌లో చీము చేరడాన్ని 'ఎంపయీమా' అంటారు.

కారణాలు:

న్యుమోనియా, బ్రోంఖియెక్టైసిస్, లంగ్ యాబ్సస్, యాక్టినోమైకోసిస్ వ్యాధులు రావడం, ఛాతికి లోతుగా గాయం అవడం, పుండు పడడం, రక్తం ద్వారా చీము క్రిములు ప్లూరాకి వ్యాపించడం.

లక్షణాలు:

జ్వరం, దగ్గు, ఛాతిలో నొప్పి, కొందరికి జ్వరంతోపాటు చలికూడా ఉంటుంది. జ్వరం అకస్మాత్తుగా రావడం, తీవ్రంగా ఉండడం జరుగుతుంది. చెమటలు ఎక్కువగా పోస్తాయి. ఆకలి ఉండదు.

నిర్ధారణ:

ఛాతి ఎక్సరే, రక్త పరీక్షలు (తెల్ల కణాలు 15,000 నుంచి 20,000 పైగా ప్రతి యం.యల్.కి ఉంటాయి, ప్లూరల్ స్పేస్‌లోంచి చీము తీసి పరీక్ష చేయాలి. చీముని కల్చర్ టెస్ట్ చేయాలి).

చికిత్స:

1. చీముని బయటకు తీసేయాలి.
2. కల్చర్ టెస్ట్ బట్టి తగిన యాంటీబయోటిక్ మందులు వాడాలి.
3. బ్రీథింగ్ ఎక్సర్‌సైజు చేయాలి.

కొందరికి ప్లూరల్ స్పేస్‌లో చీము చేరుతూనే ఉంటుంది. ఇలా చేరిన చీము మూడు మాసాలయినా తగ్గకపోయినట్లయితే క్రానిక్ ఎంపయిమా అంటారు.

క్రానిక్ ఎంపయీమా: క్రానిక్ ఎంపయీమా ఏర్పడటానికి ప్రధాన కారణం ప్లూరల్ స్పేస్‌లో చేరిన చీముని పూర్తిగా బయటకు తీసివేయకపోవడమే. అంతే కాకుండా తగిన యాంటీబయోటిక్ వాడకపోవడం ఒక ప్రధాన కారణం. ఎంపయీమా ఏర్పడినప్పుడు, చీముని కల్చర్ చేసి దాని ప్రకారం. యాంటీబయోటిక్ వాడటం అత్యవసరం. ఊపిరితిత్తులలో క్షయ వ్యాధి బ్రోంఖిఎక్టైసిస్, లంగ్ యాబ్సస్ వంటి దీర్ఘవ్యాధులు ఉన్నప్పుడు ప్లూరల్ స్పేస్‌లో చేరిన చీము కూడా అంత తేలికగా తగ్గదు. క్రానిక్ లంగ్ ఇన్‌ఫెక్షన్స్ ఉన్నప్పుడు ఎంపయీమా కూడా క్రానిక్‌గా ఉండే అవకాశం ఉంది. లంగ్ కేన్సర్ ఉన్నప్పుడు కూడా ఎంపయీమా క్రానిక్‌గా ఉంటుంది. ఛాతికి గాయమై దాని ద్వారా ప్లూరల్ స్పేస్‌లోకి ఏదైన బయట పదార్థం చేరితే దానిని బయటకు తీసేవరకు చీము తగ్గకుండా ఉంటుంది.

చికిత్స:

రిబ్ రిసెక్షన్ వంటి శస్త్ర చికిత్స ద్వారా సంతృప్తికరమైన డ్రైనేజి ఏర్పాటు చేసినట్లయితే క్రానిక్ ఎంపయీమా తగ్గుతుంది.

❑❑❑

**కారం, మసాలాలు - కాఫీ, టీలు**

- ❖ ఆహారంలో కారం, మసాలాలు బాగా తక్కువలో ఉండాలి.
- ❖ కారం, మసాలాలు కడుపులో పుళ్లు కలిగిస్తాయి.
- ❖ కాఫీ - టీలతో ఆకలి తగ్గిపోతుంది. నరాల వణుకు వస్తుంది. గుండెదడ అనిపిస్తుంది.గుండె వేగం పెరుగుతుంది.

**సాత్వికాహారం సంతోషకర జీవితానికి సోపానం**

# 6. జీర్ణకోశ వ్యాధులు

## 1. నోట్లో పుళ్ళు

కారణాలు :

నోటి అపరిశుభ్రత, ధూమపానం, మద్యం సేవించడం, అధికంగా యాంటీబయోటిక్ మందులు వాడడం, అనారోగ్య పరిస్థితులు, బాక్టీరియల్, వైరల్, ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్ రావడం.

లక్షణాలు :

నోటి మంట, నొప్పి, ఏదీ తినలేకపోవడం.

చికిత్స :

1. బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ అయినట్లయితే మెట్రోజిల్ 200 మి.గ్రా. బిళ్ళలు ఉదయం ఒకటి, మధ్యాహ్నం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున 5 రోజులు వాడాలి. 'జైటీ' సొల్యూషన్ నోట్లో రాయాలి.
2. వైరల్ ఇన్‌ఫెక్షన్ వల్ల కురుపులు వచ్చినట్లయితే నోటి శుభ్రతని పాటించడం, 'హెక్సిజిల్' ఆయింట్‌మెంటు రాయడం చేయాలి.
3. ఫంగల్ ఇన్‌ఫెక్షన్ వచ్చినప్పుడు నోట్లో పాచి పట్టినట్లు అవుతుంది. నోరంతా కురుపులు వస్తాయి.
4. 'కాండిడిడ్' సొల్యూషన్ నోట్లో రాయాలి.
5. కొందరికి తరచుగా నోట్లో కురుపులు వస్తూ పోతూ ఉంటాయి. చాలామందికి స్పష్టమైన కారణం ఉండదు. ఇటువంటి వారిలో నోటి శుభ్రత పాటించడం అవసరం. అవసరం బట్టి ప్రెడ్నిసాలోన్ 10 మి.గ్రా. బిళ్ళలు ఉదయం ఒకటి, మధ్యాహ్నం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున వారం రోజులు వాడాలి. బి- కాంప్లెక్సు బిళ్ళలు రోజూ తీసుకోవాలి.

కొన్ని మందులు, కొన్ని వ్యాధులు, రక్తంలో దోషాల వల్ల నోటిలో పుళ్ళు ఏర్పడవచ్చు.

□□□

# 2. గొంతు నొప్పి - మ్రింగుడు పడకపోవడం

కారణాలు :

గొంతుకి ఇన్‌ఫెక్షన్, టాన్సిల్స్ వాచడం, పక్షవాతం రావడం గొంతుకి దెబ్బ తగలడం, కేన్సర్ రావడం.

కొందరిలో ఏ వ్యాధి లేకుండా కేవలం అనుమానంతో బాధపడడం.

పరీక్షలు :

గొంతు పరీక్ష, లెరింగో స్కోపీ, బేరియమ్ స్వాలో, ఛాతీ ఎక్స్‌రే, ఎండోస్కోపి.

చికిత్స :

వ్యాధి నిర్ధారణ బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది.

❑❑❑

# 3. కడుపులో మంట, అజీర్ణం

కారణాలు :

అన్నవాహిక, జీర్ణకోశం, చిన్న పేగుల్లో పుండు లేక పూత. గాల్‌బ్లాడర్, పేన్‌క్రియాసిస్ వాచడం లేదా వాటిల్లో రాళ్ళు చేరడం. ఎమీబియాసిస్. హార్ట్ ఫెయిల్యూర్. లంగ్స్ టి.బి., యురీమియా. అనవసర కంగారు, గాభరా, ఆందోళన, డిప్రెషన్. ఆహారాన్ని బాగా నమిలి మింగకపోవడం, సమయం ప్రకారం భోజనం చేయకపోవడం, మసాలా దినుసులు ఎక్కువగా వాడటం.

నిర్ధారణ :

రోగి యొక్క ఆహారం, ఇతర అలవాట్లు గురించి తెలుసుకోవడం, విరోచనం పరీక్ష మూత్రం పరీక్ష , రక్త పరీక్ష , లివర్ ఫంక్షన్ టెస్ట్స్, ఎండోస్కోపి, కొల్నోస్కోపి, గాస్ట్రిక్ ఎనాలసిస్ , పేన్‌క్రియాటిక్ ఫంక్షన్ టెస్ట్స్.

చికిత్స :

1. కారణం బట్టి చికిత్స ఉంటుంది. ఎక్కువ మందిలో ఎమీబియాసిస్ కారణం **లేదా** క్రానిక్ గాస్ట్రైటిస్ కారణం. ప్రత్యేక కారణం ఏదీ కనబడకుండా కడుపు ఉబ్బరం. అజీర్ణం, త్రేన్పులు ఉండడానికి ఆ రోగి సైకలాజికల్ పరిస్థితి కారణం.

2. మామూలుగా అజీర్ణం ఉన్నప్పుడు 'యూని ఎంజైమ్' టాబ్లెట్సు ఉదయం ఒకటి, మధ్యాహ్నం ఒకటి, రాత్రి ఒకటి ఆహారం తరువాత తీసుకోవాలి. ఆహారంలో కారం తగ్గించాలి. సాత్విక ఆహారం తీసుకోవాలి. మానసికంగా కంగారు, ఆందోళన ఉన్నట్లయితే రోజూ రాత్రి పూట వాలియం-5 టాబ్లెట్స్ వాడాలి.

❑❑❑

# 4. ప్రేగుపూత (గ్యాస్ట్రైటిస్)

*ఈ ప్రేగు పూత అనేది కడుపులో యాసిడ్ ఎక్కువ తయారవడంవల్ల రావచ్చు. లేదా తీసుకున్న ఆహార పదార్థాలు కడుపులోని పొరలను వాచేటట్లు చెయ్యొచ్చు. బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కావచ్చు. మద్యం తీసుకోవడం, స్మోకింగ్ చేయడం కూడా పేగుపూతకి కారణం.*

నిర్ధారణ : ఎండోస్కోపి.

చికిత్స :

1. కాఫీ, టీలు మానివేయడం, పాలు తీసుకోవడం.
2. పులుపు, కారం, మసాలా మానివేయడం.
3. 'మ్యూకైన్' లేదా 'విస్కో' జెల్ తడవకి రెండు చెంచాల చొప్పున రోజుకి 3 సార్లు వేసుకోవాలి.
4. 'ఒమేజ్-20' రోజుకొకటి తీసుకోవాలి.
5. ఆల్కహాల్, స్మోకింగ్ పూర్తిగా మానివేయాలి.

పై చికిత్సతో ఒకటి రెండు రోజుల్లోనే రిలీఫ్ వస్తుంది.

❑❑❑

# 5. జీర్ణాశయంలో పుండు (పెప్టిక్ అల్సర్)

*జీర్ణాశయంలో గానీ, డ్యుయోడినంలోగానీ పుండు ఏర్పడడాన్ని పెప్టిక్ అల్సర్ అంటారు.*

**కారణాలు :**

కొందరికి జీన్స్ ప్రకారంగానే కడుపులో పుండు ఏర్పడే ఆస్కారం ఉంది."ఒ" గ్రూప్

బ్లడ్ ఉన్నవారికి జీర్ణాశయంలో పుండు ఏర్పడవచ్చు.పొగ త్రాగేవారిలో జీర్ణాశయంలో పుండు సహజం, న్యూరోటిక్ పర్సనాలిటీ ఉన్నవారిలో జీర్ణాశయంలో పుండ్లు ఎక్కువగా ఏర్పడతాయి. మద్యం అతిగా సేవించేవారిలోనూ, కారం ఎక్కువగా తినే వారిలోనూ పుండ్లు ఏర్పడతాయి. జీర్ణాశయంలో యాసిడ్ (ఆమ్లము) ఎక్కువ తయారవడం, పుండు పడటానికి కారణం.

## పెప్టిక్ అల్సర్‌లో రకాలు :

* గ్యాస్ట్రిక్ అల్సర్ : జీర్ణాశయంలో పుండు ఏర్పడడాన్ని గ్యాస్ట్రిక్ అల్సర్ అంటారు.
* డ్యుయోడినల్ అల్సర్ : చిన్న ప్రేగు మొదటి భాగాన్ని డ్యుయోడినం అంటారు. ఇది జీర్ణాశయం నుండి ప్రారంభమయ్యే చిన్న ప్రేగు. ఇందులో ఏర్పడే పుండుని 'డ్యుయోడినల్ అల్సర్' అంటారు.

## లక్షణాలు :

కడుపులో మంట, నొప్పి, పులుపు, కారం, మసాలా తింటే నొప్పి ఎక్కువ అవడం. మద్యం తీసుకుంటే మంట, నొప్పి పెరగడం. అర్ధరాత్రి నొప్పి, మంట అనిపించడం. ఆందోళన టెన్షన్‌తో నొప్పి పెరగడం. గ్యాస్ట్రిక్ అల్సర్ అయినట్లయితే ఆహారం తీసుకోగానే నొప్పి ఎక్కువ అవుతుంది. డ్యుయోడిన్ అల్సర్ ఆహారం తీసుకున్న రెండు, మూడు గంటలకి నొప్పి కనపడుతుంది. కడుపులో వికారం ఉంటుంది. కొందరిలో వాంతులు అవుతాయి. కొందరిలో వాంతితోబాటు రక్తం పడుతుంది. ఆ వాంతి అనేది కాఫీ డికాషన్ రంగులో ఉంటుంది. పెప్టిక్ అల్సర్ బ్లీడింగ్ అయ్యేవారిలో వాంతితో బాటు రక్తం పడటమే కాకుండా విరోచనంలో కూడా రక్తం ఉంటుంది. మలం నలుపు రంగులో ఉంటుంది. పై కడుపు బిగదీసి నొప్పి అనిపిస్తుంది.

## కాంప్లికేషన్స్ :

పెప్టిక్ అల్సర్ నుండి బ్లీడింగ్ అవడం, పుండు ఉన్నచోట కన్నంబడడం, పైలోరిక్ స్టినోసిస్, పుండు కేన్సర్‌గా మారడం.

**నిర్ధారణ :** ఎండోస్కోపి, బేరియం మీల్ ఎక్స్‌రేస్.

## చికిత్స :

1. మద్యం, ధూమపానం మానివేయాలి.
2. పులుపు, కారం, మసాలా మానివేయాలి.

3. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి.
4. ఆందోళన, దిగులు పనికిరావు.
5. కాఫీ, టీలు బదులుగా పాలు తాగాలి.
6. కనీసం రోజుకి 7, 8 గంటలు నిద్రపోవాలి.
7. యాస్పిరిన్ వంటి మందులు వాడకూడదు. కొన్ని మందులు కడుపులో పుండుని పెంచుతాయి.
8. కడుపులో యాసిడ్ పెరగకుండా ప్రతి 3 గంటలకి కొద్దిపాటి ఆహారం తీసుకోవాలి. సమయానికి భోజనం చేయాలి.
9. ఒమేప్రజాల్ 20 మి.గ్రా. రోజూ రాత్రి ఒకటి చొప్పున 1 లేక 2 నెలలు వాడాలి.

శస్త్ర చికిత్స :

పెప్టిక్ అల్సర్ ఏర్పడిన వారిలో కొందరికి పైలోరిక్ స్టినోసిస్ ఏర్పడుతుంది. ఇటువంటి వారికి గ్యాస్ట్రోజుజునాస్టమి సర్జరీ చేయాలి. పెప్టిక్ అల్సర్ పెర్ఫొరేషన్ వస్తే వెంటనే ఆపరేషన్ చేయాలి.

❑❑❑

# 6. గ్యాస్ట్రిక్ కేన్సర్

*ఏభై అయిదు, అరవై సంవత్సరాలు దాటిన వారిలో గ్యాస్ట్రిక్ కేన్సర్ (జీర్ణాశయానికి కేన్సర్) రావడానికి అవకాశం ఉంది. 'ఎ' గ్రూపు బ్లడ్ కలవారిలో గ్యాస్ట్రిక్ కేన్సర్ ఎక్కువ.*

**లక్షణాలు :**

పై కడుపులో నొప్పి, మంట ఉంటాయి. ఆహారం తీసుకున్న తరువాత కడుపు ఉబ్బరం, బాధ ఉంటాయి. ఆకలి ఉండదు. వికారంగా ఉంటుంది.

తరచుగా వాంతులు అవుతాయి. వాంతుల్లో రక్తం కనపడుతుంది. కొందరిలో విరోచనాలు, మరికొందరిలో మలబద్ధకం ఉంటుంది.పై కడుపులో గడ్డ ఏర్పడుతుంది. బరువు తగ్గిపోతారు. రక్తహీనత ఏర్పడుతుంది. కడుపుకి నీరు చేరుతుంది. పచ్చ కామెర్లు కనబడతాయి. ఆయాసం, నీరసం ఉంటాయి. కొందరిలో పెరపెరేషన్ (జీర్ణాశయానికి చిల్లు) పడుతుంది.

**నిర్ధారణ :** ఎండోస్కోపి, సి.టి. స్కానింగ్

**చికిత్స :**

గ్యాస్ట్రిక్ కేన్సర్ మొదటి దశలో సబ్‌టోటల్ **లేదా** టోటల్ గ్యాస్ట్రెక్టమీ చేస్తారు.

❑❑❑

# 7. నలుపు రంగులో వాంతి, విరోచనం

అన్నవాహికలోగానీ, జీర్ణాశయంలోగానీ, డ్యుయోడనంలోగానీ రక్తస్రావం జరుగుతున్నప్పుడు వాంతిలో రక్తం పడుతుంది. వాంతిలో రక్తం కలిసినప్పుడు నలుపుగా కనపడుతుంది. జీర్ణాశయం చిన్నపేగు, పెద్ద పేగుల్లో రక్తం కారుతున్నప్పుడు విరోచనం నలుపు రంగులో ఉంటుంది. విరోచనంలో రక్తం కలిసే పరిస్థితిని మెలీనా అంటారు.

**కారణాలు:**

పెప్టిక్ అల్సర్ , గ్యాస్ట్రిక్ కేన్సర్ , జీర్ణాశయంలో వివిధ చోట్ల పుళ్ళు , యురీమియా.

**నిర్ధారణ :**

విరోచనం పరీక్ష, రక్త పరీక్ష , ఎండోస్కోపి, బేరియం మీల్ ఎక్స్‌రే.

**చికిత్స :**

1. వాంతిలోగాని విరోచనంలోగానీ రక్తం ఉన్నట్లు కనుగొన్నప్పుడు రోగిని ఆసుపత్రిలో చేర్చి పరిస్థితిని పరిశీలిస్తూండాలి.
2. బి.పి., నాడి తరచుగా పరీక్షిస్తుండాలి. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి. అవసరం బట్టి రక్తం ఎక్కించాలి. రోగి పరిస్థితి స్థిరంగా ఉన్న తరువాత ఎండోస్కోపి ద్వారా బ్లీడింగ్ పాయింట్ పట్టుకొని బ్లీడింగు అరికట్టడానికి ప్రయత్నం చేయాలి.
3. వాంతులు లేకపోతే నోటి ద్వారా పాలు ఇవ్వాలి. చల్లని నీళ్ళు త్రాగటానికి ఇవ్వాలి.
4. జీర్ణాశయంలో బ్లీడింగ్ తగ్గేవరకు తినే ఆహారం ఏదీ ఇవ్వకూడదు.
5. ప్రతి రెండు గంటలకి ఒకసారి నోటి ద్వారా డైజిన్ లేదా జెల్యుసిల్ జెల్ ఇవ్వాలి.
6. ఒమేజ్ - 20 మి.గ్రా. కాప్సూల్స్ ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి నోటి ద్వారా ఇవ్వాలి.

సాధారణంగా మెడికల్ ట్రీట్‌మెంట్‌తో రెండు, మూడు రోజులలో రోగి పరిస్థితి బాగుపడుతుంది. లోపల బ్లీడింగ్ ఆగిపోతుంది. లోపల బ్లీడింగ్ ఆగకుండా కంటిన్యూ అవుతుంటే సర్జరీ చేయవలసి వస్తుంది.

❑❑❑

# 7. కాలేయం - పసరతిత్తి వ్యాధులు

## 1. పచ్చకామెర్లు (వైరల్ హెపటైటిస్)

*వైరస్ క్రిములవల్ల లివర్ వ్యాధిగ్రస్తమవుతుంది. దీనినే ఇన్‌ఫెక్టివ్ వైరల్ హెపటైటిస్ అంటారు. దీనివల్ల పచ్చ కామెర్లు కలుగుతాయి.*

వైరల్ హెపటైటిస్ ముఖ్యంగా రెండు రకాలు.

1. హెపటైటిస్ - ఎ 2. హెపటైటిస్ - బి.

ఈ రెండే కాకుండా నాన్ ఎ, నాన్ బి హెపటైటిస్, హెపటైటిస్ సి, హెపటైటిస్ - డి, హెపటైటిస్ - ఇ అని మరో అయిదు హెపటైటిస్ రకాలున్నాయి. ఇవి కూడా వేరు వేరు వైరస్ క్రిములవల్ల కలుగుతాయి.

హైపటైటిస్ 'ఎ' సాధారణంగా వచ్చే పచ్చ కామెర్లు. త్రాగే నీరు, తినే ఆహారం కలుషితం కావడం వల్ల ఈ వ్యాధి వస్తుంది.

హెపటైటిస్ - బి ఉన్న వ్యక్తి రక్తం ఇంకొకరికి ఎక్కించినా, అతనికిచ్చిన ఇంజక్షన్ సూదితో మరొకరికి ఇంజక్షన్ ఇచ్చినా, ఆ వ్యాధి ఉన్న రోగితో లైంగికంగా కలిసినా రెండవ వారికి వ్యాధి కలుగుతుంది.

**లక్షణాలు :**

పచ్చ కామెర్లు బయటపడడానికి వారం పది రోజులు ముందు నుంచి మూత్రం పచ్చగా వస్తుంది. జ్వరం ఉంటుంది. ఆకలి ఉండదు. వికారం అనిపిస్తుంది. కొద్ది పనికి అలసిపోవడం ఉంటుంది. కుడి డొక్కలో నొప్పి ఉంటుంది. తలనొప్పి ఉంటుంది. ఈ లక్షణాలు కనబడిన వారం పదిరోజులకి కళ్ళు పచ్చగా మారతాయి. నోటిలోపల కూడా పచ్చగా కనబడుతుంది. నిదానంగా ఒళ్ళు కూడా పచ్చగా కనబడుతుంది. విరోచనం తెల్లగా అవుతుంది. ఒళ్ళు దురదలు వస్తాయి. లివర్ పరిమాణం పెరుగుతుంది. నొక్కితే నొప్పి అనిపిస్తుంది.

**నిర్ధారణ :**

**మూత్రం పరీక్ష :** మూత్రంలో బైల్ పిగ్‌మెంట్స్ కనబడుతాయి. **రక్త పరీక్షలు :** సీరమ్ బైలిరుబిన్ ఎక్కువ శాతం ఉంటుంది. ఎస్.జి.పి.టి పెరుగుతుంది. ఇతర లివర్ ఫంక్షన్ టెస్ట్స్‌లో కూడా తేడా కనబడుతుంది.

అల్ట్రాసౌండ్ స్కానింగ్ : అల్ట్రాసౌండ్ స్కానింగ్ ద్వారా లివర్ పరిస్థితి తెలుసుకోవచ్చు.

చికిత్స :

1. కామెర్లు తగ్గేవరకు రోగి పూర్తి విశ్రాంతి తీసుకోవాలి. రోగికి వికారం, వాంతులు ఉన్నంతవరకు, నోటి ద్వారా గ్లూకోజ్, కొబ్బరి నీళ్ళు, పళ్ళరసం ఇస్తూ, నరానికి గ్లూకోజ్ పెట్టాలి.
2. విటమిన్ బి కాంప్లెక్స్, విటమిన్ సి ఎక్కువ మోతాదులో ఇవ్వాలి. వికారం, వాంతులు తగ్గిపోయిన తరువాత నోటి ద్వారా ఆహారం ఇవ్వాలి.
3. ఆకలి, అరుగుదల వచ్చిన తరువాత తినేందుకు అన్నీ యివ్వవచ్చు.
4. పచ్చ కామెర్లు ఉన్నప్పటికి ఆకలి, అరుగుదల ఉంటే ఆహారం ఎక్కువగానే పెట్టాలి. కూరగాయలు, పప్పులు, గ్రుడ్లు, మాంసం మామూలుగా తీసుకోవచ్చు.
5. కామెర్లు తగ్గేవరకు కేవలం మజ్జిగన్నమే తినాలని అనుకుంటారు. అటువంటి పత్యం తప్పు. కామెర్లు ఉన్నా పౌష్టికాహారం తప్పకుండా తీసుకోవాలి. పౌష్టికా హారం తీసుకోకపోతే కామెర్లువల్ల కాలేయం శాశ్వతంగా దెబ్బతింటుంది.
6. కామెర్లు ఉన్నప్పుడు రోగిలో మగత కనపడితేనే, అపస్మారక స్థితి ఉంటేనే మాంసకృత్తులు ఉండే ఆహారం ఇవ్వకూడదు. కొవ్వు పదార్థం మామూలుగా తీసుకోవచ్చు.
7. ఇన్‌ఫెక్షన్ ఎక్కువగా ఉన్నట్లయితే, నియోమైసిన్ లేదా మెట్రోనిడజోల్ ఇవ్వాలి.
8. సీరమ్ బైలిరుబిన్ ఎక్కువగా ఉంటే ప్రెడ్నిసొలోన్ టాబ్లెట్స్ కోర్సుగా వాడాలి. వ్యాధి పూర్తిగా తగ్గేవరకు రోగి విశ్రాంతి తీసుకొని మందులు వాడాలి. రోగి పూర్తిగా కోలుకునేవరకు డాక్టరు సలహా లేనిది ఇతరత్రా ఏ మందులు వాడకూడదు. కొన్ని మందులు లివర్ మీద పనిచేసి లివర్‌ని మరింత డామేజి చేస్తాయి. హెపటైటిస్ బి, ఇతర వైరల్ హెపటైటిస్ వ్యాధులకు పై విధంగానే చికిత్స చేయాలి.

□□□

# 2. లివర్ ఫెయిల్యూర్

త్వరితంగా లివర్‌లోని సెల్స్ కుళ్ళిపోవడం, లివర్ పనిచేయకుండా అయిపోవడం అనేది అప్పుడప్పుడు జరుగుతుంది. ఇది చాలా ప్రాణపాయ పరిస్థితి. దీనిని ఫల్మినెంటు హెపాటిక్ ఫెయిల్యూర్ అంటారు.

కారణాలు :

వైరల్ హెపటైటిస్ రావడం , కొన్ని మందులు లివర్ మీద పి. ప్రభావం చూపడం, గర్భిణీ సమయంలో లివర్ వ్యాధిగ్రస్తం కావడం.

లక్షణాలు :

త్వరితగతిన పచ్చకామెర్లు పెరగడం, అపస్మారక స్థితి ఏర్పడడం, పచ్చకామెర్లు ఉండగా వాంతిలో రక్తం పడడం, లివర్ డామేజి వల్ల మెదడు పనిచేయకుండా ఉండడం, కోమా రావడం, మెదడు పని దెబ్బతినడం.

చికిత్స :

1. నరానికి గ్లూకోజ్ పెట్టడం, ఆహారంలో మాంసకృత్తులు లేకుండా చూడడం, పళ్ళరసాలు, కొబ్బరినీళ్ళు, వెజిటబుల్ సూప్స్ ఇవ్వడం. ఇప్సమ్ సాల్ట్ ద్వారా జీర్ణాశయం ప్రేగులు క్లీన్ అయ్యేట్లు చేయడం.
2. నియోమైసిన్ 1 గ్రా. క్యాప్సూల్స్ తడవకి 1 చొప్పున రోజుకి 4 సార్లు ఇవ్వడం.
3. లాక్ట్యులోజ్ 5 ఎమ్.ఎల్. చొప్పున సిరప్ రోజుకి 3 సార్లు ఇవ్వడం.
4. ఇటువంటి లివర్ ఫెయిల్యూర్‌లో పొటాషియం, కాల్షియం తగ్గే అవకాశం ఉంది. అలా తగ్గినప్పుడు పొటాషియం ఇంజక్షన్, కాల్షియం ఇంజక్షన్ ఇవ్వాలి.
5. కోమా వచ్చి మెదడుకి నీరు చేరినట్లు అనిపిస్తే మేనిటాల్ నరానికి పెట్టాలి.
6. మూత్రపిండాలు, ఊపిరతిత్తులు, గుండె సక్రమంగా పనిచేయకుండా అయిపోతే వాటికి తగిన చికిత్స చేయాలి.

   లివర్ ఫెయిల్యూర్ చాలా ప్రమాదకరమైన పరిస్థితి. రోగిని ఆసుపత్రిలో ఉంచి చికిత్స చేయాలి.

❑❑❑

# 3. సిర్రోసిస్ లివర్

*లివర్‌లోని సెల్స్ డామేజి అయిపోయి లివర్ గట్టిపడటాన్ని సిర్రోసిస్ లివర్ అంటారు. సిర్రోసిస్ లివర్‌లో లివర్ కుదించుకుపోతుంది. లివర్ షేప్ మారుతుంది.*

కారణాలు :

వైరల్ హెపటైటిస్, మద్యం సేవించడం, కొన్ని ఔషధాల దుష్ప్రభావం క్రానిక్ కంజస్టీవ్ కార్డియాక్ ఫెయిల్యూర్, లివర్‌లో పసరు నిలబడిపోవడం, చిన్నతనంలో కాలేయం వ్యాధులు రావడం.

**లక్షణాలు :**

ఆకలి తగ్గిపోవడం, అరుగుదల లేకపోవడం, బరువు కోల్పోవడం, అలసట అనిపించడం, సెక్స్ కోరిక తగ్గడం, పొట్టకి కాళ్ళకి నీరు చేరడం, కొందరిలో జీర్ణాశయంలో రక్తస్రావం జరుగుతుంది.

**నిర్ధారణ :**

లివర్ ఫంక్షన్ టెస్ట్స్, అల్ట్రా సౌండ్ స్కానింగ్, సి.టి.స్కాన్, లివర్ బయాప్సీ, ఎండోస్కోపి మరియు లెప్రోస్కోపి.

**కాంప్లికేషన్స్ :**

రక్తం వాంతి చేసుకోవడం. లివర్ ఫంక్షన్ తగ్గిపోవడం. కేన్సర్‌కి దారితీయడం.

**చికిత్స :**

1. ఎక్కువ శ్రమచెందకుండా విశ్రాంతి తీసుకోవాలి. మూల కారణాన్ని సరిదిద్దాలి.
2. ఆహారంలో ఉప్పు తగ్గించాలి. ఆహారంలో గ్రుడ్లు, మాంసం, పాలు ఎక్కువగా తీసుకోవాలి.
3. ప్రెడ్నిసొలోన్ 10 మి.గ్రా. టాబ్లెట్స్ రోజుకి 1 చొప్పున కొన్ని నెలలపాటు వాడాలి.
4. రక్త హీనతని సరిదిద్దడానికి ఐరన్ క్యాప్సూల్స్ వాడాలి.
5. పొట్టకి కాళ్ళకి చేరిన నీరు తగ్గడానికి స్పైరనో లాక్టోన్ బిళ్ళలు రోజుకి 3 వాడాలి.
6. సిర్రోసిస్ లివర్‌కి అసలైన చికిత్స లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్.

□□□

## 4. కడుపుకి నీరు (ఎసైటిస్)

*కడుపుకి నీరు చేరడాన్ని 'ఎసైటిస్' అంటారు.*

**కారణాలు :**

కడుపులో టి.బి.గాని, బాక్టీరియా, ఫంగల్, పేరాసైటిక్ ఇన్‌ఫెక్షన్స్ ఉన్నట్లయితే కడుపుకి నీరు చేరుతుంది. కడుపులో కేన్సర్ వ్యాధి ఉన్నా నీరు చేరుతుంది, సిర్రోసిస్ లివర్ ఉన్నవారిలో కూడా కడుపుకి నీరు వస్తుంది. కిడ్నీ ఫెయిల్యూర్, లివర్ ఫెయిల్యూర్, హార్ట్ ఫెయిల్యూర్‌లో కూడా నీరు చేరుతుంది.

**నిర్ధారణ :**

పొట్టలోకి సూది వేసి, నీరు తీసి లేబరేటరీలో పరీక్ష చేస్తే వ్యాధి ఏదైనది తెలుస్తుంది.

అల్ట్రాసౌండ్ స్కానింగ్, ఎండోస్కోపి, సి.టి.స్కానింగ్, లేప్రొస్కోపి ద్వారా లోపల ఉన్న పరిస్థితి తెలుసుకోవచ్చు.

**చికిత్స :**

1. వ్యాధి కారణం బట్టి చికిత్స చేయాలి.
2. రోగి కోలుకునేంత వరకు పూర్తి విశ్రాంతి ఇవ్వాలి.
3. ఉప్పు తక్కువ తీసుకోవాలి.
4. వ్యాధి తగ్గుముఖం పట్టే వరకు ద్రవ పదార్థం తక్కువ తీసుకోవాలి.
5. కడుపులో నీరు లాగేయటానికి లాసిక్స్ లేదా స్పైరనో లేక్టోన్ బిళ్ళలు వాడాలి.

❑❑❑

# 5. హెపటోమెగలి

*కొన్ని వ్యాధులలో లివర్ ఉబ్బుతుంది. దానివల్ల లివర్ మామూలుగా కంటే పరిమాణం పెరుగుతుంది. దీనిని హెపటోమెగలి అంటారు. వైరల్ స్పైరోకీటల్, బాక్టీరియల్, ప్రోటోజోవల్, పేరసైటిక్, ఫంగల్ ఇన్‌ఫెక్షన్స్ వల్ల లివర్ పరిమాణం పెరుగుతుంది. ఉదాహరణకి వైరల్ హెపటైటిస్, సిఫిలిస్, టైఫాయిడ్, ట్యూబర్‌కొలోసిస్, ఎమీబియాసిస్, మలేరియా మొదలైన వ్యాధులు.*

*కార్బన్ టెట్రా క్లోరైడ్, ఆర్సెనిక్ మిథైల్ టెస్టోస్టిరోన్, సల్ఫనమైడ్స్, హాలోథేన్ ఔషధాల వల్ల లివర్ కణాల మీద చెడు ప్రభావం కలిగి లివర్ ఉబ్బుతుంది. లివర్‌లో కొవ్వు చేరి కూడా లివర్ పరిమాణం పెరుగుతుంది.*

*హార్ట్ ఫెయిల్యూర్, కన్‌స్ట్రక్టివ్ పెరీకార్డైటీస్, పోర్టల్ హైపర్ టెన్షన్ వల్ల కూడా లివర్ పరిమాణం పెరుగుతుంది. లివర్‌లో ట్యూమర్స్, కేన్సర్ కంతులు ఉంటే కూడా పెద్దది అవుతుంది.*

*గ్లైకోజిన్ స్టోరేజి డిసీజస్, సికిల్‌సెల్ డిసీజస్‌లలో కూడా లివర్ పరిమాణం పెరుగుతుంది. బ్లడ్ కేన్సర్, హాడ్జికిన్ డిసీజ్, లివర్ యాబ్సస్, హైడాటిడ్ సిస్ట్‌లో కూడా లివర్ పరిమాణం ఉంటుంది.*

**నిర్ధారణ :**

అల్ట్రాసౌండ్ స్కానింగ్, సి.టి. స్కానింగ్, ఛెస్ట్ ఎక్స్‌రే. లివర్ ఫంక్షన్ టెస్ట్స్, రక్త పరీక్షలు, లివర్ బయాప్సీ ద్వారా వ్యాధి నిర్ధారణ చేయవచ్చు.

చికిత్స :

1. హెపటోమెగలి ఉన్నప్పుడు రోగి విశ్రాంతి తీసుకోవాలి.
2. లివర్ పెరగడానికి మూలకారణాలు కనుగొని దానికి చికిత్స పొందాలి.

❑❑❑

# 6. పసర తిత్తిలో రాళ్ళు (గాల్‌స్టోన్స్)

*పసర తిత్తిలో రాళ్ళనే గాల్‌స్టోన్స్ అంటారు.*

కారణాలు :

పసర తిత్తిలో (గాల్ బ్లాడర్) కొలిస్ట్రాల్ స్టోన్స్ ఏర్పడతాయి. స్థూలకాయం ఎక్కువ ఉన్నవారిలో, లివర్‌లో పసరు తక్కువ తయారయ్యే వారిలో ఈ స్టోన్స్ తయారవుతాయి, మాంసకృత్తులు ఉండే ఆహారం తక్కువ తీసుకునే వారిలోనూ, పసర తిత్తిలో బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ ఉన్నవారిలోనూ పిగ్‌మెంటల్ గాల్ స్టోన్స్ ఏర్పడతాయి.

లక్షణాలు :

పసర తిత్తిలో రాళ్ళు ఉన్న ప్రతి ఒక్కరిలోనూ వ్యాధి లక్షణాలు ఏర్పడవు. కొందరిలో మాత్రం పై కడుపులో మెలిపెట్టే నొప్పి వస్తుంది. చేయి పెట్టి నొక్కితే నొప్పి అనిపిస్తుంది. ఒకోసారి ఈ నొప్పి భుజం దగ్గరకి, ఛాతి వెనకకి, పొట్ట దిగువ భాగానికి ప్రాకుతుంది. పసర తిత్తిలో రాళ్ళు ఏర్పడిన కొందరిలో జ్వరం ఉంటుంది. అప్పుడప్పుడు చలి అనిపిస్తుంది. కొందరికి అకస్మాత్తుగా పసరతిత్తి వాస్తుంది. నొప్పి చేస్తుంది. దీనినే ఎక్యూట్ కోలిసిస్టైటీస్ అంటారు.

కాంప్లికేషన్స్ :

పచ్చ కామెర్లు వస్తాయి. వ్యాధి వల్ల సెప్టిసీమియా, షాక్ కలుగుతాయి. పసర తిత్తి చీముపట్టి పగిలిపోతుంది.

నిర్ధారణ : పసర తిత్తికి ఎక్స్‌రే , అల్ట్రాసౌండ్ స్కానింగ్.

చికిత్స :

1. పసర తిత్తి వాచి నొప్పి ఉన్నప్పుడు విశ్రాంతి తీసుకోవాలి.
2. పసర తిత్తి వాచడం వల్ల, ఇన్‌ఫెక్షన్ కలగడం వల్ల నొప్పి, జ్వరం ఉన్నప్పుడు కొందరిలో వాంతులు, విరోచనాలు ఉంటాయి. ఇటువంటప్పుడు నోటి ద్వారా ఏమీ తీసుకోకూడదు. నరానికి గ్లూకోజ్ పెట్టాలి.



3. యాంపిసిలిన్ 500 మి.గ్రా. కాప్సూల్స్ ప్రతి ఆరుగంటలకి ఒకటి చొప్పున వారం పదిరోజులు వాడాలి. జెంటామైసిన్ 80 మి.గ్రా. చొప్పున ప్రతి 8 గంటలకి ఒకసారి 10 రోజులు వాడాలి. లేదా సిఫ్రాన్ 100 మి.గ్రా. ఇంజక్షన్ ఉదయం, సాయంత్రం నరానికి వారం రోజులు ఇవ్వాలి.

శస్త్ర చికిత్స :

గాల్ బ్లాడర్ వాపు తగ్గకుండా ఉండి తరచు నొప్పి చేయడం, వికారం, వాంతులు ఉండడం, పసర తిత్తిలో రాళ్ళు అడ్డుపడి కామెర్లు వదలకుండా ఉంటే ఆపరేషన్ చేసి పసరతిత్తిని తొలగించవలసి వస్తుంది.

❑❑❑

# 7. ఎక్యూట్ పేన్‌క్రియాటైటిస్

*కొందరిలో పేన్‌క్రియాస్ గ్రంథి అకస్మాత్తుగా వాస్తుంది. మరికొందరిలో పేన్‌క్రియాస్ గ్రంథి కొంత వాచి క్రానిక్‌గా ఉండిపోతుంది.*

**కారణాలు** : గాల్ స్టోన్స్, అతిగా మద్యం సేవించడం, కేన్సర్.

**లక్షణాలు :**

కడుపులో నొప్పి అకస్మాత్తుగా రావడం గానీ, నిదానంగా రావడం గానీ ఉంటుంది, సాధారణంగా కడుపునిండా భోజనం చేసిన తరువాత గానీ, మద్యం సేవించిన తరువాతగానీ పేన్‌క్రియాటిస్ గ్రంథి నొప్పి కనిపిస్తుంది. నొప్పితోపాటు వాంతులు కూడా ఉంటాయి. కొందరిలో నొప్పి వాంతులతోపాటు చెమటలు విపరీతంగా పోస్తాయి. షాక్ పరిస్థితి ఏర్పడుతుంది.

నిర్ధారణ :

సీరమ్ ఎమలైజ్ మామూలుగా కంటే 5 రెట్లు పెరుగుతుంది. రక్తంలో గ్లూకోజ్ శాతం పెరుగుతుంది. కాల్షియం శాతం తగ్గుతుంది. కడుపుకి ఎక్స్‌రే, సి.టి. స్కాన్.

చికిత్స:

1. నొప్పి ఎక్కువగా ఉన్నప్పుడు పెథిడిన్ ఇంజక్షన్ 100 మి.గ్రా. ఇవ్వాలి.
2. నోటి ద్వారా తాగడానికి, తినడానికి ఏమీ ఇవ్వకూడదు.
3. ముక్కు ద్వారా ట్యూబు వేసి కడుపులో ఉన్న పదార్థాలని ద్రవాలని ఎప్పటికప్పుడు బయటకు తీసేయాలి.

4. నరానికి గ్లూకోజ్ పెట్టాలి. షాక్ పరిస్థితి ఎక్కువగా ఉంటే రక్తం కూడా ఎక్కించాలి.
5. ఇన్‌ఫెక్షన్ తగ్గడానికి యాంపిసిలిన్ 500 మి.గ్రా ఇంజక్షన్లు ప్రతి 8 గంటలకి ఒకసారి చొప్పున పదిరోజులు వాడాలి.

సి.టి. స్కాన్ లేదా అల్ట్రాసౌండ్ స్కానింగ్ తిరిగి పది రోజులకి చేసి పేన్‌క్రియాటిస్ ఇన్‌ఫెక్షన్ ఎంత తగ్గింది పరీక్ష చేయాలి. ఇన్‌ఫెక్షన్ పూర్తిగా తగ్గేవరకు మందులు వాడాలి. ఆహారంలో కొవ్వు పదార్థం తక్కువ తీసుకోవాలి. ఎక్కువ మోతాదులో మాంసకృత్తుల ఆహారం తీసుకోవాలి. ఆల్కహాల్ అసలు తీసుకోకూడదు. నొప్పి తగ్గకుండా, పేన్‌క్రియాస్ వాపు ఉన్నవారిలో ఆపరేషన్ చేయవలసి వస్తుంది.

❑❑❑

# 8. వారాల తరబడి విరోచనాలు

*వారాల తరబడి అయ్యే విరోచనాల జబ్బుని క్రానిక్ డయేరియా అంటారు. ఇటువంటి దీర్ఘకాలపు విరోచనాలు రోజూ ఉండవచ్చు లేదా మధ్యలో కొద్ది రోజులు లేకుండా ఉండి మళ్ళీ అవుతూ ఉండవచ్చు. ఇటువంటి విరోచనాలకి ప్రేగుల్లో వ్యాధి ఉండడం, అరుగుదల లేకపోవడం కారణం.*

**కారణాలు :**

జీర్ణాశయంలో బాక్టీరియా, ఫంగస్, వైరస్ వ్యాధులు వదలకుండా ఉండటం. ఎమీబా, ఇ-కోలై క్రిములు ఉండడం. జీర్ణమైన ఆహారం ప్రేగుల ద్వారా పీల్చబడకపోవడం. జీర్ణాశయం ప్రేగులపై ఆపరేషన్లు. పెల్లగ్రా వ్యాధి, జీర్ణకోశం ప్రేగుల్లో పుళ్ళు, కడుపులో టి.బి. వ్యాధి, ప్రేగుల్లో కేన్సర్, ప్రేగుల కదలికల్లో లోపాలు. జీర్ణకోశం ప్రేగుల్లో ఎలర్జీ - కొన్ని పదార్థాలు సరిపడకపోవడం. పేన్‌క్రియాటిస్ గ్రంథి వ్యాధులు, బైల్ సాల్ట్ లోపాలు, జీవ రసాయనికాల లోపాలు, థైరోటాక్సికోసిస్, పేరా థైరాయిడిజమ్, కొన్ని ఎంటాసిడ్స్, రక్తపోటు మందులు, ఉబ్బసం మందులు, కేన్సర్ మందులు, గుండె జబ్బు మందులు, ఐరన్.

**లక్షణాలు :**

కడుపు నొప్పి, కడుపు ఉబ్బరం, మాటిమాటికి విరోచనానికి వెళ్ళాలనిపించడం, బరువు తగ్గడం, జ్వరం, విరోచనంలో జిగురు, రక్తం, కొవ్వు కనబడటం.



నిర్ధారణ :

ప్రాక్టోసిగ్మాయిడోస్కోపి, కొలనోస్కోపి, బేరియమ్ ఎనిమా ఎక్స్‌రే, ఇంటెస్టైనల్ బయాప్సీ,ఛాతి ఎక్స్‌రే , లివర్ బయాప్సీ, లివర్ ఫంక్షన్ టెస్ట్స్ , గాస్ట్రిక్ ఎనాలసిస్, రక్త పరీక్షలు

**చికిత్స :**

1. వ్యాధి మూలకారణాన్ని బట్టి మందులు.
2. రోగి నీరసించిపోకుండా శరీరానికి అందే రీతిలో ఆహారం.
3. నరానికి గ్లూకోజ్, విటమిన్లు, ప్రోటీన్లు.
4. రోగికి పూర్తి విశ్రాంతి.

❑❑❑

# 9. మాల్ ఎబ్జార్‌ప్షన్ సిండ్రోమ్

*మాల్ ఎబ్జార్‌ప్షన్ సిండ్రోమ్ అనేది అనేక వ్యాధుల సమ్మేళనం. దీనివల్ల ఆహారం జీర్ణమైనప్పటికీ ప్రేగుల ద్వారా రక్తంలోకి పూర్తిగా చేరకపోవడం, శరీరంలోని కణాలకి అందకపోవడం జరుగుతుంది. లోపభూయిష్టమైన జీర్ణప్రక్రియవల్ల రోగి ఆరోగ్యం క్షీణిస్తుంది. ముఖ్యంగా కొవ్వు పదార్థాలకి సంబంధించిన జీర్ణప్రక్రియ సక్రమంగా ఉండదు. దాని వల్ల కొవ్వులో కరిగి ఆ పైన ఒంటికి చేరే విటమిన్ ఎ, విటమిన్ డి, విటమిన్ కె, కాల్షియంకు సంబంధించిన అనారోగ్యం ఏర్పడుతుంది.*

**కారణాలు :**

జీర్ణకోశానికి ఆపరేషన్లు జరిగిన వారిలో క్రొవ్వు పదార్థాలు అంతగా పీల్చబడవు. బైల్ యాసిడ్స్ తగినంత ఉత్పత్తి కాకపోవడం వల్ల క్రొవ్వు పదార్థాల జీర్ణప్రక్రియలో లోపం ఏర్పడుతుంది. ప్రేగుల లోపల మ్యూకస్ పొర వ్యాధిగ్రస్తం కావడం వల్ల కొన్ని పదార్థాలు జీర్ణం కావు. కడుపులో పాములు ఉండటం, కొన్ని వ్యాధులు ఉండడం, జీర్ణమైన ఆహారం రక్తంలోకి చేరకపోవడానికి కారణాలు.

**లక్షణాలు :**

ఆహారం సక్రమంగా జీర్ణం కానివారిలో, వంటబట్టని వారిలో తరచూ విరోచనాలు అవుతాయి. కడుపులో నొప్పి ఉంటుంది. పోషక ఆహార లోపం వల్ల కలిగే వ్యాధులు ఉంటాయి. బరువు తగ్గిపోతారు. నీరసంగా తయారవుతారు.

**నిర్ధారణ :**

విరోచనం పరీక్ష, రక్త పరీక్ష, జీవ రసాయనికాల పరీక్ష, బేరియమ్ మీల్ ఎక్స్‌రే, ఛాతి ఎక్స్‌రే, ఎబ్డామినల్ ఎక్స్‌రే, చిన్న ప్రేగుల బయాప్సీ.

**చికిత్స :**

1. ప్రోటీన్లు ఎక్కువవుండే ఆహారం ఎప్పుడూ ఇవ్వాలి.
2. క్రొవ్వు పదార్థాలు తక్కువగా ఇవ్వాలి.
3. పేన్‌క్రియాటిక్ ఎంజైమ్ బిళ్ళలు భోజనం చేసిన తరువాత ఇవ్వాలి.
4. రక్తహీనత సరిదిద్దాలి.
5. విరోచనాలు సరిదిద్దడానికి లోపర్‌మైడ్ టాబ్లెట్స్ ఇవ్వాలి.
6. విటమిన్ 'బి', 'ఎ' 'డి' 'కె' కాల్షియం ప్రత్యేకంగా ఇవ్వాలి. జీర్ణప్రక్రియకి సంబంధించిన లోపాన్ని సరిదిద్దడానికి కోర్సుగా స్టిరాయిడ్స్ ఇవ్వాలి.

❑❑❑

# 10. కడుపులో టి.బి.

*క్షయ వ్యాధి (ట్యూబర్‌కొలోసిస్ లేదా టి.బి) ఊపిరితిత్తులకే కాకుండా శరీరంలో ఏ అంగానికైనా రావచ్చు. పెరిటోనియం, లింఫినోడ్స్, ఇంటెస్టైన్స్, లివర్, గర్భాశయం దేనికైనా టి.బి. రావచ్చు.*

**లక్షణాలు :**

కడుపులో నొప్పి, నీళ్ళ విరోచనాలు, ఆకలి తగ్గిపోవడం, బరువు కోల్పోవడం.

**కాంప్లికేషన్స్ :**

ప్రేగుకి అడ్డంపడడం, ప్రేగు చిల్లుపడడం, కడుపుకి నీరు.

**నిర్ధారణ :**

ఎక్స్‌రే, ఎండోస్కోపి, బయాప్సీ.

**చికిత్స :**

1. టి.బి. మందులు.
2. తేలికగా అరిగే పోషకాహారం, విటమిన్లు, అవసరం బట్టి శస్త్ర చికిత్స .

❑❑❑

# 11. ఇరిటబుల్ బవుల్ సిండ్రోమ్ (ఐ.బి.ఎస్)

*ఐ.బి.ఎస్‌గా పేర్కొనబడే ఇరిటబుల్ బవుల్ సిండ్రోమ్‌లో జీర్ణాశయం, జీర్ణకోశం, ప్రేగులకు సంబంధించిన రకరకాల బాధలు కనబడతాయి. కానీ ప్రేగులలో చెప్పుకోదగ్గ వ్యాధి లక్షణాలు ఏమీ ఉండవు. ప్రధానంగా ఇటువంటి పరిస్థితి స్త్రీలలో కనబడుతుంది.*

**కారణాలు :**

ఐ.బి.ఎస్. కలగడానికి స్పష్టమైన కారణం ఏదీ తెలియదు. కొందరిలో వాంతులు, విరోచనాలు అయిన తర్వాత మూలకారణం నిర్మూలింపబడినా ప్రేగులు పరిగెత్తడం, కడుపు బిగదీయడం, వికారం అనిపించడం మిగిలే ఉంటాయి. ఇంకొందరిలో ఆహారం సరిపడక పేగులలో ఎలర్జీ డెవలప్ అయి కొన్ని వ్యాధి లక్షణాలు కలుగుతాయి. మానసిక వత్తిడి, ఆందోళన ఐ.బి.ఎస్.కి మూలకారణం. మధ్యలో కొంతకాలం ఆరోగ్యంగా ఉన్నట్లు అనిపించినా తిరిగి మానసిక వత్తిడి లక్షణాలు కలిగినప్పుడు ఆ వ్యాధి లక్షణాలు బయటపడతాయి. బైల్ యాసిడ్, మాల్ ఎబ్జార్ప్షన్ కూడా ఐ.బి.ఎస్.కి ఒక కారణం

**లక్షణాలు :**

కడుపులో నొప్పి, కడుపులో గుడగుడ, కడుపులో కుడివైపుగానీ ఎడమ వైపుగానీ లేదా రెండు వైపులా గానీ నొప్పి అనిపిస్తుంది. ఈ నొప్పి ప్రేగులు మెలిపెడుతున్నట్టు ఉంటుంది. ఈ మెలిపెట్టే నొప్పి కొద్ది నిముషాలు ఉండొచ్చు లేదా గంటల తరబడి ఉండొచ్చు. సాధారణంగా ఈ నొప్పి ఉన్నప్పుడు విరోచనానికి వెళ్ళాలనిపిస్తుంది. విరోచనంలో పెద్దగా మలం లేకపోయినా కొంత గ్యాస్ పోయి నొప్పి తగ్గినట్టు అనిపిస్తుంది. మళ్ళీ కొద్దిసేపటికి మెలినొప్పి రావడం, విరోచనానికి వెళ్ళడం జరుగుతూనే ఉంటుంది. ఎక్కువ మందిలో ఏ కాస్త తిన్నా ఇట్లా నొప్పి అనిపించడం, విరోచనానికి వెళ్ళటం ఉంటుంది. తరచూ విరోచనానికి వెళ్ళాలనిపించడం ఐ.బి.ఎస్‌లోని ప్రధాన లక్షణం. విరోచనానికి వెళ్ళొచ్చినా ఇంకా కడుపులో మలమో, గ్యాసో మిగిలి ఉన్నట్లు ఫీలింగ్ ఉంటుంది, అధిక సంఖ్యాకుల్లో కడుపు ఉబ్బరం అనిపిస్తుంది. ముఖ్యంగా కింది కడుపు ఉబ్బరంగా అనిపిస్తుంది.

తిన్నా తినకపోయినా వికారం ఉంటుంది. కొద్దిగా తినగానే కడుపు నిండి పోయినట్టు ఉంటుంది. కొందరు స్త్రీలలో తరచూ విరోచనానికి వెళ్ళాలనిపించడమే కాకుండా తరచు మూత్ర విసర్జన కూడా చేయాలనిపిస్తుంది. వదలకుండా నడుము నొప్పి ఉంటుంది.

నిర్ధారణ :

మల పరీక్ష, రక్త పరీక్ష ఇతర పరీక్షలలో ఏమీ కనబడదు. సిగ్మాయిడోస్కోపి చేస్తే పెద్ద ప్రేగులలో మ్యూకస్ ఎక్కువగా కనపడుతుంది. ప్రేగులు తరచుగా స్పాజంకు లోనవ్వడం కనపడుతుంది.

చికిత్స :

1. ఐ.బి.ఎస్ ప్రధానంగా మానసిక ఆందోళన, వత్తిడి వల్ల కలుగుతుంది. చాలా మందిలో మానసిక వత్తిడిని, ఆందోళనని తట్టుకునే సామర్థ్యం ఉండదు. వీళ్ళల్లో ఐ.బి.ఎస్ ఉన్నప్పుడు అది రావడానికి గల మానసిక స్థితిని వివరించాలి. మానసిక వత్తిడిని ఆందోళనని తగ్గించుకోవాలని, అవి కలిగే పరిస్థితులకి దూరంగా ఉంటే వ్యాధి తగ్గిపోతుందని హామీ ఇవ్వాలి. చాలా మందిలో మనస్సుని చక్కదిద్దుకోవడంతో ఎటువంటి మందు లేకుండా జబ్బు తగ్గిపోతుంది.
2. ఆహారంలో పీచు పదార్థం ఎక్కువగా తీసుకోవాలి. కాయగూరలు, ఆకుకూరలు, దంపుడు బియ్యం తీసుకుంటే విరోచనం ఒకేసారి ఎక్కువై కడుపు తేలికయినట్లు అనిపిస్తుంది.
3. యాంటీ స్పాస్మోడిక్స్
4. లోపరమైడ్, కొడీన్ వంటి బిళ్ళలు తగిన మోతాదులో రోజూ 3 సార్లు ఇవ్వాలి.
5. ట్రాంక్విలైజర్స్
6. రిలాక్సేషన్ థెరపి
7. హిప్నోథెరపి

ఐ.బి.ఎస్‌కి కొన్ని నెలలపాటు మందులు, మానసిక చికిత్స చేయవలసి ఉంటుంది.

❑❑❑

# 12. అల్సరేటివ్ కోలైటిస్

*అల్సరేటివ్ కోలైటిస్ పెద్ద పేగుకి సంబంధించిన పుండు వ్యాధి. ఈ పుండు వల్ల తరచుగా రక్తంతో కూడిన విరోచనాలు అవుతాయి. ఈ పుండు ఎలా ఏర్పడుతుందో, ఎందుకు ఏర్పడుతుందో అంతుపట్టని విషయం.*

కారణాలు :

సాధారణంగా 20 నుంచి 40 సంవత్సరాల వయసు వారిలో అల్సరేటివ్ కోలైటిస్

వ్యాధి వస్తుంది. కొన్ని కుటుంబాలలో ఎక్కువ మందిలో ఈ వ్యాధి కనబడటం వల్ల ఒక తరం నుంచి మరొక తరానికి జీన్స్ ద్వారా ఈ వ్యాధి సంక్రమిస్తుందనే అభిప్రాయం ఒకటి ఉంది.

శరీరంలో రోగ నిరోధక శక్తి తక్కువ ఉండటం కూడా ఈ వ్యాధి రావడానికి ఒక కారణంగా భావించబడుతుంది.

మానసిక ఒత్తిడి, ఆందోళన కూడా ఒక ప్రధాన కారణం.

**లక్షణాలు :**

అల్సరేటివ్ కోలైటిస్ వ్యాధి లక్షణాలు కొందరిలో తక్కువగా ఉంటాయి. మరికొందరిలో ఎక్కువగా ఉంటాయి. ఈ వ్యాధిలో ప్రధానంగా తరచు విరోచనాలు అవడం, ఆ విరోచనంలో జిగురు, రక్తం ఉండడం ప్రధాన లక్షణం. కడుపు కండరాలు బిగదీస్తాయి. మలద్వారం దగ్గర నొప్పి ఉంటుంది. మలద్వారం దగ్గర కండరాలు బిగుసుకొని బాధ కలిగిస్తాయి. కొందరిలో వ్యాధి లక్షణాలు ఎక్కువ ఉన్నప్పుడు జ్వరం కూడా ఉంటుంది.

ఆకలి తగ్గిపోతుంది. వికారంగా ఉంటుంది. ఆహారం తగినంత తినకపోవడంతో బరువు తగ్గిపోతారు.

రక్తహీనత ఏర్పడుతుంది. పౌష్టికాహార లోపం వల్ల కొన్ని వ్యాధి లక్షణాలు కలుగుతాయి. నోటి పూత ఉంటుంది.

**దుష్ఫలితాలు :**

ఈ వ్యాధి వల్ల పెద్ద ప్రేగు బాగా ఉబ్బి పుండు పడి ప్రేగుకి చిల్లు పడవచ్చు. ప్రేగులో బ్లీడింగు అధికం కావచ్చు. కొందరికి ఈ పుండు కేన్సర్‌గా మారొచ్చు.

**పరీక్షలు :**

మల పరీక్ష : ఎమీబియాసిస్ అవునో, కాదో తెలుసుకోడానికి మల పరీక్ష, సిగ్మాయిడోస్కోపి, రెక్టల్ బయాప్సీ, బేరియమ్ ఎనీమా, కొలనోస్కోపి.

**చికిత్స :**

1. పూర్తి బెడ్ రెస్ట్ ఇవ్వాలి.
2. విరోచనాల ద్వారా కోల్పోయిన నీరు, ఎలక్ట్రలైట్స్ తిరిగి చేకూర్చడానికి నరానికి సెలైన్ ఎలక్ట్రోలైట్స్ పెట్టాలి.

3. రక్తహీనతను సరిదిద్దడానికి మందులు, రక్తహీనత ఎక్కువ ఉంటే బ్లడ్ ఎక్కించాలి.

మందులు :

1. అల్సరేటీవ్ కోలైటిస్ తీవ్రంగా ఉన్నప్పుడు నరానికి హైడ్రోకార్టిజోన్ 100 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు ఇవ్వాలి. అలా 5 రోజులు ఇవ్వాలి.
2. వ్యాధి అంత తీవ్రంగా లేనప్పుడు ప్రెడ్నిసాలోన్ టాబ్లెట్స్ 20 నుంచి 60 మి.గ్రా. రోజుకు 3 సార్లు ఇవ్వాలి.
3. సల్ఫాసాలజిన్ టాబ్లెట్స్ రోజు మొత్తంలో రెండు నుంచి 4 గ్రాములు ఇవ్వాలి.
4. విరోచనాలు కంట్రోలు అవ్వడానికి కొడిన్ ఫాస్ఫేట్ 180 మి.గ్రా. రోజు మొత్తంలో ఇవ్వాలి.
5. కొందరికి సర్జరీ అవసరం అవుతుంది.

## పొగత్రాగడంవల్ల నష్టాలు

తరచు దగ్గు.
రక్తపోటు.
గుండెపోటు.
లంగ్ కేన్సర్.
రక్తనాళాలు సన్నబడి రక్తప్రసరణకి అవరోధం.
పక్షవాతం.
కాళ్లకి రక్తప్రసరణ తగ్గి ప్రమాదకర పరిణామాలు.
జీర్ణాశయంలో పుండ్లు.
నోట్లో, మూత్రపిండాల్లో, మూత్రకోశంలో కేన్సర్.

ధూమపానంవల్ల గుండెజబ్బు, రక్తపోటు, మధుమేహం, ఉబ్బసం, పక్షవాతం, కడుపులో పుండు, శ్వాసకోశవ్యాధులు ఉన్నవారికి మరింత హాని కలుగుతుంది.

నశ్యం - ధూమపానం - గుట్కా, పాన్ మసాలా అలవాట్లు అన్నీ ఒకేవిధమైన హాని కలిగిస్తాయి.

**ధూమపానం మానండి - ప్రాణహానికి దూరం కండి**

# 8. మూత్రపిండాల వ్యాధులు

## 1. మూత్రంలో రక్తం

మామూలుగా మూత్రంలో రక్తం ఉండదు. మూత్రపిండాల వ్యాధులు ఉన్నప్పుడే మూత్రంలో రక్తం కనబడుతుంది. మూత్రంలో రక్తం చాలా ఎక్కువగా కనబడొచ్చు లేదా మైక్రోస్కోప్‌లో మూత్రాన్ని పరీక్ష చేస్తే రెండు, మూడు ఎర్ర కణాలు మాత్రమే కనబడొచ్చు. ఏదైనా మూత్రంలో రక్తం కనబడే పరిస్థితిని 'హిమట్యూరియా' అంటారు.

**కారణాలు:**

మూత్ర పిండాలలోగానీ, మూత్ర వాహికలలోగానీ రాళ్ళు ఉండటం. మూత్రపిండాలకు ఇన్‌ఫెక్షన్. పుట్టుకతో మూత్రపిండాల వ్యాధులు. మూత్ర పిండాలకు కేన్సర్. సల్ఫా మందులు, మరికొన్ని ఇతర మందులు. మూత్ర పిండాలకి గాయాలు. మూత్ర పిండాలకి రేడియేషన్. ప్రోస్టేట్ గ్రంధికి కేన్సర్. మూత్రకోశంలో వ్యాధులు, రాళ్ళు. మూత్రనాళానికి గాయం. రక్తస్రావ వ్యాధులు. మెలిగ్నెంట్ మలేరియా.

మూత్రంలో రక్తం కనబడటానికి ప్రధానంగా రాళ్ళు ఏర్పడడం, క్షయ వ్యాధి, కంతులు, కేన్సర్ కారణం.

**లక్షణాలు:**

మూత్ర విసర్జన సమయంలో నొప్పి, మంట. మూత్రం ఎక్కువసార్లు రావడం. కడుపు నొప్పి, నడుము నొప్పి. జ్వరం. మూత్రం రంగు మారడం. మూత్రంలో రాళ్ళు పడటం.

**నిర్ధారణ:**

మూత్ర పరీక్ష, రక్త పరీక్షలు, కడుపుకి ఎక్స్‌రే, ఐ.వి.పి, సిస్టోస్కోపి, అల్ట్రా సోనోగ్రఫి, సి.టి.స్కాన్, యం.ఆర్.ఐ, యాంటీగ్రేడ్ యండ్ రిట్రోగ్రేడ్ పైలోగ్రఫి, రీనల్ బయాప్సి.

**చికిత్స:**

***వ్యాధి కారణం బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది.***

***వాడవలసిన మందులు వేరే చోట ఇవ్వబడ్డాయి.***

❑❑❑

# 2 . ఉబ్బు కామెర్లు (నెఫ్రైటిస్)

మూత్ర పిండాలకి వ్యాధి వచ్చినప్పుడు ముఖం ఉబ్బుతుంది. కళ్ళ క్రింద ఉబ్బరంగా తయారవుతుంది. వైద్య పరిభాషలో 'గ్లోమరులార్ డిసీజ్' అంటారు. ఈ డిసీజ్ కోవలోకి ఎక్యూట్ నెఫ్రైటిస్, క్రానిక్ నెఫ్రైటిస్, నెఫ్రోటిక్ సిండ్రోమ్ వంటి వ్యాధులు వస్తాయి.

**కారణాలు:**

బాక్టీరియల్ అండ్ వైరల్ ఇన్‌ఫెక్షన్స్. మలేరియా, ఫైలేరియా. సిస్టోజోమియాసిస్, కొన్ని శారీరక వ్యాధులు.

**లక్షణాలు:**

ముఖం ఉబ్బరంగా తయారవడం, మూత్రం తక్కువ అవడం. మూత్రం పొగ రంగులో ఉండడం, మూత్రంలో రక్తం ఉండడం, జ్వరం. ఒళ్ళు నొప్పులు, వికారం, వాంతులు, ఫిట్స్, నీరసం, ఆకలి లేకపోవడం, పాలిపోవడం.

**నిర్ధారణ :** మూత్ర పరీక్ష , యూరిన్ కల్చర్, రక్త పరీక్షలు, స్కానింగ్ టెస్ట్, రీనల్ బయాప్సి.

**చికిత్స:**

1. ఉబ్బు కామెర్లు వచ్చినప్పుడు వ్యాధి నుండి కోలుకునేవరకు పూర్తి విశ్రాంతి తీసుకోవాలి.
2. లెక్కప్రకారం నీరు త్రాగాలి. రోజంతటికి ఎంత మూత్రం అవుతున్నదో ప్రతి రోజు కొలత వేస్తూ, ముందురోజు అయిన మూత్రం కొలతకి అదనంగా అర లీటరు నీరు తీసుకోవచ్చు.
3. ఉప్పు తక్కువ వాడాలి.
4. మాంసకృత్తుల ఆహారం తక్కువ తీసుకోవాలి.
5. మూత్రం అవడానికి లాసిక్స్ వంటి మందులు వాడాలి.
6. యాంటిబయోటిక్ మందులు వాడాలి.
7. అవసరం బట్టి డయాలసిస్ చేయాలి.

మందుల వివరాలు వేరే చోట ఇవ్వబడ్డాయి.

❑❑❑

# 3. నెఫ్రోటిక్ సిండ్రోమ్

ఈ వ్యాధి కూడా మూత్రపిండాలు డామేజి అవడం వల్ల వస్తుంది. ఈ వ్యాధిలో ముఖ్యంగా 3 లక్షణాలు ఉంటాయి.

ముఖం ఉబ్బరం. మూత్రంలో అత్యధిక శాతంలో ఆల్బుమిన్. రక్తంలో ప్రోటీన్ శాతం తగ్గిపోవడం.

**కారణాలు:**

80 శాతం కేసుల్లో స్పష్టమైన కారణం లేకుండానే మూత్రపిండాలలోని గ్లోమరోలై డామేజి అవడం. తక్కిన 20 శాతం కేసుల్లో ఇన్‌ఫెక్షన్లు, రకరకాల మందులు, కంతులు కారణం.

**లక్షణాలు:**

నెఫ్రోటిక్ సిండ్రోమ్ రెండు, మూడు సంవత్సరాల వయసు వారిలో రావడం ఎక్కువ. ముఖం ఉబ్బరం, ఒంటికి నీరు, ఉబ్బుగా పొట్ట బరువు పెరగడం, ఆకలి లేకపోవడం, తేలికగా అలసిపోవడం, ఆయాసం, రక్తపోటు పెరగడం.

**నిర్ధారణ:** మూత్ర పరీక్షలో మూత్రంలో అధికంగా ఆల్బమిన్ ఉంటుంది. రక్త పరీక్షలో రక్తంలో ప్రోటీన్ శాతం తగ్గిపోతుంది, రీనల్ బయాప్సీ.

**చికిత్స:**

1. కార్టికో స్టిరాయిడ్స్ - ప్రెడ్నిసొలోన్ రోజుకి 60 మి.గ్రా. నాలుగు వారాల తరువాత నిదానంగా మోతాదు తగ్గించాలి.
2. మాంసకృత్తులు ఎక్కువ ఉన్న ఆహారం ఇవ్వాలి.
3. మూత్రం ఎక్కువ అవడానికి లాసిక్స్ బిళ్ళలు వాడాలి.
4. ఇతర వ్యాధులు సోకకుండా ముందు జాగ్రత్తగా యాంటిబయోటిక్ మందులు వాడాలి.

❑❑❑

# 4. ఎక్యూట్ రీనల్ ఫెయిల్యూర్

ఎక్యూట్ రీనల్ ఫెయిల్యూర్‌లో కిడ్నీ ఫంక్షన్ అకస్మాత్తుగా పడిపోతుంది. దీనివల్ల మూత్రం చాలా తక్కువ అవడం, అసలు కాకపోవడమో ఉంటుంది. రక్తంలో యూరియా శాతం పెరుగుతుంది.

కారణాలు:

ఒళ్ళు కాలడం. విష పదార్థాల వల్ల అకస్మాత్తుగా కిడ్నీ డామేజి అవడం. కార్డియాక్ ఫెయిల్యూర్. అధికంగా రక్తస్రావం జరగడం. ఆపరేషన్లు. ఒంట్లో నీరు తగ్గిపోవడం. ఇన్‌ఫెక్షన్లు.

లక్షణాలు:

మూత్ర విసర్జన అకస్మాత్తుగా తగ్గిపోవడం, వికారం, వాంతులు, రక్తపోటు పెరగడం, ఆయాసపడటం, మగత, ఫిట్స్.

నిర్ధారణ: మూత్ర పరీక్షలు, రక్త పరీక్షలు, స్కానింగ్.

చికిత్స:

1. నరానికి గ్లూకోజ్ సలైన్, ఎలక్ట్రోలైట్స్.
2. మానిటాల్ 50 యం.యల్. చొప్పున రోజుకి 3 సార్లు.
3. లాసిక్స్.
4. డోపమైన్ డ్రిప్.
5. యాంటి బయోటిక్స్.
6. డయాలసిస్.

❑❑❑

# 5. యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్

యూరినరీ ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్‌నే యు.టి.ఐ. అని, మూత్ర సంబంధిత వ్యాధి అని అంటారు. గర్భిణి స్త్రీలలోనూ, లైంగిక వ్యాధులు ఉన్నవారిలోనూ యూరినరి ట్రాక్ట్ ఇన్‌ఫెక్షన్స్ సహజం.

కారణాలు:

ప్రోస్టేట్ ఎన్‌లార్జ్‌మెంట్, రాళ్ళు ఏర్పడటం, షుగర్ కంప్లైంట్ ఉండటం. మూత్రనాళం సన్నబడటం. బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్స్ - ఇ.కోలై, స్టెఫలోకోకై, క్లబ్ సెల్లా, ప్రోటియస్, కాండిడా, ఎంటరోకోకై, సూడోమొనాస్, ట్యూబర్‌కోలోసిస్ క్రిములు కారణం. ఈ క్రిములు మూత్రపిండాలు, మూత్ర వాహికలు, మూత్రకోశం, మూత్ర నాళంలో స్థావరం ఏర్పరుచుకుంటాయి. శుభ్రతను పాటించకుండా యూరినరి కేథిడర్ వేయడం.

లక్షణాలు:

అకస్మాత్తుగా జ్వరం, వణుకు, వికారం, వాంతులు, కడుపునొప్పి, నడుం నొప్పి,మూత్రంలో మంట, మాటిమాటికి మూత్రం రావడం.

నిర్ధారణ:

మూత్ర పరీక్ష, యూరిన్ కల్చర్, స్కానింగ్, ఐ.వి.పి., సిస్టోస్కోపి.

చికిత్స:

1. నీరు ఎక్కువగా త్రాగాలి.
2. ఆల్కలైన్ సెట్రేట్ తీసుకోవాలి.
3. యాంటిబయోటిక్స్ - నార్‌ఫ్లాక్సాసిన్, సిప్రోఫ్లాక్సాసిన్, లోమోఫ్లాక్సాసిన్, ఎరిత్రోమైసిన్, కోట్రైమాక్సిజాల్ మొదలైన మందులు.

మందుడోస్ :

నార్‌ఫ్లాక్సాసిన్ 400 మి.గ్రా. ఉదయం ఒకటి, రాత్రి ఒకటి

సిప్రోఫ్లాక్సాసిన్ 500 మి.గ్రా. ఉదయం ఒకటి, రాత్రి ఒకటి.

లోమోఫ్లాక్సాసిన్ 400 మి.గ్రా. రోజుకి ఒకసారి.

ఎరిత్రోమైసిన్ 500 మి.గ్రా. ప్రతి 6 గంటలకి ఒకసారి.

❑❑❑

# 6 . మూత్రపిండాలలో రాళ్ళు

మూత్రపిండంలో రాళ్ళు 30 సంవత్సరాలు దాటిన వారిలో ఎక్కువ కనబడుతుంది. స్త్రీలలో కంటే పురుషులలో 3 రెట్లు ఎక్కువ.

కారణాలు:

ఇన్‌ఫెక్షన్లు , మూత్ర విసర్జనకు అవరోధం - ప్రోస్టేట్ ఎన్‌లార్జ్‌మెంట్, స్ట్రిక్చర్ యురిత్రా. బెడ్ మీదనుంచి లేవలేని పరిస్థితి, మూత్రంలో ఆక్జలేట్, కాల్షియం, సిస్టిన్ అధికంగా ఉండడం. మంచినీళ్ళు తక్కువ త్రాగడం.

మూత్రపిండాల రాళ్ళల్లో రకాలు:

* కాల్షియం ఆక్సలైట్ స్టోన్స్
* కాల్షియం ఫాస్ఫేట్ స్టోన్స్
* యూరేట్ స్టోన్స్
* ట్రిపిల్ ఫాస్ఫేట్ స్టోన్స్
* సిస్టిన్ స్టోన్స్

లక్షణాలు:

కడుపులో మెలిపెడుతున్నట్లు, పిండుతున్నట్లు తీవ్రమైన నొప్పి, నొప్పితోపాటు వాంతులు, అతిగా చెమటలు. కడుపులో వచ్చే నొప్పి మగవాళ్ళల్లో వృషణాలకి ప్రాకుతుంది. స్త్రీలల్లో లేబియాలోకి ప్రాకుతుంది. మూత్రంలో రక్తం, నడుం నొప్పి.

నిర్ధారణ: మూత్ర పరీక్ష-మూత్రంలో రక్తం ఉంటుంది. చీము కూడా ఉండొచ్చు. క్రిస్టల్స్ ఉంటాయి, కడుపుకి ఎక్స్‌రే, సి.టి.స్కాన్, యం.ఆర్.ఐ.

చికిత్స:

1. నీరు ఎక్కువగా త్రాగడం.
2. యాంటి బయోటిక్ మందులు వాడటం.
3. నొప్పి తగ్గడానికి మందులు.
4. పెర్‌కిటోనియస్ నెఫ్రోలిథాటమి (పి.సి.యన్.యల్.).
5. ఎక్స్‌ట్రా కార్పొరల్ షాక్ వేవ్ లిథోట్రిప్సి.
6. ఓపెన్ సర్జరి.

□□□

## టైంకి భోజనం అంటే

ఉషోదయంతో ఆకలి కలిగించే జీవ జీర్ణ రసాయనికాలు కడుపులో స్రవించడం ఎక్కువ అవుతాయి. సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి జీవజీర్ణ రసాయనికాల ఉత్పత్తి మరింత ఎక్కువలో ఉంటాయి. సూర్యాస్తమయంతో తగ్గుతాయి. దానికి తగిన విధంగానే ఆహారం తీసుకోవడం ఉండాలి.

ఉదయం 6 నుండి 8 గంటలలోగా అల్పాహారం.

మధ్యాహ్నం 12 నుండి 2 గంటలలోగా భోజనం.

రాత్రి 6 నుండి 8 గంటలలోగా భోజనం.

——సమయానికి భోజనం సరైన ఆరోగ్యానికి మూలం——

# 9. వినాళ గ్రంథులు వ్యాధులు

## 1. జైగాంటిజం మరియు మాక్రోమెగలి

*అతిగా ఎత్తు పెరుగుదలని జైగాంటిజం అంటాం. 17-18 సంవత్సరాల వరకు ఎపిఫిసిస్ పెద్ద ఎముకకి పూర్తిగా అంటుకుపోదు. ఈ వయసులోపల పిట్యూటరి గ్రంథి అత్యధిక శాతంలో గ్రోత్‌హార్మోన్‌ని ఉత్పత్తి చేసినట్లయితే మనిషి మామూలుగా ఉండవలసిన ఎత్తుకంటే ఎక్కువ ఎత్తు పెరగడం జరుగుతుంది. ఒకవేళ ఈ హార్మోను ఎపిఫిసిస్ అంటుకుపోయిన తరువాత అనగా 17-18 సంవత్సరాల తరువాత గ్రోత్‌హార్మోన్ అధికశాతంలో ఉత్పత్తి అయితే ఎత్తు పెరగటం కాకుండా క్రింది దవడ, చేతులు, పాదాలు పెద్దగా ఎదుగుతాయి. దీనిని మాక్రోమెగలి అంటారు.*

*పిట్యూటరీ గ్రంథి అధికంగా పనిచేయడాన్ని హైపర్ పిట్యూటరిజం అంటారు. జైగాంటిజం, మాక్రోమెగలి హైపర్ పిట్యూటరిజం పరిణామాలే.*

**హైపర్ పిట్యూటరిజం లక్షణాలు:**

తలనొప్పి, వాంతులు, చూపు మందగించడం, ఒకే వస్తువు రెండుగా కనపడడం, బరువు పెరగడం, అధికంగా చెమటలు, చేతులు పాదాలు పెద్దవి అవడం, వెన్నుపూసలో అంగవైకల్యం, నాలిక పరిమాణం పెరగడం, పెదవులు, ముక్కు పెద్దవి అవడం, రక్తపోటు, ఊపిరితిత్తులు పరిమాణం పెరగడం , ఇతర పిట్యూటరి హార్మోన్ల అస్తవ్యస్తత.

**నిర్ధారణ:** తలకి ఎక్స్‌రే, సి.టి.స్కానింగు, యం. ఆర్. ఐ., హార్మోన్ల పరీక్ష.

**చికిత్స:**

1. ఇర్రాడియేషన్.
2. పిట్యూటరి గ్రంథి మీద సర్జరి.
3. బ్రోమోక్రిప్టిన్ రోజుకి 20-30 మి.గ్రా. ఇవ్వాలి.

❑❑❑

## 2. ఇతర హైపర్ పిట్యూటరిజం పరిస్థితులు

*కుషింగ్ డిసీజ్, హైపర్ ప్రోలాక్టీనీమియా, నెల్సన్ సింగ్రోమ్, ప్రికాషియస్ ప్యూబర్టి.*

❑❑❑

# 3 . హైపోపిట్యూటరిజం

పిట్యూటరి గ్రంథి తక్కువగా పనిచేసినప్పుడు గ్రోత్‌హార్మోన్ తగినంతగా లేకపోవడంతో పిట్యూటరి డ్వార్ఫిజం (మరుగుజ్జులు)గా తయారవుతారు.

చిన్నప్పటి నుంచి పిట్యూటరి గ్రంథి తగినంత గ్రోత్‌హార్మోన్‌ని ఉత్పత్తి చేయనప్పుడు ఎదుగుదల చాలా నిదానంగా ఉంటుంది. చివరికి మరుగుజ్జులుగా మిగిలిపోతారు. వీరిలో తెలివితేటలు అందరిలాగానే ఉంటాయి కొందరిలో హైపో పిట్యూటరిజంతో పాటు గొనాడో ట్రాఫిక్ హార్మోన్లు కూడా తక్కువ శాతంలో విడుదల అవుతాయి. అటువంటప్పుడు సెక్సువల్‌గా కూడా ఎదుగుదల ఉండదు.

చిన్నతనంలోనే గ్రోత్‌హార్మోన్ తక్కువగా ఉందని గుర్తిస్తే ఈ హార్మోన్‌నిరెండు మి.గ్రా. చొప్పున వారానికి రెండు, మూడుసార్లు ఇవ్వాలి. అవసరం బట్టి థైరాయిడ్, ఎడ్రినల్ కార్టికాయిడ్స్, టెస్టోస్టిరోన్ లేదా ఈస్ట్రోజన్ హార్మోన్లు ఇవ్వాలి.

మరుగుజ్జుతనానికి కారణాలు:

1. వంశంలో మరుగుజ్జులు ఉండడం.
2 .ప్యూబర్టి (కౌమార దశ) ఆలస్యం అవడం.
3. పుట్టుకతో బరువు తక్కువ ఉండడం.
4. పౌష్టికాహార లోపం
5. గ్రోత్ హార్మోన్ల లోపం
6. క్రోమోజోమ్‌ల అస్తవ్యస్తత.
7. దీర్ఘవ్యాధులు
8. మానసికంగా కృంగిపోవడం

❑❑❑

# 4. ఫ్రోలిక్ సిండ్రోమ్

ఇందులో ఒంటికి అత్యధికంగా కొవ్వు చేరడం. వృషణాలు ఎదగకపోవడం స్త్రీల వలె రొమ్ములు రావడం ప్రధాన లక్షణాలు.

మూలకారణాన్ని సరిదిద్దితే చాలా వరకు మామూలవుతారు.

❑❑❑

# 5 . డయబిటిస్ ఇన్‌స్పిడస్

రోజుకు మూడు లీటర్ల కంటే ఎక్కువ మూత్రాన్ని తయారు చేయడం, మూత్రం సాంద్రత తక్కువ ఉండడం, ఎక్కువ సార్లు మూత్రం పోయడం, డయబిటిస్ ఇన్‌స్పిడస్

*లక్షణాలు. దీనికి ముఖ్యంగా యాంటీడయాబిటిక్ హార్మోను లోపం కారణం. అంతే కాకుండా గ్లోమెరోలై క్రింది ట్యూబ్యూల్స్ సక్రమంగా పనిచేయకపోవడం.*

**కారణాలు :**డయబిటిస్ ఇన్‌స్పిడస్ వంశపారపర్యంగా రావచ్చు. కొందరిలో పిట్యూటరి గ్లాండ్‌కి ట్యూమర్ వల్ల, తలకి దెబ్బతగలడం వల్ల, బ్రెయిన్ సర్జరీ వల్ల, మెదడు టి.బి. వల్ల, మెదడు వాపు వల్ల రావచ్చు.

**లక్షణాలు :** ఈ వ్యాధి ఉన్నవారికి ఎక్కువగా మూత్రం అవడమేకాకుండా అధికంగా దాహం అవుతుంది.

**నిర్ధారణ :** ఎనిమిది గంటలపాటు నీళ్ళు త్రాగకపోతే డీహైడ్రేషన్ కలగడం, యాంటి డయూరిటిక్ ఎస్టిమేషన్, స్కల్ ఎక్స్‌రే.

డయబిటిస్ ఇన్‌స్పిడస్, డయబిటిస్ మెలిటస్ రెండు వేరువేరు. డయాబిటిస్ మెలిటస్‌లో మూత్రంలో షుగర్ ఉంటుంది. మూడు లీటర్ల కంటే మించి మూత్ర విసర్జన ఉండదు.

**చికిత్స:**

డిస్మొప్రెస్సిన్ 10 నుంచి 20 మి.గ్రా రోజుకి ఒకటి రెండు సార్లు, క్లోరోప్రోపమైడ్ 250 నుంచి 500 మి.గ్రా. **లేదా** కార్బమా జెపిన్ రోజుకి 400 నుంచి 800 మి.గ్రా.

❑❑❑

# 6 . స్థూలకాయం

*ఒంటికి అధికంగా కొవ్వు చేరడం ఎండోక్రైన్ గ్లాండ్స్ లోపం వల్ల కూడా కలుగుతుంది.*

**కారణాలు:** ఎక్కువగా భుజించడం, వ్యాయామం లేకపోవడం, వంశపారంపర్య లక్షణం, పిట్యూటరి గ్రంథి లోపం, థైరాయిడ్ గ్రంథి తగినంత హార్మోన్లు ఉత్పత్తి చేయకపోవడం, ఎడ్రినల్ కార్టెక్స్ సక్రమంగా పనిచేయకపోవడం, గొనాడ్స్ సరిగా పనిచేయకపోవడం, పాన్‌క్రియాటిస్‌లో ట్యూమర్స్, హైపోథెలమస్ లోపాలు, ఎన్‌కెఫలైటిస్, ఫ్రోలిక్ సింట్రోమ్,థర్డ్ వెంట్రుక్యులర్ ట్యూమర్, సెరిబ్రల్ ఇంజ్యూరీస్.

**చికిత్స:**

1. వ్యాయామం.
2. చాలా తక్కువ కేలరీలు ఉన్న పదార్థాలను భుజించడం.
3. యాంఫిటమైన్ రోజుకి 20 మి.గ్రా. **లేదా** ఫెన్‌ఫ్లోరమిన్ రోజుకి 60 మి.గ్రా.
4. సైకోథెరపి.

❑❑❑

# 7. హైపర్ థైరాయిడిజం (గ్రేవ్స్ డిసీజ్)

*థైరాయిడ్ గ్రంథి అత్యధికంగా పనిచేయటం వల్ల కలిగే పరిస్థితిని హైపర్ థైరాయిడిజం అంటారు. హైపర్ థైరాయిడిజంలో ఫ్రీ థైరాక్సిన్ (టి-4) ట్రైఐడో థైరాక్సిన్ (టి-3) శాతం పెరుగుతాయి.*

**కారణాలు:** గ్రేవ్స్ డిసీజ్ (డిఫ్యూజ్ టాక్సిగాయిటర్), నాడ్యుల్లార్-గాయిటర్.

**గ్రేవ్స్ డిసీజ్:** ఈ వ్యాధి పురుషులలో కంటే స్త్రీలలో ఆరు రెట్లు ఎక్కువ. వయస్సులో ఉన్నవారిలో ఈ వ్యాధి ఎక్కువ కనబడుతుంది. కొన్ని కుటుంబాలలో ఈ వ్యాధి ఎక్కువ.

**లక్షణాలు:** థైరాయిడ్ గ్రంధి పరిమాణం పెరుగుతుంది. ఈ వ్యాధి ఉన్నవారిలో యాంగ్జయిటీ, టెన్షన్, భయం, గందరగోళం ఎక్కువ కనబడతాయి. చేతుల్లో వణుకు ఉంటుంది. నాడి వేగంగా కొట్టుకుంటుంది. మెడ మీద, ముఖం మీద చెమటలు ఎక్కువ పోస్తాయి. కంటిగుడ్లు పైకి ఉబ్బినట్టు కనబడతాయి. రోగి బరువు కోల్పోతాడు. ఒంట్లో కొవ్వు కరిగిపోతుంది. తరచు విరోచనాలు అవుతాయి.

**నిర్ధారణ:** టి.ఎస్.హెచ్. లెవల్స్ పెరుగుతాయి, టి-3, టి-4 లెవల్స్ పెరుగుతాయి. ప్రధానంగా టి-3 లెవల్స్ ఎక్కువగా ఉంటాయి, థైరాయిడ్ స్కానింగు.

**చికిత్స:**

1. కార్బిమాజోల్ 15 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు. నెల రోజులు వాడాలి. ఆ తరువాత 10 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు వాడాలి. వ్యాధి కంట్రోల్ అయిపోయిన తరువాత రోజుకి ఒక మాత్ర చొప్పున 5 నుంచి 20 మి.గ్రా. వాడాలి. సాధారణంగా రెండు సంవత్సరాలు దాటిన తరువాత మందులు అవసరం ఉండదు.
2. ప్రొప్రనాల్ 40 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు.
3. సబ్‌టోటల్ థైరాయిడ్‌క్టమి ఆపరేషన్ ద్వారా కొంత థైరాయిడ్ గ్రంథిని తొలగించడం.
4. రేడియో యాక్టీవ్ ఐడీన్.
5. విశ్రాంతి.
6. కాంపోస్ 5 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు.
7. విటమిన్లు.

□□□



# 8. హైపో థైరాయిడిజం

*హైపోథైరాయిడిజంలో టి-4. టి-3 లెవల్స్ తక్కువగా ఉంటాయి. థైరాయిడ్ హార్మోన్సు తక్కువగా ఉత్పత్తి అవుతాయి. దీర్ఘకాలంగా ఈ పరిస్థితి నెలకొన్నవారిలో మిక్సిడీమా అనే వ్యాధి కలుగుతుంది.*

**కారణాలు:** వంశపారంపర్యం, దీర్ఘకాలంగా ఐడిన్ లోపం, పుట్టుకతో కలిగే థైరాయిడ్ హార్మోన్ లోపం, పిట్యూటరి లేదా హైపోథెలమస్ పనిలో లోపం. హైపో థైరాయిడిజం పురుషులలో కంటే స్త్రీలల్లో ఆరు రెట్లు ఎక్కువ. సాధారణంగా 35 సంవత్సరాలు దాటిన వారిలో కనబడుతుంది.

**లక్షణాలు:** బరువు పెరగడం, చలిని తట్టుకోలేకపోవడం, అలసట, గాయిటర్ (గొంతు దగ్గర థైరాయిడ్ గ్రంథి కంతిగా పరిమాణం పెరగడం), చర్మం డ్రైగా ఉండడం. మొహం ఉబ్బరం, ఉబ్బిన కనురెప్పలు, ఉబ్బిన మెడ, చేతులు,కాళ్ళు నీరు పట్టినట్లు ఉబ్బుగా కనబడడం, వెంట్రుకలు ఎక్కువగా రాలిపోవడం, ఒంటి మీద అక్కడక్కడ తెల్లపొర, యాంజైనా గుండెనొప్పి, స్లో పల్స్ (నాడి తక్కువగా కొట్టుకోవడం), కార్డియాక్ ఫెయిల్యూర్ పెరికార్డియల్ ఎఫ్యూజన్ (గుండె పై పొర అయిన పెరికార్డియమ్‌లో నీరు చేరడం), మానసికంగా డల్‌గా ఉండడం, చేతులు, కాళ్ళు తిమ్మిర్లు, బొంగురు గొంతు, నత్తిగా మాట, కండరాలలో నొప్పి, బిగుతు మల బద్ధకం, పొట్టకి నీరు, రక్త హీనత, సంతాన లేమి సెక్స్‌లో బలహీనత.

**నిర్ధారణ:** టి-3 (నార్మల్ కన్నా తక్కువగా ఉండడం), టి.ఎస్.హెచ్ (నార్మల్ కన్నా ఎక్కువగా ఉండడం), సీరమ్ కొలెస్ట్రాల్ (మామూలు కంటె ఎక్కువగా ఉండడం), ఇ.సి.జి. (హార్ట్ రేట్ తక్కువ ఉండటం), టెండాన్ రిఫ్లెక్స్ (స్లోగా ఉండడం), థైరాయిడ్ యాంటి బాడీస్.

**చికిత్స:** థైరాక్సిన్ హార్మోన్ 50 నుంచి 100 మి.గ్రా. రోజుకి ఒకసారి.

❑❑❑

# 9. క్రిటినిజం

*చంటి పిల్లలలో ఏర్పడే హైపోథైరాయిడిజంను క్రిటినిజం అంటారు. క్రిటినిజం ఉన్న పిల్లల్లో యాక్టివ్‌నెస్ ఉండదు. డల్‌గా ఉంటారు. మాట సరిగ్గా మాట్లాడరు. ఎదుగుదల ఉండదు. పొట్ట ఉబ్బుగా ఉంటుంది. నాలిక పెద్దగా ఉంటుంది. మొహం*

ఉబ్బరంగా ఉంటుంది. కంటిరెప్పలు ఉబ్బరంగా ఉంటాయి. కాళ్ళు, చేతులు, పొట్ట నీరు చేరినట్టు ఉబ్బుగా ఉంటాయి. మలబద్ధకం ఉంటుంది.

**చికిత్స:** థైరాయిడ్ హార్మోన్‌తో పరిస్థితి మెరుగవుతుంది.

❑❑❑

# 10. హైపో పేరాథైరాయిడిజం

**కారణాలు :** థైరాయిడ్ ఆపరేషన్ సమయంలో పేరాథైరాయిడ్ గ్రంథి డామేజి అవడం. ఏ కారణం లేకుండా పేరాథైరాయిడ్ గ్రంథి సరిగ్గా పని చేయకపోవడం. సీరం మెగ్నీషియం లెవల్స్ తగ్గిపోవడం.

**లక్షణాలు:** హైపో పేరా థైరాయిడిజం ఉన్నవాళ్లలో ఫిట్స్ వస్తాయి. చేతి వేళ్ళు, కాలివేళ్ళు వంకర పోతాయి. రక్తంలో కాల్షియం లెవల్స్ తక్కువగా ఉంటాయి. దాని వల్ల కాల్షియం లోపం వల్ల కలిగే లక్షణాలు ఉంటాయి. భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి.

**చికిత్స:**

1. విటమిన్ డి రోజుకి 50,000 నుండి 1.00,000 యూనిట్లు ఇవ్వాలి.
2. నరానికి కాల్షియం ఇంజక్షన్స్ ఇవ్వాలి.
3. ఫాస్ఫరస్ తక్కువగా ఉండే ఆహారం. (మాంసం, చేపలు, జున్ను, పాలు. కోడిగ్రుడ్లు, పప్పులు తక్కువ తీసుకోవాలి)

❑❑❑

# 11. హైపర్ పేరాథైరాయిడిజం

**కారణాలు:** పేరా థైరాయిడ్ గ్రంథికి కేన్సర్ రావడం. రక్తంలో కాల్షియం లెవల్స్ తక్కువగా ఉండడం. క్రానిక్ రీనల్ ఫెయిల్యూర్.

**లక్షణాలు:** కండరాలలో బలహీనత, అలసట, మలబద్ధకం, బరువు కోల్పోవడం, ఆకలి తగ్గిపోవడం, వికారం, గందరగోళ మనస్తత్వం, కొందరిలో అతిగా దాహం, అతిగా ఆకలి, అతిగా మూత్రం, మూత్ర పిండాలలో రాళ్ళు ఏర్పడడం, ఎముకలలో నొప్పులు, కడుపులో పుళ్ళు.

**నిర్ధారణ:** సీరమ్ కాల్షియం (నార్మల్ కంటే ఎక్కువ ఉండడం), సీరం ఫాస్ఫరస్ (నార్మల్ కంటే తక్కువగా ఉండడం), పేరా థైరాయిడ్ హార్మోను ఎస్టిమేషన్ (ఎక్కువగా ఉండడం), ఎక్స్‌రే (ఎముకలు బలహీనంగా కనపడడం), సి.టి. స్కాన్, అల్ట్రా సౌండ్ స్కాన్.

చికిత్స:

1. సర్జరీ చేసి పేరా థైరాయిడ్‌కు పెరిగిన కంతిని తొలగించడం.
2. న్యూట్రల్ ఫాస్ఫేట్ బఫర్ నరానికి ఇవ్వడం.
3. ప్రెడ్నిసోలోన్ టాబ్లెట్స్ 40 నుంచి 60 మి.గ్రా. ఇవ్వడం.

❑❑❑

# 12 ఎడిసన్స్ డిసీజ్

*ఎడిసన్స్ డిసీజ్‌నే ప్రైమరీ హైపో ఎడ్రినలిజం అంటారు. ఎడ్రినల్ కార్టెక్స్ డామేజి అవడం వల్ల ఈ వ్యాధి కలుగుతుంది. సాధారణంగా ఈ వ్యాధి 30-40 సంవత్సరాల వారిలో వస్తుంది. స్త్రీలలో ఈ వ్యాధి ఎక్కువ.*

*ఎడ్రినల్ కార్టెక్స్‌కి క్షయ వ్యాధి రావడం, కేన్సర్ రావడం, శస్త్రచికిత్స వల్ల తొలగింపబడడం ఉన్నప్పుడు ఈ వ్యాధి కలగడం ఎక్కువ. ఆటో ఇమ్యూన్ డిసీజ్ వల్ల కూడా ఎడిసన్స్ డిసీజ్ వస్తుంది.*

**లక్షణాలు:** చర్మం మీద, మ్యూకస్ మెంబ్రేన్ మీద నల్లటి మచ్చలు ఏర్పడతాయి. చేతు మీద, కాళ్ళ మీద నల్ల పొడ కనబడుతుంది. పెదవులు, చిగుళ్ళు, దవడ లోపల నల్ల చారలు పడతాయి. ఆకలి తగ్గిపోతుంది. వికారం కలుగుతుంది. కండరాలు బలహీనంగా అనిపిస్తాయి. జ్ఞాపక శక్తి తగ్గుతుంది. మెంటల్ డల్‌నెస్ ఉంటుంది. నపుంసకత్వం కలుగుతుంది. ఒక్కొక్కసారి అకస్మాత్తుగా తెలివితప్పి పడిపోవడం, వాంతులు అవడం, పరిస్థితి సీరియస్ అవడం ఉంటుంది.

**నిర్ధారణ:** ప్లాస్మా కార్టిజాన్ లెవల్స్ ఎస్టిమేషన్, ప్లాస్మా ఏ.సి.టి.హెచ్. లెవెల్స్ ఎస్టిమేషన్.

**చికిత్స:**

1. కార్టిజోన్స్:- హైడ్రో కార్టిజోన్ 20 మి.గ్రా. చొప్పున రోజుకు మూడుసార్లు.
2. ఆల్డోస్టిరోన్:- ఫ్లూడోకార్టిజోన్ 50 మైక్రోగ్రామ్స్ చొప్పున రోజుకి రెండుసార్లు.

❑❑❑

# 13. కుషింగ్స్ సిండ్రోమ్

*ఎడ్రినల్ కార్టికల్స్ అధికంగా పనిచేయడం వల్ల ఈ వ్యాధి కలుగుతుంది. ఏ.సి.టి. హెచ్. అధికంగా ఉండటం, కార్టిజోన్ అధికంగా ఉండటం, కుషింగ్ సిండ్రోమ్‌కు కారణం.*

**లక్షణాలు:** కండరాలలో బలహీనత.చర్మం పలచగా అవడం. అధికంగా కొవ్వు చేరడం, పుండు త్వరగా మానకపోవడం, ఎముకలు బలహీనంగా మారడం, రక్తపోటు రావడం, నిద్ర రాకపోవడం, నెల నెల బహిష్టులు సక్రమంగా రాకపోవడం, ఎదుగుదల లేకపోవడం, షుగర్ వ్యాధి కలగడం.

**నిర్ధారణ:** కార్టిజాల్ ఎస్టిమేషన్ (మామూలుగా కంటే ఎక్కువగా ఉండటం), ఏ.సి.టి.హెచ్. (ఎక్కువగా ఉండటం), సి.టి.స్కాన్.

**చికిత్స:**

1. మిథిరాపోన్ (ఎడ్రినోలైటిక్ డ్రగ్)
2. శస్త్ర చికిత్స

❑❑❑

# 14. ఫియోకోమో సైటోమా

*ఎడ్రినల్ గ్రంథి అధికంగా పనిచేయడం వల్ల ఫియోకోమో సైటోమా వస్తుంది.*

**లక్షణాలు:** రక్తపోటు (అకస్మాత్తుగా రక్తపోటు పెరగడం, తగ్గడం ఉంటుంది). తలనొప్పి, అధికంగా చెమటలు, ఆందోళన ఉంటాయి.

**నిర్ధారణ:** మూత్రంలో కెటకోలమైన్స్ ఎక్కువ శాతంలో ఉంటాయి. సి.టి. స్కాన్.

**చికిత్స:**

1. ఆపరేషన్ చేసి ఎడ్రినల్ గ్రంథికున్న కంతిని తొలగించడం.
2. ఆల్ఫా బ్లాకర్, ఫినాక్సి బెంజిమన్ 10 మి.గ్రా. చొప్పున రోజుకి రెండుసార్లు.

❑❑❑

# 15. షుగర్ వ్యాధి (డయబిటిస్ మెలిటస్)

*డయబిటిస్ మెలిటస్‌నే మధుమేహ వ్యాధి, చక్కెర వ్యాధి, షుగర్ కంప్లైంట్ అని కూడా అంటారు.*

*డయబిటిస్ మెలిటస్ ముఖ్యంగా రెండు రకాలు. 1. ఇన్సులిన్ డిపెండెంట్ డయబిటస్ మెలిటస్, 2. నాన్ ఇన్సులిన్ డిపెండెంట్ డయబిటస్ మెలిటస్.*

*ఇది ఇలా ఉండగా పాన్‌క్రియాటిస్ గ్రంథి వ్యాధుల్లోనూ, ఎడ్రినల్ థైరాయిడ్ గ్రంథుల వ్యాధుల్లోనూ, కార్టికో స్టిరాయిడ్స్, థైజైడ్, ఫినటాయిన్ మందులు వాడిన వారిలోనూ మస్క్యులర్ డిస్ట్రఫి, డౌన్స్ సింఢ్రోమ్, క్లిన ఫెల్టర్ సింఢ్రోమ్, టర్నర్స్ సింఢ్రోమ్ కలవారిలోనూ, కాలేయం వ్యాధులు ఉన్నవారిలోనూ, స్థూలకాయం ఉన్నవారిలోనూ, డయబిటిస్ మెలిటస్ వచ్చే అవకాశం ఉంది.*



పెద్దవాళ్ళలో డయబిటిస్ మెలిటస్ నిదానంగా వస్తుంది.

చిన్న పిల్లల్లో అకస్మాత్తుగా కనపడుతుంది.

**లక్షణాలు:** అతిగా దాహం, అతిగా మూత్రం, అతిగా ఆకలి, రాత్రిపూట పలుమార్లు మూత్ర విసర్జన, బరువు కోల్పోవడం, బలహీనత, దురదలు, మర్మావయవాల దగ్గర దురద, శిశ్నం పుండుగా తయారవడం, కాళ్ళ పిక్కల నొప్పి, సెగ్గడ్డలు, సెక్స్ బలహీనత, కంటి చూపు మందగించడం, కాళ్ళు, చేతులు తిమ్మిర్లు, మంటలు, మొద్దుబారడం, కోమా.

**నిర్ధారణ:** మూత్ర పరీక్ష, బ్లడ్‌షుగర్ ఎస్టిమేషన్, జి.టి.టి., గ్లైకోసైలైటెడ్ హీమోగ్లోబిన్ ఎస్టిమేషన్.

**చికిత్స:**

1. ఆహారంలో పిండి పదార్థం తగ్గించడం.
2. వ్యాయామం.
3. ఆరోగ్యకరమైన అలవాట్లు
4. ధూమపానం మానివేయడం.
5. షుగర్, జామ్, తేనె, పళ్ళు, తీపి పదార్థాలు, చాక్లెట్స్, డ్రింక్స్, కేక్స్, స్వీట్ బిస్కెట్స్ ఆల్కహాలిక్ డ్రింక్స్ మానాలి **లేదా** డాక్టరు సలహాపై కొద్దిగా తీసుకోవచ్చు.
6. కోడి మాంసం, గుడ్లు, చేపలు, పంచదార లేని టీ, కాఫీ ఆకుకూరలు, కాయగూరలు మామూలుగా తీసుకోవచ్చు.

**షుగర్ కంట్రోలుకి మందులు:**

**సల్ఫోనైల్ యూరియాస్-**

1. టాల్‌బుటమైడ్- రోజుకి 1-3 గ్రాములు, నాన్ ఇన్సులిన్ డిపెండెంటు డయబిటస్ మెలిటస్ వ్యక్తికి, స్థూలకాయం లేని వ్యక్తికి ఈ మందు పని చేస్తుంది.
2. క్లోరాప్రోపమైడ్ - 100 - 600 మి.గ్రా. రోజుకి ఒక్కసారి. పెద్దవాళ్ళలో వచ్చిన మధుమేహానికి పనిచేస్తుంది.
3. గ్లైబెన్‌క్లామైడ్ 2.5 - 30 మి.గ్రా. రోజుకి ఒకసారి.
4. గ్లిపిజైడ్ 2.5 - 30 మి.గ్రా. రోజుకి ఒకసారి.
5. స్థూలకాయం ఉన్నవారిలో మెట్‌ఫార్మిన్ రోజుకి 0.5 - 3 గ్రా. రెండు మూడు మోతాదుల్లో తీసుకోవాలి.
6. ఫెన్‌ఫార్మిన్ 25-150 మి.గ్రా. రోజుకి రెండు-మూడు సార్లు.

7. ఇన్సులిన్.
   1. సాల్యుబుల్ ఇన్సులిన్.
   2. ఐసోఫేన్ ఇన్సులిన్.
   3. లెంటే ఇన్సులిన్.

❑❑❑

## 16. హైపోగ్లైసీమియా

*రక్తంలో ఉండవలసిన దానికంటే గ్లూకోజ్ లెవల్స్ బాగా తగ్గిపోవడాన్ని హైపో గ్లైసీమియా అంటారు.*

**కారణాలు:** ఇన్సులిన్ మోతాదు ఎక్కువ అవ్వడం, యంజైమ్ డెఫిషియన్సి, భోజనం లేకపోవడం, లివర్ ఫంక్షన్ సరిగా లేకపోవడం.

**లక్షణాలు:** చెమటలు, వణుకు, గుండెదడ, మొహం పాలిపోవడం, మాటల్లో తడబాటు, అడుగులు సరిగా పడకపోవడం, ఒకే వస్తువు రెండుగా కనబడడం, మూతి దగ్గర తిమ్మిరి. ఫిట్స్ లాగా రావడం, కోమా.

**చికిత్స:**

1. గ్లూకోజ్, పళ్ళరసం ఇవ్వడం.
2. స్పృహ కోల్పోయిన వ్యక్తికి 50% గ్లూకోజ్ 50 యం.యల్ నరానికి ఇవ్వడం.
3. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టడం.
4. కారణం బట్టి చికిత్స.

❑❑❑

## 17. మూత్రంలో షుగర్ (గ్లైకోసూరియా)

మూత్రంలో షుగర్ ఉండే పరిస్థితిని గ్లైకోసూరియా అంటారు.

**కారణాలు:** డయబిటస్ మెలిటస్, రీనల్‌గ్లైకోసూరియా - మధుమేహ వ్యాధి లేకపోయినా మూత్రంలో షుగర్ ఉంటుంది. రక్తంలో షుగర్ నార్మల్‌గా ఉంటుంది. ప్రెగ్నెన్సీ గ్లైకోసూరియా - వీరిలో బ్లడ్ షుగర్ నార్మల్‌గానే ఉంటుంది. ఎమోషనల్ గ్లైకోసూరియా, ఎండోక్రైన్ డిస్‌ఆర్డర్స్ - ఉదా॥ హైపర్‌థైరాయిడిజం హైపర్‌పిట్యూటరిజం, ఇంట్రాక్రేనియల్ ప్రెషర్ పెరగడం - బ్రెయిన్ ట్యూమర్స్, స్కల్ ఫ్రాక్చర్స్, బ్రెయిన్ హెమరేజ్, ఎన్‌కెఫలైటిస్, యారిమెంటరీ గ్లైకోసూరియా, ఇన్‌ఫెక్షన్స్, టాక్సీమియా, అతిగా శారీరక అలసట, నెఫ్రైటిస్.

**నిర్ధారణ:** మూలకారణాన్ని గుర్తించడం, జి.టి.టి.

**చికిత్స:** మూలకారణం బట్టి చికిత్స.

❑❑❑

# 10. చర్మవ్యాధులు

చర్మవ్యాధులని ముఖ్యంగా 5 రకాలుగా విభజించవచ్చు.

1. ఒళ్ళంతా దురదలు, చీము పొక్కులు:- ఈ తరగతికి చెందిన చర్మవ్యాధుల్లో గజ్జి, పురుగులు కుట్టగా వచ్చిన వ్యాధులు, లైకెన్‌ప్లానస్, ఎటోపిక్ ప్రూరిగో వస్తాయి.
2. చర్మం మీద రింగులు రింగులుగా ఏర్పడుతూ పైన పొట్టు ఏర్పడే చర్మ వ్యాధులు:- వీటిల్లో తామర (రింగ్ వార్మ్), సొరియాసిస్, పిటిరియాసిస్ రోజియా, అర్టికేరియా, డ్రగ్ రియాక్షన్స్ మొదలైనవి. వీటిల్లో కొన్ని చర్మ వ్యాధులకి పొట్టు ఏర్పడడం లేకపోవచ్చు.
3. చీము పొక్కులు, నీటి పొక్కులు ఏర్పడే చర్మ వ్యాధులు:- ఇన్‌ఫెక్షన్ వల్ల వచ్చే చర్మ వ్యాధుల్లో చీము పొక్కులు, హెర్పిస్ జోస్టర్, ఇంపెడిగో మొదలైనవి.
4. ఎక్జిమా.
5. చర్మం మీద నల్లపొడ, తెల్లపొడ, ఇతర పొడలు.

## 1. గజ్జి

*గజ్జినే స్కేబిస్ అంటారు. ఇది ఒకరినుంచి మరొకరికి అతి తేలికగా సంక్రమిస్తుంది. ఇంట్లో ఒకరికి గజ్జి కనబడితే ఆ ఒక్కరికే కాకుండా తక్కిన కుటుంబ సభ్యులందరికీ చికిత్స చేయాలి. అంతేగానీ గజ్జి కనబడిన వారికి మాత్రమే కాదు.*

**చికిత్స:**

బెంజైల్ బెంజోయేట్ 25% సొల్యూషన్ **లేదా** గామాబెంజిన్ హైడ్రోక్లోరైడ్ 1% సొల్యూషన్ రాత్రి స్నానం చేసి ఒళ్ళంతా (ముఖానికి కాకుండా) రాసుకోవాలి. ఉదయం లేచిన తరువాత స్నానం చేయాలి. ఇలా వారానికి రెండుసార్లు రాసుకోవాలి. ఈ రకంగా రెండు వారాలు చేయాలి. అదే సమయంలో ఇంట్లో వాళ్ళందరూ వాడే పక్క దుప్పట్లు, తువ్వాళ్ళు, దుస్తులు ఉడకబెట్టి ఆరేయాలి. ఇలా చేయడం వల్ల వ్యాధి క్రిములని పూర్తిగా నిర్మూలించడం జరుగుతుంది. గజ్జి వల్ల చీము పొక్కులు తయారయితే పెన్సిలిన్ లేదా టెట్రాసైక్లిన్ పూర్తి కోర్సు తీసుకోవాలి. గజ్జి ఉన్నప్పుడు కొందరికి దురద ఎక్కువగా ఉంటుంది. దురద తగ్గటానికి ఎవిల్, ట్రైక్సిల్, ఇన్సిడాల్ వంటి బిళ్ళలు ఏవైనా ఉదయం-ఒకటి, సాయంత్రం-ఒకటి వాడాలి.

❑❑❑

## 2. తలలో పేలు

*తలలో పేలు ఉండడం అతి సహజం. ఈ పేలు వంటివే ఒంటిమీద, మర్మావయవాల దగ్గర ఉంటాయి. ఇలా పేలు ఉండే పరిస్థితిని 'పెడిక్యులోసిస్' అంటారు.*

**చికిత్స:**

గామా బెంజీన్, హెక్సాక్లోరైడ్ (లో రెజేన్) సాల్యూషన్ వారానికి రెండుసార్లు తలకి రాసి 12 గంటల తరువాత తలకి స్నానం చేయాలి. అలా వారానికి రెండు సార్లు చేయాలి. ఒంటిమీద పేను పురుగులు ఉన్నప్పుడు కూడా ఈ మందే రాత్రిపూట రాసి ఉదయం స్నానం చేయాలి.

❑❑❑

## 3. తామర

*తామరనే ఫంగల్ ఇన్‌ఫెక్షన్ అనీ మెకోటిక్ ఇన్‌ఫెక్షన్ అనీ అంటారు. తామర వివిధ రూపాల్లో ఉంటుంది. రింగులు రింగులుగా వచ్చే తామర ఉండగా శోభిగా వచ్చే తామర మరొకటి. మరికొందరికి నోట్లో ప్రేగుల్లో, ఊపిరితిత్తుల్లో ఫంగస్ ఇన్‌ఫెక్షన్ వస్తుంది. శరీరంలోపల భాగాన వచ్చే తామరని సిస్టమిక్ మైకోసిస్ అంటారు.*

**రింగ్‌వార్మ్**

రింగ్‌వార్మ్‌కి చెందిన తామర ఒంటిమీద, తలలో, గడ్డంమీద, గజ్జల్లో, అరిపాదాల్లో, వేళ్ళ సందున, గోళ్ళమీద వస్తుంది. తామర రాకుండా ఉండాలంటే శుభ్రత పాటించడం చాలా అవసరం.

**కారణాలు :**

గాలి ఆడని దుస్తులు ధరించడం. చెమట ఎక్కువ పట్టడం. స్నానం సరిగ్గా చెయ్యకపోవడం. తామర ఉన్న వాళ్ళతో ఎక్కువ కలిసి మెలిసి ఉండడం. పరిసరాలు అపరిశుభ్రంగా ఉండడం తామర రావడానికి ప్రధాన కారణాలు.

**చికిత్స:**

క్లోట్రైమజోల్ **లేదా** మికొనజోల్ **లేదా** ఎకొనజోల్ ఆయింట్‌మెంటు రోజుకి రెండుసార్లు రాయాలి. నోటి ద్వారా గ్రిసోఫల్విన్ 250 మి.గ్రా. బిళ్ళలు ఉదయం-

ఒకటి, సాయంత్రం-ఒకటి చొప్పున కనీసం 4 వారాలు తీసుకోవాలి. గోళ్ళకి తామర వచ్చిన వాళ్ళు సంవత్సరం పైగా వాడాలి.

❑❑❑

# 4. శోభి

*శోభి తెల్లగా గానీ, గోధుమ రంగులోగానీ, పసుపురంగులో గానీ ఉంటుంది. ముఖంమీద, మెడ, ఛాతి, పొట్ట శరీరంలో ఇతర భాగాల్లో కూడా శోభి వస్తుంది. శోభి పొడలాగా శరీరం మీద కొంతమేర రావచ్చు. లేదా విస్తృతంగా రావచ్చు.*

చికిత్స:

క్లోట్రైమజోల్ **లేదా** మిక్‌నజోల్ **లేదా** ఎకొనజోల్ సొల్యూషన్ ఒకటి శోభి ఉన్నచోట రోజుకి రెండుసార్లు చొప్పున కనీసం నెల రోజులు రాయాలి. శోభి ఎక్కువగా ఉన్నప్పుడు కీటోకోనజోల్ 200 మి.గ్రా. క్యాప్సూల్ రోజుకొకటి చొప్పున వారం పదిరోజులు వేసుకోవాలి.

❑❑❑

# 5. మొనిలియాసిస్

*మొనిలియాసిస్ నల్లని పొడలాగా గజ్జల్లోనూ, చంకల్లోనూ, స్త్రీ రొమ్ముల కిందను, పిర్రల వెనుక వస్తుంది. కొందరికి చేతి, కాళ్ళ, గోళ్ళ మార్జిన్‌లో నల్లటి పొరవలె ఏర్పడుతుంది. మరికొందరిలో నోటి అంచుల్లో, స్త్రీ యోని దగ్గర, పురుష మర్మావయవాల దగ్గర నల్లగా ఏర్పడుతుంది. కొందరి నోటి అంచుల్లో, నోటిలోపల, నాలిక పైన, దవడ లోపల ఏర్పడుతుంది. పైన చెప్పిన ప్రదేశాల్లో మొనిలియాసిస్ ఏర్పడినప్పుడు అక్కడ నల్లగా ఏర్పడడమే కాకుండా దురదగా ఉంటుంది. ఇది మొదట్లోనే చికిత్స చేయకపోయినట్లయితే ఇతర ప్రదేశాలకి కూడా వ్యాపిస్తుంది. స్థూలకాయం ఎక్కువ ఉండేవారిలో, గాలి ఆడని దుస్తులు ధరించేవారిలో, చెమట ఎక్కువ పట్టే వారిలో, షుగర్ వ్యాధి ఉండేవారిలో మొనిలియాసిస్ రావడం ఎక్కువ.*

చికిత్స:

1. క్లోట్రైమజోల్ **లేదా** మిక్‌నోజోల్ **లేదా** ఎకొనజోల్ సొల్యూషన్ గానీ, ఆయింట్‌మెంట్‌గానీ నల్లగా ఏర్పడి దురద పుడుతున్న చోట రోజుకి రెండుసార్లు

చొప్పున కనీసం నెలరోజులు రాయాలి. గోళ్ళ అంచున మొనిలియాసిస్ వచ్చిన వారు కనీసం 3 నెలలు పై మందులు వాడాలి.

2. మొనిలియాసిస్ ఎక్కువగా ఉన్నప్పుడు కోటోకోనజోల్ 200 మి.గ్రా. క్యాప్సూల్ **లేదా** టాబ్లెట్ రోజుకి ఒకటి చొప్పున 10 రోజులు వాడాలి.
3. యోని లోపల మొనిలియాసిస్ వచ్చి దురద, మంట కలుగుతున్నప్పుడు క్లోట్రైమజోల్ వెజైనల్ టాబ్లెట్స్ రోజుకి ఒకటి చొప్పున వారం - పది రోజులు వాడాలి.
4. తిరిగి మొనిలియాసిస్ రాకుండా ప్రతిసారి స్నానం చేసిన తరువాత చంకల్లోనూ, గజ్జల్లోనూ, రొమ్ములక్రింద, క్లోట్రైమజోల్ **లేదా** మికొనోజోల్ పౌడరు అద్దుకోవాలి.

□□□

# 6. చీము పొక్కులు, సెగ్గడ్డలు

*బాక్టీరియల్ ఇన్ఫెక్షన్ వల్ల ఒంటిమీద చీము పొక్కులు, సెగ్గడ్డలు ఏర్పడతాయి. గజ్జి, తామర, పెడిక్యులోసిస్ మొదలైన వ్యాధుల్లో కూడా దురద పుట్టి గోకడంతో అక్కడ బాక్టీరియా క్రిములు చేరి చీము పొక్కులు తయారవుతాయి. షుగర్ వ్యాధి ఉన్న వాళ్ళలో చీము పొక్కులు, సెగ్గడ్డలు రావడం ఎక్కువ. తరచు చీము పొక్కులు, సెగ్గడ్డలు వస్తున్నప్పుడు మధుమేహం ఉన్నదేమో చూడాలి. మధుమేహం (డయాబెటిస్) ఉన్నట్లయితే చికిత్స చేయాలి.*

చికిత్స:

1. చీము పొక్కులు ఉన్నప్పుడు ఆ ప్రాంతాన్ని శుభ్రంగా సబ్బు పెట్టి కడగాలి. చీము పొక్కులుపైన యాంటిబయోటిక్ ఆయింట్మెంట్ రాయాలి. నోటిద్వారా యాంపిసిలిన్ - క్లాక్సాసిలిన్ 250-500 మి.గ్రా. క్యాప్సూల్స్ కానీ, బిళ్ళలు గానీ ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున వారం, పది రోజులు వాడాలి.
2. చిన్న పిల్లలకి వారి బాడీవెయిట్ ప్రకారంగా యాంటిబయోటిక్ మందు వాడాలి. చీము పొక్కులు, సెగ్గడ్డలు ఉన్నప్పుడు ఎరిత్రోమైసిన్ 500 మి.గ్రా. బిళ్ళలు ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున వారం, పదిరోజులు వాడవచ్చు.
3. ఇవే కాకుండా ఇతర యాంటిబయోటిక్ మందులు కూడా వాడొచ్చు.

□□□



# 7. ఎక్జిమా

ఎక్జిమా ఒక ప్రత్యేకమైన చర్మ వ్యాధి. ఇది అకస్మాత్తుగా రావచ్చు లేదా నిదానంగా రావచ్చు. దానివల్ల చర్మంలో ఒకచోట చర్మం ఎర్రగా, ఉబ్బుగా మారుతుంది. అలా మారిన చోట చిన్న చిన్న పొక్కులు వస్తాయి. వాటి నుంచి కొంత రసి కూడా కారుతుంది. ఆ ప్రాంతంలో చర్మం నీరు పట్టి దళసరిగా కనబడుతుంది. దురద కూడా ఉంటుంది.

**కారణాలు :**

ఎక్జిమా రావడానికి ఎలర్జీ కారణం. ఎలర్జీ అనేది శరీరం లోపల్నించి కలగవచ్చు లేదా చర్మానికి కొన్ని సరిపడక ఆ స్థలంలో దురద కలిగి ఎక్జిమాగా మారవచ్చు. ఉదాహరణకి ఒకరికి కుంకుమ బొట్టు సరిపడకపోవచ్చు. ఆ సరిపడకపోవడాన్నే ఎలర్జీ అంటారు. బొట్టు పెట్టినంత మేర ఎలర్జీ కలిగి చర్మం ఉబ్బుగా, ఎర్రగా, దళసరిగా మారుతుంది. చిన్న చిన్న పొక్కులు లేస్తాయి. రసి కారుతుంది. ఇది బయట నుంచి కలిగిన ఎలర్జీ వల్ల ఏర్పడే ఎక్జిమా. మరికొందరికి తీసుకున్న మందులు, ఆహారం, శరీరంలో కలిగే రసాయనిక మార్పులు ఎలర్జీకి దారితీసి ఆ ఎలర్జీ వల్ల చర్మం మీద ఎక్జిమా తయారవుతుంది.

ఎక్జిమా చిన్న పిల్లల్నించి వృద్ధుల వరకు ఎవరికైనా రావచ్చు. చిన్న పిల్లల్లో డైపర్ వాడితే సరిపడక రెండు పిర్రల మధ్య ఎక్జిమా రావచ్చు. అలాగే వారిలో కలిగే జలుబు, ఇతర వ్యాధుల వల్ల ఎలర్జీ ఏర్పడి ఎక్జిమా రావచ్చు.

స్త్రీలు లిప్‌స్టిక్ వాడితే సరిపడక పెదాలు వాచి పుండుగా మారవచ్చు. డిటర్జెంట్స్, సబ్బులు సరిపడక చేతులకి, కాళ్ళకి ఎక్జిమా రావచ్చు. సాక్స్ వాడేవాళ్ళకి, చెప్పులు వేసుకునే వాళ్ళకి కొందరిలో అవి సరిపడక ఆయా ప్రాంతాలలో ఎక్జిమా రావచ్చు. ఈ రకంగా ఎలర్జీ లోపలి నుంచి ఏర్పడినా, బయట నుంచి కలిగినా ఈ ప్రత్యేకమైన చర్మ వ్యాధి ఎక్జిమా వస్తుంది. కొందరు ఎక్జిమానే 'మేహం', 'ఉడుకు' అంటారు.

**చికిత్స :**

1. ఎక్జిమా ఎక్కువగా ఉండి రసి కారుతూంటే సెలైన్‌తోగానీ పొటాషియం పర్మాంగనేట్ సొల్యూషన్‌తోగానీ రెండు పూటలా కడగాలి.
2. ఎక్జిమాని డ్రైగా ఉంచటానికి దాని మీద కేలెడ్రల్ లోషన్ రాయాలి.
3. ఇన్‌ఫెక్షన్ ఉంటే రోసిలిన్ 250 మి.గ్రా. క్యాప్సూల్స్ ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున వారం రోజులు వాడాలి.
4. ఎక్జిమా వచ్చిన చోట లోకాయిడ్ (కార్టికో స్టిరాయిడ్) ఆయింట్‌మెంట్ రోజుకి 2సార్లు రాయాలి.

5. ఎక్జిమా క్రానిక్‌గా ఉన్నప్పుడు ప్రాగ్‌మటార్ ఆయింట్‌మెంట్ రెండు పూటలా రాయాలి.

6. ఎక్జిమా అకస్మాత్తుగా వచ్చినా, నిదానంగా వచ్చినా పూర్తిగా తగ్గేవరకు మందులు వాడాలి.

డ్రై స్కిన్ ఉన్నవాళ్ళకి ఎక్జిమా మాటిమాటికి వస్తుంది. అలా రాకుండా మాయిశ్చరిక్స్ క్రీము రోజుకి రెండుసార్లు చర్మం మీద రాయాలి.

❑❑❑

# 8. మొటిమలు

మొటిమలనే 'యాక్నేవల్గారిస్' అంటారు. యాక్నే అన్నా మొటిమలే. వెంట్రుకల కుదుళ్ళ పక్కనే సెబాషియస్ గ్లాండ్స్ ఉంటాయి. వీటిలో సెబం అనే నూనె పదార్థం ఉంటుంది. ఇలా తయారయిన నూనె పదార్థం వెంట్రుక బయటికి వచ్చే మార్గంతో కలిసి బయటకు వస్తుంది. అందుకనే చర్మం ఆయిలీగా మారుతుంది. స్నానం చేయకపోయినా, ఎక్కువ చెమటపోసినా చర్మం జిడ్డుగా మారడానికి ఈ సెబాషియస్ గ్లాండ్ నుంచి ఉత్పత్తి అయ్యే ద్రవమే కారణం. కొన్ని సందర్భాలలో సెబాషియస్ గ్లాండ్‌కి సంబంధించిన డక్ట్ పాక్షికంగా గానీ, పూర్తిగా కానీ మూసుకుపోతుంది. దాంతో సెబాషియస్ గ్లాండ్‌లో తయారయ్యే పదార్థం బయటికి రాకుండా ఉబ్బిపోతుంది. అలా ఉబ్బిన సెబాషియస్ గ్లాండ్సే మొటిమలు. కొందరిలో సెబాషియస్ గ్లాండ్స్‌లో బాక్టీరియా క్రిములు చేరి చీము పట్టిన మొటిమలు లేస్తాయి.

మొటిమలు ఎక్కువగా యుక్తవయస్సులో వస్తాయి. 18 సంవత్సరాల నుంచి 35 సంవత్సరాల వరకు రావడం ఎక్కువ.

మొటిమలు బుగ్గలు, గడ్డం, ముక్కు, నుదురు మీద రావడం ఎక్కువ. ఛాతి ముందు, వెనుక, భుజాల మీద కూడా తరచూ మొటిమలు వస్తాయి. మొటిమలు ముఖం మీద ఎక్కడైనా రావచ్చు. అలాగే ఏ వయసులో వారికైనా రావచ్చు. అందుకనే అప్పుడప్పుడు చంటి బిడ్డల బుగ్గల మీద కూడా మొటిమలు లేస్తాయి.

మొటిమలు ఆవగింజంత పరిమాణం నుంచి శనగగింజంత పరిమాణం వరకు ఉండొచ్చు.

**చికిత్స :**

1. మొటిమలు ఉన్నవారు ముఖాన్ని రోజుకు నాలుగైదు సార్లైనా శుభ్రంగా కడుక్కోవాలి. క్రీములు రాయకూడదు.

2. మొటిమలు చీము పడితే డాక్సీసైకిలిన్ క్యాప్సుల్స్ రోజుకి ఒకటి చొప్పున 3,4 వారాలు వాడాలి. వీటికి బదులుగా ఇతర యాంటిబయోటిక్ మందులు కూడా వాడవచ్చు.
3. తలలో చుండ్రు లేకుండా చేసుకోవాలి. తలకి నూనె ఎక్కువ రాయకూడదు.
4. మొటిమలు మీద మెగాట్రోసిన్ **లేదా** ఎక్నిసిన్ **లేదా** ఎక్నెక్స్ సొల్యూషన్ గానీ, ఆయింట్‌మెంట్‌గానీ రోజుకి రెండు పూటలు రాయాలి.
5. మొటిమలు ఎక్కువగా ఉన్నప్పుడు పెర్సాల్‌ఫోర్టు క్రీము సాయంత్రం పూట మొటిమల మీద రాసి 15 నిముషాల తరువాత కడిగివేయాలి. రోజురోజుకీ కొద్దిగా సమయం పెంచుకుంటూ వెళ్ళాలి. ఈ క్రీము రాసినప్పుడే కొందరిలో పొక్కినట్లు అవుతుంది. అందుకని నిదానంగా సమయం పెంచుకుంటూ వెళ్ళాలి. చివరికి రెండు గంటల పాటు ఈ క్రీము మొటిమల మీద రాసుకునేటట్లు చూసుకోవాలి. రెండు గంటలైన తరువాత కడిగి వేయాలి.
6. మెట్రోజిల్ జెల్ కూడా మొటిమల మీద రాయవచ్చు. ఈ జెల్ రోజుకి 2 సార్లు రాయాలి. రెటినో-ఎ ఆయింట్‌మెంట్ కూడా వాడవచ్చు.
7. కొందరి స్త్రీలలో హార్మోనల్ చికిత్స చేస్తే తప్ప మొటిమలు తగ్గవు. ప్రొజిస్ట్రోన్ సంబంధించిన టాబ్లెట్స్ (డ్యుయోలుటాన్, ఓవరాల్) బహిష్టు అయిన 5వ రోజు నుంచి 25వ రోజువరకు రోజుకి ఒకటి చొప్పున వాడాలి.

మొటిమలని గిల్లడం గానీ, పిండడం గానీ చేయకూడదు. మొటిమలని గిల్లినా, పిండినా వాటిలోని బాక్టీరియా క్రిములు చర్మం క్రింద వ్యాప్తి చెంది ముఖం అంతా వాచేటట్లు చేస్తాయి.

*మొటిమలు ఎక్కువ వచ్చేవారు ఆహారంలో స్వీట్స్, కొవ్వు పదార్థం తగ్గించాలి*

❑❑❑

# 9. దద్దుర్లు (అర్టికేరియా)

*అర్టికేరియానే చలితం అని, దద్దుర్లని అంటారు. దద్దుర్లు ఏ వయసు వారికైనా రావచ్చు. దద్దుర్లు ఒకోసారి శరీరానికంతటికి రావచ్చు లేదా శరీరంలో ఏదో ఒక ప్రాంతం వరకే రావచ్చు. తేనెటీగ కానీ, కందిరీగ కానీ కుడితే ఎలా దద్దురు వస్తుందో అర్టికేరియాకి సంబంధించిన దద్దుర్లు కూడా అలాగే ఉంటాయి. అర్టికేరియా దద్దుర్లు సాధారణంగా గులాబి రంగులో ఉంటాయి. దద్దుర్లు వచ్చిన మేరంతా చర్మం ఎర్రగా ఉంటుంది.*

ఉబ్బుగా కనబడుతుంది. అర్టికేరియా దద్దుర్లు ఒకే ఆకారంలో కాకుండా వివిధాకారాలలో ఉంటాయి. అర్టికేరియా దద్దుర్లు దురద అనిపిస్తాయి. చల్లగాలి, ఎండల వల్ల మరింత దురద అనిపిస్తాయి.

**కారణాలు :**

ఆహారం సరిపడక దద్దుర్లు రావచ్చు. ముఖ్యంగా చేపలు, పందిమాంసం, పుట్ట గొడుగులు, మామిడి పళ్ళు, దద్దుర్లు కలిగిస్తాయి. ఫుడ్ ఎలర్జీ ఏ పదార్థంలోనైనా ఉండొచ్చు. పెన్సిలిన్ ఎ.టి.యస్., సల్ఫా, యాస్పిరిన్ సరిపడనివారికి కూడా అర్టికేరియా వస్తుంది, కడుపులో పాములు ఉంటే కూడా అర్టికేరియా వస్తుంది. కొన్ని రకాల పుప్పొడి, వాసనలు, సెంట్లు, పక్షుల ఈకలు అర్టికేరియాని కలిగిస్తాయి. చెవిలో చీము, పిప్పి పన్ను, సైనుసైటిస్, పసరతిత్తి వ్యాధులు, మూత్రపిండాల వ్యాధులు ఉన్నవారిలో కూడా అర్టికేరియా రావచ్చు. అతిగా చల్లదనం ఉన్నా, వేడి ఉన్నా అర్టికేరియా వస్తుంది. అలవాటు లేకుండా ఎండలోకి వెళ్ళినా, చలిలో తిరిగినా వెంటనే దద్దుర్లు రావచ్చు, మానసికంగా దిగులు, ఆందోళన ఉన్నవారిలో కూడా అర్టికేరియా రావచ్చు. కేన్సర్, కామెర్లు, మలేరియా, రుమాటిక్ ఫీవర్ ఉన్నవాళ్ళలో కూడా అర్టికేరియా రావచ్చు.

**చికిత్స :**

1. ఫుడ్ ఎలర్జీ ఉంటే ఏ ఆహారానికి ఉందో గుర్తించి దాన్ని తినడం మానేయాలి.
2. పడని మందులు ఉంటే మానేయాలి.
3. కడుపులో పాములు ఉంటే పడిపోడానికి మందులు వాడాలి.
4. వ్యాధులు ఉంటే ఏ వ్యాధి అయినదీ గుర్తించి చికిత్స చేయాలి.
5. మానసిక కారణాలు ఉంటే ట్రాంక్విలైజర్స్ వాడాలి.
6. ఎండా, వాన, చలి సరిపడకపోతే, వాటికి దూరంగా ఉండాలి.
7. ఎలర్జీ తగ్గడానికి ఎవిల్‌గానీ, ట్రెక్సిల్ గానీ, సెట్రిజిన్ గానీ రోజుకి 1, 2 సార్లు వాడాలి.
8. బెటనలాన్ **లేదా** ప్రెడ్నిసొలోన్ వంటి కార్టికోస్టిరాయిడ్స్ వాడాలి.
9. సైకలాజికల్ కారణానికి సైకోథెరపి చేయాలి.

□□□

# 10. హెర్పిస్ సింప్లెక్స్

హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వైరస్ క్రిములవల్ల వస్తుంది. దీనికి సంబంధించిన వైరస్ రెండు రకాలు. 1. హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - I; 2. హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - II.

హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వచ్చిన వారిలో నీటి పొక్కులులాగా ఒకే చోట అనేకం వస్తాయి. అవి పగిలిపోయి దొండపండులాగా పుండు ఏర్పడుతుంది.

హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ -I ద్వారా వ్యాధి వచ్చిన వాళ్ళల్లో పెదవుల మీద, నోటి అంచుల దగ్గర, ముక్కు రంధ్రం దగ్గర చిన్న చిన్న చెమట పొక్కులు గుత్తులు గుత్తులుగా వస్తాయి. వీటినే వెసికిల్స్ అంటారు. ఈ వైరస్ వల్లే నోటిలో పుళ్ళు ఏర్పడతాయి. ఈ పుళ్ళు వారం, పదిరోజులు ఉంటాయి. నోట్లో పుళ్ళు ఏర్పడినప్పుడు నొప్పి అనిపించడం, ఏమీ తినలేకపోవడం, మాట్లాడడానికి కష్టం అవుతుంది.

హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ -II వల్ల స్త్రీ, పురుషులలో మర్మావయవాల దగ్గర వెసికిల్స్ ఏర్పడి కొద్ది గంటలలోనే పగిలి పుండుగా తయారవుతుంది. లైంగికంగా కలిసినప్పుడు ఒకరి నుంచి మరొకరికి వ్యాధి సంక్రమిస్తుంది.

హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - II వల్ల పురుషులలో వ్యాధి వచ్చినప్పుడు పురుషాంగం పూర్వ చర్మం మీద, లోపల, పురుషాంగం కాండం మీద వెసికిల్స్ రావడం, పుండుగా రావడం జరుగుతుంది. స్త్రీలలో ఈ వ్యాధి వచ్చినప్పుడు యోని పెదవులు, యోని మార్గం, గర్భాశయ కంఠం మీద వెసికిల్స్ తేలుతాయి. తరువాత పుండుగా మారుతుంది. నొప్పి అనిపిస్తుంది.

కొందరిలో హెర్పిక్స్ వ్యాధి ఒకసారి కనబడి తగ్గిపోతే, మరికొందరిలో తరచు, వస్తూ పోతుంటుంది. హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధికి ఇంతవరకు సరైన మందు లేదు. కనుక ఏ మందు వాడినా పెద్దగా ఫలితం కనబడదు. హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి సాధారణంగా ఎటువంటి హాని కలిగించదు. అందుకని ఎన్నిసార్లు వ్యాధి కనబడినా, పెద్దగా నష్టం కలగదు.

**చికిత్స :**

1. హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వల్ల నోట్లో పుండ్లు పడి బాధగా ఉంటే "మ్యూకో పేయిన్" ఆయింట్‌మెంట్‌గానీ, "హెక్సిజిల్" ఆయింట్‌మెంట్‌గానీ, జెయిటి సొల్యూషన్ గానీ నోటిలో పుళ్ళ మీద రాయాలి. ఈ మందులు కడుపులోకి మింగినా ఏమి అవదు.

2. హెర్పిక్స్ సింప్లెక్స్ వ్యాధి మూతిపైనా, ముక్కు మీద, మర్మావయవాల దగ్గర వచ్చినప్పుడు 'ఎసైక్లోవిరాన్' ఆయింట్‌మెంట్ రోజుకి 3,4 సార్లు రాయాలి. వ్యాధి తీవ్రంగా మాటిమాటికి వస్తున్నా ఎసైక్లోవిరాన్ బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున రోజుకి 5 సార్లు వాడాలి. అలా వారం, 10 రోజులు వేసుకోవాలి.
3. వైరస్ ఇన్‌ఫెక్షన్‌తోపాటు బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కూడా కలిస్తే యాంటిబయోటిక్ మందులు వాడాలి.

❑❑❑

# 11. హెర్పిస్ జోస్టర్

*హెర్పిస్ జోస్టర్ వ్యాధి వైరస్ క్రిములవల్ల వస్తుంది. ఆట్లమ్మ వచ్చిన వాళ్ళలో హెర్పిస్ జోస్టర్ ఎక్కువగా కనబడుతుంది. శారీరకంగా, మానసికంగా దెబ్బతిన్నవారిలోనూ, షుగర్ వ్యాధి ఉన్నవారిలోనూ, లింఫోమా కార్సినోమా ఉన్నవారిలోనూ హెర్పిస్ జోస్టర్ రావడం ఎక్కువ.*

*హెర్పిస్ జోస్టర్ వచ్చినవారికి శరీరంలో ఒక భాగం వైపు ముందు, వెనుక దట్టంగా వెసికిల్స్ (నీటి పొక్కుల్లాంటివి) అనేకం వస్తాయి. చాలా నొప్పి అనిపిస్తుంది.*

*హెర్పిస్ జోస్టర్ వచ్చే ముందు ఆ ప్రాంతంలో చర్మం నొప్పిగా మారుతుంది. జ్వరం కూడా ఉంటుంది. ఆ తరువాత వెసికిల్స్ విస్తృతంగా ఏర్పడతాయి. చివరికి వెసికిల్స్ చీము పొక్కుల్లాగా పెద్దవిగా అయి అణిగిపోతాయి. అలా అణిగిపోయిన చోట చారలు చారలుగా కనబడుతుంది.*

*హెర్పిస్ జోస్టర్ తగ్గిపోయినా, ఆ చారలు ఏర్పడిన చోట నరాలు మండినట్లు అనిపిస్తుంది.*

**చికిత్స :**

1. హెర్పిస్ జోస్టర్ వచ్చినప్పుడు దురద, మంట ఉంటుంది. అవి తగ్గడానికి పొక్కుల మీద కేలమిన్ లోషన్ అనేక మార్లు రాయాలి.
2. నొప్పి తగ్గటానికి బిళ్ళలు వాడాలి.
3. హెర్పిస్ జోస్టర్ ప్రారంభ దశలోనే ప్రెడ్నిసొలోన్ టాబ్లెట్లు రోజుకి 40 మి.గ్రా. చొప్పున 10 రోజులు వాడాలి. ఆ తరువాత నిదానంగా మోతాదు తగ్గించుకుంటూ 3 వారాల వరకు వాడాలి.
4. హెర్పిస్ జోస్టర్ తగ్గిన తరువాత కూడా నరాల మంట ఉంటే న్యూరోబియాన్ ఇంజక్షన్ 3 రోజులకి ఒకటి చొప్పున చేయాలి.

❑❑❑



# 12. సొరియాసిస్

*సొరియాసిస్ క్రానిక్‌గా వచ్చిపోయే చర్మ వ్యాధి. కొంతకాలం వ్యాధి ఉధృతంగా కనబడుతుంది. మరికొంతకాలం అసలు లేకుండా పోతుంది. ఈ చర్మ వ్యాధిలో ఒంటి మీద సూది మొనంత తెల్లటి చుక్కలు అక్కడక్కడ ఏర్పడడంతో మొదలయి నిదానంగా రూపాయి బిళ్ళ సైజుకి లేదా ఇంకా ఎక్కువ సైజుకి పెరుగుతాయి. ఈ చర్మ వ్యాధిలో వెండి పొలుసులు వంటివి తయారవుతాయి. గోకితే జలజలా రాలిపోతాయి. మళ్ళీ ఆ స్థలంలోనే కొత్త పొలుసులు తయారవుతాయి. ఈ వ్యాధి గోరు నుంచి వెంట్రుక దాక వచ్చే వ్యాధి. ఈ వ్యాధి ఎందుకు వస్తుందో ఇంతవరకు స్పష్టమైన కారణం తెలియదు.*

**లక్షణాలు :**

సొరియాసిస్ వ్యాధి శరీరంలో రెండు వైపుల సమానంగా వస్తుంది. ఉదా॥ కుడికాలి మీద వ్యాధి వస్తే సమానంగా అదే ప్రదేశంలో ఎడమ కాలి మీద కూడా వస్తుంది, సొరియాసిస్ వ్యాధి వంశపారంపర్యంగా సంక్రమించటం ఎక్కువ. కొందరిలో ఈ వ్యాధి ఉన్నా బయటపడకుండా ఉంటుంది. ఏవైనా గాయాలు తగిలినప్పుడు లేదా ఒంటి మీద ఏదైనా ప్రదేశంలో ఒరిపిడి ఏర్పడినప్పుడు ఆ ప్రదేశంలో సొరియాసిస్ వ్యాధి బహిర్గతం అవుతుంది. శీతాకాలంలో వ్యాధి కనబడటం ఎక్కువ. ఎండాకాలంలో రావడం తక్కువ. మానసికంగా దిగులు, ఆందోళన కలిగిన వారిలో ఈ వ్యాధి బయటపడడం ఉంటుంది. మానసికంగా ప్రశాంతంగా మారగానే పూర్తిగా తగ్గిపోతుంది, సొరియాసిస్ మోచేతి వెనుక, మోకాళ్ళ ముందు రావడం ఎక్కువ. తల వెంట్రుకలలో, కాళ్ళ మీద, ఛాతి వెనుక, అరిచేతులలో, పాదాలలో రావడం ఎక్కువ. కీళ్ళకు కూడా ఈ వ్యాధి రావచ్చు, సొరియాసిస్‌లో దురద ఉండడం అరుదు. ఒకవేళ దురద ఉన్నా తక్కువగా ఉంటుంది, సొరియాసిస్ శరీరం మీద ఎక్కడ వచ్చినా తలలో తప్పకుండా వస్తుంది. చుండ్రులాగా తలలో పొట్టు విపరీతంగా తయారవుతుంది. కొందరికి ఒంటి మీద ఎక్కడా రాకుండా తలలోనే ఈ వ్యాధి వస్తుంది.

**చికిత్స :**

1. సొరియాసిస్ వచ్చినవారు మానసికంగా ప్రశాంతంగా ఉండడం నేర్చుకోవాలి. ఆందోళన, దిగులు ఉన్నవారు రోజూ రాత్రిపూట కాంపోజ్ బిళ్ళ ఒకటి వేసుకోవాలి.
2. సొరియాసిస్ ఉన్నచోట "క్లొబెటాల్" ఆయింట్‌మెంట్ రెండు పూటలా రాయాలి.

3. కొందరికి సొరియాసిస్‌తోపాటు ఇన్‌ఫెక్షన్ కూడా ఉండొచ్చు. వీరు యాంటి బయోటిక్ మందులు కోర్సుగా వాడాలి.
4. సొరియాసిస్ శరీరమంతా ఉన్నప్పుడు ప్రాగ్‌మటార్ ఆయింట్‌మెంట్ **లేదా** టార్‌ప్రిపరేషన్ సొల్యూషను చర్మవ్యాధి ఉన్న చోటంతా రాయాలి. ఈ మందు రాసిన తరువాత 30 నిముషాలు ఎండలో నిలబడాలి.
5. సొరియాసిస్ ఉన్నవారు మెలనోసిల్ టాబ్లెట్లు ఉదయం 10 గంటల ప్రాంతంలో రెండు వేసుకుని, మధ్యాహ్నం 12 గంటలకి ఎండలో 15 నిముషాలు నిలబడాలి. ఎండలో నిలబడేటప్పుడు కళ్ళకి నల్లద్దాలు పెట్టుకోవాలి.
6. సొరియాసిస్ వ్యాధి ఎక్కువగా ఉన్నప్పుడు ప్రెడ్నిసొలోన్ రోజుకి 60 మి.గ్రా. చొప్పున వాడాలి. వారం రోజుల తరువాత నుంచి నిదానంగా మోతాదు తగ్గించుకుంటూ రావాలి.
7. మెథోట్రెక్సేట్ టాబ్లెట్స్ డాక్టర్ సలహాపై వాడవచ్చు.

**ఆహారం :**

సొరియాసిస్ ఉన్నవారు ఆహారంలో కొవ్వు పదార్థం, జంతు సంబంధమైన మాంసకృత్తులు బాగా తగ్గించి తీసుకోవాలి.

❑❑❑

# 13. ఉలిపిరి కాయలు

*వైరస్ ఇన్‌ఫెక్షన్ వల్ల ఉలిపిరి కాయలు వస్తాయి. ఉలిపిరి కాయలు వివిధ రకాలుగా ఉంటాయి. కొందరిలో ఆవగింజంత పరిమాణం నుంచి కందిగింజంత పరిమాణం వరకూ ఉంటాయి. మరికొందరిలో మెత్తగా, బొడుపుల్లాగా వేరుశనగ గింజంత, జీడిపప్పంత పరిమాణంలో ఉలిపిరికాయలు వస్తాయి. కొందరిలో అరిచేతుల్లో, అరికాళ్ళల్లో ఆనల రూపంలో ఉలిపిరి కాయలు వస్తాయి. ఇంకొందరిలో గజ్జల్లో, మర్మావయవాల దగ్గర మెత్తగా ఉలిపిరి కాయలు వస్తాయి.*

**చికిత్స :**

1. ఉలిపిరి కాయలని లోకల్ ఎనస్తీషియాతో మొద్దుబారేటట్లు చేసి ఎలక్ట్రికల్ కాటరితో తొలగించాలి.
2. కొన్ని రసాయనికాలు రాసి ఉలిపిరి కాయలని తొలగించవచ్చు. దీనిని కెమికల్ కాటరి పద్ధతి అంటారు.

❑❑❑



# 14. దురదలు

దురదలు రావడానికి అనేక కారణాలు ఉన్నాయి. తామర, గజ్జి ఉంటే దురద అనిపిస్తుంది. దోమలు, ఇతర క్రిమికీటకాదులు కుట్టినా దురదలు వస్తాయి. వాతావారణం ఉక్కగా ఉన్నా, చలిగా ఉన్నా దురద వస్తుంది. రోజూ స్నానం చేయకపోయినా దురద వస్తుంది. మసాల దినుసులు ఆరగించినా, ఆల్కహాల్ తీసుకున్నా దురదలు రావచ్చు. కొన్ని మందులు సరిపడక దురదలు వస్తాయి. రకరకాల వ్యాధులు వచ్చినప్పుడు దురదలు రావడం సహజం. కొన్ని రకాల దుస్తులు ధరించినపుడు, ఆభరణాలు, పూలు పెట్టుకున్నప్పుడు ఎలర్జీ అనిపించి దురదలు అనిపిస్తాయి.

పచ్చ కామెర్లు వచ్చినప్పుడు దురద అనిపించడం సహజం. మధుమేహం ఉన్నవారిలో దురదలు రావడం ఎక్కువ. కడుపులో పాములు ఉండటం కూడా దురదలకి ఒక కారణం. డ్రై స్కిన్ ఉన్నవాళ్ళలో దురదలు ఉంటాయి.

కొందరికి ఏ కారణం లేకుండా దురదలు ఉంటాయి. వాళ్ళు దురద అనిపించి గోక్కోవడం చాలా ప్రత్యేకత కలిగి ఉంటుంది. ఇటువంటి దురదని సైకలాజికల్ ఇచ్చింగ్ అంటారు.

**చికిత్స :**

1. మూలకారణం గుర్తించి దాని నివారణకి కృషి చేయాలి.
2. సరిపడనివి ఉంటే మానేయాలి.
3. దురదలు తగ్గటానికి 'ఎవిల్' లేదా 'ట్రెక్సిల్' లేదా 'ఇన్సిడాల్' లేదా 'సెట్రిజిన్' బిళ్ళలు ఉదయం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున కొన్ని రోజులు వాడాలి.
4. కొన్ని దురదలు ఉన్నప్పుడు కార్టికో స్టిరాయిడ్స్ వాడవలసి వుంటుంది.

❑❑❑

# 15. నల్లమచ్చలు, నల్లపొడ

కొందరికి శరీరం మీద నల్లమచ్చలు, నల్లపొడలు ఏర్పడతాయి. నల్ల మచ్చలు చిన్నవిగా ఉంటే, నల్లపొడ ముఖం అంతాగానీ, చేతుల మీద, కాళ్ళ మీద ఎక్కడైనా ఎక్కువగా రావచ్చు.

**కారణాలు :**

మెలినిన్ పిగ్మెంట్ ఎక్కువ కావడం, శరీరంలో గ్రంథులు కొన్ని అతిగా పనిచేయడం,

కొన్ని దీర్ఘ వ్యాధులు ఉండడం, మలేరియా, కాలాజాల్, క్షయ, కేన్సర్ వ్యాధులు ఉండడం, పెల్లగ్రా వ్యాధి ఉండడం. ఆర్సెనిక్, సిల్వర్, గోల్డ్, మొదలైన మెటల్స్ మందుగా తీసుకోవడం. సల్ఫా టెట్రాసైకిలిన్ మందులు వాడటం. ఎక్జిమా, తామర, గజ్జి ఉండటం. ఎండలో ఎక్కువ తిరగటం.

చికిత్స :

1. నల్లమచ్చలు, నల్లపొడ వచ్చినప్పుడు మూలకారణాన్ని గుర్తించి దాని నివారణకు కృషి చేయాలి.
2. ఎండలో తిరగకుండా చల్లని ప్రదేశంలో ఉండాలి.
3. పోషకాహారం తీసుకోవాలి.
4. నల్ల పొడమీద, మచ్చల మీద మెలలైట్ క్రీమ్ గానీ కేలడ్రిల్ లోషన్ గానీ రెండు పూటలా రాయాలి.

❑❑❑

# 16. బొల్లి

*బొల్లినే తెల్లపొడ అంటారు. వైద్య పరిభాషలో ల్యూకోడెర్మా లేదా విటిలిగో అంటారు.*

కారణాలు :

విటిలిగో రావడానికి స్పష్టమైన కారణం తెలియదు. కడుపులో పాములు ఉండడం, మాంసకృత్తుల లోపం, జింక్ లోపం బొల్లికి ఒక కారణంగా పరిగణింపబడుతుంది. కొంతమందిలో బొల్లి వంశపారంపర్యంగా వస్తుంది. అయితే కేవలం వంశపారంపర్యంగా సంక్రమించడం తక్కువ. బొల్లి అంటువ్యాధి కాదు. చర్మంలో ఉండే మెలినిన్ పిగ్మెంటు పోవడం వల్ల తెల్ల మచ్చలు ఏర్పడతాయి. కొందరిలో బిగించి చీర కట్టుకున్నా, టైట్‌గా బెల్ట్ పెట్టుకున్నా ఆ ప్రదేశంలో బొల్లి రావచ్చు.

కొంతమందిలో బొల్లి వచ్చిన చోట వెంట్రుకలు కూడా తెల్లగా మారతాయి. దీర్ఘకాలంగా జీర్ణకోశ వ్యాధులు ఉన్నవారిలో బొల్లి వస్తుంది. కడుపులో పాములు ఉన్నవారిలో, షుగర్ వ్యాధి ఉన్నవారిలో, రక్తహీనత ఉన్నవారిలో, థైరాయిడ్ లోపం ఉన్నవారిలో బొల్లి రావచ్చు.



చికిత్స :

1. మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయాలి.
2. తెల్ల మచ్చ ఉన్న చోట తగ్గేవరకు క్లొబెటాల్ ఆయింట్‌మెంట్ రెండు పూటలా రాయాలి.
3. మెలనోసిల్ టాబ్లెట్లుగానీ, సొరాలిన్ టాబ్లెట్లుగానీ ఉదయంపూట ఒకేసారి రెండు బిళ్ళలు వేసుకొని ఆ తరువాత 2 గంటలకి పావుగంట పాటు ఎండలో న్నుంచోవాలి.
4. సిగరెట్లు త్రాగేవారిలో పెదవుల మీద తెల్లమచ్చలు వస్తాయి. వీరు సిగరెట్లు మానేయాలి.

❑❑❑

## మానసిక ప్రశాంతత - ఆరోగ్యం

ఈనాడు ప్రతి వ్యక్తిలోను మానసిక ఒత్తిడి పెరిగిపోయింది. కంగారు, గాభరా, ఆందోళన ఎక్కువైనాయి. ఏది ఎలా ఉంటుందో, ఏమవుతుందో తెలియని భయం పెరిగాయి. అనుక్షణం టెన్షన్, ఎల్లప్పుడూ స్ట్రెస్‌తో పనిచేయడం. టెన్షన్, స్ట్రెస్ ఉన్నవారిలో రక్తపోటు, గుండెపోటు రావడం ఎక్కువ.

స్ట్రెస్, టెన్షన్ ఉంటే ఉబ్బసం మరింత ఎక్కువ అవుతుంది. షుగర్ ఉన్నవారికి షుగర్ మరింత ముదురుతుంది. న్యూరోసిస్ ఉన్నవారిలో వణుకు, దడ మరింత పెరుగుతాయి. మానసిక ఒత్తిడి తెలియకుండా ఎంతో నష్టం కలిగిస్తుంది. యోగ, సెల్ఫ్ హిప్నాసిస్, టెన్షన్స్‌ని, స్ట్రెస్‌ని తగ్గిస్తాయి. లలితకళలు డైవర్షన్ కలిగించి మనసుని తేలికపరుస్తాయి.

ఆందోళన ఆరోగ్యానికి చేటు

# 11. చిన్న పిల్లల వ్యాధులు

## 1. ఎదుగుదలలో లోపం

పిల్లల ఎదుగుదలలో లోపం కలగడానికి రకరకాల కారణాలున్నాయి. ఆ కారణాన్ని గుర్తించి లోపాన్ని సరిదిద్దినట్లయితే ఎదుగుదల మామూలు అవడానికి అవకాశం ఉంది. కొన్ని లోపాలు సరిదిద్దగలిగేవి, మరికొన్ని సరిదిద్దలేనివి.

* జన్యు సంబంధమైనవి:- జన్యుసంబంధమైన లోపాలవల్ల, వ్యాధుల వల్ల - బిడ్డ ఎదుగుదలలో తేడా వస్తుంది. జన్యు సంబంధమైన లోపాన్ని సరిదిద్దడం కష్టం.
* హార్మోన్ల సంబంధమైనవి:- గ్రోత్ హార్మోన్ ఇందులో ప్రధాన పాత్ర వహిస్తుంది. థైరాక్సిన్ లోపం, చిన్నతనంలోనే డయబిటిస్ (ఇన్సులిన్ లోపం), సెక్స్ స్టిరాయిడ్స్ లోపం కూడా బిడ్డ ఎదుగుదలలో తేడాలు తెస్తాయి.
* వ్యాధులు:- తల్లి గర్భవతిగా ఉండగా వచ్చే వ్యాధులు. బిడ్డ పుట్టిన తరువాత బిడ్డకు కలిగే వ్యాధులు - ఎదుగుదలలో లోపం కలిగిస్తాయి.
* పౌష్టికాహారం లోపం:- తల్లి గర్భవతిగా ఉండగా పౌష్టికాహారం తీసుకోనట్టయితే గర్భస్థ శిశువు సరిగా ఎదగడం ఉండదు. బిడ్డ పుట్టిన తరువాత బిడ్డకు తగిన పాళ్ళల్లో పోషకాహారం ఇవ్వకపోయినట్లయితే ఎదుగుదల ఉండదు. బిడ్డపూర్తిగా ఎదిగేవరకు పిండి పదార్థాలు, మాంసకృత్తులు, క్రొవ్వు పదార్థాలు, విటమిన్లు, లవణ పదార్థాలు తగిన మోతాదులో ఇవ్వవలసిన అవసరం ఉంది. అధికశాతం పిల్లలు ఎదగకపోవడానికి, నీరసంగా ఉండడానికి ప్రధానకారణం పోషకాహార లోపమే.
* తల్లిదండ్రుల ఆర్థికస్థితి:- తల్లిదండ్రుల ఆర్థిక స్థితి తగినంత లేనప్పుడు పిల్లలకి ఆహార లోపం కలగడం, తరచు వ్యాధులు రావడం ఉంటుంది.
* మానసిక స్థితి:- బిడ్డ మానసిక స్థితి ఉల్లాసంగా లేకుండా ఇంటి వాతావరణం, ఛీత్కారాలు గొడవలతో ఉన్నట్లయితే బిడ్డ ఆరోగ్యంపై, ఎదుగుదలపై చెడు ప్రభావం కలుగుతుంది.
* మతాచారాలు, సాంఘికాచారాలు:- కొన్ని మతాలలో, సమాజాలలో ఆహారం గురించి ఉండే విధి నిషేధాలు బిడ్డకి తగిన పోషకాహారం లేకుండా చేస్తాయి.



బిడ్డ ఎదుగుదలలో అవరోధంగా నిలుస్తాయి.

* మానసికంగా పెరుగుదల:- కొందరి పిల్లల్లో మానసికంగా ఎదుగుదల ఉండదు. ఆహారం సక్రమంగా తీసుకోలేరు. దానితో వారి ఎదుగుదలలో లోపం ఏర్పడుతుంది.

చికిత్స:

1. బిడ్డ ఏ వయస్సుకి ఎంత ఎత్తు, ఎంత బరువు ఉండవలసినది తల్లిదండ్రులు తెలుసుకొని ఎప్పటికప్పుడు తగిన రీతిలో శ్రద్ధ తీసుకోవాలి.
2. పోషకాహారం ఇవ్వడంలోనూ, వ్యాధి నిరోధక టీకాలు వేయించటంలోనూ, వ్యాధులు కనబడగానే చికిత్స చేయించడంలోనూ తల్లిదండ్రులు జాగ్రత్తలు వహించాలి.
3. బిడ్డల శారీరక వ్యాయామ విషయాల్లో కూడా తల్లిదండ్రులు శ్రద్ధ వహించాలి. బిడ్డ ఎదుగుదలకి ఆహారం ఎంత ముఖ్యమో, శారీరక వ్యాయామం కూడా అంతగానే ముఖ్యం.

**వివిధ వయసుల వారికి ఒక రోజుకు కావలసిన సమతులాహారము**

| | పురుషులు | | | స్త్రీలు | | | పిల్లలు | | బాలికలు | బాలురు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆహారపదార్థం | తేలిక పని | సాధారణ పని | బరువు పని | తేలిక పని | సాధారణ పని | బరువు పని | 1-3 సం॥ | 4-6 సం॥ | 10-12 సం॥ | 10-12 సం॥ |
| | | | | గ్రాములలో | | | | | | |
| ధాన్యాలు | 460 | 520 | 670 | 410 | 440 | 575 | 175 | 270 | 420 | 380 |
| పప్పుధాన్యాలు | 40 | 50 | 60 | 40 | 45 | 50 | 35 | 35 | 45 | 45 |
| ఆకు కూరలు | 40 | 40 | 40 | 100 | 100 | 50 | 40 | 50 | 50 | 50 |
| ఇతర కూర గాయలు | 60 | 70 | 80 | 40 | 40 | 100 | 20 | 30 | 50 | 50 |
| దుంపలు | 50 | 60 | 80 | 50 | 50 | 60 | 10 | 20 | 30 | 30 |
| పాలు | 150 | 200 | 250 | 100 | 150 | 200 | 300 | 250 | 250 | 250 |
| నూనె,క్రొవ్వు పదార్థాలు | 40 | 45 | 65 | 20 | 25 | 40 | 15 | 25 | 40 | 35 |
| చక్కెర లేదా బెల్లం | 30 | 35 | 55 | 20 | 20 | 40 | 30 | 40 | 45 | 45 |

మూలం: జాతీయ పోషకాహారసంస్థ - ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి



# 2. పసికూనలో పసికిరులు

*బిడ్డ పుట్టగానే కూడా పసికిరులు (జాండీస్) కనబడతాయి. మామూలుగా పెద్దయ్యాక వచ్చే పచ్చ కామెర్లకి పసిబిడ్డలికి వచ్చే కామెర్లకి తేడా ఉంది.*

కారణాలు:

కాలేయం తగినంత వృద్ధి కాకపోవడం : ముఖ్యంగా నెలలు నిండకుండానూ, బరువు తక్కువగానూ పుట్టిన పిల్లల్లో పుట్టగానే కామెర్లు కనబడతాయి.

రక్తంలో బైలిరుబిన్ శాతం పెరగడం: ఆర్.హెచ్. ఇన్‌కంపాటబిలిటి, ఎ.బి.ఓ. ఇన్ కంపాటబిలిటి వగైరా.

అసాధారణ ఎంజైమ్స్, పసరు గొట్టానికి పుట్టుకతోనే అడ్డంకి ఉండడం, పుట్టుకతోనే వచ్చే కామెర్లు.

50 శాతం చిన్న పిల్లలలో పుట్టిన 3వ రోజు, 4వ రోజున ఒళ్ళు వెచ్చబడటం ఉంటుంది. కళ్ళు కూడా పచ్చబడతాయి. ఇలా కనబడే కామెర్లు అంతగా పెరగడం ఉండదు. కొద్ది పూటల్లోనో, కామెర్లు కనబడిన 3,4, రోజుల్లోనో పూర్తిగా తగ్గిపోతాయి.

ఎ.బి.ఓ. బ్లడ్ గ్రూపుల కలయికలో తేడా రావడం వల్ల బిడ్డ పుట్టిన 24 గంటలలో పచ్చ కామెర్లు వస్తాయి. ఆర్.హెచ్. ఫ్యాక్టరు ఇన్‌కంపాటబిలిటి వచ్చి పుట్టుకతోనే, పుట్టిన కొద్ది గంటలలోనో కామెర్లు వస్తాయి. పసరు గొట్టానికి అడ్డంకి ఉన్న పిల్లల్లో వారం, పది రోజులలో పచ్చ కామెర్లు కనబడతాయి.

నిర్ధారణ:

రక్త పరీక్ష , కూంబ్స్ టెస్ట్, బ్లడ్ గ్రూపింగ్.

చికిత్స:

1. ఫొటోథెరపి:- సీరమ్ బైలురుబిన్ 10 మి.గ్రా. కంటే ఎక్కువ ఉన్నప్పుడే ఫొటోథెరపి ప్రారంభించాలి.
2. ఫినో బార్బిటోన్:- సీరమ్ బైలురుబిన్ ఎక్కువగా ఉన్నప్పుడు ఫినోబార్బిటోన్ టాబ్లెట్స్ బిడ్డకి ఇచ్చినట్లయితే కామెర్లు తగ్గిపోతాయి.
3. ఎక్స్‌ఛేంజ్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్:- సీరం బైలురుబిన్ 18-20 మి.గ్రా. కంటే ఎక్కువ ఉన్నట్లయితే ఎక్స్‌ఛేంజ్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ ద్వారా రక్త మార్పిడి జరపాలి.

❑❑❑

# 3. చిన్న పిల్లలలో రక్తస్రావ వ్యాధి

*రక్తస్రావ వ్యాధినే హెమరేజిక్ డిసీజ్ అంటారు.*

కారణాలు:

విటమిన్ 'కె' లోపం ఉన్న బిడ్డలలో ప్రోథ్రోంబిన్ లెవల్స్ తక్కువగా ఉండి రక్తస్రావం జరుగుతుంది. సాధారణంగా బిడ్డ పుట్టిన 5 రోజుల తరువాత ప్రోథ్రోంబిన్ లెవల్స్ తగ్గుతాయి. అయినా అధిక సంఖ్యాక పిల్లల్లో రక్తస్రావం జరగదు. కాలేయం సరిగా పెంపొందనివారిలోనూ, నెలలు నిండకుండా పుట్టిన వారిలోనూ ప్రోథ్రోంబిన్ తక్కువ అవడంతో రక్తస్రావం జరుగుతుంది. గీరుకుపోవడం, నొక్కుకుపోవడం, కాన్పు సమయంలో ఆక్సిజన్ తగినంత అందకపోవడం, ఇన్‌ఫెక్షన్‌కు గురికావడం, పుట్టుకతోనే సిఫిలిస్, సెప్టిసీమియా ఉండడం, హీమోఫీలియా వ్యాధి ఉండడం.

లక్షణాలు:

అకస్మాత్తుగా నోటివెంట రక్తం వాంతి అవడం. లేదా మలద్వారంలో రక్తం కారడం,ఆడపిల్లల్లో యోనినుండి రక్తం కారడం, మూత్రంలో రక్తం, బొడ్డునుంచి రక్తం కారడం, చర్మం క్రింద రక్తనాళాలు పగలడం.

చికిత్స:

1. విటమిన్ 'కె' :- కేజి బాడీ వెయిట్‌కి 1 మి.గ్రా. చొప్పున ప్రతి 8 గంటలకి ఒకసారి నరానికి గాని, కండకి గాని ఇవ్వాలి.
2. బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్.

❑❑❑

# 4. పాలు కక్కడాలు - వాంతులు

*పుట్టిన పిల్లలలో తాగిన పాలల్లో కొంత కక్కేయడం లేదా వాంతులు అవడం ఉంటాయి. దీన్నే రీగర్జిటేషన్ లేదా వామిటింగ్స్ (వాంతులు) అంటారు.*

కారణాలు:

బిడ్డ పుట్టిన మొదటి వారాలలో తాగిన పాలలో కొంత ఉమ్మేయడం లేదా కొంత కక్కేయడం సహజం. రోజులు గడుస్తున్న కొద్దీ ఇది తగ్గిపోతుంది, పాలు పట్టే పద్ధతి సక్రమంగా తెలియకపోవడం, బిడ్డ పాలతో పాటు గాలిని కూడా మింగేయడం.

రిఫ్లెక్స్ యాక్షన్:- మొదటి వారం, పదిరోజులు కడుపులోకి ఆహారం వెళ్ళగానే కడుపు వెంటనే బయటికి నెట్టేయడం జరుగుతుంది.అరుదుగా పుట్టుకతోనే పేగు మూసుకు పోవడం, పేగు మెలిపడడం, మలద్వారం మూసుకుపోయి ఉండడం, కాన్పు సమయంలో తలకి వత్తిడి ఎక్కువయి మెదడు వాచడం.

నిర్ధారణ:

ఎబ్డామినల్ ఎక్స్‌రే, బేరియమ్ మీల్ ఎక్స్‌రే, సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ ఎగ్జామినేషన్, రక్త పరీక్షలు, మూత్ర పరీక్షలు.

చికిత్స:

1. సాధారణంగా కొద్దిపాటి వాంతులు అయి వాటంతటికి అవే తగ్గిపోతాయి. అలా తగ్గినప్పుడు సెలైన్ వాటర్‌తో స్టమక్ వాష్ చేయాలి.
2. కొద్ది కొద్దిగానే ఆహారం ఇవ్వాలి.
3. పెరినార్మ్ (మెటాక్లోప్రమైడ్) పావుబిళ్ళ చొప్పున రోజుకి 2 సార్లు ఇవ్వాలి లేదా పెరినార్మ్ డ్రాప్స్ వాడాలి.
4. డీ హైడ్రేషన్ ఉంటే నరానికి సెలైన్ ఎక్కించాలి.
5. పుట్టుకతోనే ప్రేగు మూసుకుని ఉంటే సర్జరీ చేయాలి.
6. ఇన్‌ఫెక్షన్ ఉంటే యాంటీబయోటిక్ మందులు వాడాలి.

❑❑❑

# 5. చంటిపిల్లల్లో శ్వాస అందని పరిస్థితి

*కొందరు పిల్లలు పుట్టగానే మూలగడం మొదలుపెడతారు. వారికి శ్వాస అందదు. ఇటువంటి పరిస్థితిని ఎక్యూట్ రెస్పిరేటరి డిస్ట్రెస్ అంటారు. ఈ పరిస్థితి పుట్టగానే ఉండవచ్చు. తరువాత ఎప్పుడైనా ఏర్పడవచ్చు. రెస్పిరేటరీ డిస్ట్రెస్‌కి రకరకాల కారణాలు ఉన్నాయి.*

కారణాలు:

పుట్టుక సమయంలో తలకి బాగా ఒత్తిడి ఏర్పడడం, తలకి దెబ్బ తగలడం,కోమా వల్ల మెదడు సక్రమంగా పనిచేయకపోవడం. నిద్రమందులు, మరికొన్ని రసాయనిక పదార్థాలు రెస్పిరేటరి సెంటర్‌ని డిప్రెస్ చేయడం, శ్వాసనాళాలలో అడ్డం ఏర్పడడం, న్యుమోనియా వంటి శ్వాసకోశాల వ్యాధులు రావడం, బిడ్డ ఛాతి నిర్మాణంలో లోపం,

గుండె సక్రమంగా పనిచేయకపోవడం, ప్రాణవాయువు అందకపోవడం, ఎసిడోసిస్, యురీమియా పరిస్థితులు ఏర్పడడం.

పై విధంగా మెదడుకి, గుండెకి శ్వాసకోశాలు మెటబాలిజంకి సంబంధించిన వ్యాధులు, డామేజి, శ్వాస సరిగ్గా తీసుకోలేకపోవడానికి ప్రాణవాయువు రక్తంలోకి చేరకపోవడానికి కారణమవుతాయి. బిడ్డకి ప్రాణవాయువు తగినంత అందక మూలగడం, శక్తిహీనంగా మారడం జరుగుతుంది. ప్రాణాపాయ పరిస్థితి ఏర్పడుతుంది.

నెలలు నిండకుండా పుట్టినప్పుడు, కాన్పు సమయంలో తల్లికి వాడిన మందులు, కాన్పుకి అధిక సమయం తీసుకోవడం, గర్భస్థ శిశువుకి తగినంత ప్రాణవాయువు అందకపోవడం, బిడ్డ శ్వాసకోశాలు తగినంత పరిపక్వత చెందకపోవడం, శ్వాసకోశాల మ్యూకస్ అడ్డుపడడం, ఎక్యూట్ రెస్పిరేటరీ డిస్ట్రెస్‌కి ప్రధాన కారణాలు.

**ముందు జాగ్రత్త :**

*తల్లి గర్భవతిగా ఉండగా రక్తం పట్టడానికి మంచి ఆహారం, మందులు తీసుకోవడం, ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తపడడం, కాన్పు సక్రమంగా అయ్యేటట్లు చూసుకోవడం, కాన్పు అవగానే బిడ్డకు తగినంత జాగ్రత్తలు తీసుకోవడం, అవసరమైతే వెంటనే ఆక్సిజన్ పెట్టడం.*

**చికిత్స:**

1. రెస్పిరేటరీ డిస్ట్రెస్ ఉన్నప్పుడు కారణంబట్టి వెంటనే చికిత్స ప్రారంభించాలి. కారణం ఏదైనా ముందు ప్రాణవాయువు సక్రమంగా అందేటట్టు చూడాలి.
2. బిడ్డని ఇంక్యుబేటర్‌లో పెట్టాలి.
3. మెటబాలిక్ ఎసిడోసిస్‌ని సరిదిద్దాలి. సోడియం బైకార్బొనేట్ 7.5% సాల్యూషన్ కేజి బాడీ వెయిట్‌కి 2 యం.యల్. చొప్పున నిదానంగా నరానికి ఇవ్వాలి.
4. ఇన్‌ఫెక్షన్ అరికట్టడానికి యాంపిసిలిన్, జెంటామైసిన్ 2 పూటలా ఇవ్వాలి.
5. అవసరం బట్టి బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ చేయాలి.
6. కొందరిలో కార్టికోస్టిరాయిడ్స్ కూడా అవసరం అవుతాయి. అవసరాన్ని గుర్తించి స్టిరాయిడ్స్ ఇవ్వాలి.
7. బిడ్డకు తగిన వెచ్చదనాన్ని నిలకడగా ఉంచాలి. అతిగా చల్లదనం గానీ, వేడిగానీ పనికిరాదు.
8. నరం ద్వారాగానీ, ట్యూబు ద్వారా గానీ ఆహారాన్ని తగినంత అందించాలి.
9. రక్తస్రావ పరిస్థితులు ఏర్పడకుండా విటమిన్ 'కె' ఇవ్వాలి.
10. పల్స్, టెంపరేచర్, రెస్పిరేషన్స్ సక్రమంగా ఉండేటట్లు చూసుకోవాలి.

□□□

# 6. చంటిపిల్లల్లో ఇన్‌ఫెక్షన్స్

*తల్లి గర్భవతిగా ఉండగానే గర్భస్థ శిశువుకు తల్లి రక్తం ద్వారా కొన్ని వ్యాధులు (ఇన్‌ఫెక్షన్స్) వస్తాయి. రూబెల్లా, హెపటైటిస్-బి, హెచ్.ఐ.వి. (ఎయిడ్స్) వంటి వైరల్ వ్యాధులు, 2-కోలై, ట్యూబర్క్యులోసిస్, సిఫిలిస్, టాక్సోప్లాస్మా, మలేరియా వంటి వ్యాధులు సంక్రమిస్తాయి.*

*కాన్పు అవుతున్న సమయంలో హెర్పిస్ సింప్లెక్స్, వైరల్ హైపటైటిస్, వివిధ బాక్టీరియల్, ఫంగస్ ఇన్‌ఫెక్షన్లు సంక్రమిస్తాయి.*

*కాన్పు తరువాత పరిసరాల ప్రభావం వల్ల వైరల్, బాక్టీరియల్, ఫంగస్, పేరసైటిక్ ఇన్‌ఫెక్షన్లు సంక్రమిస్తాయి.*

*బిడ్డలో రోగ నిరోధకశక్తి లేకపోవడం, తల్లికి వివిధ వ్యాధులు ఉండడం, యోనిమార్గంలో వ్యాధులు ఉండడం, నెలలు నిండకుండా కాన్పు అవడం, కాన్పు అధిక సమయం తీసుకోవడంతో బిడ్డ అలసిపోవడం బిడ్డ పుట్టగానే వ్యాధులు రావడానికి కారణాలు.*

**లక్షణాలు:**

బిడ్డలో ఇన్‌ఫెక్షన్ ఉన్నప్పుడు జ్వరం తగలడం, ఆహారం తీసుకోకపోవడం, బిడ్డలో చురుకుదనం లేకపోవడం, కడుపు ఉబ్బరించడం, వాంతులు అవడం, ఆయాసపడడం, మూలగడం, ఛాతి కండరాలు లోపలికి గుంజుకుపోవడం, పాలిపోవడం, ఒళ్ళు చల్లగా అవడం, నాడి వేగంగా కొట్టుకోవడం, చేతులు, కాళ్ళు అదరడం, ఫిట్స్ రావడం, చర్మం క్రింద రక్తనాళాలు పగలడం వంటి లక్షణాలు ఉంటాయి.

**నిర్ధారణ:**

మూలకారణాన్ని గుర్తించడం. లేబరేటరీ పరీక్షలు, ఎక్స్‌రే.

**నివారణ-చికిత్స:**

1. కాన్పు సక్రమంగా చేయడం.
2. కాన్పు అవగానే బిడ్డ పరిస్థితి బట్టి వెంటనే ఆక్సిజన్ పెట్టడం. మందులు వాడటం. పరిసరాలు పరిశుభ్రంగా ఉంచడం.
3. వ్యాధి బట్టి చికిత్స చేయడం.
4. యాంటిబయోటిక్ మందులు.

సాధారణంగా చంటి బిడ్డలకి యాంపిసిలిన్, జెంటామైసిన్ వాడటం జరుగుతుంది.



మొదటి వారం రోజులలో కేజి బాడీ వెయిట్‌కి 100 మి.గ్రా. చొప్పున, నాలుగు డివైడెడ్ డోసులలో ఇవ్వడం జరుగుతుంది. 7 రోజులు దాటిన బిడ్డకి యాంపిసిలిన్ 200 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్‌కి నాలుగు డివైడ్ డోసులలో ఇవ్వడం జరుగుతుంది. యాంపిసిలిన్‌తోపాటు జెంటామైసిన్ కూడా ఇవ్వడం జరుగుతుంది. జెంటామైసిన్ ఇంజక్షన్ 7.5 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్‌కి రెండు డివైడ్ డోసులలో ఇవ్వడం జరుగుతుంది. పైన వివరించిన మోతాదు ఒక రోజుకి సంబంధించినది. ఇదే మోతాదులో కనీసం పది రోజులు **లేదా** ఇన్‌ఫెక్షన్ తగ్గేవరకు వాడాలి.

ఇన్‌ఫెక్షన్ తీవ్రత ఉన్నవారిలో 'ఎమికాసిన్' ఇంజక్షన్ 20 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్‌కి రెండు మోతాదులు చొప్పున ఇవ్వాలి **లేదా** 'సెఫటాక్సిన్' 50-100 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్‌కి రెండు డివైడెడ్ డోసుల క్రింద ఇవ్వాలి. పైన వివరించిన ఈ మోతాదు ఒక రోజుకి సంబంధించినది. ఇన్‌ఫెక్షన్ పూర్తిగా తగ్గేవరకు వారం, పది రోజులు పూర్తిగా మందులు వాడాలి.

❑❑❑

## 7. బిడ్డకు పాలు

*బిడ్డ పుట్టిన తరువాత నాలుగు నుంచి ఆరు నెలల వరకు పాలు ప్రధాన ఆహారం. బిడ్డకు తల్లి పాలే ఆరోగ్యకరం. తల్లి పాలకి మించి ఏవీ గొప్పవికాదు. తల్లి పాలు లేనప్పుడే డబ్బాపాలు, ఇతర పాలు గురించి ఆలోచించాలి.*

**తల్లి పాలవల్ల లాభాలు:**

- తల్లిపాలు పరిశుభ్రమైనవి.
- తల్లిపాల ద్వారా బిడ్డకు యాంటీబాడీస్ అందుతాయి.
- తల్లిపాలు తేలిగ్గా జీర్ణమవుతాయి.
- తల్లిపాలలో బ్యాలెన్స్‌డ్‌గా పోషక పదార్థాలన్నీ ఉంటాయి.
- తల్లిపాలు త్రాగేవారిలో శ్వాసకోశవ్యాధులు, జీర్ణకోశవ్యాధులు తక్కువ.
- తల్లి, బిడ్డ మధ్య చక్కని మానసిక అనుబంధం పెంపొందుతుంది.
- మొదటి రెండు, మూడు రోజులలో తల్లిపాల ద్వారా అందే కొలోస్ట్రం, చక్కని రోగనిరోధక శక్తిని పెంపొందిస్తుంది.

### తల్లిపాలు పనికిరాని పరిస్థితులు:

సెప్టిసీమియా, అతిగా రక్తస్రావం, తీవ్రమయిన అనారోగ్యం, యాంటీ థైరాయిడ్ డ్రగ్స్ వాడుతూ ఉండడం, రొమ్ములో చీము గడ్డలు.

### బిడ్డకు ఇతరత్రా పాలు:

ఆవు, గేదె, మేక పాలు ఇవ్వవచ్చు. నెలలోపు బిడ్డకు ఒకవంతు పాలు, ఒకవంతు నీళ్ళు కలిపి ఇవ్వాలి. రెండు నెలల బిడ్డకు రెండు వంతులు పాలు, ఒక వంతు నీళ్ళు కలిపి ఇవ్వాలి. మూడవ నెలనుంచి నీళ్ళు కలపకుండా పాలు పట్టాలి.

**డబ్బాపాలు :** పాలడబ్బా మీద బిడ్డ బరువు, వయస్సు బట్టి లెక్కగట్టి ఇవ్వాలి. బిడ్డకు పాలు పట్టే ప్రతిసారి పాలపీక, పాలసీసా పూర్తిగా స్టెరిలైజ్ చేసి దానితో పాలు పట్టాలి. పాలు పట్టే సమయంలో పాల పీకకు మట్టి అంటడం, మురికి చేతులతో పాలపీకను తాకడం పనికిరాదు. పోతపాలు పట్టడం విషయంలో తగిన శ్రద్ధ వహించకపోయినట్లయితే బిడ్డ ఆరోగ్యం చెడుతుంది.

### ఎన్ని గంటలకి ఒకసారి పాలు ఇవ్వాలి?

* బిడ్డకి ఫీడింగ్‌కీ, ఫీడింగ్‌కీ మధ్య స్పష్టమైన వ్యవధి ఏదీ లేదు. కడుపునిండా పాలు త్రాగిన బిడ్డకు కనీసం రెండు గంటల వరకు ఆకలి అనిపించదు. అందుకని ఆకలి వల్ల ఏడవడం ఉండదు.
* బిడ్డకు తల్లి కనీసం 20-25 నిముషాలు స్తన్యం అందించాలి. ఫీడింగు కోసం తల్లి అంత సమయం కేటాయించినప్పుడు బిడ్డ పూర్తిగా పాలు త్రాగుతుంది. ప్రతిసారి రెండువైపుల పాలు ఇవ్వాలి.
* పగటిపూట ప్రతి 2 గంటలకి ఒకసారి, రాత్రిపూట ప్రతి 3 గంటలకి ఒకసారి తల్లి తన స్తన్యం బిడ్డకు ఇవ్వాలి.
* బిడ్డ ఫీడింగ్‌కి, ఫీడింగ్‌కి మధ్య ఏడవటం ఉంటే పాలైనా సరిపోకపోవాలి లేదా వేరే అనారోగ్యం అయినా ఉండాలి.
* కొంతమంది తల్లులకు చనుమొనలు చిన్నవిగా ఉంటాయి. పాలు త్రాగడానికి కుదరదు. ఇటువంటివారు రొమ్ముకు నిపిల్ షీల్డ్ పెట్టి పాలు పట్టాలి.
* బిడ్డకు 4వ నెలనుంచి ఘనపదార్థం కొద్దిగా అలవాటు చేయాలి. 6వ నెల

నుంచి ఆహారం తినిపించాలి. సంవత్సరం నిండిన దగ్గర్నుంచి పెద్దలు తినే ఆహారం పెట్టవచ్చు.

* సంవత్సరంన్నర, రెండు సంవత్సరాలు దాటిన తరువాత బిడ్డకు తల్లిపాలు పూర్తిగా మానివేయాలి.

❑❑❑

# 8. బిడ్డ బరువు కోల్పోవడం

*కొందరి పిల్లలు వయసు పెరుగుతున్న కొద్దీ ఎదగడం, బరువు పెరగడం ఉండదు. పైగా అంతకుముందు ఉన్న బరువు కూడా కోల్పోతుంటారు. నీరసంగా కనబడతారు.*

**కారణాలు:**

ఆర్థిక కారణాల వల్ల బిడ్డకు పౌష్టికాహారం అందకపోవడం, తల్లి తగినంత శ్రద్ధ వహించకపోవడం. పుట్టుకతోనే పెదవి, అంగిలి చీరుకునిపోయి ఉండడం. దానివల్ల ఆహారం తీసుకోలేకపోవడం. జీర్ణశక్తిలో లోపం, క్రానిక్ డయేరియా, క్రానిక్‌గా జియార్డియాసిస్, మాల్ ఎబ్జార్ప్షన్ సిండ్రోమ్, జీర్ణకోశం పేగుల్లో లోపాలు, క్షయవ్యాధి,థైరాయిడ్ గ్రంథి లోపం, క్రానిక్ రీనల్ ఫేయిల్యూర్, పుట్టుకతో గుండె జబ్బులు, కేన్సర్, క్రోమోజోమ్‌ల డిజార్డర్.

**నిర్ధారణ:**

గ్రోత్ ఛార్టు, ఆరోగ్య పరీక్ష , రక్తపరీక్ష, మూత్ర పరీక్ష, మలపరీక్ష, ఎక్స్‌రే, మాంటో టెస్ట్, ఇతర పరీక్షలు.

**చికిత్స:**

1. బిడ్డను ఆరోగ్యకర పరిసరాలలో ఉంచటం.
2. వ్యాధి మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయడం.
3. ఆరోగ్యం పెంపొందడానికి ఆహారం, వ్యాయామం.

❑❑❑

# 9. మెరాస్మస్

*బిడ్డ చిక్కి శల్యమైన పరిస్థితిని మెరాస్మస్ అంటారు. సాధారణంగా మెరాస్మస్ పరిస్థితి 6 నుంచి 18 మాసాల బిడ్డలలో కనబడుతుంది. మెరాస్మస్‌కి ప్రధానంగా ఆహారం లేకపోవడం కారణం.*

**కారణాలు:**

ఆహార లోపం, జీర్ణశక్తి లోపం, ఆహారం జీర్ణం కాకపోవడం (తీసుకున్న ఆహారం

జీర్ణమై ఒంటికి పట్టకపోవడం), అస్తవ్యస్తమైన మెటబాలిజం.

లక్షణాలు:

* బిడ్డ చర్మం క్రింద కొవ్వు లేకుండా కరిగిపోవడం. ఈ కొవ్వు కరిగిపోవడాన్ని బట్టి మెరాస్మస్ పరిస్థితిని నాలుగు గ్రేడ్లుగా పేర్కొనడం జరుగుతుంది.
  గ్రేడ్ 1 : పిరుదులు దగ్గర కొవ్వు లేకుండా పోవడం.
  గ్రేడ్ 2 : చంకల్లోనూ, గజ్జల్లోనూ కొవ్వు లేకుండా పోవడం.
  గ్రేడ్ 3 : ఛాతి, పొట్ట, నడుము దగ్గర కొవ్వు లేకుండా పోవడం.
  గ్రేడ్ 4 : బుగ్గల దగ్గర కొవ్వు పూర్తిగా కరిగిపోవడం, బుగ్గలు గుంటలు అవ్వడం.
* చిరాకు, కోపం, విసుగు ఎక్కువగా ఉండి ఊరకినే ఏడుస్తూ ఉండటం.
* ముఖంలో కళపోయి ముసలి ముఖంగా మారడం.
* కళ్ళు గుంటలు అవడం.
* ఒళ్ళు చల్లగా ఉండడం.
* కండరాలు క్షీణించడం.
* బిడ్డ ఆడలేకపోవడం, ఎప్పుడూ ఏడుస్తూండడం.
* వయసుకి తగ్గట్లు కూర్చోవడం, నడవడం లేకపోవడం.
* ఎప్పుడూ ఏదో ఒక వ్యాధి ఉండడం.
* కూర్చుంటే పొట్ట ఉబ్బుగా కనబడడం.
* మలబద్ధకం ఉండడం.

చికిత్స:

1. బిడ్డకి తగిన పాళ్ళలో తగిన కేలరీస్ ఉన్న పిండి పదార్థం, మాంసకృత్తులు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ లవణాలు ఉండే ఆహారం ఇవ్వడం.
2. పాలల్లో పంచదార కలిపి త్రాగించడం.
3. కోడిగుడ్లు, పప్పులు తినిపించడం.
4. బిడ్డను చలికి గురికాకుండా వెచ్చగా ఉంచడం.
5. బరువు కోల్పోవడానికి కారణాన్ని గుర్తించి చికిత్స చేయడం.

❑❑❑

# 10. క్వాషియార్కర్

మాంసకృత్తుల లోపం వల్ల పిల్లల్లో క్వాషియార్కర్ వ్యాధి వస్తుంది. ముఖ్యంగా 6 నెలల నుంచి 2 సంవత్సరాలలోపు పిల్లల్లో క్వాషియార్కర్ వ్యాధి వస్తుంది. మాంసకృత్తుల లోపంతోపాటు ఇతర పోషక పదార్థాలు, శక్తినిచ్చే పదార్థాలు లోపం ఉంటుంది.



క్వాషియార్కర్ బిడ్డ డల్‌గా ఉంటాడు. అతనిలో జీవం కనబడదు. తరచు శ్వాసకోశ వ్యాధులు కనబడతాయి. విరోచనాలు అవుతూంటాయి. ఆహారం తీసుకోవటం బాగా తగ్గిపోతుంది.

లక్షణాలు:

వయస్సుకి తగ్గ బరువు ఉండరు. ఎదుగుదల ఉండదు. కండరాలు క్షీణిస్తాయి. అయినా ఒళ్ళు ఉబ్బుగా కనబడుతుంది. దానికి కారణం ఒంటికి నీరు చేరడమే. చేతులకీ, పాదాలకీ నీరు ఎక్కువగా ఉంటుంది. చేతులు, కాళ్ళు ఎక్కువ చల్లగా ఉంటాయి బిడ్డకి ఆటలమీదగానీ, ఇతర వాటిమీదగానీ ఆసక్తి ఉండదు. కళ్ళు ఎర్రగా ఉంటాయి. ఎప్పుడూ పడిశం ఉంటుంది. నోటివెంట చొంగ కారుతూంటుంది. ముఖం గుండ్రంగా, ఉబ్బుగా ఉంటుంది. వెంట్రుకలు ఎండిపోయి, రాగి రంగులో కళాహీనంగా ఉంటాయి. చర్మం మీద మచ్చలు ఎక్కువగా ఉంటాయి. స్కిన్ షైనింగ్ ఉండదు తరచు నీళ్ళ విరోచనాలు అవుతుంటాయి. లివర్ పరిమాణం పెరుగుతుంది. రక్తహీనత ఎక్కువ ఉంటుంది.

క్వాషియార్కర్ బిడ్డని తేలిగ్గానే గుర్తించవచ్చు. మెంటల్‌గా డల్, మజిల్ వేస్టింగ్, గ్రోత్ రిటార్డేషను, ఒంటికి నీరు ప్రధాన లక్షణాలు.

చికిత్స:

1. మాంసకృత్తులతో ఉన్న ఆహారం బిడ్డకి అందితే క్వాషియార్కర్ రావడం అరుదు.
2. క్వాషియార్కర్ ఉన్న బిడ్డకి మాంసకృత్తులు ఉండే ఆహారం ఎక్కువగా ఇవ్వాలి.
3. సోయాబీన్స్, మొక్కజొన్న కండెలు, పప్పులు, అరటిపళ్ళు, గుడ్లు తినిపించాలి.
4. విటమిన్లు, మినరల్స్ ఇవ్వాలి.
5. ఇన్‌ఫెక్షన్లకి చికిత్స చేయాలి.
6. శ్వాసకోశవ్యాధులు, జీర్ణకోశవ్యాధులు, గుండెజబ్బులకి చికిత్స చేయాలి.
7. బిడ్డని ఆరోగ్యకర పరిసరాల్లో పెంచాలి.

□□□

# 11. రికెట్స్

విటమిన్ 'డి' లోపం వల్ల వచ్చే వ్యాధిని రికెట్స్ అంటారు. ఈ వ్యాధిలో విటమిన్ 'డి' లోపం వల్ల ప్రేగుల్లోంచి కాల్షియం, ఫాస్ఫరస్ జీర్ణం కావు. దానివల్ల పిల్లల ఎముకల ఎదుగుదలలో లోపం ఏర్పడుతుంది. ఎముకలలో లైమ్ సాల్ట్స్ తగిన పాళ్ళలో ఉండవు.

ఎదిగే ఎముకలు బలంగా ఉండవు. దానివల్ల సహజంగా ఉండవలసిన ఎముక ఆకారంలోనూ, నిర్మాణంలోనూ తేడా వస్తుంది. విటమిన్ 'డి' లోపం వల్ల ఎముక ఎదుగుదల, ఆకారం నిర్మాణంలో కలిగే తేడాయే రికెట్స్ వ్యాధి.

రికెట్స్ వ్యాధి 4 నుంచి 2 సంవత్సరాలలోపు పిల్లలలో ఎక్కువగా కనబడుతుంది. తల్లిపాలు పుష్కలంగా ఉన్న బిడ్డలో రికెట్స్ రావడం అరుదు.

**లక్షణాలు:**

నుదురు వెడల్పుగా ఉంటుంది. తలపైభాగం మామూలుగా కాకుండా కాస్త బల్లపరుపుగా ఉంటుంది. చిన్న పిల్లలలో మాడు మెత్తగా ఉంటుంది. పళ్ళు ఆలస్యంగా వస్తాయి. ఛాతి మధ్యలో ప్రక్కటెముకలు బొడిపెలులాగా తయారవుతాయి. ఛెస్ట్‌బోన్ ఎత్తుగా కనబడుతుంది. ఇటువంటి రూపాన్ని పావురం పొట్టగా పోలుస్తారు. వీపు కాస్త గూనిగా కనబడుతుంది. పొట్ట కండరాలు బలహీనంగా ఉండి ఉబ్బుగా కనబడుతుంది. మణికట్టు దగ్గర, మడమ దగ్గర లావుగా కనబడుతుంది. కాళ్ళు దొడ్డికాళ్ళుగా వంగి ఉంటాయి. తరచు జలుబు చేస్తుంది. టాన్సిల్స్ ఎడినాయిడ్స్ ఉబ్బి ఉంటాయి. గొంతునొప్పి, దగ్గు తరచూ అనిపిస్తాయి. కొందరిలో వేళ్ళు వంకర్లు పోతుంటాయి. ఫిట్స్ వస్తుంటాయి.

**నిర్ధారణ:**

రోగి లక్షణాలను బట్టి వ్యాధిని తేలికగా గుర్తించవచ్చు. మణికట్టు దగ్గర ఎముకలలో రికెట్స్ వల్ల వచ్చే మార్పుని మొదట్లోనే ఎక్స్‌రే ద్వారా నిర్ధారణ చేయవచ్చు. రక్తంలో ఆల్కలైన్ ఫాస్ఫేట్ శాతం పెరుగుతుంది. ఫాస్ఫరస్ శాతం తగ్గుతుంది. కొందరిలో కాల్షియం శాతం కూడా తగ్గుతుంది.

**చికిత్స:**

1. మామూలుగా వచ్చే రికెట్స్‌లో 1200-2000 యూనిట్స్ విటమిన్ 'డి' రోజూ ఇవ్వాలి.
2. కార్డ్ లివర్ ఆయిల్ ఒక స్పూన్ చొప్పున రోజుకి 3 సార్లు ఇవ్వాలి లేదా హాలిబిట్ లివర్‌అయిల్ రోజుకి 3 సార్లు ఇవ్వాలి.
3. రోజూ ఉదయం పూటగానీ, సాయంత్రంగానీ ఒకటి, రెండు గంటలు ఎండలో ఉంచాలి.
4. ఒకే మోతాదులో 6,00,000 యూనిట్స్ విటమిన్ 'డి' ఇవ్వాలి.



5. కాల్షియం గ్లూకోనేట్ ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి లేదా కాల్షియం టాబ్లెట్స్ ఇవ్వాలి.
6. ఆహారంలో కాల్షియం ఉన్న పదార్థాలు ఎక్కువ తినాలి.

❑❑❑

# 12. స్కర్వీ

*విటమిన్ 'సి' లోపం వల్ల స్కర్వీ వ్యాధి వస్తుంది. 6 నెలల నుంచి 2 సంవత్సరాలలోపు పిల్లలకి ఈ వ్యాధి ఎక్కువ. తాజా పండ్లు, కాయగూరలు తిననివాళ్ళలో స్కర్వీ వ్యాధి ఎక్కువ కనబడుతుంది. ఈ వ్యాధి లక్షణాలు నిదానంగా కలుగుతాయి.*

**లక్షణాలు:**

చిగురు వెంట రక్తం కారుతుంది. కీళ్ళు, కండరాలు నొప్పి చేస్తాయి. చర్మం కింద రక్తనాళాలు పగులుతాయి. మూత్రంలో రక్తం పోతుంది. మలంతోపాటు రక్తం కనబడుతుంది. రక్తహీనత ఏర్పడుతుంది. తరచుగా జ్వరం కనబడుతుంది.

**నిర్ధారణ:**

ఎక్స్‌రే : ఎక్స్‌రేలో స్కర్వీ వ్యాధికి సంబంధించిన ఎముకల తేడా కనబడుతుంది.

**చికిత్స:**

1. రోజూ నిమ్మ, నారింజ, కమలారసం తీసుకోవాలి.
2. విటమిన్ 'సి' 100 మి.గ్రా. చొప్పున రోజుకి 3 సార్లు తీసుకోవాలి.
3. కీళ్ళ నొప్పులు, కాళ్ళ నొప్పులు తగ్గేవరకు విశ్రాంతి తీసుకోవాలి.

❑❑❑

# 13. చిన్న పిల్లల్లో నీళ్ళ విరోచనాలు

*చిన్న పిల్లల్లో అకస్మాత్తుగా నీళ్ళ విరోచనాలు కలుగుతాయి. ఆహారంలో తేడా, వ్యాధి క్రిములు చేరడం ఇందుకు ప్రధాన కారణాలు. కొందరిలో క్రానిక్‌గా నీళ్ళ విరోచనాలు కలుగుతూ పోతుంటాయి. వీరిలో కడుపులో పాములు ఉండడం, జియార్డియాసిస్ ఉండడం కారణం. పౌష్టిక ఆహారలోపం కూడా నీళ్ళ విరోచనాలకి కారణం. పేగుల్లో టి.బి. ఉండడం, కడుపులో పుండు ఉండడం, యాంటిబయోటిక్ మందులు ఎక్కువ వాడడం, ఫుడ్ ఎలర్జీ ఉండడం, క్రానిక్‌గా నీళ్ళ విరోచనాలు అవడానికి మరికొన్ని కారణాలు.*

*అతిగా తినిపించడం, ఆహారంలో కొవ్వు పదార్థం ఎక్కువ ఉండడం, లాక్టేజి లోపం ఉండడం, పాలు సరిపోకపోవడం, నీళ్ళ విరోచనాలకి మరికొన్ని కారణాలు.* చెవిలో చీము, శ్వాసకోశాల వ్యాధులు, మూత్రపిండాల వ్యాధులు ఉన్నవారిలో కూడా నీళ్ళ విరోచనాలు అవవచ్చు.

**లక్షణాలు:**

నీళ్ళ విరోచనాలు, విరోచనాలు నురుగుగా, ఆకుపచ్చగా, పుల్లటివాసనగా అవడం, కొద్దిపాటిగా జ్వరం ఉండటం,డీ హైడ్రేషన్ కలగడం,.నీరసంగా కనిపించడం.

**చికిత్స:**

1. ఎలక్ట్రోలైట్ పొడరు నీళ్ళలో కలిపి తరచుగా తాగించాలి.
2. డీహైడ్రేషన్ ఉంటే నరానికి రింగర్ లాక్టేట్, గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.
3. విరోచనాలు అవుతున్నా మామూలుగా ఆహారం పెట్టొచ్చు. పాలల్లో నీళ్ళు కలిపి మొదటి రోజు ఇచ్చి రెండోరోజునుంచి మామూలుగా పాలు పట్టవచ్చు.
4. నీళ్ళ విరోచనాలు అవుతున్నా తల్లిపాలు మానవలసిన అవసరంలేదు.
5. ఇన్ఫెక్షన్ వల్ల నీళ్ళ విరోచనాలు అయ్యేవారిలో యాంపిసిలిన్ ఇంజక్షన్లు ఇవ్వాలి. కోట్రైమక్స్‌జోల్, ఫెరజోలిడిన్, నాల్డిక్సిక్ యాసిడ్, మెట్రో నిడజోల్‌కి సంబంధించిన సిరప్స్ ఏమైనా వాడాలి.

❑❑❑

# 14. ఇండియన్ చైల్డ్‌హుడ్ సిర్రోసిస్

*ఒక విధమైన లివర్ డిసీజ్ భారత ఉపఖండంలోని పిల్లల్లో ఎక్కువ కనబడుతుంది. దీనినే 'ఇండియన్ చైల్డ్‌హుడ్ సిర్రోసిస్"అంటారు. 1 నుంచి 3 సంవత్సరాలలోపు పిల్లలలో* ఈ వ్యాధి ఎక్కువ కనబడుతుంది. ఆడపిల్లలలో కంటే *మగపిల్లలలో ఈ వ్యాధి రావడం ఎక్కువ.*

**కారణాలు:**

వైరస్ ఇన్ఫెక్షన్ వచ్చిన వాళ్ళలో ఎక్కువ కనబడుతుంది. మాంసకృత్తులు తక్కువ భుజించేవారిలో ఎక్కువ. వంశపారంపర్యంగా జీన్స్ ద్వారా సంక్రమించడం ఉంటుంది. వ్యాధి నిరోధక శక్తి లేకపోవడం కూడా కారణమే.

లక్షణాలు:

నిదానంగా బయటపడుతుంది. కొందరిలో అకస్మాత్తుగా కలుగుతుంది. సాధారణంగా ఈ వ్యాధిని గుర్తించిన సంవత్సరకాలంలో మృత్యువు కబళిస్తుంది, లివర్ (కాలేయం) బాగా పెరుగుతుంది. లివర్‌లోని టిష్యు డామేజ్ అవుతుంది. లివర్ సాధారణంగా నున్నగా ఉంటుంది. కానీ ఇందులో బొడిపెలుగా తగులుతుంది. ఈ వ్యాధి రావడానికి ముందు సాధారణంగా పచ్చకామెర్లు వస్తాయి. నీళ్ళ విరోచనాలు కూడా ఉంటాయి. రోజూ కొద్దిపాటి జ్వరం వస్తూంటుంది. బిడ్డ నీరసపడడం, చికాకుగా ఉండడం, ఎప్పుడూ ఏడుస్తూ ఉండడం జరుగుతుంది, ఈ వ్యాధి పెరుగుతున్న కొద్దీ కామెర్లు పెరిగి కళ్ళు పచ్చగా కనబడతాయి. పొట్ట ఎత్తుగా కనబడుతుంది. పై కడుపు మీద రక్తనాళాలు ఉబ్బి నీలంగా కనబడతాయి. పాదాలకి నీరు వస్తుంది. నిదానంగా పొట్టకి, ముఖానికి నీరు వస్తుంది. వ్యాధి ముదిరిన తర్వాత లివర్ బాగా పెరగడం, పొట్ట బాగా ఉబ్బడం, స్ప్లీన్ పెరగడం, కడుపులో నీరు బాగా చేరడం, మగత రావడం, కోమాలోకి పోవడం జరుగుతుంది.

నిర్ధారణ:

రక్త పరీక్ష - తెల్లకణాలు పెరుగుతాయి. మూత్ర పరీక్ష - మూత్రంలో షుగర్ కనబడుతుంది, సీరం బైలురుబిన్ పెరుగుతుంది. ఆల్కలైన్ ఫాస్ఫటేజ్ పెరుగుతుంది, సీరం అల్బుమిన్ తగ్గుతుంది, లివర్ బయాప్సి - వ్యాధిని నిర్ధారిస్తుంది.

చికిత్స:

1. ఆహారంలో ఉప్పు తగ్గించటం, పౌష్టికాహారం తినిపించడం, గ్లూకోజ్ ఎక్కువగా ఇవ్వడం, కోమా పరిస్థితుల్లో ప్రొటీన్లు ఉన్న ఆహారం తక్కువ పెట్టడం.
2. విటమిన్ 'ఎ', 'డి', 'ఇ', 'కె' నోటిద్వారా ఇవ్వడం.
3. నీరు లాగేయటానికి స్పైరినో లాక్టోన్ లేదా ఫ్రూసిమైడ్ బిళ్ళలు రోజూ ఇవ్వడం.
4. కార్టికో స్టిరాయిడ్స్ 1-2 మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజులో 1, 2 సార్లు ఇవ్వడం.
5. గామాగ్లోబ్యులిన్ 3 వారాలకు ఒకసారి ఇంజక్షన్ ఇవ్వడం.
6. జింక్ థెరపి 30-120 మి.గ్రా. రోజుకొకసారి ఇవ్వడం.

*ఇండియన్ చైల్డ్‌హుడ్ సిర్రోసిస్ ప్రమాదకరమైనది.*

*ఎంత చికిత్స చేసినా ప్రాణాపాయం కలుగుతుంది.*

□□□

# 15. పిల్లల్లో బ్రోంఖ్యోలైటిస్ మరియు బ్రోంఖోన్యుమోనియా

*రెండు సంవత్సరాలలోపు చిన్న పిల్లల్లో జలుబు, దగ్గు, జ్వరం, ఆయాసం రావడం ఎక్కువ. వీటివల్ల పిల్లలు చాలా హైరానా పడతారు. కొందరిలో పరిస్థితి చాలా సీరియస్ అవుతుంది.*

**లక్షణాలు:**

అకస్మాత్తుగా జ్వరం వస్తుంది. దగ్గు, జలుబు తీవ్రంగా ఉంటాయి. వాంతులు అవుతాయి. జ్వరం తీవ్రంగా ఉంటుంది. ఒక్కొక్కసారి తగ్గుతూ, పెరుగుతూ ఉంటుంది. ఆయాసం ఎక్కువగా అనిపిస్తుంది. గాలి పీల్చడానికి చాలా ఇబ్బంది పడతారు. కొందరు ఈ వ్యాధి వచ్చినప్పుడు నీలంగా మారతారు. బాగా అలసిపోవడం, నీరసపడడం ఉంటుంది. ఫిట్స్ రావచ్చు.

**నిర్ధారణ:**

రోగి పరీక్ష ,రక్త పరీక్షలు, ఛాతి ఎక్స్‌రే.

**చికిత్స:**

1. యాంటిబయోటిక్స్ -క్రిష్టలైన్ పెన్సిలిన్ ఇంజక్షన్ **లేదా** యాంపిసిలిన్ ఇంజక్షన్ ప్రతి 8 గంటలకు ఒకసారి **లేదా** ఎమికాసిన్ ఇంజక్షన్ రోజుకి 2 సార్లు.
2. సాల్‌బుటమాల్ సిరప్ చెంచా మందు చొప్పున రోజుకి 3 సార్లు.
3. ఆయాసం ఎక్కువ ఉంటే ఆక్సిజన్.
4. త్రాగడానికి నీరు ఎక్కువ ఇవ్వాలి. డీహైడ్రేషన్ ఉంటే నరానికి సెలైన్ పెట్టాలి.
5. అవసరం బట్టి స్టిరాయిడ్స్ వాడాలి.

□□□

# 16. రుమాటిక్ ఫీవర్

*రుమాటిక్ ఫీవర్ 5 నుంచి 15 సంవత్సరాల పిల్లల్లో రావడం ఎక్కువ. గ్రూపు 'ఎ' బీటాహీమోలైటిక్ స్ట్రెప్టోకోకస్ ఇన్‌ఫెక్షన్ వల్ల రుమాటిక్ ఫీవర్ రావడం ఎక్కువ.*

*తరచూ గొంతు నొప్పి, టాన్సిల్స్ వాపు, చీము పట్టడం ఉండేవారిలో రుమాటిక్ ఫీవర్ రావడం ఎక్కువ.*

*రుమాటిక్ ఫీవర్ వచ్చిన వారిలో అకస్మాత్తుగా జ్వరం రావడం, కీళ్ళు నొప్పి చేయడం ఉంటుంది. ఛాతిలో బరువు అనిపించడం, గుండె దడగా ఉంటుంది. వికారం,*

వాంతులు ఉంటాయి. జ్వరానికి స్పష్టమైన కారణం కనబడదు. కొందరిలో ఫిట్స్ కూడా వస్తాయి. కొందరిలో జ్వరం వచ్చినప్పుడు ఒంటిమీద అక్కడక్కడ గడ్డలులాగా కనబడతాయి. ముక్కునుంచి రక్తం కూడా వస్తుంది.

**లక్షణాలు:**

రుమాటిక్ ఫీవర్: ఈ జ్వరం వచ్చినప్పుడు 10-15 రోజులపాటు ఉంటుంది. సాధారణంగా ఈ జ్వరం వచ్చినప్పుడు ఒక కీలు వాస్తుంది. ఆ వాపు 4, 5 రోజులు ఉంటుంది. ఆ వాపు తగ్గుతూండగానే రెండో కీలు వాస్తుంది. ఒకసారి వాచిన కీలు ఆ జ్వరంలో మరొకసారి వాయదు. కొందరిలో ఒకేసారి ఒక కీలు కంటే ఎక్కువ కీళ్ళు వాయవచ్చు. ఇలా అప్పుడప్పుడూ జ్వరం రావడం, కీళ్ళు వాయడం, తగ్గడం ఉంటుంది, రుమాటిక్ ఫీవర్ వచ్చిన సమయంలో గుండెలో కూడా మార్పులు కలగొచ్చు. హార్ట్ సౌండ్స్‌లో మార్పు కనబడుతుంది. మర్మర్స్ వినబడతాయి. గుండె నీరసంగా అవుతుంది. రుమాటిక్ ఫీవర్ వచ్చినప్పుడు చర్మం మీద ఎర్రటి పాచెస్ కనబడతాయి. చర్మం క్రింద అక్కడక్కడ గడ్డలు వస్తాయి. ముక్కువెంట రక్తం కారడం, న్యుమోనియా లక్షణాలు కనబడతాయి. వాంతులు, విరోచనాలు కూడా ఉండొచ్చు, ఫిట్స్ లాగా రుమాటిక్ కారియా వస్తుంది.

**నిర్ధారణ:**

ఎ.ఎస్.ఓ. టైటర్ - స్ట్రెప్లోకోకల్ ఇన్‌ఫెక్షన్ వచ్చి రుమాటిక్ ఫీవర్ కలిగినట్లు నిర్ధారణ చేసుకోవడానికి ఎ.ఎస్.ఓ. బ్లడ్ టెస్ట్ తోడ్పడుతుంది. స్ట్రెప్టోకోకల్ ఇన్‌ఫెక్షన్ వల్ల రక్తంలో యాంటిస్ట్రెప్టోలైసిన్ - ఓ (ఎ.ఎస్.ఓ.) పెరుగుతుంది. రక్తంలో ఎ.ఎస్.ఓ. టైటరు 250 కంటే తక్కువ ఉంటే ఆ జ్వరం రుమాటిక్ ఫీవర్‌గా తీసుకోనవసరం లేదు. 250 నుంచి 320 ఉన్నట్లయితే రుమాటిక్ ఫీవర్‌గా భావించవచ్చు. కొందరికి ఈ రీడింగ్ 500 కంటే ఎక్కువగా ఉంటుంది. రుమాటిక్ ఫీవర్ వచ్చిన 1, 2 వారాలలోనే రక్తంలో ఎ.ఎస్.ఓ. టైటర్ పెరిగి కనబడుతుంది, ఇ.ఎస్.ఆర్. పెరుగుతుంది, సీరియాక్టీవ్ ప్రోటీన్ పెరుగుతుంది, థ్రోట్‌స్వాబ్ కల్చర్‌లో గ్రూపు ఎ స్ట్రెప్టోకోకై ఉన్నట్లయితే రుమాటిక్ ఫీవర్‌గా గుర్తించవచ్చు.

**చికిత్స:**

1. విశ్రాంతి: కేవలం జ్వరం, కీళ్ళవాపులు అయినట్లయితే రెండు వారాలు పూర్తి బెడ్ రెస్ట్, ఆ తరువాత మరో 2 వారాలు కొంత విశ్రాంతి తీసుకోవాలి.

   రుమాటిక్ ఫీవర్‌లో గుండె కూడా ఎఫెక్ట్ అయితే 4 వారాలు పూర్తి బెడ్ రెస్ట్,

ఆ పైన మరో 4 వారాలు అంతగా హైరానా చెందకుండా కొద్దిపాటిగా కదలడం ఉండాలి.

కొందరిలో రుమాటిక్ ఫీవర్‌తోపాటు గుండె కూడా పెరుగుతుంది. వీరు 6 వారాలు పూర్తి బెడ్ రెస్ట్ **లేదా** గుండె పూర్తిగా కోలుకునేంతవరకు విశ్రాంతి తీసుకోవాలి.

2. రుమాటిక్ ఫీవర్ వచ్చినవారు ప్రొకైన్ పెన్సిలిన్ ఇంజక్షన్ రోజుకి ఒకటి చొప్పున పది రోజులు చేయించుకోవాలి. పెన్సిలిన్ పడని వాళ్ళు ఎరిత్రోమైసిన్ 40-50 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్ చొప్పున పది రోజులు వాడాలి.
3. కీళ్ళ నొప్పులు, వాపులు తగ్గడానికి యాస్పిరిన్ బిళ్ళలు రోజుకి 3 సార్లు వాడాలి.
4. గుండె ఎన్‌లార్జ్ అయిన వారికి, హార్ట్ ఫెయిల్యూర్ వచ్చిన వారికి, పెరికార్డైటిస్ వచ్చిన వారికి స్టిరాయిడ్స్ ఒక నెల వాడాలి. స్టిరాయిడ్స్‌తో పాటు డిజాక్సిన్, లాసిక్స్ వాడాలి.
5. పై చికిత్స రుమాటిక్ ఫీవర్‌ని గుర్తించగానే జరగగా మళ్ళీ మళ్ళీ గ్రూపు 'ఎ' స్ట్రెప్టోకోకస్ వల్ల ఇన్‌ఫెక్షన్ రాకుండా నివారించడానికి పెనిడ్యూర్ ఎల్.ఎ.-12 ఇంజక్షన్ 3 వారాలకొక్కటి చొప్పున 25 సంవత్సరాలు నిండేవరకు చేయించాలి. జీవితాంతం ఈ ఇంజక్షను చేయించినా లాభమే తప్ప నష్టము లేదు. పెన్సిలిన్ పడనివాళ్ళు ఎరిత్రోమైసిన్ 40 మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజుకొకసారి చొప్పున వాడాలి.
6. రుమాటిక్ కొరియా వచ్చిన వాళ్ళకి శరీరంలో ఫిట్స్ కొద్దికొద్దిగా వస్తాయి. కండరాలలో బలహీనత ఏర్పడుతుంది. మానసికంగా సరిగ్గా ఉండరు. ఈ పరిస్థితి కూడా రుమాటిక్ ఫీవర్‌కి, గుండె జబ్బుకి దారి తీస్తుంది. అందుకని రుమాటిక్ కొరియా వచ్చిన వాళ్ళకి కూడా రుమాటిక్ ఫీవర్ వచ్చిన వాళ్ళకి ఇచ్చే ట్రీట్‌మెంటే చేయాలి.

ముఖ్య విషయం:

రుమాటిక్ ఫీవర్‌ని గానీ, రుమాటిక్ కొరియానిగాని నిర్లక్ష్యం చేస్తే భవిష్యత్తులో బిడ్డకు గుండె జబ్బు వచ్చే అవకాశం ఉంది. గుండె కవాటాలు (వాల్వ్స్) దెబ్బతింటాయి. అందుకని రుమాటిక్ ఫీవర్‌ని సరిగ్గా గుర్తించి వెంటనే పూర్తి చికిత్స చేయడమే కాకుండా పెనిడ్యూర్ ఎల్.ఎ.12 ఇంజక్షన్లు సంవత్సరాల తరబడి తప్పకుండా చేయించాలి.

□□□

# 17. చిన్న పిల్లల్లో టి.బి. మెనింజైటిస్

3 నుంచి 6 సంవత్సరాల పిల్లలలో మెదడుకి క్షయ వ్యాధి రావడం ఎక్కువ. గాలి ద్వారా ఊపిరితిత్తులలో చేరిన క్షయ వ్యాధి క్రిములు రక్తంలోకి ప్రవేశించి ఆ పైన మెదడుకి చేరి వ్యాధిని కలగచేస్తాయి.

**లక్షణాలు:**

మెదడు టి.బి. లక్షణాలు నిదానంగా కలుగుతాయి. బిడ్డకు వదలకుండా తలనొప్పి ఉంటుంది. జ్వరం ఉంటుంది. ఆకలి తగ్గిపోతుంది. వికారం ఉంటుంది. బిడ్డ డల్‌గా మారతాడు. వ్యాధి పెరిగిన కొద్దీ మెడ నరాలు బిగపడతాయి. జ్వరం వదలకుండా ఉంటుంది. మగత ఎక్కువవుతుంది. వాంతులు అవుతాయి, వ్యాధి మరింత ఎక్కువైన తరువాత కోమా వస్తుంది. శ్వాసక్రియ సక్రమంగా ఉండదు. పరిస్థితి విషమంగా ఉంటుంది.

**నిర్ధారణ:**

సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ ఎగ్జామినేషన్- ప్రెషర్ పెరుగుతుంది. ఫ్లూయిడ్‌లో ప్రతి క్యూబిక్ మిల్లీమీటరుకి 50-500 సెల్స్ ఉంటాయి. ఎక్కువగా లింఫోసైట్స్ ఉంటాయి. ప్రోటీన్సు శాతం పెరుగుతుంది. షుగర్ శాతం తగ్గుతుంది. ఫ్లూయిడ్ కల్చర్ చేస్తే టి.బి. క్రిములు పెరుగుతాయి.

**చికిత్స:**

1. బిడ్డ బరువు వయసు బట్టి యాంటిట్యూబర్‌క్యులోసిస్ డ్రగ్స్ ఇవ్వాలి.
2. స్టిరాయిడ్స్ వాడాలి.
3. ఫిట్స్ తగ్గడానికి మందులు వాడాలి.
4. బ్రెయిన్‌లో పెరిగిన టెన్షన్ తగ్గడానికి మానిటాల్ పెట్టాలి.
5. కొందరికి శస్త్ర చికిత్స అవసరమౌతుంది.

**టి.బి. మెనింజైటీస్‌కి మందులు:**

మెదడు టి.బి. వచ్చిన వారికి కనీసం ఒక సంవత్సరం మందు వాడాలి.

* స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్ 20-25 మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజుకి రెండు నెలలు వాడాలి.
* ఐసోనియాజైడ్ 10-12మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజుకి సంవత్సరం వాడాలి.
* రిఫాంపిసిన్ 10 మి.గ్రా. కేజీ బాడీ వెయిట్‌కి రోజుకి సంవత్సరం వాడాలి.

* ఇథంబుటాల్ 25 మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజుకి ఆరు వారాలు వాడాలి. ఆ తరువాత 15 మి.గ్రా. చొప్పున సంవత్సరంన్నర వాడాలి.
* పైరజెనమైడ్ 30మి.గ్రా. కేజి బాడీ వెయిట్‌కి రోజుకి రెండునెలలు వాడాలి.

❑❑❑

# 18. చిన్న పిల్లలలో ఫిట్స్

*ఫిట్స్‌నే కన్‌వల్షన్స్ అని, సీజర్స్ అని అంటారు. సాధారణంగా జ్వరం వచ్చినప్పుడు, మెదడువాపు జబ్బులు వచ్చినప్పుడు ఫిట్స్ రావడం, స్పృహ కోల్పోవడం జరుగుతుంది. ఈ రెండూ కాకుండా మెదడులో ప్రత్యేకంగా ఉండే మరో జబ్బు ఎపిలెప్సి. దీంట్లో కూడా ఫిట్స్ వస్తాయి. ఈ ఫిట్స్‌నే ఎపిలెప్టిక్ సీజర్స్ అంటారు. అలా కాకుండా ఏ జబ్బు లేకుండా మానసికంగా వచ్చే ఫిట్స్‌ని హిస్టీరికల్ ఫిట్స్ అంటారు.*

## జ్వరంలో ఫిట్స్:

వీటినే 'ఫెబ్రైల్ కన్‌వల్షన్స్' అంటారు. చిన్న పిల్లలకు జ్వరం వచ్చినప్పుడు ఫిట్స్ రావడం సహజం. జ్వరం 100-101 దాటితే కొందరికి ఫిట్స్ వస్తాయి. మరికొందరిలో 103-104 దాటితే ఫిట్స్ వస్తాయి. వీరిలో మెదడుకి సంబంధించిన వ్యాధి ఏదీ ఉండదు. సాధారణంగా ఫ్లూ, పొంగు, న్యుమోనియా, పైలోనెఫ్రైటీస్, చెవిలో చీము వ్యాధుల్లో జ్వరం వచ్చినప్పుడు ఫిట్స్ రావడం ఉంటుంది. జ్వరంలో ఫిట్స్ అనేది 6 వెలల నుంచి 5 సంవత్సరాలలోపు పిల్లలలో కనబడతాయి.

సాధారణంగా జ్వరంతోపాటు వచ్చే ఫిట్స్ 5 నుంచి 15 నిమిషాల పాటు ఉంటాయి. ఈ లోపల జ్వరం తగ్గేందుకు మందులు ఇస్తే మళ్ళీ ఫిట్స్ కనబడవు. లేకపోతే కొందరిలో అరగంట తర్వాత మళ్ళీ ఫిట్స్ వస్తాయి. జ్వరం వల్ల ఫిట్స్ వచ్చే 3 నుంచి 10 శాతం పిల్లలకు భవిష్యత్తులో ఎపిలెప్సి (మూర్ఛవ్యాధి) కనబడటానికి అవకాశం ఉంది. జ్వరం వచ్చినప్పుడు పావుగంట కంటే ఎక్కువ సమయం ఫిట్స్ ఉండే పిల్లలకు భవిష్యత్తులో మూర్ఛవ్యాధి కన పడే అవకాశాలు మరింత ఎక్కువ. తల్లిదండ్రులలో ఎవరికైనా వాళ్ళ చిన్నతనంలో జ్వరం వచ్చినప్పుడు ఫిట్స్ రావడం ఉంటే సంతానానికి కూడా ఫిట్స్ వచ్చే అవకాశాలు ఎక్కువ.

## మెదడు వ్యాధుల్లో ఫిట్స్:

మెనింజైటీస్, ఎన్‌కెఫిలైటీస్ మొదలైన మెదడువాపు జబ్బులలోనూ, తలకి దెబ్బ

తగిలిన కేసుల్లోనూ, పుట్టుకతోనే మెదడు నిర్మాణంలో లోపం ఉన్న కేసుల్లోనూ, మెదడులో కంతులు (ట్యూమర్స్) ఏర్పడిన సందర్భాలలోను ఫిట్స్ వస్తాయి.

**ఎపిలెప్సీ:**

ఎపిలెప్సీనే మూర్ఛవ్యాధి అంటారు. ఇది మెదడు నరాలకు సంబంధించిన వ్యాధి. మెదడులో ఇన్‌ఫెక్షన్, నిర్మాణంలో తేడా ఏమీ లేకుండా కూడా ఫిట్స్ వస్తాయి. ఇటువంటి ఫిట్స్‌నే ఎపిలెప్టిక్ ఫిట్స్ అంటారు. కోర్సుగా కనీసం 3 సంవత్సరాలు ఫిట్స్‌కి మందులు వాడితే ఎపిలెప్సీ పూర్తిగా తగ్గిపోయే అవకాశం ఉంది.

**ఇతర అనారోగ్య పరిస్థితులు:**

రక్తంలో గ్లూకోజ్, కాల్షియం, మాంగనీస్ శాతం తగ్గిపోయిన, బి-6 విటమిన్ లోపం ఏర్పడినా, యూరియా శాతం పెరిగినా, ఆక్సిజన్ శాతం తగ్గినా, కోరింత దగ్గు వంటి పరిస్థితులు ఏర్పడినా, రసాయనికాల విషప్రభావం కలిగినా ఫిట్స్ వచ్చే అవకాశం ఉంది. ధనుర్వాతం వచ్చినప్పుడు కూడా ఫిట్స్ వస్తాయి.

**నిర్ధారణ:**

ఫిట్స్ వచ్చినప్పుడు కారణం ఏమై ఉంటుందనేది నిశితంగా పరిశీలించాలి. వ్యాధిని బట్టి పరీక్షలు చేయాలి. సాధారణంగా వెన్నులో నీరుపరీక్ష, మూత్రపరీక్ష, రక్తపరీక్ష, ఇ.ఇ.జి.వ్యాధి నిర్ధారణకు తోడ్పడతాయి. అవసరంబట్టి సి.టి. స్కాన్. యం.ఆర్.ఐ. పరీక్షలు చేయాలి.

**చికిత్స:**

1. ఫిట్స్ వచ్చినప్పుడు ఒంటి మీద బిగుతుగానున్న దుస్తులు వదులు చేయాలి.
2. ఫిట్స్ వల్ల నాలిక కరుచుకోకుండానూ, నాలిక గొంతుకు అడ్డం పడకుండానూ, గాలి సక్రమంగా ఆడేందుకు పళ్ళ మధ్య మౌత్‌గాగ్ పెట్టాలి.
3. జ్వరం ఉన్నట్లయితే జ్వరం తగ్గడానికి పేరాసెటమాల్ ఇంజక్షన్ ఇవ్వాలి. ఒళ్ళంతా తడిగుడ్డతో తుడవాలి.
4. ఫిట్స్ తగ్గడానికి పెరాల్డిహైడ్ ఇంజక్షన్ ఇవ్వాలి. ఈ ఇంజక్షన్‌ని వయస్సుని బట్టి, (ఒక్కొక్క సంవత్సరానికి 1 యం.యల్. చొప్పున) ఇవ్వాలి. ఉదా॥ 3 సంవత్సరాల బిడ్డకి 3 యం.యల్. ఇవ్వాలి. లేదా కాంపోజ్ ఇంజక్షన్ 0.25-0.5 మి.గ్రా. చొప్పున ప్రతి కేజీ బాడీ వెయిట్‌కి లెక్కగట్టి నిదానంగా నరానికి ఇవ్వాలి. కాంపోజ్ ఇంజక్షను వల్ల కొందరిలో శ్వాస తీసుకోవడం తగ్గొచ్చు. అందుకనే

జాగ్రత్తగా చూసుకుంటూ ఇవ్వాలి. సాధారణంగా కాంపోజ్ ఇంజక్షన్ వల్ల అరనిముషంలో ఫిట్స్ కంట్రోలు అయిపోతాయి. ఫిట్స్ తగ్గిపోయిన తరువాత మళ్ళీ వెంటనే రాకుండా డైలాంటిన్ సోడియం 10 మి.గ్రా. చొప్పున కేజి బాడీ వెయిట్‌కి లెక్కగట్టి నరానికి ఇవ్వాలి. ఎసిడోసిస్ ఉన్న పిల్లలలో సోడాబైకార్బనేట్ నరానికి ఇవ్వాలి.

5. ఇన్‌ఫెక్షన్ వల్ల ఫిట్స్ ఉన్నప్పుడు ఒక ప్రక్క ఫిట్స్‌ని కంట్రోలు చేస్తూ మరోప్రక్క ఇన్‌ఫెక్షన్ తగ్గడానికి యాంటీబయోటిక్ మందులు ఇవ్వాలి.

□□□

# 19. నీరుతో ఉబ్బిన తల

*కొందరు పిల్లలకి తలలో నీరు చేరుతుంది. దాని వల్ల తల రోజురోజుకి పెరుగుతూ పెద్దగా కనబడుతుంది. దీనిని హైడ్రోకెఫలస్ అంటారు. మామూలుగా మెదడులో నీరు పారే మార్గాలు ఉంటాయి. వాటికి ఆడ్డు ఏర్పడినప్పుడు నీటితో తల ఉబ్బుతుంది.*

**కారణాలు:**

పుట్టుకతో మెదడు నిర్మాణంలో లోపాలు, తలలో కంతులు, మెదడులో ఇన్‌ఫెక్షన్లు వచ్చి నీటి పారుదలకి అడ్డంకి ఏర్పడడం, పుర్రె నిర్మాణంలో లోపాలు.

**లక్షణాలు:**

వయసుకి మించి తల పెద్దదిగా కనబడడం, తలకు ఎక్స్‌రే తీస్తే పుర్రె ఎముకలు దూరదూరంగా కనబడడం, తల మీద రక్తనాళాలు ఉబ్బి కనబడడం, వయసుకి తగ్గ విధంగా శారీరక, మానసిక ఎదుగుదల లేకపోవడం, ఫిట్స్ రావడం.

**నిర్ధారణ:**

తలకి ఎక్స్‌రే, సి.టి. స్కాన్.

**చికిత్స:**

1. మూలకారణానికి చికిత్స.
2. తలలో చేరిన నీరుని బయటకు పెడుతూ వెంట్రిక్యులో పెరిటోనియల్ షంట్ లేదా ఇతర విధమైన షంట్స్ పెట్టడం.

□□□

# 20. నిద్రలో మూత్రం

చిన్న పిల్లలు కొంత వయస్సు నిండిన తరువాత కూడా నిద్రలో మూత్రం పోసి పక్క తడిపేస్తుంటారు. ఇటువంటి పరిస్థితిని ఎన్యూరేసిస్ అంటారు. సాధారణంగా 3 సంవత్సరాలు నిండే సరికి పిల్లలు పక్కలో మూత్రం పోయడం మానేస్తారు. ఒకవేళ మూత్రం వస్తే లేచివెళ్ళి మూత్రం పోస్తారు. 3 సంవత్సరాలు నిండిన తరువాత కూడా పిల్లలు పక్కలో మూత్రం పోస్తుంటే చికిత్స చేయాలి.

**పక్కలో మూత్రం పోయడానికి కారణాలు:**

బ్లాడర్ కంట్రోలు రావడంలో ఆలస్యం, ఎపిలెప్సి, స్పైనా బైఫిడా, సెరిబ్రల్ పాల్సీ వంటి నరాల వ్యాధులు ఉండటం, చిన్నతనంలోనే మధుమేహ వ్యాధి రావడం. మూత్ర పిండాల వ్యాధులు. న్యూరోసిస్ లక్షణాలు. మానసిక వ్యాధి ఉండడం.

**చికిత్స:**

1. వ్యాధి మూలకారణం బట్టి చికిత్స చేయడం.
2. బిడ్డకు పక్కలో మూత్రం పోయకుండా శిక్షణ ఇవ్వడం.
3. ఇమిప్రమిన్ లేదా ఎమిట్రెప్టిన్ బిళ్ళలు రోజూ రాత్రిపూట ఇవ్వడం. 5 సంవత్సరాలలోపు పిల్లలకి రోజూ రాత్రిపూట 10 మి.గ్రా. బిళ్ళలు, 5 సంవత్సరాలు దాటిన పిల్లలకు 25 నుంచి 50 మి.గ్రా. రోజూ ఇవ్వాలి.
4. ఎలక్ట్రిక్ అలార్మ్ ద్వారా మూత్రకోశం నిండగానే బిడ్డకు మెలకువ వచ్చేటట్లు చేసి లేచి మూత్రం పోసేటట్లుగా శిక్షణ ఇవ్వడం.

□□□

**ఆరోగ్యానికి బంగారు సూత్రాలు**

మంచి అలవాట్లు.

మంచి ఆహారం.

వ్యాయామం.

మానసిక ప్రశాంతత.

# 12. రక్తహీనత (ఎనీమియాస్)

## 1. రక్తహీనత వ్యాధులు - రకాలు

*ఎర్రకణాలలో హీమోగ్లోబిన్ ఉండవలసిన దాని కంటె తగ్గిన పరిస్థితిని 'ఎనీమియా' లేదా 'రక్తహీనత' అంటారు.*

*రక్తహీనత కలగటానికి రకరకాల కారణాలున్నాయి. కారణం బట్టి రక్తహీనత ఏ రకానికి చెందినదో పేర్కొనడం జరుగుతుంది.*

* *రక్తం కోల్పోవడం వల్ల కలిగిన రక్తహీనత.*
* *ఎర్రకణాల నిర్మాణంలో ఏర్పడిన లోపం వల్ల కలిగిన రక్త హీనత.*
* *ఎర్రకణాలు పగిలిపోవడం వల్ల కలిగే రక్తహీనత.*

*ఎర్రకణాల సైజు, అందులో ఉన్న హీమోగ్లోబిన్ ప్రకారం పేర్కొనబడే రక్తహీనత వ్యాధులు:*

*1. నార్మోసైటిక్ ఎనీమియా, 2. హైపోక్రోమిక్ మైక్రోసైటిక్ ఎనీమియా, 3. నార్మోక్రోమిక్ మైక్రోసైటిక్ ఎనీమియా, 4. మాక్రోసైటిక్ ఎనీమియా.*

**రక్తహీనతకి కొన్ని ముఖ్య కారణాలు:** శరీరంలో ఏ భాగం నుంచైనా రక్తం ఎక్కువగా కారిపోవడం, జీన్స్‌లో లోపం వల్ల రక్తహీనత ఏర్పడడం. ఉదా॥ థాలసీమియా వ్యాధి, ఐరన్ లోపం, ఫోలిక్ యాసిడ్, బి-12 లోపం, ప్రోటీను లోపం, దీర్ఘకాలంగా అనారోగ్యం మూత్రపిండాల వ్యాధులు, బోన్‌మారో డామేజి అవడం, కేన్సర్, లుకీమియా వ్యాధులు ఉండడం, థైరాయిడ్ లోపం.

రక్తహీనత ఉన్నప్పుడు ఏ వయసు వారికి వస్తున్నదీ, ఎలా వస్తున్నదీ గమనించాలి. వారు చేసే పని, తీసుకునే ఆహారం దృష్టిలో ఉంచుకోవాలి. వారు వాడే మందులను కూడా తెలుసుకోవాలి - ఎందుకంటే కొన్ని మందులు రక్తహీనత కలగచేస్తాయి. కొన్ని కుటుంబాలలో ఒక రకమైన రక్తహీనత వంశపారపర్యంగా సంక్రమిస్తుంది. శరీరంలోంచి రక్తం ఎక్కువగా పోతుంటే - ఎంత పోతున్నది, ఎలా పోతున్నది తెలుసుకోవాలి.

**లక్షణాలు:** రక్తహీనత ఉన్నవారు పాలిపోయికనబడతారు. కొందరి శరీరం నిమ్మపండులాగా మారుతుంది. దీర్ఘకాలంగా రక్తహీనత ఉన్నవారిలో చేతి గోళ్ళు గుంటలుగా మారతాయి.

గోళ్ళ మీద నిలువుగా పగుళ్ళు ఏర్పడుతాయి. కంటి రెప్పల లోపల తెల్లగా కనబడుతుంది. నాలిక తెల్లగా ఉంటుంది. కొందరిలో నాలుక దొండపండులా మారుతుంది. కొందరికి గొంతులో బంతి అడ్డం పడినట్లుగా ఫీలింగ్ ఉంటుంది. గుండె పెరగడం, అసాధారణ ధ్వనులు ఏర్పడతాయి. స్ప్లీన్ పెరుగుతుంది. ఎముకలు మెత్తగా తయారవుతాయి.
నిర్ధారణ : ఈ పరీక్షల ద్వారా రక్తహీనతని నిర్ధారించవచ్చు. హీమోగ్లోబిన్ పర్సెంటేజ్, ఎర్ర కణాల సంఖ్య, మీన్‌సెల్ వాల్యూమ్ (ఎమ్.సి.వి.), తెల్ల కణాల సంఖ్య, ప్లేట్‌లెట్ కౌంట్, రెటిక్లోసైట్ కౌంట్, సీరమ్ ఐరన్, సీరమ్ బి-12, బ్లీడింగ్ టైమ్, క్లాటింగ్‌టైమ్, బోన్‌మారో ఎగ్జామినేషన్.

చికిత్స:

1. ఆహార లోపాన్ని సరిదిద్దడం.
2. రక్తహీనత కలగడానికి మూల కారణాన్ని కనుగొని చికిత్స చేయడం. కొందరికి కడుపులో పాములు ఉంటాయి, మొలలు ఉంటాయి. బహిష్టు స్రావం అధికంగా అవుతుంది. క్రానిక్ కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా, లివర్ డిసీజస్, కొలాజన్ డిసీజస్, ఎండోక్రైమ్స్ లోపం ఉంటాయి. బి-12 వల్ల కలిగే రక్తహీనతని తేలికగా సరిదిద్దవచ్చు.
3. కొందరికి కొన్ని పదార్థాలు, మందులు, రక్తహీనత కలగచేస్తాయి.
4. రక్తహీనత ఎక్కువ ఉన్నప్పుడు మరొకరి రక్తం ఎక్కించాలి.
5. కొందరి రక్తహీనతకు ఐరన్‌గానీ, ఫోలిక్ యాసిడ్ గానీ, బి-12 గానీ, థైరాక్సిన్ గానీ లోపం కారణం అవుతాయి. ఆ లోపాన్ని కనుగొని వాటిని సప్లిమెంట్ చేస్తే రక్తహీనత తగ్గుతుంది.

□□□

# 2. ఐరన్ లోపం వల్ల కలిగే రక్తహీనత

*ఐరన్ లోపం వల్ల కలిగే రక్తహీనత రెండు సంవత్సరాల పిల్లలలోనూ, 10-16 సంవత్సరాల వారిలోనూ ఎక్కువ. స్త్రీలలో బహిష్టు స్రావం అధికంగా అయ్యేవారిలోనూ, గర్భం వచ్చినవారిలోనూ రక్తహీనత ఎక్కువ. ఆకు కూరలు తక్కువ భుజించేవారిలో, మాంసాహారం తినని వారిలో ఐరన్ లోపం వల్ల కలిగే రక్తహీనత ఎక్కువ. జీర్ణాశయం మీద శస్త్రచికిత్స జరిగినవారిలో కూడా ఐరన్ లోపం ఎక్కువ.*

**లక్షణాలు:** త్వరగా అలసిపోవడం, నీరసం, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, దేనిమీదా మనసు కేంద్రీకరించలేకపోవడం, తల తిరగడం, గుండె దడ, ఆయాసం, ఛాతిలో నొప్పి. ఐరన్ డెఫిషియన్సీ ఎనీమియా ఉన్నవారిలో నాలిక మీద ఉండే మ్యూకస్ పొర లేకుండా పోతుంది. దాని వల్ల నాలిక ఎర్రగా, నున్నగా కనబడుతుంది. గోళ్ళు గుంటలు అవుతాయి. మట్టి గెడ్డలు, సున్నం వగైరా తినాలనిపిస్తుంది. గొంతులో ఏదో అడ్డం పడినట్లు అనిపిస్తుంది.

**నిర్ధారణ:** రక్తపరీక్షలు, సీరమ్ ఐరన్ ఎస్టిమేషన్, బోనమారో యాస్పిరేషన్, విరోచనం పరీక్ష, ఎండోస్కోపి.

**చికిత్స:**

1. ఐరన్ లోపాన్ని కనుగొని మూలకారణాన్ని సరిదిద్దడం.
2. ఐరన్ మందులు వాడడం.
3. రక్తం ఎక్కించడం.
4. ఆహారంలో ఆకు కూరలు

రక్తం పట్టడానికి వాడే మందుల వివరాలు వేరే చోట ఇవ్వబడ్డాయి.

□□□

# 3. మెగలోబ్లాస్టిక్ ఎనీమియా

*విటమిన్ బి-12 లేదా ఫోలిక్ యాసిడ్ లోపం వల్ల ఎర్రకణాల నిర్మాణంలో తేడా కలిగి మెగలోబ్లాస్టిక్ ఎనీమియా ఏర్పడుతుంది.*

**కారణాలు:** శాకాహారుల్లో బి-12 లోపం ఉంటుంది. అలాగే పౌష్టికాహారం తీసుకోని వారిలో బి-12 లోపం ఉంటుంది. జీర్ణాశయంలో లోపాలు, జీర్ణకోశంలో వ్యాధులు, ఆహారంలోని బి-12 జీర్ణం కాకుండా మెగలోబ్లాస్టిక్ ఎనీమియా ఏర్పడుతుంది. అదే విధంగా ఆహారంలో ఫోలిక్ యాసిడ్ లోపం, కొన్ని దీర్ఘవ్యాధులు, కొన్ని రకాల మందులు, మద్యపానం, ఫోలిక్ యాసిడ్ ఆహారం ద్వారా రక్తంలోకి చేరకుండా అడ్డుపడి మెగలోబ్లాస్టిక్ ఎనీమియాకి కారణమవుతాయి.

**లక్షణాలు:** ఆయాసం, పాలిపోవడం, ఛాతిలో నొప్పి, గాలి నిండుగా పీల్చుకోలేకపోవడం, తరచు విరోచనాలు, ఆకలి లేకపోవడం, బరువు కోల్పోవడం, నోటిపూత, కొద్దిపాటి

జ్వరం, స్ప్లీన్ పెరుగుదల, కాళ్ళు చేతులు తిమ్మిర్లు, చూపు మందగించడం, చిన్న చిన్న రక్త నాళాలు చిట్లడం వంటి లక్షణాలు మెగలోబ్లాస్టిక్ ఎనీమియాలో కనబడతాయి.

**నిర్ధారణ:** హిమోగ్లోబిన్ శాతం బాగా తక్కువగా ఉంటుంది. తెల్లకణాలు, ప్లేట్ లెట్స్ తక్కువ ఉంటాయి. ఎర్ర కణాల పరిమాణం (ఎమ్. సి.వి.) ఎక్కువగా ఉంటుంది. కొన్ని ఎర్ర కణాలు గుండ్రంగా కాకుండా కోడిగ్రుడ్డు ఆకారంలోనూ, కండెలాగానూ ఉంటాయి. బోన్‌మారో యాస్పిరేషన్. బయోకెమికల్ ఛేంజస్ : బైల్‌రుబిన్ యల్.డి.హెచ్. శాతం పెరుగుతుంది. సీరమ్ ఐరన్ శాతం పెరుగుతుంది.

**చికిత్స:** బి-12 ఇంజక్షన్లు ప్రతి మూడు రోజులకి 1000 మైక్రోగ్రామ్స్ ఇవ్వాలి. ఫోలిక్ యాసిడ్ రోజూ 5 మి.గ్రా. ఇవ్వాలి.

❑❑❑

# 4. హీమోలైటిక్ ఎనీమియాస్

*ఇటువంటి ఎనీమియా వ్యాధులలో ఎర్ర కణాల సంఖ్య తగ్గిపోతుంది. ఎర్రకణాల ఎదుగుదల ప్రారంభదశలోనే నాశనం చేయబడుతుంది.*

**కారణాలు:** జెనిటిక్‌గా ఎర్రకణాలు వృద్ధికి తోడ్పడే ఎంజైమ్స్ లోపం ఉండడం, హీమోగ్లోబిన్‌లో తేడాలు,ఎర్ర కణాల్లో లోపం, ఎర్ర కణాలకి వ్యతిరేక కణాలు ఉండటం.

కొందరికి పుట్టుకనుంచే ఇటువంటి లోపాలు ఉంటే మరికొందరికి తరువాత ఏర్పడతాయి.

**నిర్ధారణ:** హీమోలైటిక్ ఎనీమియాస్‌కి మూలకారణాలని నిర్ధారణ చేసుకోవడం, రక్తంలో అన్‌కాంజుగేటెడ్ బైల్‌రుబిన్ ఎక్కువగా ఉండడం. హెప్టోగ్లోబిన్స్ బాగా తగ్గిపోవడం, యూరోబైరిలోజన్ పెరగడం, రెటికిలోసైట్స్, నార్మల్ బ్లాస్ట్స్ రక్త పరీక్షలో కనపడడం.

## పుట్టుకతో వచ్చే హీమోలైటిక్ ఎనీమియాస్

1. సికిల్‌సెల్ ఎనీమియా - ఇటువంటి ఎనీమియా బిడ్డ మూడవ మాసంలోనే బహిర్గతమవుతుంది. బిడ్డ పాలిపోయి ఉంటాడు. పచ్చకామెర్లు కనబడతాయి. జ్వరం ఉంటుంది. స్ప్లీన్ పెరుగుతుంది. వయసు పెరుగుతున్న కొద్దీ బిడ్డలో రకరకాల బాధలు కలుగుతాయి. తరచు ఏదో ఒక వ్యాధి వస్తుంది.

చికిత్స:

ఫోలిక్ యాసిడ్ రెగ్యులర్‌గా ఇవ్వాలి. రక్తహీనత ఎక్కువ ఉంటే బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ ఇవ్వాలి.

2. థాలసీమియా - జెనిటిక్ లోపం వల్ల హీమోగ్లోబిన్ తయారీలో లోపం ఏర్పడు తుంది. ఈ లోపం తీవ్రతని బట్టి థాలసీమియా మైనర్, థాలసీమియా మేజర్ అని స్థూలంగా విభజించడం జరుగుతుంది.

జెనిటిక్ లోపాల వల్ల ఏర్పడే ఎనీమియాస్‌కి పూర్తి క్యూర్ లేదు. ఎనీమియా తీవ్రత బట్టి బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ ఇవ్వాల్సి ఉంటుంది.

❑❑❑

# 5. ఎబ్లాస్టిక్ ఎనీమియా

*ఎబ్లాస్టిక్ ఎనీమియాలో బోన్‌మారోలో ఎర్ర కణాలని ఉత్పత్తి చేసేటటువంటి యంత్రాంగం పూర్తిగా లోపిస్తుంది. ఇది పుట్టుకతో ఉండవచ్చు లేదా తరువాత ఏర్పడవచ్చు. బోన్‌మారో దెబ్బతినడం అనేది రేడియేషన్ వల్ల, రసాయనికాల వల్ల, విషపదార్థాల వల్ల, కొన్ని మందుల వల్ల, కొన్ని వ్యాధుల వల్ల జరగవచ్చు.*

లక్షణాలు: బోన్‌మారో దెబ్బతిని రక్తహీనత ఏర్పడడం అనేది నిదానంగా జరగవచ్చు. అకస్మాత్తుగా జరగవచ్చు. వీరిలో నీరసం, అలిసిపోవడం, ఆయాసం, పాలిపోవడం, నోట్లో పుళ్ళు, గొంతునొప్పి, జ్వరం, చెమటలు, ఛాతిలో నొప్పి మొదలైన లక్షణాలు ఉంటాయి.

నిర్ధారణ: రక్త పరీక్ష, బోన్‌మారో యాస్పిరేషన్.

చికిత్స:

1. మూలకారణాన్ని గుర్తించి దానికి తగిన చర్య తీసుకోవడం.
2. ఇన్‌ఫెక్షన్ కంట్రోల్ చేయడం.
3. కార్టికో స్టిరాయిడ్స్.
4. బోన్‌మారో ట్రాన్స్‌ప్లాంటేషన్.

❑❑❑

# 6. ఎగ్రాన్యులోసైటోసిస్

*రక్తంలో తెల్లకణాలు విపరీతంగా తగ్గిపోయిన పరిస్థితిని ఎగాన్యులోసైటోసిస్ అంటారు. ఈ పరిస్థితి చాలా ప్రమాదకరమైనది. కొందరిలో ఎగ్రాన్యులోసైటోసిస్‌కి కారణం తెలుస్తుంది. మరికొందరిలో ఎటువంటి కారణం కనపడదు.*

**కారణాలు:** కీళ్ళనొప్పి మందులు, థైరాయిడ్ మందులు, సల్ఫామందులు, మరికొన్ని వ్యాధుల మందులు - ఎగ్రాన్యులోసైటోసిస్‌ని కలుగచేస్తాయి. ఎక్స్‌రేలు, రేడియం ఎగ్రాన్యులోసైటోసిస్‌కి కారణమవుతాయి. ఆస్టియోమైలైటిస్ లివర్‌యాప్సినో, న్యుమోనియా, సెప్టిసీమియా, ఇన్‌ఫ్లూయింజా మొదలైన వ్యాధుల వల్ల ఎగ్రాన్యులో సైటోసిస్ కలగవచ్చు.

**లక్షణాలు :** అకస్మాత్తుగా జ్వరం, చలి, వణుకు, చెమటలు, తలనొప్పి, కండరాల నొప్పి,వికారం, వాంతులు, అతి నీరసం, కోమా.

**నిర్ధారణ :** రక్తపరీక్షలు, బోన్‌మారో యాస్పిరేషన్.

**చికిత్స :**

1. ఎగ్రాన్యులోసైటోసిస్ కలిగించే మూలకారణాన్ని గుర్తించి వెంటనే దానిని సరిదిద్దడం.
2. పూర్తి విశ్రాంతి.
3. వ్యాధులు సంక్రమించకుండా ముందు జాగ్రత్తగా యాంపిసిలిన్ **లేదా** కెఫ్లక్సిన్ మందులు.
4. తెల్ల కణాల ట్రాన్స్‌ఫ్యూజన్.
5. కార్టికో స్టిరాయిడ్స్ ద్వారా తెల్లకణాల ఉత్పత్తికి ప్రేరేపణ.
6. బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్.

❑❑❑

# 7. ల్యుకీమియాస్ (బ్లడ్ కేన్సరు)

*ల్యుకీమియాస్ ముఖ్యంగా రెండు రకాలు: 1. ఎక్యూట్ ల్యుకీమియాస్.*

*2. క్రానిక్ ల్యుకీమియాస్.*

**ఎక్యూట్ ల్యుకీమియాస్ :** ఈ వ్యాధి రెండు రకాలు. (1) ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకీమియా (2) ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకీమియా.

**లక్షణాలు:** సాధారణంగా అకస్మాత్తుగా వ్యాధి బయటపడుతుంది. లేదా వ్యాధి కనబడిన కొద్ది రోజులలోనే త్వరత్వరగా పెరిగిపోతుంది. ఎక్యూట్ ల్యుకీమియా ఉన్నవారిలో పాలిపోవడం, నీరసం, అలసట, బలహీనత ఉంటాయి. శరీరంలో వివిధ చోట్ల చిన్న చిన్న రక్తనాళాలు పగులుతాయి. ముక్కువెంట, నోటి వెంట రక్తం పడటం ఉంటుంది. చిగుళ్ళ వెంట రక్తం కారుతుంది. తరచు ఏదో ఒక అనారోగ్యం ఏర్పడుతుంది. స్ప్లీన్ పెరుగుతుంది. లింఫ్‌నోడ్స్ పెద్దవవుతాయి. ఎముకలు సలపరం కలిగిస్తాయి. లివర్ పెరుగుతుంది. కొద్దిపాటి జ్వరం ఉంటుంది.

**నిర్ధారణ:** ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకీమియాలో తెల్లకణాలు ప్రతి క్యూబిక్ మి.మీటరుకి 5,00,000 పైగా ఉంటాయి. ఆరోగ్యవంతుల్లో 10-12,000 మించి ఉండవు. పెరిఫరల్ బ్లడ్ ఫిల్మ్‌లో అపరిపక్వ, అసాధారణ తెల్ల కణాలు అధికంగా కనబడతాయి. బోన్‌మారోలో 30 శాతం పైగా అసాధారణ కణాలు ఉంటాయి.

ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకీమియాలో తెల్ల కణాలు ప్రతిక్యూబిక్ మి.మీటరు కి 50,000కిపైగా ఉంటాయి. పెరిఫరల్ బ్లడ్ ఫిల్మ్‌లోనూ, బోన్‌మారోలోనూ, అసాధారణ కణాలు అధికంగా ఉంటాయి.

**చికిత్స:**

1. రక్తహీనతని సరిదిద్దాలి. హీమోగ్లోబిన్ పర్సంటేజి 8 గ్రా.కంటే తగ్గకుండా చూసుకోవాలి.
2. ఇన్‌ఫెక్షన్లు రాకుండా యాంటిబయోటిక్ మందులు వాడాలి.
3. రక్తహీనతను సరిదిద్దడానికి బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ ఇవ్వాలి.
4. యాంటిల్యుకీమియా థెరపి.

❑❑❑

# 8. క్రానిక్ ల్యుకీమియాస్

*క్రానిక్ ల్యుకీమియాస్‌లో క్రానిక్ మైలాయిడ్ ల్యుకీమియా, క్రానిక్ లింఫాయిడ్ ల్యుకీమియా ప్రధానమైనవి.*

*క్రానిక్ మైలాయిడ్ ల్యుకీమియా: రేడియేషన్ వల్ల, వైరస్ ఇన్‌ఫెక్షన్‌వల్ల కలుగుతాయి. ఇటువంటి బ్లడ్ కేన్సర్ వచ్చినవారిలో జ్వరం, బరువు కోల్పోవడం, అలసట, అతిగా చెమటలు ఉంటాయి. స్ప్లీన్, లివర్ పెరుగుతాయి. చిన్నచిన్న రక్త నాళాలు పగిలి వివిధ చోట్లనుంచి రక్తం కారుతుంది.*

**నిర్ధారణ:** తెల్ల కణాల సంఖ్య పెరుగుతుంది. పెరిఫరల్ బ్లడ్ ఫిల్మ్‌లో మెటామయిలోసైట్స్, మైలోసైట్స్, ప్రొమైలోసైట్స్, బ్లాస్ట్‌సెల్స్ అసాధారణ రీతిలో కనబడతాయి. బోన్‌మారో యాస్పిరేషన్ పరీక్షలో కూడా ఈ అసాధారణ కణాలు అధికంగా కనబడతాయి.

**చికిత్స:** కీమోథెరపి. ఇందులో మైలరాన్ ప్రధానమైన మందు, బోన్‌మారో ట్రాన్స్‌ప్లాంటేషన్.

**క్రానిక్ లింఫాయిడ్ ల్యుకీమియా:** 40 సంవత్సరాల లోపు వారిలో ఈ బ్లడ్ కేన్సర్ తక్కువ. వీరిలో శరీరంలో వివిధ చోట్ల లింఫ్ గ్లాండ్లు వస్తాయి. చిన్న చిన్న రక్తనాళాలు పగులుతాయి. లివర్, స్ల్పీన్ పెరుగుతాయి.

**నిర్ధారణ:** తెల్ల కణాల్లో ఒకటైన లింఫోసైట్స్ అధికంగా పెరుగుతాయి. బోన్‌మారో యాస్పిరేషన్ పరీక్షలో లింఫోసైట్స్ అధికంగా కనబడతాయి.

**చికిత్స:**

1. కీమోథెరపి: ఈ వ్యాధి విషయంలో ల్యుకేరాన్ ప్రధానంగా వాడబడుతుంది.
2. రేడియోథెరపి.
3. కార్టికో స్టిరాయిడ్స్.

❑❑❑

# 9. లింఫోమాస్

*లింఫోమాస్‌లో ప్రధానంగా శరీరంలో వివిధ భాగాలలో ఉన్న లింఫ్ గాండ్లు పరిమాణం పెరుగుతాయి. స్ల్పీన్ పరిమాణం పెరుగుతుంది. శారీరకంగా శుష్కించడం ఉంటుంది.*

లింఫోమాస్ రెండు రకాలు. (1) హాడ్జికిన్స్ డిసీజ్ (2) నాన్ హాడ్జికిన్స్ లింఫోమాస్.

**హాడ్జికిన్స్ డిసీజ్ :** హాడ్జికిన్స్ డిసీజ్‌లో లింఫ్‌గ్లాండ్సు విపరీతంగా పెరుగుతాయి. హిస్టోపెథలాజికల్‌గా ఈ వ్యాధిని స్పష్టంగా తెలుసుకోవచ్చు.

సాధారణంగా ఈ వ్యాధి 20-25 సంవత్సరాల వారిలో కనపడుతుంది. ఈ వ్యాధి రావడానికి ప్రధాన కారణం తెలియదు.

హాడ్జికిన్స్ డిసీజ్‌లో మొదట మెడదగ్గర లింఫ్ గ్లాండ్లు వాస్తాయి. మొదట ఒక వైపు వాచి తరువాత రెండవ వైపు వాస్తాయి. ఆ తరువాత చంకల్లో, గజ్జల్లో,కడుపులో, ఛాతిలో ఉండే లింఫ్‌గ్లాండ్లు వాస్తాయి. ఈ వ్యాధి వచ్చిన రోగి త్వరగా నీరస పడిపోతాడు. రక్తహీనత కలుగుతుంది. తరచు ఏదో ఒక వ్యాధి వస్తుంది. ఒళ్ళు దురద అనిపిస్తుంది.

ఎముకలు సలపరం కలిగిస్తాయి. నరాలు నొప్పి కలిగిస్తాయి. కొందరికి ఆహారం మింగుడుపడదు. మరికొందరిలో శ్వాసకోశాలకి, జీర్ణాశయం పేగులకి మూత్రవాహికలకి అడ్డంకి ఏర్పడుతుంది.

**పరీక్షలు:** లింఫ్‌నోడ్ బయాప్సి, లింఫోంజియోగ్రఫీ, సి.టి.స్కానింగు.

**చికిత్స:**

1. రేడియోథెరపి.
2. కీమోథెరపి.

**నాన్ హాడ్జికిన్స్ లింఫోమాస్** : ఈ వ్యాధి విషయంలో ఎందుకు వస్తుందో సరైన కారణం తెలియదు. శరీరంలో వివిధ చోట్ల లింఫ్‌గ్లాండ్లు వాస్తాయి. నొప్పి ఉండవు. రోగి త్వరగా నీరసించిపోతాడు. త్వరగా బరువు కోల్పోవడం, రాత్రిపూట చెమటలు ఎక్కువగా పోయడం ఉంటాయి.

**నిర్ధారణ:** లింఫ్‌నోడ్ బయాప్సి, బోన్‌మారో బయాప్సి, అల్ట్రాసౌండ్ స్కానింగ్, సి.టి.స్కానింగ్.

**చికిత్స:**

1. కీమోథెరపి.
2. బోన్‌మారో సప్రషన్.
3. బోన్‌మారో ట్రాన్స్‌ప్లాంటేషన్.

□□□

# 10 . మల్టిపుల్ మైలోమా

ఈ వ్యాధిలో కేన్సర్‌కి సంబంధించిన ప్లాస్మా సెల్స్ శరీరమంతా విస్తరించి ఉంటాయి. ఈ వ్యాధిలో పేరాప్రొటీన్స్ రక్తంలోనూ, మూత్రంలోనూ ఉంటాయి. బోన్‌మారోలో కేన్సర్‌కి సంబంధించిన ప్లాస్మా సెల్స్ ఉంటాయి. ఎముకల్లో ఆస్టియోలైటిక్ లక్షణాలు ఉంటాయి.

ఈ వ్యాధిలో బోన్‌మారో డామేజి అవుతుంది. రక్తహీనత ఎక్కువగా ఉంటుంది.

**నిర్ధారణ:** రక్తము, మూత్రములోని ప్రొటీను ఎలక్ట్రోఫోరసిస్, బోన్‌మారో బయాప్సి, రేడియోగ్రఫి.

**చికిత్స:**

ఈ వ్యాధిలో ఆల్కెరాన్ ప్రధానమైన మందు.

□□□

# 13. లైంగిక వ్యాధులు

## 1. సిఫిలిస్

*ఈ వ్యాధి ట్రిపోనోమా పాలిడం అనే క్రిమివల్ల వస్తుంది. లైంగిక సంపర్కం ద్వారా ఈ వ్యాధి సంక్రమించడం ఎక్కువ. ఈ వ్యాధి క్రిమి శరీరంలో ప్రవేశించిన 10 రోజులనుంచి 3 నెలలలోగా వ్యాధి లక్షణాలు బయటపడతాయి. ఈ వ్యాధి కనబడగానే మందులు వాడకపోతే 3 దశలుగా శరీరంలో వ్యాధి పెంపొందుతుంది.*

**మొదటిదశ:**

మర్మావయవాల మీద పుండు ఏర్పడుతుంది. ఈ పుండు అంతగా నొప్పి ఉండదు. పుండు వచ్చిన తరువాత 3 నుంచి 8 వారాలలో దానంతటికి అదే తగ్గిపోతుంది. మందు వాడితే 1,2 వారాలలో తగ్గిపోతుంది. మర్మావయవాల మీద పుండు వచ్చినప్పుడు గజ్జల్లో కూడా చీముగడ్డలు రావచ్చు.

**రెండవదశ:**

మొదటి దశలో వ్యాధికి సరైన చికిత్స జరగకపోతే రెండవదశకి వ్యాధి చేరే అవకాశం ఉంది. రెండవదశ లక్షణాలు రోగిలో వ్యాధి కలిగిన 3 నుంచి 5 మాసాలలో బయటపడతాయి. రెండవదశలో ఒంటిమీద దద్దుర్లు, గడ్డలు వస్తాయి.

**మూడవ దశ:**

వ్యాధి వచ్చిన 3 నుంచి 10 సంవత్సరాలలో 3వ దశ లక్షణాలు కలుగుతాయి. దానివల్ల మెదడులో, గుండెలో, ఎముకలలో, మూత్రపిండాలలో, ఇతర శరీర అవయవాలలో ప్రత్యేకమైన వ్యాధులు కలుగుతాయి. పెన్సిలిన్, ఇతర యాంటిబయోటిక్స్ మందుల ఆవిర్భావంతో సిఫిలిస్ వ్యాధికి సంబంధించిన రెండవదశ, మూడవదశలు కలగడం చాలా అరుదైపోయింది.

**చికిత్స:**

1. పెనిడ్యూర్ యల్.ఎ.24 వారానికి ఒకటి చొప్పున 2 వారాలు **లేదా** టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా చొప్పున ప్రతి 6 గంటలకి ఒకసారి వేసుకుంటూ రెండు వారాలు వాడాలి **లేదా** డాక్సీసైకిలిన్ 100 మి.గ్రా. లేదా సైనోమైసిన్ 100 యం.జి. చొప్పున రోజూ 2 సార్లు వేసుకుంటూ 15 రోజులు వాడాలి.

2. సిఫిలిస్ రెండవ దశ, మూడవ దశల్లో పెనిడ్యూర్ యల్.ఎ.24 ఇంజక్షన్లు వారానికి ఒకటి చొప్పున మూడు వారాలు వాడాలి.

□

## 2. గనేరియా

*నిశీరియా గొనేరియా క్రిమి వల్ల గనేరియా వ్యాధి వస్తుంది. లైంగిక సంపర్కం పొందిన 2 నుంచి 5 రోజులలో ఈ వ్యాధి లక్షణాలు బయటపడతాయి. ఈ వ్యాధి వచ్చినవారిలో ముందు మూత్రం మంటగా రావడం, మాటిమాటికి రావడం, ఆ తరువాత మూత్రనాళం నుంచి చీము కారడం ఉంటాయి. ఈ వ్యాధి క్రిములు స్త్రీలలో గానీ, పురుషులలో గానీ జననేంద్రియాలలోని ఇతర భాగాలకి వ్యాపించి మరికొన్ని లక్షణాలు కలగచేస్తాయి. పురుషులలో వృషణాలు, ప్రోస్టేట్ గ్రంథి వాచటం, పొత్తి కడుపులో నొప్పి అనిపించటం ఉంటాయి. స్త్రీలలో అండాశయాలు, అండవాహికలు, మూత్రకోశం వ్యాధిగ్రస్తమై పొత్తి కడుపు బిగదీస్తుంది.*

చికిత్స:

1. ప్రొకైన్ పెన్సిలిన్ 6,00,000 ఇంజక్షన్ రోజుకొకటి చొప్పున 10 రోజులు వాడాలి. **లేదా** నార్ఫ్లాక్సాసిన్ 400 మి.గ్రా. చొప్పున రోజుకి 2 సార్లు వాడుతూ పదిరోజులు వేసుకోవాలి **లేదా** సైనోమైసిన్ 100 యం.జి. ఉదయం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున10 రోజులు వాడాలి.

□□□

## 3. షాంక్రాయిడ్

*ఈ వ్యాధి హీమోఫిలస్ డుక్రీ బాక్టీరియా క్రిమివల్ల వస్తుంది. ఈ వ్యాధిగల క్రిమి శరీరంలోకి ప్రవేశించిన 3 నుంచి 5 రోజులలో వ్యాధి లక్షణాలు బయటపడతాయి. మర్మావయవాల మీద ఒకటికి మించి పుళ్ళు ఏర్పడతాయి. నొప్పి అనిపిస్తాయి. గజ్జల్లో చీము గడ్డలు తయారవుతాయి. నలపరం, చలిజ్వరం ఉంటాయి.*

చికిత్స:

1. టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. తడవకి ఒక క్యాప్సూల్ చొప్పున ప్రతి 6 గంటలకి ఒకటి వేసుకోవాలి. అలా 10 రోజులు వాడాలి. **లేదా** డాక్సీసైకిలిన్ 100 మి.గ్రా. క్యాప్సూల్ ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి చొప్పున 10 రోజులు వాడాలి.

□□□

## 4. యల్.జి.వి.

ఈ వ్యాధినే లింఫో గ్రాన్యులోమా వెనీరియం అంటారు. ఈ వ్యాధి వచ్చిన వారిలో మర్మావయవాల దగ్గర చిన్న చిన్న కురుపులు లేస్తాయి. గజ్జల్లో గడ్డలు లేస్తాయి. మర్మావయవాలు నీరు పట్టి ఉబ్బుగా ఉంటాయి. మర్మావయవాల దగ్గర ఏర్పడిన పుళ్ళనుంచి రసి కారుతుంది.

**చికిత్స:**

1. టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. క్యాప్సూల్స్ ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున 2, 3 వారాలు వాడాలి **లేదా** సైనోమైసిన్ 100 మి.గ్రా. క్యాప్సూల్స్ ఉదయం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున 2-3 వారాలు వాడాలి.

❑❑❑

## 5. గ్రాన్యులోమా ఇంగ్వైనాలే

ఈ వ్యాధి వచ్చిన వారిలో మర్మావయవాల మీద పుళ్ళు ఏర్పడతాయి. ఆ పుళ్ళ నుంచి రక్తం కారుతుంది. పుళ్ళ రసి అంటుకుని ప్రక్క భాగాలలో కూడా కొత్త పుళ్ళు తయారవుతాయి.

**చికిత్స:**

1. టెట్రాసైకిలిన్ 500 మి.గ్రా. క్యాప్సూల్స్ ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున రెండు, మూడు వారాలు వాడాలి **లేదా** సైనోమైసిన్ - 100 మి.గ్రా. రోజుకి రెండుసార్లు చొప్పున 2-3 వారాలు వాడాలి.

❑❑❑

## 6. హెర్పిస్ సింప్లెక్స్

హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వైరస్ క్రిములవల్ల వస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి ఒకరి నుంచి మరొకరికి లైంగిక సంపర్కంవల్ల వస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ ఉన్న స్త్రీ - పురుషులలో మర్మావయవాల దగ్గర చిన్న చిన్న నీటి పొక్కులు గుంపులు - గుంపులుగా వస్తాయి. అవి 1 - 2 రోజుల్లో చితికిపోయి ఎర్రని పుండుగా అవుతుంది. మందు వాడినా, వాడకపోయినా హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వారం - పది రోజుల్లో తగ్గిపోతుంది. ఒకసారి హెర్పిస్‌సింప్లెక్స్ వ్యాధి సంక్రమిస్తే ఆ తరువాత ఎటువంటి లైంగిక సంబంధం లేకపోయినా అనేక సంవత్సరాలపాటు వ్యాధి తిరిగి తిరిగి కనబడుతుంది. ఈ వ్యాధివల్ల సాధారణంగా ఎటువంటి హాని ఉండదు.

చికిత్స:

తక్కిన వైరస్ వ్యాధులకి సరైన మందు లేనట్లే దీనికీ లేదు. అయితే 'ఎసైక్లోవిరాన్' టాబ్లెట్లు ప్రతి 5 గంటలకి ఒకటి చొప్పున 3 - 4 వారాలు వాడితో కొంత ఫలితం ఉంటుంది. ఈ బిళ్ళలు ఖరీదైనవి. హెర్పిస్ సింప్లెక్స్ వచ్చినచోట 'హెర్పిస్' క్రీమ్ రోజుకి 3 - 4 సార్లు రాస్తే కూడా ఉపశాంతి కలుగుతుంది.

□□□

# 7. ఎయిడ్స్

ఎయిడ్స్ వ్యాధి వైరస్ క్రిముల వల్ల వస్తుంది. ఈ వ్యాధికి 2 రకాలయిన వైరస్ క్రిములు కారణం. 1. హెచ్.ఐ.వి.-I. 2. హెచ్.ఐ.వి.-II.

కారణాలు:

ఈ వ్యాధి ముఖ్యంగా లైంగిక సంపర్కం ద్వారా ఒకరినుంచి మరొకరికి సంక్రమిస్తుంది. ఎయిడ్స్ వ్యాధి క్రిములున్న రోగియొక్క రక్తం మరొక ఆరోగ్యకరమైన వ్యక్తికి ఎక్కించినట్లయితే అతనికి కూడా ఎయిడ్స్ వ్యాధి సంక్రమిస్తుంది, ఎయిడ్స్ వ్యాధి ఉన్న తల్లికి గర్భం వస్తే బిడ్డకి కూడా ఎయిడ్స్ వ్యాధి సంక్రమిస్తుంది. మత్తుమందులకి అలవాటుపడిన వారిలోనూ ఒకే ఇంజక్షన్ సూది శుభ్రపరచకుండా అనేక మందికి ఇవ్వడం ద్వారాను ఎయిడ్స్ వ్యాధి ప్రబలే అవకాశం ఉంది.

లక్షణాలు:

బరువు కోల్పోవడం, లింఫ్ గ్లాండ్లు వాచడం, నీళ్ళ విరోచనాలు, విడవకుండా జ్వరం, ఆకలి లేకపోవడం.

ఎయిడ్స్ క్రిములు శరీరంలో ప్రవేశించిన తరువాత రోగ లక్షణాలు బయటపడటానికి 5 నుచి 15 సంవత్సరాలు పడుతుంది. ఈ లోపల రక్త పరీక్ష చేసి చూస్తే తప్ప ఆ వ్యక్తికి ఎయిడ్స్ వ్యాధి వచ్చినట్లు తెలియదు. ఎయిడ్స్ క్రిములు శరీరంలో ప్రవేశించిన 3 నుంచి 6 మాసాలలోగా రక్త పరీక్షలో తెలుస్తుంది.

ఎయిడ్స్ వ్యాధి బయటపడినవారిలో ఒక నెలలోనే 10 శాతం బరువు కోల్పోవడం ఉంటుంది. అందుకని ఎవరయినా త్వరితంగా బరువు కోల్పోయినా, నెలకిమించి నీళ్ళ విరోచనాలు అవుతున్నా, నెలకంటేమించి జ్వరం ఉంటున్నా స్పష్టమైన రోగ నిర్ధారణ లేనప్పుడు ఎయిడ్స్ అని అనుమానించవచ్చు. ఇవే కాకుండా చాలా కాలంనుంచి అకారణంగా దురదలు ఉండడం, కారణం తెలియకుండా జబ్బు రావడం, నోటిలో పాచి


పేరుకుపోవడం, హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి ఉన్నట్లుండి పెరిగి తగ్గకుండా అవడం, శరీరంలో వివిధ భాగాలలో గడ్డలు రావడం కూడా ఎయిడ్స్ వ్యాధికి లక్షణాలు కావచ్చు.

**నిర్ధారణ:**

హెచ్.ఐ.వి. టెస్ట్:- ఈ టెస్ట్ పాజిటివ్ వచ్చినంత మాత్రాన అది ఎయిడ్స్ అనుకోవలసిన అవసరం లేదు. ఎయిడ్స్ కాని ఇతర ఇమ్యునో డెఫిషియన్సీ వైరస్ వ్యాధుల్లో కూడా పాజిటివ్ రావచ్చు. ఈ టెస్ట్ కేవలం ప్రాధమిక టెస్ట్ మాత్రమే.

వెస్ట్రన్ బ్లాట్ టెస్ట్:- ఈ టెస్ట్ ద్వారా ఎయిడ్స్ వ్యాధి అయినదీ, కానిది నిర్ధారణ చేసుకోవచ్చు. ఈ టెస్ట్ పాజిటివ్ అయితే ఎయిడ్స్ వ్యాధి ఉన్నట్లే.

**చికిత్స:**

1. ఇంతవరకు ఎయిడ్స్ వ్యాధి వస్తే తగ్గడానికి సరైన మందు లేదు. ఎయిడ్స్ క్రిములు ప్రవేశించిన వ్యక్తి ఇతరులతో సెక్స్‌లో పాల్గొనకూడదు. ఒకవేళ పాల్గొనేటట్లయితే కండోమ్స్ ఉపయోగించాలి.
2. ఎయిడ్స్ రోగి శారీరకంగా, మానసికంగా ఎక్కువ విశ్రాంతిగా ఉండాలి.
3. జిడోవుడిన్ - ఈ మందు కొంతవరకు ఎయిడ్స్ తీవ్రతని అరికట్టి వ్యాధిని కొంత ఆపుతుంది.

❑❑❑

## -ఆరోగ్యానికి వ్యాయామం-

మంచి ఆరోగ్యానికి మంచి ఆహారం ఎంత ముఖ్యమో వ్యాయామం అంతగానే ముఖ్యం.

నడక, ఈత, పరుగు, ఆటలు ఆరోగ్యానికి అత్యంత అవసరం.

చిన్నపిల్లలు ఆటలు తప్పక ఆడాలి. అప్పుడే ఏపుగా ఎదుగుతారు. కండరాలు బలంగా తయారవుతాయి.

పెద్దవాళ్లు రోజూ కనీసం 2 - 3 మైళ్లు నడవాలి. నడిస్తే రక్తపోటు, గుండెజబ్బు, మధుమేహం రావు. అనవసరంగా ఒంటికి క్రొవ్వు చేరదు. రక్తప్రసరణ 25 రెట్లు పెరుగుతుంది.

ప్రాణవాయువు శరీరానికి బాగా అందుతుంది. మామూలుగా నిమిషానికి మూడున్నర లీటర్ల గాలి పీల్చుకునేవాళ్లు 5 లీటర్ల గాలి పీల్చుకుంటారు. కణకణానికీ ప్రాణవాయువు చేరుతుంది. మనిషికి అలసట తొలుగుతుంది. శక్తి అనిపిస్తుంది.

# 14. మానసిక వ్యాధులు

## 1. స్కిజోఫ్రినియా

'స్కిజోఫ్రినియా' మానసిక వ్యాధుల్లో ముఖ్యమైనది. దీనినే మామూలుగా 'పిచ్చి' అంటారు. మానసిక వ్యాధుల్లో సైకోసిస్‌కి సంబంధించిన వ్యాధుల్లో స్కిజోఫ్రినియా ఒకటి.

స్కిజోఫ్రినియా మానసికరోగి ఆలోచనలోనూ, మాటల్లోనూ, వినికిడిలోనూ మామూలు వ్యక్తుల్లో వలెకాక విలక్షణంగా ఉంటుంది.

స్కిజోఫ్రినియా వ్యాధి చిన్న వయస్సులోనే ప్రారంభమవుతుంది. ఈ మానసిక వ్యాధి 20 నుంచి 40 సంవత్సరాల వారిలో ఎక్కువగా కనబడుతుంది.

**కారణాలు :**

వంశపారంపర్యంగా స్కిజోఫ్రినియా సంక్రమించడం ఎక్కువ. స్కిజాయిడ్ పర్సనాలిటి కలవారిలో ఈ వ్యాధి వచ్చే అవకాశం ఉంది. తల్లిదండ్రుల ప్రేమని కాకుండా ఛీత్కారాలు పొందేవారిలో ఈ మానసిక వ్యాధి వచ్చే అవకాశం ఉంది. సామాజికంగా అణగద్రొక్కబడిన వ్యక్తుల్లో ఈ మానసిక వ్యాధి కనబడవచ్చు. న్యూరోట్రాన్స్‌మీటర్ డోపమైన్ మెటబాలిజంలో అస్తవ్యస్తత ఏర్పడిన వారిలో ఈ వ్యాధి రావచ్చు. చాలామందిలో ప్రత్యేకంగా ఏ కారణం కనబడదు.

**లక్షణాలు :**

* **ఆలోచనలో తేడా :** స్కిజోఫ్రీనియా రోగిలో రకరకాల విలక్షణమైన ఆలోచనలు కలుగుతాయి. భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. భ్రమలు, భ్రాంతులని నిజం అని భావిస్తారు. ఎవరైనా అటువంటి ఆలోచనలు నిజం కాదని చెప్పినా వారి మాటలు నమ్మరు. వారి మనస్సుకు తోచినవే కరెక్టు అనుకుంటారు. ఏది కరెక్టు, ఏది కరెక్టు కాదో విచక్షణ జ్ఞానం ఉండదు. వారి ఆలోచనలని ఎవరో ఎక్కడి నుంచో పసిగడుతున్నారని, అన్నీ వారికి తెలిసిపోతున్నాయని భావిస్తారు. అంతేకాకుండా సుదూర ప్రాంతాల నుంచి ఇతర లోకాల నుంచి తమ ఆలోచనలని ఎవరో కంట్రోలు చేస్తున్నారని, తమ ఆలోచనలని ఎవరో

తెలియని వ్యక్తులు వారి ఆధీనంలో ఉంచుకుంటున్నారని వాపోతారు. వారిలో అర్థం లేని తాత్విక చింతన, అర్థంలేని దైవ భావం, అర్థం లేని వైజ్ఞానిక విషయాలు ఉంటాయి. ఒక ఆలోచనకి మరొక ఆలోచనకి పొంతన ఉండదు. ప్రక్కవారికి అవి అర్థంలేని పిచ్చి ఆలోచనలుగా ఇట్టే తెలిసిపోతుంది. కానీ స్కిజోఫ్రెనియా రోగులు తమ ఆలోచనలు చాలా గొప్పవని భావిస్తారు. ఏదీ సక్రమంగా ఆలోచించలేరు. వీరి ఆలోచనలు ఏదీ పూర్తిగా ముందుకు సాగదు. ఆలోచనలు ఒకదాంట్లో నుంచి మరొకదానిలోకి ఇట్టే మారిపోతుంటాయి.

* కొత్త మాటలు - కొత్త అర్థాలు : ఈ రోగం వచ్చినవారు సాధారణంగా అందరు అనుకునే మాటలకి విచిత్రమైన అర్థాలు సృష్టిస్తారు. ఎక్కడా లేని కొత్త పదాలని సృష్టిస్తారు. అవన్నీ ఆలోచనారహితంగా ఉంటాయి. వివేకహీనంగా సృష్టించే అర్థాలని వారు చాలా గొప్పగా భావిస్తారు.

* మాటలో, నడకలో తేడా : మాటలో, నడకలో ప్రత్యేకమైన మేనరిజమ్స్ కనబడతాయి. ఈ వ్యాధి రాకముందు వారిలో ఈ మేనరిజమ్స్ ఉండవు. మనిషి బిగదీసుకుపోవడం, కదలకుండా నిలబడిపోవడం, చూసేవారికి విలక్షణంగా కనబడడం ఉంటుంది. ప్రతి దానికి వ్యతిరేకంగా మాట్లాడడం, చేయడం ఉంటుంది. కొందరిలో క్రూర మనస్తత్వం పెంపొందుతుంది. వీరిలో పగటి కలలు కనడం ఎక్కువ.

* భ్రమలు - భ్రాంతులు : వీరిలో రకరకాల భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. రకరకాల మాటలు, ధ్వనులు వినబడతాయి. వాస్తవానికి అక్కడ ఏమీ ఉండవు. వారి గురించి ఎవరెవరో ఏదో చెప్పుకుంటున్నట్టు మాటలు వినబడతాయి. అలాగే ఒంటి మీద పురుగులు, పాములు పాకుతున్నట్లు బాధపడిపోతుంటారు. ఏ వాసనలు అక్కడ లేకపోయినా సువాసనలు, దుర్వాసనలు వారి అనుభవంలోకి వస్తుంటాయి. అవన్నీ వారు నిజం అనుకుంటారు. వీరి కంటికి ఏవేవో వస్తువులు, ఎవరెవరో మనుషులు కనబడుతుంటారు. దెయ్యాలు, దేవతలు ప్రత్యక్షం అయి తమతో మాట్లాడుతున్నట్టుగా అనుభూతి పొందుతారు. అవన్నీ నిజంగా జరిగినట్టు భావిస్తారు.

* ఉద్రేకాలు, ఆవేశాలు : ఉన్నట్టుండి ఉద్రేకపడటం, ఆవేశం చెందడం జరుగుతుంది. ఒకేసారి విచారం, సంతోషం రెండూ కనబడతాయి. ఫీలింగ్స్‌లో అర్థం ఉండదు. నిలకడ ఉండదు.

స్కిజోఫ్రినియాలో రకాలు :

* హెబిఫ్రినిక్ స్కిజోఫ్రినియా : ఈ రోగం వచ్చినవారిలో చిన్నపిల్లల ప్రవర్తన కనబడుతుంది. ఆలోచనల్లో పరిపక్వత కనబడదు. ప్రవర్తన అనూహ్యంగా ఉంటుంది. ఆలోచనలు, చేతలు రోజురోజుకి దిగజారతాయి. ఇటువంటి స్కిజోఫ్రినియా వచ్చినవారు కోలుకోవడం అరుదు.
* కెటాటోనిక్ స్కిజోఫ్రినియా : ఈ రకానికి చెందిన స్కిజోఫ్రినియా రోగిలో శరీరం బిగుసుకుపోయినట్లు కనబడుతుంది. కూర్చుంటే కదలడం మెదలడం అంతగా ఉండదు. పడుకుంటే బిగుసుకుపోయి పడుకుంటారు. ఆలోచనలన్నీ వ్యతిరేకంగా ఉంటాయి. అర్థం లేకుండా ఉద్రేకపడటం ఉంటుంది.
* పేరనాయిడ్ స్కిజోఫ్రినియా : ఈ రకానికి చెందిన స్కిజోఫ్రినియా రోగిలో అనుమాన మనస్తత్వం ఎక్కువగా ఉంటుంది. ఎవరో తమకి హాని తలపెట్టారని, తమని చంపటానికి వెంటబడుతున్నారని అంటారు. గొడ్డళ్ళతో, బల్లాలతో తనను వెంటాడుతున్నారని భ్రాంతి చెందుతారు. తన భద్రత గురించి అన్నీ అనుమానాలే, భయాలే. కానీ వాస్తవానికి వారికెవరూ శత్రువులుండరు. ఎవరూ వారిని వెంటాడుతూ ఉండరు. వారి ఆలోచనల్లో నిలకడ ఉండదు. భ్రమలు, భ్రాంతులు ఎక్కువ ప్రభావితం చేస్తాయి. మానసిక చికిత్సతో ఇటువంటి వారు కోలుకోవడం జరుగుతుంది.
* అన్‌డిఫరెన్షియేటెడ్ స్కిజోఫ్రినియా : ఈ రకానికి చెందిన స్కిజోఫ్రినియా రోగిలో ఆలోచనల్లో అస్తవ్యస్తత ఎక్కువ. విచక్షణ జ్ఞానం ఉండదు. వారు అనుకున్నదే నిజం అనుకుంటారు. భ్రమలు, భ్రాంతులు ఎక్కువ కలుగుతాయి. ప్రవర్తనలో విలక్షణత ఉంటుంది.

చికిత్స :

1. క్లోరోప్రోమాజిన్ రోజుకి 100-1000 మి.గ్రా, థైయోరైడజిన్ రోజుకి 1-10 మి.గ్రా., ట్రైఫ్లూపెరజిన్ 15-40 మి.గ్రా.

2. హాలోపెరిడాల్ రోజుకి 5-80 మి.గ్రా., ట్రైఫ్లూపెరిడాల్ రోజుకి 0.5-8 మి.గ్రా.
3. పైమోజైడ్ రోజుకి 2-12 మి.గ్రా.
4. ఇ.సి.టి. (ఎలక్ట్రో కన్వల్సీవ్ థెరపి)
5. సైకోథెరపి.

కొందరిలో స్కిజోఫ్రినియా వ్యాధి కాకపోయినా అకస్మాత్తుగా స్కిజోఫ్రినియా లక్షణాలు వంటివి కనబడతాయి. వీరికి కూడా స్కిజోఫ్రినియాకివలెనే యాంటీసైకోటిక్ డ్రగ్స్ వాడాలి.

❑❑❑

# 2. డిప్రషన్

*డిప్రషన్ అనేది ఒక విధమైన మానసిక వ్యాధి. ఎఫెక్టివ్ డిస్ఆర్డర్స్ అనే మానసిక వ్యాధుల తరగతులకి చెందినది. ఈ వ్యాధిలో ముఖ్యంగా "మూడ్ డిస్టర్బెన్స్" ఉంటుంది. మనిషి డల్‌గా మారడం ఉంటుంది.*

*డిప్రషన్‌లో మనిషి ఆలోచనల్లో, ప్రవర్తనలో డల్‌నెస్ చోటు చేసుకోవడం ప్రధానం. కాగా తక్కిన ఎఫెక్టివ్ డిస్ఆర్డర్స్‌లో పిచ్చి హుషారు చోటు చేసుకుంటుంది లేదా ఒకే వ్యక్తిలో కొంతకాలం అతి డల్‌నెస్, మరికొంతమందిలో అతి హుషారు చోటు చేసుకుంటాయి. ఇటువంటి పరిస్థితిని 'మేనిక్ డిప్రస్సీవ్ సైకోసిస్' (యం.డి.పి) అంటారు.*

*కొందరిలో మైండ్ బ్యాలెన్స్ తప్పి మాటల్లో, చేతల్లో అతి ఏర్పడుతుంది. అతి హుషారుగా (అర్థం పర్థం లేకుండా) మారతారు. ఇటువంటి మూడ్ డిస్టర్బెన్స్‌ని "మేనియా" అంటారు.*

**కారణాలు :**

వంశపారంపర్యం, పర్సనాలిటి, మానసికంగా దెబ్బతినడం, మానసిక ఒత్తిడి, బయోకెమికల్ ఛేంజెస్.

**రకాలు :**

ఎండోజీనస్ డిప్రషన్, న్యూరోటిక్ డిప్రషన్ లేదా రియాక్టీవ్ డిప్రషన్

**లక్షణాలు :**

నిద్ర పట్టకపోవడం. దేని మీదా ఆసక్తి లేకపోవడం. హుషారు అసలు లేకపోవడం.

ఆకలి లేకపోవడం. బాధాకరమైన విషయమైనా, సంతోషకరమైన విషయమైనా మనిషిలో ఎటువంటి రియాక్షన్ కనబడకపోవడం. అయినదానికీ, కానిదానికీ ఇట్టే కన్నీరు కార్చడం. ఏ కష్టం లేకపోయినా ఎంతో కష్టం ఉన్నట్లు దిగులుపడడం. ఉద్యోగం, వ్యాపారం మానేసి ఏదీ పట్టకుండా ఒంటరిగా ఉండిపోవడం. ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఏ మూలో కూర్చోవడం. జీవితం మీద ఎంతో నిరాశ, అకారణంగా ఆత్మహత్యకు పూనుకొనడం. తరచూ చనిపోవాలని అనిపించడం.

డిప్రషన్ ఉన్న అందరిలో పై లక్షణాలన్నీ కనబడి ఉండకపోయినా నిద్ర తగ్గిపోవడం, హుషారు లేకపోవడం, బంధుమిత్రులతో అంతగా కలవక పోవడం, దేని మీదా ఆసక్తి లేకపోవడం, తెలియకుండా కళ్ళమ్మట నీళ్ళు రావడం చనిపోవాలనిపించడం ఉంటాయి.

ఎండోజీనస్ డిప్రషన్ ఉన్నవారిలో ఉదయం పూట డిప్రషన్ లక్షణాలు ఎక్కువగా ఉంటాయి. న్యూరోటిక్ డిప్రషన్‌లో సాయంత్రం పూట డిప్రషన్ లక్షణాలు ఎక్కువగా ఉంటాయి.

చికిత్స :

1. ఎమీప్రమిన్ రోజుకి 75-300 మి.గ్రా **లేదా** ఎమీట్రిప్టిలిన్ రోజుకి 75-300 మి.గ్రా. **లేదా** డాక్సిపిన్ రోజుకి 75-300 మి.గ్రా. **లేదా** ఫ్లూక్సిటిన్ రోజుకి 20-80 మి.గ్రా. **లేదా** లిథీయం కార్బనేట్ రోజుకి 60-150 మి.గ్రా.
2. పై మందుతోపాటు నైట్రాజెపామ్ 5-20 మి.గ్రా. **లేదా** ఆల్‌ప్రజాలాం 1-4 మి.గ్రా.
3. ఇ.సి.టి

□□□

## 3. మేనిక్ డిప్రస్సివ్ సైకోసిస్

*ఇందులో కొంతకాలం డిప్రషన్, మరికొంతకాలం అతి హుషారు ఉంటాయి. డిప్రషన్ ఉన్న టైమ్‌లో డిప్రషన్ తగ్గడానికి మందులు వాడాలి. మేనియా ఉన్నప్పుడు మేనియాకి ప...ులు వాడాలి.*

**మేనియా** : మేనియాలో మూడు రకాలు ఉన్నాయి.

* హైపోమేనియా : ఇందులో మనిషి అతి హుషారుగా కనబడతాడు. తన శక్తి సామర్థ్యాలని గొప్పగా ఊహించుకుంటాడు. అలసటని లెక్కచేయకుండా ఎక్కువగా పనిచేసుకుంటూ పోతాడు. తనలో నిబిడీకృతంగా ఉన్న టాలెంట్స్‌ని

ప్రదర్శిస్తాడు. చూసేవాళ్ళకి అతిగా కనబడ్డా, అతని ఆలోచనలు, పనులు సక్రమంగానే కనబడతాయి.

* డెలీరియస్ మేనియా : ఈ మేనియా వ్యాధి వచ్చిన వ్యక్తి హద్దు, అదుపు లేకుండా తను ఏం చేస్తున్నాడో కూడా తెలియకుండా తెంపు లేకుండా పాటలు పాడడం, మాట్లాడడం, గంతులు వేయడం చేస్తాడు. ఒకదానికి ఒకదానికి సంబంధం లేకుండా ఉంటుంది. అసాధారణంగా ప్రవర్తించడం, అసందర్భంగా మాట్లాడడం చేస్తాడు. రకరకాల భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. అవన్నీ నిజం అని నమ్ముతాడు. మాటల్లో, చేతల్లో అలుపు కనబడదు. ఇది చేయవచ్చు. ఇది చేయకూడదు, ఇది మాట్లాడవచ్చు, ఇది మాట్లాడకూడదు అనే విచక్షణా జ్ఞానం, వివేకం పూర్తిగా కోల్పోతాడు. చూసేవాళ్ళకి అతనికి పిచ్చిపట్టిందని పూర్తిగా అర్థం అవుతుంది.
* క్రానిక్ మేనియా : కొందరిలో మేనియా లక్షణాలు తరచు కనబడతాయి.

చికిత్స :

1. మేనియా వచ్చినవారిని ఆసుపత్రిలో ఉంచి పూర్తిగా తగ్గేవరకు చికిత్స చేయాలి.
2. హాలో పెరిడాల్ ఇంజక్షన్‌గానీ, టాబ్లెట్స్‌గానీ రోజుకి 15-60 మి.గ్రా రెండు, మూడు మోతాదుల్లో ఇవ్వాలి.
3. క్లోర్ ప్రొమజిన్ రోజుకి 100-600 మి.గ్రా. ఇంజక్షన్ రూపంలోగానీ, టాబ్లెట్స్ రూపంలో గానీ ఇవ్వాలి.
4. లిథియం కార్బనేట్ రోజుకి 600-1500 మి.గ్రా. ఇవ్వాలి.
5. అవసరం బట్టి రోగిని నిద్రపుచ్చడానికి నైట్రజెపాం రోజుకి 5-20 మి.గ్రా ఇవ్వాలి.
6. మేనియా తీవ్రత తగ్గిపోయిన తరువాత సైకోథెరపి చేయాలి.
7. మేనియా పూర్తిగా తగ్గిపోయిన తరువాత కూడా తిరిగి రాకుండా లిథియం కార్బనేట్ రోజుకి 600-1500 మి.గ్రా చొప్పున వాడుతుండాలి.

❑❑❑

# 4. సైకోసిస్

సైకోసిస్ అనేది ఒక తీవ్రమైన మానసిక వ్యాధి. ఈ వ్యాధి వచ్చిన వారిలో వారి ఆలోచనలు అర్థంపర్థం లేకుండా ఉంటాయి. వారిలో విచక్షణా జ్ఞానం, వివేకం

పోతాయి. భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. భ్రమలు, భ్రాంతులనే నిజం అని భావించడం జరుగుతుంది. వారు ఉండే పరిసరాలతో, మనుషులతో సంబంధాన్ని కోల్పోతారు. ఎక్కడ ఉన్నామో, అప్పుడు సమయం ఏమిటో, పగలో, రాత్రో, తోబుట్టువులు అవునో, కాదో తెలియకుండా పోతుంది. జ్ఞాపక శక్తి పూర్తిగా కోల్పోతారు. తెలివితేటలు ఉండవు. ఏం చేస్తున్నామో, ఏమి మాట్లాడుతున్నామో స్పృహ లేకుండా ఉంటుంది.

కొందరిలో సైకోసిస్ పరిస్థితి అకస్మాత్తుగా ఏర్పడితే, మరికొందరిలో నిదానంగా ఏర్పడుతుంది. కొందరిలో సైకోసిస్ త్వరగా తగ్గిపోతే, మరికొందరిలో క్రానిక్ అవుతుంది. సైకోసిస్ అనేది కేవలం మానసిక వ్యాధి వల్లే కాకుండా, కొన్ని మందుల ప్రభావం వల్ల, మత్తు పదార్థాలు సేవించడం వల్ల, యురీమియా, లివర్ ఫెయిల్యూర్‌లోనూ. సెప్టీసీమియా, మెనింజైటీస్ వంటి ఇన్‌ఫెక్షన్‌లోనూ, మెదడులో ట్యూమర్స్ తయారవడం వల్ల, తలకి దెబ్బ తగలడం వల్ల, మూర్ఛ వ్యాధి వల్ల కూడా ఏర్పడవచ్చు.

సైకోసిస్ అనేది కొందరిలో వంశపారంపర్యంగా కనబడుతుంది. స్కిజాయిడ్ పర్సనాలిటి ఉన్నవారిలో, మానసిక సమస్యలు కలిగిన వారిలో, ఆర్థిక సామాజిక వత్తిడులకు, మానసిక వేదన పొందినవారిలో కూడా సైకోసిస్ లక్షణాలు కనబడతాయి.

సైకోసిస్ లక్షణాలు ఏర్పడినప్పుడు స్కిజోఫ్రీనియాలో వాడినట్లే యాంటీసైకోటిక్ డ్రగ్స్ వాడాలి. ❑❑❑

## 5. న్యూరోసిస్

న్యూరోసిస్ అనేది ఒక చిన్న తరహా మానసిక వ్యాధి. ఇందులో సైకోసిస్ లక్షణాలు ఉండవు. న్యూరోసిస్ ఉన్న వ్యక్తిలో తన గురించి, తాను ఉన్న పరిసరాల గురించి పరిస్థితి గురించి పూర్తి స్పృహ ఉంటుంది. కొన్ని కేసుల్లోనే వ్యక్తి మరొక వ్యక్తిగా ప్రవర్తించడం ఉంటుంది. న్యూరోసిస్‌లో ప్రధానంగా ఆందోళన, కంగారు, భయం, ఆత్మవిశ్వాసం లేకపోవడం కనబడతాయి.

న్యూరోసిస్‌లో రకాలు :

యాంక్సైటీ న్యూరోసిస్, ఫోబియాస్, అబ్సెస్సివ్ కంపల్సివ్ న్యూరోసిస్, హిస్టీరియా, డిప్రెస్సివ్ న్యూరోసిస్, హైపోకాండ్రియా.

❑❑❑

## 6. యాంక్జయిటి న్యూరోసిస్

యాంక్జయిటి న్యూరోసిస్ ఉన్నవారిలో ఆందోళన, కంగారు, భయం, గాభరా. ఏదో ఉపద్రవం ముంచుకొస్తుందని వణికిపోవడం ఉంటుంది. ఇటువంటి పరిస్థితి తరచు వారిలో కనబడుతుంది.

**కారణాలు :** న్యూరోటిక్ పర్సనాలిటి, జెనిటిక్ ఫాక్టర్స్.

**లక్షణాలు :**

యాంక్జయిటి న్యూరోసిస్ ఉన్నవాళ్ళలో ఉన్నట్టుండి అకస్మాత్తుగా భయం, కంగారు వస్తాయి. గుండె దడదడ కొట్టుకుంటుంది. ఊపిరి కూడా పూర్తిగా పీల్చుకోలేరు. మనసు నిలకడగా ఉండదు. కంగారుగా ఉంటుంది. నోరు ఎండిపోతుంది. తల బరువు ఎక్కుతుంది. తలనొప్పి వస్తుంది. తల తిరిగినట్లు అవుతుంది. చూపు మసకగా మారుతుంది. ఉన్నట్లుండి మూత్రం మాటిమాటికి వస్తుంది. అకస్మాత్తుగా విరోచనాలు అయిపోతాయి. చెమటలు ఎక్కువగా పోస్తాయి. ముఖ్యంగా అరిచేతుల్లో, అరికాళ్ళల్లో చెమటలు ఎక్కువ పోస్తాయి. గుండె వేగంగా కొట్టుకుంటుంది. మతిమరుపు వస్తుంది. ఎంతో తెలిసిన విషయాలు కూడా గుర్తురావు. మనసు లగ్నం చేసి పనిచేయలేకపోతారు. నిద్ర రాదు. భయంకరమైన కలలు వస్తాయి. బుర్ర అలసిపోతుంది. ఎంతో అలసిపోయినవారిలాగా మారతారు. చేతులు, కాళ్ళల్లో వణుకు కనబడుతుంది. పైన చెప్పిన లక్షణాలు వేటికీ ఎటువంటి శారీరక అనారోగ్యం కనబడదు. నరాల జబ్బు ఏదీ ఉండదు. కేవలం మనసులో కలిగే కంగారు, భయం వల్లనే పై లక్షణాలు కలుగుతాయి.

**రకాలు :**

ఎక్యూట్ యాంక్జయిటి న్యూరోసిస్, క్రానిక్ యాంక్జయిటి న్యూరోసిస్.

**చికిత్స :**

1. యాంక్జయిటి న్యూరోసిస్ ఎక్కువగా ఉన్నప్పుడు ఆసుపత్రిలో అడ్మిట్ చేయాలి.
2. డైజపామ్ 5-10 మి.గ్రా.గానీ, ఆల్ప్రజోలామ్ 1-2 మి.గ్రా చొప్పున రోజుకి మూడు సార్లు ఇవ్వాలి.
3. ప్రపరనాల్ 40 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు ఇవ్వాలి.
4. నైట్రజాపామ్ 10 మి.గ్రా. రోజుకి 1, 2 సార్లు ఇవ్వాలి.
5. అవసరం బట్టి ఎమీప్రమిన్ టాబ్లెట్స్ రోజుకి 75-300 మి.గ్రా. ఇవ్వాలి.
6. సైకోథెరపి.
7. బిహేవియర్ థెరపి.

❑❑❑

# 7. ఫోబియాస్

భయం వేరు, అర్ధం లేని భయం వేరు. పాముని చూసి, పులిని చూసి భయపడినా, స్పృహ కోల్పోయినా ఒక అర్ధం ఉంది. అలా కాకుండా కొందరు ఎలుకని చూసి, బొద్దింకని చూసి, కప్పని చూసి కెవ్వున కేకవేసి *గజగజ వణికిపోతారు*. భయంతో ఒళ్ళంతా చెమటలు పోసేస్తాయి. ఒక్కోసారి క్షణాల్లో స్పృహ కోల్పోతారు. ఇటువంటి అర్ధం లేని భయాలనే 'ఫోబియాస్' అంటారు.

**కారణాలు :**

ఫోబియాస్ సాధారణంగా చిన్న వయసులోనే మొదలవుతాయి. న్యూరోటిక్ పర్సనాలిటి ఉన్నవారిలో ఫోబియాస్ ఎక్కువ.

**ఫోబియాలో రకాలు :**

* సింపుల్ ఫోబియా : ఎత్తైన ప్రదేశాలన్నా, తలుపులు మూసిన గదులన్నా; బొద్దింకలు, ఎలుకలు, కప్పలు మొదలైన జంతువులు, కీటకాలన్నా అర్ధం లేకుండా భయపడడం సింపుల్ ఫోబియా తరగతికి చెందినవి.
* ఎగోరా ఫోబియా : జనసమ్మర్దంలో ఉన్నా, బస్సులో ఉన్నా తమకి ఏదో అయిపోతున్నట్లుగా గాభరా చెందడం, భయపడటం, ఎగోరా ఫోబియా తరగతికి చెందినవి.
* సోషల్ ఫోబియా : విందులు, వినోదాల్లో, చిన్న చిన్న సమూహాల్లో ఉన్నప్పుడు బెదిరిపోవడం, అక్కడ ఉండలేకపోవడం, సోషల్ ఫోబియా కిందకి వస్తుంది. అటువంటి చోట్ల ఉన్నప్పుడు తనని తక్కినవారు నిశితంగా పరిశీలిస్తారని, తననే తదేకంగా చూస్తారని భావించి భయంతో వణికిపోతారు.

**చికిత్స :**

1. భయం తగ్గటానికి 'కాంపోజ్' 5 మి.గ్రా. చొప్పున రోజుకి 3సార్లు గానీ లేదా 'అల్ప్రోలామ్' 0.25 మి.గ్రా. తడవకి ఒకటి చొప్పున రోజుకి 3 సార్లు వాడాలి.
2. డీసెన్సిటైజేషన్
3. బిహేవియర్ థెరపి

❑❑❑

# 8. అబ్సెస్సివ్ కంపల్సివ్ న్యూరోసిస్

*అబ్సెసివ్ కంపల్సివ్ న్యూరోసిస్‌ని అబ్సెస్సివ్ కంపల్సివ్ డిజార్డర్ (ఒ.సి.డి) అని కూడా అంటారు. ఒకే ఆలోచన ఎంత వద్దన్నా మాటిమాటికి మనసులో మెదలడం, ఒకే పని ఎంత వద్దనుకున్నా మాటిమాటికి చేయడం ఒ.సి.డి. కింద వస్తాయి.*

**కారణాలు :** వంశపారంపర్యం, న్యూరోటిక్ పర్సనాలిటి.

**లక్షణాలు :**

ఒకే ఆలోచన తెంపు లేకుండా మాటిమాటికి రావడం, ఎంత ఆపుకుందామన్నా ఆపుకోలేకపోవడం, ఒకే పని మాటిమాటికి చేయడం, ఎంత వద్దనుకున్నా ఆ పనే చేయడం. ఉదా: కడిగిన చేతులే గంటలు తరబడి కడగడం. మురికి ఉందని గంటలు తరబడి స్నానం చేయడం, తుడిచిన ఇల్లునే మళ్ళీ మళ్ళీ తుడవడం. పడుకునే ముందు తలుపు గడియపెట్టి కూడా గడియ పెట్టానో లేదో అని మాటిమాటికి లేచి చూడడం, ఆందోళనా మనస్తత్వం ఉండడం.

**చికిత్స :**

1. ఆల్‌జోలామ్ 0.5 మి.గ్రా. చొప్పున రోజుకి మూడు సార్లు
2. ఫ్లూనాట్ 20.60 మి.గ్రా. రోజూ ఉదయం పూట
3. ఎనాఫ్రినాల్ 25-75 మి.గ్రా. రోజూ రాత్రిపూట ఒకటి
4. సైకోథెరపి
5. బిహేవియర్ థెరపి

❑❑❑

# 9. హిస్టీరియా

*హిస్టీరియా అనేది ఒక విచిత్రమైన మానసిక వ్యాధి. వ్యాధి లేకున్నా ఏదో వ్యాధి ఉన్నట్లుగా వ్యాధి లక్షణాలు కనబడతాయి.*

**కారణాలు :**

మానసికంగా అసంతృప్తి, బాధ, నిరాశ, అనుకున్నది జరగకపోవడం, శారీరక, మానసిక వత్తిళ్ళకి తట్టుకోలేకపోవడం, ఛీత్కారాలకి గురికావడం హిస్టీరియాకి కొంత కారణంకాగా ధైర్యంగా సమస్య ఎదుర్కోలేకపోవడం, హిస్టీరికల్ పర్సనాలిటి ఉండడం మరికొంత కారణం.

హిస్టీరియాలో రకాలు :

* హిస్టీరియా ఆఫ్ కన్వర్షన్
* హిస్టీరియా ఆఫ్ డిసోసియేషన్

**హిస్టీరియా ఆఫ్ కన్వర్షన్ :** ఇటువంటి హిస్టీరియా ఉన్న వ్యక్తులు పైకి మామూలుగానే ఉంటారు. వారిలో ఉండే అసంతృప్తి, బాధ వారికి కూడా తెలియకుండానే శారీరక బాధలుగా ప్రకటితమవుతాయి. పక్షవాతం వచ్చినట్లు కాలు, చేయి చచ్చుబడతాయి. వాటిని కదపాలని ఎంతో ఆరాటపడతారు. అయినా అవి కదలవు. అలాగే మాట పడిపోయినట్లు అవుతుంది. ఎంత ప్రయత్నించినా మాట పెగలనట్లు కనబడుతుంది. చూపు పోయినట్లవుతుంది. కళ్ళు తెరిచే ఉంటాయి. గుడ్డివారిలాగా ప్రవర్తిస్తారు. శరీరంలో కొంత భాగం సెన్సేషన్ తెలియకుండా అవుతుంది. అలాగే ఒంటి మీద ఏదో ప్రాకుతున్నట్లు, పురుగులు కుట్టుతున్నట్లు తెగ హైరానా పడిపోతారు. కానీ అక్కడ ఏమీ ఉండవు. దురదలు అతిగా ఉంటాయి. ఒళ్ళంతా గోకేసికుంటారు. కానీ అక్కడ దురదలకి ఏ కారణం ఉండదు. చెడ్డ వాసనలు వెలువడుతున్నట్లు, నరాలు వీకైపోయినట్లు, అతిగా బాధపడతారు. వాస్తవానికి ఇవి ఏవీ అక్కడ ఉండవు. బాధపడిపోతున్నట్లుగా ప్రవర్తిస్తూ ఎదుటి వారి సానుభూతి పొందటానికి ఇవన్నీ ఉద్దేశింపబడతాయి. ఇవన్నీ సబ్‌కాన్షస్‌గా మనసు చేయిస్తుంది. మనసులోని దిగులు, బాధ, అసంతృప్తి ఈ రకంగా శారీరక వ్యాధులు, బాధల రూపంలో మార్పు చెంది ప్రకటితం అవుతాయి. అందుకనే ఇటువంటి హిస్టీరియాని 'హిస్టీరియా ఆఫ్ కన్వర్షన్' అంటారు. హిస్టీరియా రోగి పక్షవాతంవచ్చిన వానిలా, నోటి మాట పడిపోయినట్లుగా ప్రవర్తిస్తున్నా పక్షవాతం రావడానికి శరీరంలో ప్రధానంగా కలగవలసిన వ్యాధి గానీ, కారణాలు గానీ అక్కడ ఉండవు. అన్నీ బాగానే ఉంటాయి. కానీ ఆ వ్యాధి వచ్చినట్లు కనబడుతుంది.

**హిస్టీరియా ఆఫ్ డిసోసియేషన్ :** ఇటువంటి హిస్టీరియాలోనివారు అకస్మాత్తుగా మరో మనిషి అయిపోతారు. పూనకం వచ్చి దేవుడిలాగా, దేవతలాగా ప్రవర్తిస్తారు. చనిపోయిన వ్యక్తి తిరిగి వచ్చి ఆవహించినట్లుగా ప్రవర్తిస్తారు. దెయ్యం పట్టినట్లుగా గందరగోళం సృష్టిస్తారు. అలా మార్పు వచ్చినప్పుడు, వాళ్ళు ఏం చేస్తున్నారో వాళ్ళకే తెలియదు. పూనకం నుంచి ప్రేతాత్మలు ఆవహించడం నుంచి తిరిగి మామూలవుతారు. మామూలు అయిన

తరువాత అంతకు ముందు ఏమి జరిగిందో, ఏమేమి చేశారో ఏ మాత్రం వాళ్ళకి తెలియదు. జరిగినదంతా మరచిపోతారు.

## హిస్టీరియా ఎవరిలో వస్తుంది :

హిస్టీరియా వ్యాధి ఎక్కువగా 20-35 సంవత్సరాల వారిలో కనబడుతుంది. స్త్రీలలో హిస్టీరియా రావడం ఎక్కువ. తెలివితేటలు తక్కువ ఉన్నవారిలో, హిస్టీరికల్ పర్సనాలిటీ ఉన్నవారిలో హిస్టీరియా ఎక్కువ కనబడుతుంది. పెళ్ళికాని వాళ్ళలో, భర్తలు వదిలేసిన వాళ్ళలో, వైధవ్యం పొందిన వారిలో హిస్టీరియా రావడం ఎక్కువ.

సామాజికంగా ఆర్థికంగా అణగద్రొక్కబడిన వారిలో అణచివేతకు గురి అయ్యేవారిలో హిస్టీరియా ఎక్కువ కనబడుతుంది.

స్వేచ్ఛగా అన్యాయాన్ని ఎదిరించలేనివారిలో, మనసులోని మాట బయటకు చెప్పలేనివారిలో, అతిగా అసంతృప్తికి గురయ్యేవారిలో హిస్టీరియా రావడం ఎక్కువ. కొందరిలో ఎదుటివారు తమని పట్టించుకోవాలని, తమ ఎడల సానుభూతి చూపించాలని, తమ ఆధిపత్యాన్ని గుర్తించాలని ఆరాటం ఉంటుంది. అది జరగనప్పుడు ఎదుటివారి దృష్టిని, సానుభూతిని తమవైపు మళ్ళించుకోవటానికి మనసు తొక్కే తప్పుడు త్రోవే హిస్టీరియా వ్యాధి. సమస్యల నుండి ఎస్కేప్ అవడానికి మనసు విచిత్రంగా ఎన్నుకునే మార్గమే హిస్టీరియా వ్యాధి. ఉదా: ఒక విద్యార్థి పరీక్షలకి సక్రమంగా ప్రిపేరు కాకపోవచ్చు. కానీ పరీక్ష తప్పడం అతనికి షేమ్. అటువంటి మానసిక సంఘర్షణ నుండి బయటపడాలనుకున్నప్పుడు మనసు ఒక విచిత్రమైన నిర్ణయం తీసుకుంటుంది. అకస్మాత్తుగా నరాల వీక్‌నెస్ వచ్చినట్లుగా చేయి వణకడమో, గుండె పోటు వచ్చినట్లుగా విలవిలలాడడమో జరుగుతుంది. 'పరీక్ష రాయకపోతే మానె మా అబ్బాయి ఈ వ్యాధి నుంచి బయటపడితే అదే పదివేలు' అని తల్లిదండ్రులు కోరుకుంటారు. పరీక్ష రాయకుండా ఎస్కేప్ అవడం, బయటవారి నిందపడకుండా బయటపడడం జరుగుతుంది. ఈ రకంగా మనసు ప్రవర్తించే తీరునే హిస్టీరియా ఆఫ్ కన్‌వర్షన్ అంటారు. ఎదుటివారి సానుభూతి పొందడానికి, సమస్య నుంచి తప్పించుకోడానికి మనసు కొందరిలో అలా ప్రవర్తిస్తే, మరికొందరిలో పూనకం వచ్చినట్లు, దెయ్యం పట్టినట్లు ప్రవర్తించడం ఉంటుంది. వాస్తవానికి దేవతలు, దెయ్యాలు లేవు. అవి ఆవహించడమూ లేదు. అలా ఆవహించినట్లు ఎవరైన ప్రవర్తిస్తే అది కేవలం హిస్టీరియా వ్యాధి.

మామూలు వ్యక్తులు ఏదైనా సమస్య వచ్చినప్పుడు ధైర్యంగా ఎదుర్కొంటారు. హిస్టీరికల్ మనస్తత్వం ఉన్నవారు, మానసిక పరిపక్వత లేనివారు వాటిని ధైర్యంగా ఎదుర్కొనలేరు. మనసులో కలిగిన అసంతృప్తికి, బాధకి మనసుకు నచ్చచెప్పుకోలేరు. దానితో మనసు విలక్షణంగా తనలోని వ్యాధిని బహిర్గతం చేస్తుంది. అదే హిస్టీరియా వ్యాధి.

చికిత్స :

1. మనసుకి బాధ కలిగించే పరిస్థితుల నుంచి, పరిసరాల నుంచి వ్యక్తిని దూరం చేసి, అతనికి ఇష్టమైన వ్యక్తుల మధ్య, పరిసరాల మధ్య ఉంచాలి.
2. మానసికంగా తృప్తిని, హాయిని కలిగించాలి.
3. మనసుకి నచ్చే విధంగా నచ్చచెప్పుతూ సమస్యనుండి సంతృప్తికరమైన పరిష్కారం కనుగొనాలి.
4. సైకోథెరపి చేయాలి.
5. మానసికంగా ప్రశాంతత కలుగచేయడానికి యోగ గానీ, మెడిటేషన్ గానీ, హిప్నోథెరపి గానీ చేయాలి.
6. త్వరగా మనసుకి ప్రశాంతత కలిగించటానికి కాంపోజ్ 10 మి.గ్రా. గానీ, ఆల్‌జోలామ్ 1 మి.గ్రా. గానీ తడవకి ఒకటి చొప్పున రోజుకి 3 సార్లు వాడాలి.
7. దెయ్యం పట్టినట్లు, పూనకం పూనినట్లు వ్యవహరిస్తున్నప్పుడు కాంపోజ్ ఇంజక్షన్ 10 మి.గ్రా. నిదానంగా నరానికి ఇవ్వాలి. దాంతో మనసు శాంతించి మామూలవుతారు.
8. హిస్టీరియా ఉన్నవాళ్ళకి వాస్తవ పరిస్థితులని తట్టుకునే విధంగా మానసిక శిక్షణ ఇవ్వాలి.

□□□

## 10. మత్తు మందులకి అలవాటు

*కొందరు మద్యానికి, మత్తుబిళ్ళలకి, మాదకద్రవ్యాలకి బానిసలవుతారు. దీనికి కొంత మానసిక బలహీనత, పరిసరాలు, కొంత కారణం కాగా జెనిటిక్, బయోకెమికల్ ఫాక్టర్స్ మరికొంత కారణం.*

*వ్యసనాలకి బానిస అయిన వ్యక్తి అకస్మాత్తుగా వాటిని మానినప్పుడు కొన్ని శారీరక, మానసిక బాధలు కలుగుతాయి. అయినప్పటికీ తగిన జాగ్రత్తలు తీసుకుని మత్తు మందులు మాన్పించి, వ్యసనానికి చికిత్స చేయాలి.*

చికిత్స :

1. మత్తు మందులు మానగానే విత్‌డ్రావల్ సింప్టమ్స్ కలుగుతాయి. ముందు వాటికి చికిత్స చేయాలి. అవి ఎక్కువగా ఉన్నప్పుడు ఆసుపత్రిలో ఉంచాలి. విత్‌డ్రావల్ సింప్టమ్స్ తగ్గటానికి హాలోపెరిడాల్ 10-30 మి.గ్రా. **లేదా** డైజిపాం 10-20 మి.గ్రా. **లేదా** రోజు మొత్తంలో రెండు - మూడు మోతాదులుగా ఇంజక్షన్ రూపంలో **లేదా** టాబ్లెట్ రూపంలో ఇవ్వాలి. 5-6 రోజులలో విత్‌డ్రావల్ సింప్టమ్స్ కంట్రోల్ అవుతాయి.
2. మత్తు పదార్థాలకి అలవాటుపడ్డవారిలో పోషకాహార లోపం ఉంటుంది. దానిని

3. రకరకాల అనారోగ్య పరిస్థితులుంటాయి. వాటికి చికిత్స చేయాలి.
4. మద్యం అలవాటుని తప్పించడానికి డాక్టర్ పర్యవేక్షణలో డైసల్ఫిరామ్ 600-1000 మి.గ్రా. రోజుకి ఒక్కసారి చొప్పున ఇస్తూ ఆ తరువాత రోజుకి 125-250 మి.గ్రా. చొప్పున కొంతకాలం ఇవ్వాలి.
5. మత్తుమందులు అలవాటు అయినవారిలో మానసిక అనారోగ్యం కలుగుతుంది. దానికి కూడా మానసిక చికిత్స చేయాలి.

❑❑❑

# 11. చిన్నపిల్లలలో మానసిక వ్యాధులు

*చిన్నపిల్లలలో రకరకాల వింత ప్రవర్తనలు కనబడతాయి. వీటికి అనేక కారణాలు ఉన్నాయి.*

**కారణాలు :**

బుద్ధి మాంద్యం (మెంటల్ రిటార్డేషన్), స్పెసిఫిక్ డెవలప్‌మెంట్ డిజార్డర్స్, ఎటన్షన్ డిఫెక్ట్ డిజార్డర్స్, కాండక్ట్ డిజార్డర్స్, ఛైల్డ్‌హుడ్ సైకోసిస్, న్యూరోసిస్.

* బుద్ధిమాంద్యం : బుద్ధిమాంద్యం ఉన్నవాళ్ళలో శారీరక, మానసిక ఎదుగుదల సక్రమంగా ఉండదు. అందరితో సక్రమంగా కలవడం ఉండదు. చదువులో వెనకబడి ఉంటారు. ఎంత వయసు వచ్చినా పని నైపుణ్యం పెరగదు. తెలివితేటలు తక్కువగా ఉంటాయి.
* బుద్ధిమాంద్యం రావడానికి పుట్టుకతోనే క్రోమోజోమ్స్ అస్తవ్యస్తత ఉండడం. పుట్టుకతోనే మెదడు సక్రమంగా ఎదగకపోవడం, చిన్నతనంలోనే మెదడు

వ్యాధులు రావడం, విషజ్వరాలు రావడం, తలకి దెబ్బలు తగలడం, ఎండోక్రైన్ గ్లాండ్స్ సక్రమంగా పనిచేయకపోవడం కొన్ని ప్రధాన కారణాలు. బుద్ధిమాంద్యం ఉన్నవారికి ప్రధానంగా పనుల్లోనూ, చదువులోనూ ప్రత్యేక శిక్షణ ఇవ్వాలి. వాళ్ళ తల్లిదండ్రులకి పిల్లల పెంపకం విషయంలో తగిన అవగాహన పెంపొందించాలి. బుద్ధి మాంద్యం విషయంలో తగిన మందులు లేవు. అయినా పైరాసిటం రోజుకి 40 మి.గ్రా. చొప్పున కేజి బాడీ వెయిట్‌కి రోజులో రెండు మోతాదుల చొప్పున ఇవ్వాలి.

* స్పెసిఫిక్ డెవలప్‌మెంట్ డిజార్డర్స్ : బుద్ధి మాంద్యం ఉన్న పిల్లలు అన్నింటిలోనూ తెలివితేటలు తక్కువతో ఉండగా, స్పెసిఫిక్ డెవలప్‌మెంట్ డిజార్డర్స్ ఉన్న పిల్లలు ప్రత్యేకంగా ఏదో ఒక విషయంలోనే వెనుకబడి ఉంటారు. లెక్కల్లోగానీ, సైన్స్‌లోగానీ లేదా సక్రమంగా మాట్లాడటంలోగానీ లోపం కలిగి ఉంటారు. ప్రత్యేకంగా ఒక విషయంలో లోపం ఉన్న పిల్లల్ని గుర్తించి వారికి తగిన శిక్షణ ఇస్తే మానసికంగా మామూలవుతారు. ఆ రంగంలో నైపుణ్యం పెంచుకుంటారు.
* ఎటన్షన్ డిఫెక్ట్ డిజార్డర్స్: కొందరు పిల్లలకి చిన్నతనంలోనే ఎపిలెప్సి (మూర్ఛవ్యాధి), మెదడు వ్యాధులు వస్తాయి. దానివల్ల వారి ప్రవర్తనలో, తెలివితేటల్లో మార్పు వస్తుంది. వారికి కలిగిన వ్యాధి విషయంలో తగిన జాగ్రత్త తీసుకోనట్లయితే పిల్లల శారీరక, మానసిక, సామాజిక విషయాల్లో విలక్షణత కలుగుతుంది. ఇలాంటి విలక్షణత కలిగిన పిల్లల్లో అతిగా గోల చేయడం, స్థిరత్వం లేకపోవడం, గోలగోలగా వ్యవహరించడం, కనబడిందల్లా విరగ్గొట్టడం ఉంటుంది. మొదట్లోనే పట్టించుకోకపోవడంవల్ల పిల్లలు అలా తయారవుతారు. స్థిరత్వం లేకపోవడం, అతిగా ప్రవర్తించడం ఉన్న పిల్లలకి హాలోపెరిడాల్ 0.25-1.5 మి.గ్రా. బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున రోజూ 3 సార్లు వేయాలి. మూర్ఛ జబ్బు ఇంకా ఉన్నట్లయితే కొన్ని సంవత్సరాలపాటు చికిత్స చేయాలి.
* కాండక్ట్ డిజార్డర్స్ : కొందరు పిల్లల ప్రవర్తన "యాంటిసోషల్"గా ఉంటుంది. సాధారణంగా తల్లిదండ్రులు సరిగా పట్టించుకోని పిల్లలు, ఇళ్ళనుంచి పారిపోయిన పిల్లలు, సంఘ విద్రోహ శక్తులుగా మారతారు. వారి ప్రవర్తన ప్రమాదకరంగా ఉంటుంది. ఎపిలెప్సి, ఇతర మెదడు వ్యాధులు వచ్చిన పిల్లలు కొందరిలో కూడా యాంటిసోషల్ ప్రవర్తన కలగవచ్చు. వీరు చాలా ఆవేశంగా, ఉద్రేకంగా

మారవచ్చు. సామాజిక, నైతిక ప్రవర్తన (కాండక్ట్ డిజార్డర్) లోపం ఉన్న పిల్లలకి బిహేవియర్ థెరపి తోడ్పడుతుంది. అలాగే వారి తల్లిదండ్రులకి కూడా పిల్లల పెంపక విషయంలో తగిన శిక్షణ ఇవ్వాలి.

* చైల్డ్‌హుడ్ సైకోసిస్ : పెద్దవాళ్ళలోలానే చిన్నపిల్లల్లో కూడా మానసిక వ్యాధులు వస్తాయి. వారి ఆలోచనల్లో, చేతల్లో చాలా వైపరీత్యం కనబడుతుంది. భ్రమలు, భ్రాంతులు కలుగుతాయి. ముఖ్యంగా వంశంలో ఎవరికైనా సైకోసిస్ ఉన్నట్లయితే బిడ్డలో 2 1/2 సంవత్సరాలలోపే "పిచ్చి" రావడానికి అవకాశం ఉంది. పెద్దవాళ్ళకి సైకోసిస్‌కి ఎటువంటి చికిత్స చేస్తామో, పిల్లలకు కూడా అటువంటి చికిత్సే చేయాలి.

* న్యూరోసిస్ : పెద్దవాళ్ళలోలానే పిల్లల్లో కూడా న్యూరోటిక్ డిజార్డర్స్ కనబడతాయి. యాంగ్జైటి, ఫోబియాస్, హిస్టీరియా, అబ్సస్సీవ్ కంపల్సీవ్ డిజార్డర్స్, డిప్రస్సీవ్ డిజార్డర్స్ కనబడతాయి. స్కూలుకి వెళ్ళాలంటే భయం, రాత్రిపూట పక్కలోనే మూత్రం పోయటం, నిద్రలో లేచి నడిచి వెళ్ళిపోవటం. ఇవన్నీ కూడా చిన్న పిల్లల్లో వచ్చే న్యూరోసిస్ కోవకి చెందినవే. న్యూరోసిస్‌కి పెద్దవాళ్ళలో లాగానే పిల్లలకి కూడా చికిత్సతో తేడా వస్తుంది.

❑❑❑

## నిత్యజీవితంలో జెనెటిక్స్

### ఉదయం దినపత్రిక సమీక్షనుండి

వైద్యశాస్త్ర రచనలు చేయడంలో తెలుగులో సమరంకున్న పేరు మరొకరికి లేదు. అందుకు ఆ రంగంలో ఆయన చేసిన విస్తారమైన కృషితప్ప మరోటి కారణం కాదు. 'నిత్య జీవితంలో జెనెటిక్స్' అనే ఈ పుస్తకం సమరం కృషికి మరో తార్కాణం. వంశపారంపర్యంగా వచ్చే వ్యాధులేమిటో, వాటి నుంచి ఎలా తప్పించుకోవచ్చో జన్యుశాస్త్రం తెలియచేస్తుంది. ఉదాహరణకు తండ్రికి పార్శ్వనొప్పి వుంటే పిల్లలకు కూడా వస్తుందా? పచ్చకామెర్లు వంశపారంపర్యమా? ఆడా, మగా తేడా ఎలా ఏర్పడుతోంది? పొట్టి, పొడవు లక్షణాలు ఎలా వస్తాయి? చదువు సరిగా రాకపోవడం కూడా పెద్దల నుంచి సంక్రమించే దుర్లక్షణమా? బట్టతల మగవాళ్లలోనే ఎక్కువ ఎందుకని? ఇవన్నీ చాలామందికి సమాధానం లేని ప్రశ్నలు. సమరం వీటన్నింటికీ శాస్త్రబద్ధంగా వివరమైన సమాధానాలు చెప్పారు.

# 15. వ్యాధులు - పథ్యాలు

## 1. రక్తపోటు - ఆహారం

రక్తపోటు ఉన్నవారు ఆహారంలో ఉప్పు చాలా తక్కువ తీసుకోవాలి. ఉప్పు ఎక్కువ తింటే దుష్ఫలితాలు కలుగుతాయి. సాధారణంగా మనం రోజూ 10-15 గ్రా. ఉప్పు ఆహారంలో తీసుకుంటాం. రక్తపోటు ఉన్నవారు 2-4 గ్రా. మించి ఉప్పు తీసుకోకూడదు. కూరల్లో, పెరుగు అన్నంలో, పచ్చళ్ళలో మనం ఉప్పు వేసుకోకపోయినా కొన్ని ఉప్పు పదార్థాలు ఉంటాయి. వాటిని మనం తీసేయలేం కాబట్టి రక్తపోటు ఉన్నవారు, తాము తినే కూరల్లో కొలతగా 2-4 గ్రా. వాడటం మంచిది.

రక్తపోటు ఉన్నవారు నెయ్యి, వెన్న, మీగడ, డాల్డా, మొదలైన కొవ్వు పదార్థాలని వాడకూడదు. కొవ్వు ఉండే మాంసం కూడా తినకూడదు. రక్తంలో ఉండవలసిన దానికంటే ఎక్కువగా కొవ్వు పదార్థాలు చేరితే రక్తనాళాలు దెబ్బతింటాయి. దానివల్ల రక్తపోటు తగ్గదు.

మాంసాహారం తీసుకునే వారిలో ఆహారం ద్వారా కొలెస్ట్రాల్ ఎక్కువగా చేరుతుంది. మెదడు, కాలేయం, మూత్రపిండాలలోనూ, నెయ్యి, వెన్న, మీగడ, జున్నులోను కొలెస్ట్రాల్ ఎక్కువ ఉంటుంది. అందుచేత రక్తపోటు ఉన్నవారు వాటిని తినకూడదు.

ఆకుకూరలు, కాయగూరల్లో కొలెస్ట్రాల్ ఉండదు. చేపల్లో కొలెస్ట్రాల్ చాలా తక్కువ ఉంటుంది. అందుచేత రక్తపోటు ఉన్నవారు ఆకుకూరలు, కాయగూరలు ఎక్కువ భుజించాలి.

రక్తపోటు ఉన్నవారు ఆహారంలో పథ్యం చేయడమే కాకుండా రోజూ కనీసం 3-4 కిలోమీటర్లు ఏకబిగిన నడవాలి. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. చికాకు, కోపం, కంగారు, ఆందోళన, మానసిక వత్తిడి పనికిరావు. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి.

రక్తపోటు ఉన్నవారికి మధుమేహం ఉన్నట్లయితే పూర్తిగా అదుపులో ఉంచుకోవాలి. లేకపోతే కాంప్లికేషన్స్ వస్తాయి.

❑❑❑

## 2. మెదడు వ్యాధులు - ఆహారం

మెదడు వ్యాధులు ఎక్కువగా రక్తపోటు, మధుమేహం వల్ల వస్తాయి. ఈ వ్యాధుల వల్ల రక్తనాళాలు గట్టిపడటం లేదా మూసుకుపోవడం జరుగుతుంది. దాని వల్ల మెదడుకి రక్త సరఫరా సక్రమంగా ఉండదు. వీలయినంత వరకు పక్షవాతం , సెరిబ్రల్ హెమరేజి

రాకుండా ఉండాలంటే రక్తపోటుని, మధుమేహాన్ని అదుపులో ఉంచుకోవాలి. రక్తనాళాలని ఆరోగ్యకరంగా ఉంచుకోవాలి.

రక్తనాళాలు ఆరోగ్యకరంగా ఉండటానికి ఆహారంలో కొవ్వు ఉండే పదార్థాలు చాలా తక్కువలో తీసుకోవాలి. వెన్న, నెయ్యి, మీగడ, కొవ్వు ఉండే మాంస పదార్థాలు తక్కువలో తీసుకోవాలి. పక్షవాతం మొదలైన వ్యాధులు వచ్చినప్పుడు వాటిని పూర్తిగా మానివేయాలి. కోడి మాంసం, చేపలు తీసుకోవచ్చు. కొవ్వు ఉండే మాంసం తీసుకోకూడదు.

ఆకుకూరలు, కాయగూరలు ఎక్కువగా తీసుకోవాలి. ధూమపానం పనికిరాదు. మద్యం మానివేయాలి. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. రోజూ వ్యాయామం చేయాలి.

❑❑❑

# 3. కాలేయం వ్యాధులు - ఆహారం

## పచ్చ కామెర్లు:

వ్యాధి మొదటి దశలో వికారం, వాంతులు ఉండి ఆహారం ఏమీ తీసుకోలేకపోవచ్చు. ఆ సమయంలో కేవలం కొబ్బరినీళ్ళు, గ్లూకోజ్, పళ్ళరసం తీసుకోవాలి. అవసరాన్ని బట్టి నరానికి గ్లూకోజ్ ఎక్కించాలి. సాధారణంగా పచ్చకామెర్లు మొదలైన వారం-పది రోజులలో వికారం, వాంతులు తగ్గిపోతాయి. ఆకలి, అరుగుదల మామూలుగా వచ్చేస్తాయి. కళ్ళు బాగా పచ్చగా ఉన్నప్పటికి కారం, మసాలాలు బాగా తగ్గించి అన్నిరకాల ఆహార పదార్థాలు పెట్టవచ్చు. కొందరిలో కొవ్వు పదార్థాలకి వికారం వస్తుంది. అటువంటి వారు కొవ్వు పదార్థాలని బాగా తగ్గించి తీసుకోవాలి.

పచ్చ కామెర్లు వస్తే కళ్ళు పూర్తిగా తెల్లబడేవరకు కేవలం మజ్జిగ అన్నమే తినాలని కొందరు అనుకుంటారు. అది తప్పు. కేవలం మజ్జిగ అన్నం తింటే నష్టం కూడా జరుగుతుంది. ఆకలి, అరుగుదల కనబడిన తరువాత కూరగాయలు, పప్పు, మాంసం, మొదలైనవి తీసుకోవచ్చు. పచ్చకామెర్ల నుంచి త్వరగా కోలుకోవడానికి మాంసకృత్తుల అవసరం కూడా ఎక్కువ ఉంటుంది.

## హెపాటిక్ కోమా:

కొన్ని రకాల కామెర్లలోను, లివర్ వ్యాధుల్లోనూ రోగిలో మగత రావడమో, కోమా రావడమో జరుగుతుంది. లివర్ వల్ల కోమా వస్తున్నప్పుడు ఆహారంలో ప్రోటీన్లు (మాంసకృత్తులు) చాలా తక్కువలో ఇవ్వాలి. రోగి మగతలోకి వెళుతున్నట్లు తెలుసుకోగానే పప్పులు, మాంసం మానివేయాలి. గ్లూకోజ్, పళ్ళరసం ఎక్కువ ఇవ్వాలి.

## సిర్రోసిస్ లివర్:

సిర్రోసిస్ లివర్ ఉన్నప్పుడు పౌష్టికాహారం ఎక్కువ ఇవ్వాలి. రోజుకి కనీసం 3,000 కేలరీలు కలిగిన ఆహారం ఇవ్వాలి. అందులో కనీసం 120గ్రా. మాంసకృత్తులు, 400గ్రా. పిండి పదార్థం, 100గ్రా. కొవ్వు పదార్థం ఉండాలి. పాలు, కోడిగ్రుడ్లు, మాంసం, పప్పులు, ఆకు కూరలు, పళ్ళు రోజూ తీసుకోవాలి. కూరల్లో ఉప్పు తక్కువ వాడాలి.

ఆహారంతో పాటు బి-కాంప్లెక్సు, విటమిన్ సి. బిళ్ళలు రోజూ తీసుకోవాలి.బి-12 ఇంజక్షన్ తరచు తీసుకోవాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆల్కహాల్ (మద్యం) తీసుకోకూడదు. మద్యం తీసుకుంటే లివర్ కోలుకునే బదులు మరింత దెబ్బ తింటుంది.

## పసరుతిత్తి వాపు:

కొందరిలో గాల్‌బ్లాడర్ వాస్తుంది. గాల్‌బ్లాడర్ ఇన్‌ఫెక్షన్ ఉన్నవాళ్లలో నెయ్యి, నూనె, కొబ్బరితో చేసినవి ఏవి తిన్నా వికారంగా ఉంటుంది. వేపుడు కూరలు తిన్నా వికారంగా ఉంటుంది. అందుకని పసరుతిత్తి వాపు (గాల్ బ్లాడర్ ఇన్‌ఫెక్షన్) ఉన్నవాళ్ళు కొవ్వు పదార్థం ఉండే ఆహారం మానివేయాలి. కాయగూరలు, పప్పులు తీసుకోవాలి. మజ్జిగ, పెరుగు తీసుకోవాలి. కోడిగుడ్లు తీసుకోవచ్చు.

## ఆల్కాహోలిక్ లివర్:

మద్యం తీసుకునేవారిలో లివర్ (కాలేయం) దెబ్బతింటుంది. ఆకలి సరిగా ఉండదు. వికారంగా ఉంటుంది. వాంతులు కూడా అవుతాయి. ఇటువంటి వారు పోషకాహార విలువలు ఉండే ఆహారం తీసుకోవాలి. పళ్ళు, పాలు, పప్పులు, కోడిగుడ్లు, మాంసం తీసుకోవాలి. ఆకుకూరలు తినాలి. మల్టీవిటమిన్లు వాడాలి. అన్నింటికి మించి ప్రోటీన్లు ఉండే ఆహారం ప్రధానం.

## కడుపుకి నీరు:

కడుపుకి నీరు చేరడాన్నే ఎసైటిస్ అంటారు. కడుపుకి నీరు చేరిన వారు ప్రోటీన్లతో కూడిన ఆహారం, విటమిన్లు ఎక్కువ తీసుకోవాలి. పళ్ళు, పాలు, పళ్ళ రసాలు ఎక్కువ వాడాలి.

## ఫాటీ లివర్:

కొన్ని వ్యాధులు వచ్చినప్పుడు పోషకాహారం లోపం కలిగినప్పుడు లివర్‌లో కొవ్వు పదార్థం విపరీతంగా పేరుకుపోతుంది. దాని వల్ల ఆకలి, అరుగుదల ఉండదు. మనిషి నీరసించిపోతాడు. ఫాటి లివర్ ఉన్నవారికి మాంసకృత్తులు ఎక్కువ ఉండే ఆహారం, పప్పులు, చేపలు, గుడ్లు పెట్టాలి. కొవ్వు పదార్థం ఉన్న ఆహారం చాలా తక్కువ పెట్టాలి.

**పసరు తిత్తిలో రాళ్ళు:**

పసరు తిత్తిలో రాళ్ళు (గాల్ బ్లాడర్ స్టోన్స్) ఉన్నప్పుడు వెన్న, నెయ్యి, మీగడ, కేకులు, ఇతర కొవ్వు పదార్థాలు తినకూడదు. ఆకుకూరలు, కాయగూరలు, పప్పులు ఎక్కువగా తీసుకోవాలి.

❑❑❑

# 4. జీర్ణకోశం వ్యాధులు - ఆహారం

**కడుపులో పుండు (పెప్టిక్ అల్సర్) :**

జీర్ణకోశంలో పుండు ఉన్నప్పుడు పులుపు, కారం, మసాలాలు బాగా తగ్గించాలి. కాఫీ, టీలు మానివేయాలి. పాలు త్రాగాలి. టైమ్‌కి భోంచేయాలి. భోజనానికి, భోజనానికి మధ్య ఎక్కువ వ్యవధి ఉండకూడదు. 1-2 గంటలకొకసారి బిస్కెట్లు, పాలు తీసుకుంటూ ఉండాలి. పుల్లగా ఉండే పళ్ళు, పళ్ళ రసాలు తీసుకోకూడదు. మద్యం సేవించకూడదు. సిగెరెట్లు, చుట్టలు, బీడీలు తాగకూడదు. మానసికంగా ప్రశాంతంగా ఉండాలి. ఆకుకూరలు, కాయగూరలు, పాలు, గుడ్లు, పప్పులు ఎక్కువ తీసుకోవాలి.

**కడుపులో పాములు :**

కడుపులో పాములు ఉన్నవారిలో రక్తహీనత ఎక్కువగా ఉంటుంది. మాంసకృత్తుల లోపం ఏర్పడుతుంది. రక్తహీనత, మాంసకృత్తుల లోపంవల్ల ముఖం ఉబ్బరం, పాలిపోవడం, కాళ్ళకు, పొట్టకు నీరు చేరడం మొదలైనవి వస్తాయి. ఆహారంలో ఐరన్, ప్రోటీన్లు ఎక్కువ ఉండేవి తీసుకోవాలి. అన్నిరకాల ఆకుకూరలు, పప్పులు తీసుకోవాలి. కోడిగుడ్లు, మాంసం తినాలి. కడుపులో పురుగులు పడిపోవటానికి మందులు వాడాలి.

**పైల్స్ (మొలలు) :**

మొలలు ఉన్నవాళ్ళు ఆకుకూరలు ఎక్కువ తినాలి. మొలలు పెద్దగా ఉంటే ఆపరేషన్ చేయించుకోవాలి.

**నోటిపూత :**

బి-కాంప్లెక్సు, ఐరన్ లోపం వల్ల నోటిపూత ఎక్కువగా వస్తుంది. ఆకుకూరలు రోజూ తీసుకోవాలి. పప్పులు తినాలి. అవసరం బట్టి బి-కాంప్లెక్సు, ఐరన్ బిళ్ళలు వాడాలి.

**తరచు విరోచనాలు :**

తరచు విరోచనాలు అవడానికి గల మూలకారణాన్ని గుర్తించి చికిత్స పొందాలి. విరోచనాలు అవుతున్నప్పుడు ఆకుకూరలు తినకూడదు. పప్పులు, కాయగూరలు తీసుకోవాలి.

❑❑❑

# 5. గుండె జబ్బులు - ఆహారం

## యాంజైనా పెక్టోరిస్ :

యాంజైనా పెక్టోరిస్ ఉన్నవాళ్ళకి అలసట చెందినా, ఆవేశం చెందినా ఛాతిలో నొప్పి వస్తూంటుంది. సరైన జాగ్రత్తలు తీసుకోకపోతే హార్ట్ ఎటాక్‌కి దారి తీస్తుంది. యాంజైనా పెక్టోరిస్ ఉన్నవాళ్ళకి మందులు ఎంత ముఖ్యమో ఆహారంలో పథ్యం కూడా అంత ముఖ్యం.

ఆహారంలో నెయ్యి, డాల్డా, వెన్న, మీగడ, ఇతర కొవ్వు పదార్థాలు మానివేయాలి. వేపుడు కూరలు తినకూడదు.కేక్‌లు, ఐస్‌క్రీమ్‌లు, కోడిగుడ్డులో పచ్చసొన తీసుకోకూడదు. ఆకుకూరలు, కాయగూరలు, బఠానీలు, పళ్ళు. చేపలు, కోడిమాంసం వాడవచ్చు. మీగడ, పెరుగు పనికిరాదు. వెన్న తీసిన మజ్జిగ వాడవచ్చు. అన్నం తగ్గించాలి. దుంప కూరలు తక్కువ తినాలి. జామ్, జెల్లి, తేనె తక్కువ తీసుకోవాలి. కూరలు వండడానికి పొద్దు తిరుగుడు పువ్వు నూనె, పత్తిగింజలనూనె వాడాలి. కొలెస్ట్రాల్ ఉండే పదార్థాలు తక్కువ తీసుకోవాలి లేదా మానివేయాలి. కోడిగుడ్డు పచ్చసొన, వెన్న, మీగడ, మాంసం లివర్, మెదడు, వాటిలో కొలెస్ట్రాల్ ఎక్కువ ఉంటుంది. యాంజైనా ఉన్నవారు మితంగా భుజించాలి. పొగ త్రాగకూడదు. మద్యం తీసుకునే అలవాటు ఉంటే రెండు చిన్న పెగ్గులకి మించి తీసుకోకూడదు. టీ, కాఫీలు రోజు మొత్తం మీద 1, 2 సార్లు తీసుకోవచ్చు. రోజూ వ్యాయామం చేయలి.

## గుండెపోటు:

గుండెపోటు వచ్చినవారు కూడా పైన వివరించిన విధంగానే ఆహారం తీసుకోవాలి. గుండెపోటు రావడానికి మధుమేహం, రక్తపోటు కారణం కావచ్చు. వాటి వల్ల గుండెపోటు వచ్చినవారు ఆహారంలో మరింత జాగ్రత్తలు తీసుకోవాలి. మధుమేహం ఉన్నవారు పిండి పదార్థం తగ్గించాలి. కేలరీలు తక్కువ ఉండే ఆహారం తీసుకోవాలి. ఆకుకూరలు, కాయగూరలు ఎక్కువ వాడాలి. రక్తపోటు ఉన్నవారు ఆహారంలో ఉప్పు తగ్గించాలి.

గుండెపోటు రావడానికి స్థూలకాయం కూడా ఒక కారణం. స్థూలకాయం ఉన్నవారు పిండి పదార్థాలు, కొవ్వు పదార్థాలు బాగా తగ్గించి తీసుకోవాలి. కాయగూరలు, ఆకు కూరలు ఎక్కువ వాడాలి.

స్థూలకాయం తగ్గడానికి తక్కువ ఆహారం తీసుకోవడం ఎంత ముఖ్యమో, రోజూ వ్యాయామం చేయడం కూడా అంత ముఖ్యం.

ధూమపానం పనికిరాదు. మానసికంగా ప్రశాంతంగా ఉండాలి. కొలెస్ట్రాల్ ఉండే పదార్థాలకి దూరంగా ఉండాలి.

**గుండె పెరగడం:**

గుండె పెరిగిన వారు (హార్ట్ ఫెయిల్యూర్) కారణం గుర్తించి తగిన చికిత్స పొందాలి. ఆహారం తక్కువ తీసుకోవాలి. ఆహారంలో ఉప్పు చాలా తక్కువ వాడాలి.

❑❑❑

## 6. ఉబ్బసం - ఆహారం

*కొందరికి కొన్ని ఆహార పదార్థాలు సరిపడవు. ముఖ్యంగా ఉబ్బసం ఉన్నవాళ్ళలో సరిపడని ఆహార పదార్థం తీసుకున్నప్పుడు ఉబ్బసం తలెత్తుతుంది. ప్రత్యేకంగా దేనికైనా ఎలర్జీ ఉంటే దానిని తీసుకోకూడదు.*

ఉబ్బసం ఉన్నప్పుడు కడుపునిండా తినకూడదు. కడుపునిండా తింటే ఆయాసం ఎక్కువవుతుంది.

ఉబ్బసం రోగి ధూమపానం పూర్తిగా మానివేయాలి. ఆల్కహాల్ కూడా పనికిరాదు.

ఉబ్బసం ఉన్నవారు నీరు ఎక్కువ త్రాగాలి. ఉబ్బసం ఎటాక్ వచ్చినప్పుడు మరింత ఎక్కువ నీరు త్రాగాలి. స్వీట్స్ మానేయడం మంచిది. మసాలా దినుసులు కూడా తక్కువలో వాడాలి.

చిన్నపిల్లలకి ఉబ్బసం ఉంటే ఎదుగుదల సరిగా ఉండదు. అందుకని వారికి పోషకాహారం ఇవ్వడం విషయంలో తల్లిదండ్రులు జాగ్రత్త తీసుకోవాలి. ఉబ్బసం ఉన్న రోగి వ్యాయామం చేయడం అవసరం.

❑❑❑

## 7. పైల్స్, ఫిస్టులా, ఫిషర్ - ఆహారం

*పైల్సు (మొలలు), ఫిషర్ ఉన్నవారు ఆహారంలో ఆకుకూరలు ఎక్కువ తినాలి. పళ్ళు తీసుకోవాలి. విరోచనం సాఫీగా అయ్యేటట్లు చూసుకోవాలి. మలం గట్టిగా అయినట్లయితే బ్లీడింగ్ అవడానికి అవకాశం ఉంది.*

మంచినీళ్ళు ఎక్కువ త్రాగాలి.

ధూమపానం పనికిరాదు.

మలబద్ధకం లేకుండా చూసుకోవాలి.

❑❑❑

# 8 . కీళ్ళ నొప్పులు - ఆహారం

కీళ్ళనొప్పులు రావడానికి అనేక కారణాలున్నాయి. పెద్దవాళ్ళల్లో కీళ్ళు అరిగిపోవడం వల్ల ఆస్టియో ఆర్థ్రైటిస్ అనే కీళ్ళ నొప్పులు ఎక్కువ వస్తాయి.

స్థూలకాయం ఉన్నవాళ్ళల్లో కీళ్ళ నొప్పులు రావడం ఎక్కువ అందుకని ఒళ్ళు పెరగకుండా చూసుకోవాలి. ఒళ్ళు ఉన్నవాళ్ళు కొవ్వు పదార్థాలు మానివేయాలి. ఆహారం తక్కువ తీసుకోవాలి. కేలరీలు తక్కువ ఉండే ఆహారం తీసుకోవాలి. ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు, ఫలాలు తీసుకోవాలి.

ఒళ్ళు తగ్గడానికి తగిన వ్యాయామం చేయాలి. ఉండవలసిన బరువు కంటే మించి ఉండకూడదు. బరువు ఎక్కువ ఉంటే కీళ్ళ నొప్పులు తగ్గడం కష్టం.

❑❑❑

# 9. గౌటు

గౌటు ఉన్నవారు ఆహారంలో జాగ్రత్తగా ఉండాలి. ఆహారంలో ప్యూరిన్స్ ఎక్కువ ఉండేవి తీసుకోకూడదు. కాలేయం, మూత్రపిండాలు, మెదడు, గుండె, స్వీట్ బ్రెడ్స్, మాంసం, ఫిష్ రోస్ట్ వీటిల్లో ప్యూరిన్స్ ఎక్కువగా ఉంటాయి. వీటిని తినడం మానివేయాలి.

చేపలు, సీ ఫుడ్స్, లెంటిల్స్, ఈస్ట్, చిక్కుళ్ళు, బఠానీలు, కాలీఫ్లవర్, కుక్క గొడుగులు వీటిలో ప్యూరిన్స్ ఒక మోస్తరుగా ఉంటాయి. వాటిని తగ్గించి తీసుకోవాలి.

కాయగూరలు, ఆకుకూరలు, పళ్ళు, పాలు, కాఫీ, టీలు తీసుకోవచ్చు. మద్యం మానివేయాలి.

❑❑❑

# 10. పక్షవాతం - ఆహారం

పక్షవాతం రావడానికి అనేక కారణాలు ఉన్నాయి. ముఖ్యంగా రక్తనాళాలు గట్టిపడడం, రక్తపోటు, మధుమేహం, కొలెస్ట్రాల్ ఎక్కువ ఉండడం కారణం.

కొలెస్ట్రాల్ ఉన్నవారు ఆహారంలో కొవ్వు పదార్థాలు తినకూడదు. కొలెస్ట్రాల్ ఎక్కువ ఉండే పదార్థాలు మానివేయాలి. రోజూ వ్యాయామం చేయాలి.

మధుమేహం ఉన్నవారు ఆహారంలో దుంపకూరలు, పళ్ళు, తీపి పదార్థాలు మానివేయాలి.

ఆకుకూరలు, కాయగూరలు ఎక్కువ తినాలి. వేపుడు కూరలు తినకూడదు. కోడిగుడ్లు, కోడిమాంసం, చేపలు తినొచ్చు. కొవ్వు ఉండే మాంసం తినకూడదు.

పక్షవాతం వచ్చినవారు రోజూ వ్యాయామం గానీ, ఫిజియోథెరపి గానీ చేయాలి

నరాల తిమ్మిర్లు, మంటలు చాలావరకు బి-కాంప్లెక్స్ లోపం వల్ల వస్తాయి. కండరాల బలహీనతకి కూడా విటమిన్లు, ఖనిజ లవణాల లోపం కారణం. అందుకని తిమ్మిర్లు, మంటలు, నరాల వ్యాధులు ఉన్నవారు ఆకుకూరలు, కాయగూరలు, పళ్ళు ఎక్కువగా తీసుకోవాలి. మధుమేహం ఉన్నవాళ్ళు పళ్ళు తినకూడదు.

❑❑❑

# 11. కేన్సర్ - ఆహారం

కారం, మసాలాలు తగ్గించి తీసుకోవాలి.ఆకుకూరలు, కాయగూరలు, పళ్ళు ఎక్కువ తీసుకోవాలి. పీచు పదార్థం కేన్సర్ నివారణలో ఎక్కువ తోడ్పడుతుంది. ఆకుకూరలు, కాయగూరల్లో పీచు పదార్థం ఎక్కువగా ఉంటుంది.

మద్యం సేవించకూడదు.రంగులు వేసిన తినుబండారాలు ఎక్కువ తినకూడదు. పోషకాహారం తీసుకోవాలి.

❑❑❑

# 12. చర్మవ్యాధులు - ఆహారం

*చర్మ వ్యాధుల విషయంలో అనేక అపోహలు ఉన్నాయి. చాలా రకాల ఆహార పదార్థాలు తినకూడదు అనుకుంటారు. పథ్యం చేయకపోతే చర్మవ్యాధి తగ్గదు అనుకుంటారు. గోంగూర, వంకాయ, ములక్కాడ, కోడిగుడ్లు, మాంసం, చేపలు - ఇలా ఎన్నో ఆహార పదార్థాలు తినకూడదు అనుకుంటారు. అవన్నీ మూఢ నమ్మకాలే.*

చర్మ వ్యాధులు ఉన్నవారు చక్కని పోషకాహారం తీసుకోవాలి. పళ్ళు, పాలు, కోడిగుడ్లు, మాంసం, చేపలు, ఆకుకూరలు, కాయగూరలు అన్నీ తినాలి. ముఖ్యంగా మాంసకృత్తులు ఉండే ఆహారం తీసుకోవాలి. ఆకుకూరలు, కాయగూరలు చర్మవ్యాధుల నివారణలో ముఖ్యపాత్ర వహిస్తాయి. అందుకని వీటిని మానకూడదు.

మొటిమలు ఉన్నవాళ్ళు, సెబోరిక్ డెర్మటైటిస్ ఉన్నవారు ఆహారంలో కొవ్వు పదార్థం తగ్గించి తీసుకోవాలి. ఆకుకూరలు, కాయగూరలు, పప్పులు, పళ్ళు ఎక్కువ తీసుకోవాలి.

ఎక్జిమా ఉన్నవారు ఉప్పు తక్కువగా వాడాలి.

సొరియాసిస్, సైకోజెనిక్ చర్మవ్యాధులు ఉన్నవారు అన్నీ తినొచ్చు. మానసికంగా ప్రశాంతంగా ఉండాలి.

చర్మ రక్షణ కొరకు చక్కగా గాలి ఆడే దుస్తులు వాడాలి.

పళ్ళు, పళ్ళరసాలు, పాలు తీసుకోవాలి.

ఎండలో ఎక్కువ తిరగకూడదు.

❑❑❑

# 16. అనారోగ్యం - తీసుకోవలసిన జాగ్రత్తలు

అనారోగ్యం కలిగిన వ్యక్తికి పూర్తిగా విశ్రాంతి కలిగించాలి. సుఖంగా ఉండేచోట పడుకోబెట్టాలి. ఎండాకాలం అయితే చల్లగానూ, చలికాలం అయితే వెచ్చగానూ ఉండే స్థలంలో ఉంచాలి. గోల, గందరగోళం లేనిచోట పడుకోబెట్టాలి. రోగి ప్రక్కన చేరి ఎక్కువ మాట్లాడడం, మాట్లాడించడం చేయకూడదు.

జ్వరం ఉన్నా, విరేచనాలు - వాంతులు అవుతున్నా రోగికి త్రాగడానికి నీళ్ళు, పళ్ళరసాలు, కొబ్బరి నీళ్ళు, గ్లూకోజ్ ఎక్కువ ఇవ్వాలి.

రోగి పడుకున్న పరుపుని శుభ్రంగా ఉంచాలి. ఏ పూటకా పూట శుభ్రంగా ఉతికిన పక్క దుప్పట్లు వేయాలి. రోగి ఉన్న గదిని ఫినాయిల్‌తో గానీ, డెట్టాల్‌తోగానీ తుడవాలి. రోగి వాంతి చేసుకున్నా, తుమ్మినా వెంటనే క్లీన్ చేయాలి. రోగి శరీరాన్ని రోజుకి 2, 3 సార్లు గోరువెచ్చని నీటితో తుడిచి ఒళ్ళంతా నైసిల్ పౌడరు రాయాలి. నోరుని డెట్టాల్ నీళ్ళతో పుక్కిలించాలి. రోగిని అన్నివిధాలా శుభ్రంగా ఉంచాలి. బట్టలు ఎప్పటికప్పుడు శుభ్రంగా ఉతికి ఆరవేసినవి వేయాలి.

రోగికి ఆహారం ఇచ్చేటప్పుడు పోషక విలువలు కలిగిన ఆహారం ఇవ్వాలి. పండ్ల రసాలు, పళ్ళు తగినన్ని ఇవ్వాలి.

రోగి ఆరోగ్యం విషయంలో ఎటువంటి మార్పు కనబడినా
వెంటనే డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్ళాలి.

❑❑❑

- ❖ చక్కని ఆరోగ్యానికి పచ్చని ఆకుకూరలు అవసరం
- ❖ త్రాగే ప్రతీ ఒక్క సిగరెట్టు 5 నిమిషాల జీవిత కాలాన్ని హరిస్తుంది.
- ❖ ఆరోగ్యానికి వ్యాయామం అవసరం
- ❖ మల్లెపూవులాంటి తెల్లని బియ్యంకన్న దంపుడు బియ్య మిన్న
- ❖ తాయెత్తులు, వీభూది వైద్యాలు అశాస్త్రీయ వైద్యాలు

# 17. రోగి - ప్రమాద చిహ్నాలు

1. శరీరంలో ఏ భాగంలో నుంచైనా రక్తస్రావం జరగడం.
2. దగ్గులో రక్తం, ముక్కు వెంట రక్తం కారడం.
3. పెదవులు, చేతివేళ్ళు సిరా రంగుగా మారడం.
4. గాలి అందనట్లు ఆరాటపడడం, విశ్రాంతి కలిగించినా ఉపశాంతి కలగకపోవడం.
5. ఎంత తట్టినా వ్యక్తికి మెలకువ రాకపోవడం.
6. ఎంతో బలహీనంగా ఉండి లేచి నిలుచోగానే కళ్ళు తిరిగి పడిపోవడం.
7. రోజు మొత్తం మీద ఒకసారి కూడా మూత్ర విసర్జన చేయకపోవడం.
8. పాలుగానీ, నీళ్ళుగానీ ఏమాత్రం తాగలేకపోవడం.
9. ఎక్కువగా వాంతులు - విరేచనాలు అవడం.
10. నల్లగా విరేచనం అవడం, కాఫీ రంగులో వాంతి అవడం.
11. భరించలేనంత కడుపు నొప్పి రావడం.
12. మెడ కండరాలు, నడుం కండరాలు బిగదీసుకునిపోయి వంగకపోవడం.
13. తలనొప్పి అనిపించి ఫిట్స్ రావడం.
14. అతిగా బరువు కోల్పోవడం.
15. మూత్రం ద్వారా రోజుల తరబడి రక్తం పోవడం.
16. మందు వాడుతున్నా ఎంతకీ పుండు మానకపోవడం.
17. శరీరంలో ఏ భాగంలో అయినా కంతులు త్వరత్వరగా ఎదిగిపోవడం.

ఈ విధంగా రోగిలో అసాధారణ మార్పులు ఏవి కనిపించినా తగిన వైద్య పరీక్షలు జరిపించాలి. దాని ప్రకారం చికిత్స చేయించాలి.

□□□

# 18 . ఆరోగ్యం - ఆహారం

మనిషి ఆరోగ్యంగా ఎదగడానికి పోషకాహారం అవసరం. మంచి ఆహారం తీసుకున్నప్పుడే హుషారుగా, శక్తివంతంగా పనిచేయడానికి కుదురుతుంది. ఆహారం లోపం వల్లే ఎన్నో వ్యాధులు కలుగుతాయి. సరైన ఆహారం తీసుకోని వ్యక్తి బలహీనంగా ఉంటాడు.

చిన్నపిల్లలకి సరైన ఆహారం ఇవ్వకపోతే తగిన విధంగా ఎదగడం గానీ, బరువు పెరగడం గానీ జరగదు. వారు చాలా ఆలస్యంగా నడవడం నేర్చుకుంటారు. మాటలు రావడం, తెలివితేటలుగా వ్యవహరించడం కూడా ఆలస్యమే. పెద్ద పొట్ట వేసుకుని వికారంగా కనబడతారు. పైగా కాళ్ళు, వేళ్ళు, చేతులు సన్నగా తయారవుతాయి. పిల్లల ముఖంలో హుషారు కనబడదు. ఎప్పుడూ ముఖం ఏదో నలతగా ఉంటుంది. కొందరు పిల్లల చేతులకు నీరు వచ్చి ఉబ్బినట్లు కనబడతాయి. మొఖం కూడా ఉబ్బుగా కనబడుతుంది. నోటి ప్రక్కల పుండ్లు ఏర్పడతాయి. కంటి మీద కురుపులు, మచ్చలు వస్తాయి. వెంట్రుకలు సహజ వర్ణం, సహజ ఆకర్షణ కోల్పోయి మొక్కజొన్న కండె పీచులాగా అవుతాయి. కళ్ళలో కళ పోయి ఎండిపోయినట్లవుతాయి.

పిల్లల విషయం అలా ఉంటే, సరైన ఆహారం తీసుకోని పెద్దవారు కూడా బలహీనంగా తయారవుతారు. ఎప్పుడూ అలసిపోయినట్లే ఉంటారు. ఆకలి కూడా తగ్గిపోతుంది. రక్తహీనత స్పష్టంగా కనబడుతుంది. నోటి ప్రక్కన పుండ్లు వస్తాయి. నాలిక కూడా ఎప్పుడూ పూసి ఉంటుంది. కాళ్ళు మంటలనిపిస్తూ ఉంటాయి.

ఆహార లోపం వల్ల పైవిధంగా లక్షణాలు ఏర్పడితే - కొన్ని వ్యాధులు వీరిలో అతి తేలికగా సంక్రమించడమో లేదా ఏదో ఒక బాధ తరచూ అనిపించడమో ఉంటుంది. అటువంటి బాధల్లో నీళ్ళ విరేచనాలు తరచూ అవుతాయి.. అంతేకాకుండా చెవుల్లో ఏదో తెలియని హోరు, చికాకుపరిచే తలనొప్పి, చిగుళ్ళ వెంట రక్తం, ముక్కు వెంట రక్తం కారడం ఉంటాయి. మరికొందరిలో కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరం, చికాకు కలిగిస్తూ ఉంటాయి. చిన్నపిల్లల్లో కారణం లేకుండా ఫిట్స్ వస్తాయి. పెద్దవారిలో ఎప్పుడూ గుండెదిడ, ఆయాసం అనిపిస్తాయి. ఊరికినే గాభరా అనిపించడం, ప్రతిదానికి కంగారు పడటం, తల త్రిప్పినట్లు ఉంటాయి. కొందరికి లివర్ దెబ్బతిని పొట్టకి నీరు చేరి బానలా తయారవుతుంది.

సరైన ఆహారం తీసుకోని పిల్లల్లో పొంగు వంటి వైరల్ వ్యాధులు తేలికగా సంక్రమిస్తాయి. పిల్లలకి పొంగు వస్తే, తరచుగా ప్రాణాపాయం కలుగుతూంటుంది. అంతేకాదు, ఇటువంటి పిల్లలకి క్షయవ్యాధి కూడా తేలికగా సంక్రమించి దుష్ఫలితాలు కలిగిస్తాయి. జలుబు కూడా తరచూ చేస్తుంది.

సరైన ఆహారం తీసుకోవడం వల్ల శరీరంలో వ్యాధి నిరోధక శక్తి పెంపొందుతుంది. వ్యాధులు వచ్చినవారికి మందులతో పాటు మంచి పోషకాహారం ఇవ్వాలి. వ్యాధి తగ్గిపోయిన తరువాత కూడా మంచి ఆహారం ఇవ్వాలి.

ఇందుకొరకు మాంసకృత్తులు ఉండే మాంసం, చికెన్, కోడిగ్రుడ్లు, చేపలు, పాలు, వెన్న, సోయాబీన్, పప్పులు తీసుకోవాలి. శక్తినివ్వడానికి పిండిపదార్థాలు ఉండే గోధుమలు, వరి, జొన్నలు, దుంపకూరలు, చక్కెర, తేనె వాడాలి. అంతేకాకుండా వెన్న, నెయ్యి, ఇతర కొవ్వు పదార్థాలు తీసుకోవాలి. వీటికితోడు విటమిన్లు, ఖనిజ లవణాలు ఉండే పాలు, గుడ్లు, చేపలు, పండ్లు, కాయగూరలు, ఆకుకూరలు తీసుకోవాలి.

సరైన ఆహారం తీసుకోవడమంటే మాంసకృత్తులు ఉండే ఆహార పదార్థాలు, పిండి పదార్థాలు, కొవ్వు పదార్థం ఉండే ఆహార పదార్థాలు ఉండేలా ప్రతిసారీ భోజనంలో తీసుకోవాలి. అప్పుడే అది సమీకృత ఆహారం అవుతుంది.

అయితే తగిన ఆర్థిక స్థోమత లేనివారు ఆ విధంగా తాము భరించలేమని కేవలం కారం మెతుకులతో కడుపు నింపుకుంటారు. ఆర్థిక స్థోమత లేనివారు కూడా ఏమాత్రం ఆరోగ్యం గురించి శ్రద్ధ ఉన్నా, వారికి అందుబాటులో ఉండే సమీకృత ఆహారాన్ని తీసుకోగలరు. అనవసరమైన ఇతర ఖర్చు తగ్గించుకుని ఆకుకూరలు, చేపలు, జొన్నలు, రాగులు ఆహారంగా తీసుకుంటే సరిపోతుంది. వీలున్నప్పుడల్లా జంతు సంబంధమైన మాంసకృత్తులు తీసుకోవడం మంచిది. ఆరోగ్యం గురించి, ఏ మాత్రం అవగాహన ఉన్నా అందుబాటులో ఉండే సమీకృత ఆహారం తీసుకోవాలి.

ఆహారంలో మసాల దినుసులు, పచ్చి మిరపకాయలు, పండు మిరపకాయలు అతిగా వాడటం మంచిది కాదు. వీటివల్ల కడుపులో పుండ్లు తయారవుతాయి. అలాగే తీపి పదార్థాలు, పంచదార, బెల్లం వాడటం మంచిది కాదు. ఇవి ఆకలిని తగ్గించివేస్తాయి. దంతాలని పాడు చేస్తాయి. పైగా వీటివల్ల ఒళ్ళు రావడం, గుండె వ్యాధులకి సంబంధించిన సమస్యలు వస్తాయి.

మంచి ఆరోగ్యం కొరకు మంచి ఆహారం అంటే ఏమిటో,

మంచి అలవాట్లు ఏమిటో తెలుసుకోవడం ప్రతి వ్యక్తికీ అవసరం.

□□□

# 19 . వృద్ధాప్యంలో ఆరోగ్యం

వయస్సు మీద పడుతున్నకొద్దీ మొదట ఎదురయ్యే సమస్యల్లో కంటిచూపు మందగించడం, కళ్ళజోడు లేనిదే దూరంగా ఉన్న వ్యక్తులని సరిగా గుర్తుపట్టకపోవడం, కళ్ళ ఎదుటే పుస్తకం ఉన్నా చదవడానికి ఇబ్బంది పడటం వంటివి సాధారణంగా కొన్ని సమస్యలు. వీటికి తోడు కొందరిలో గ్లాకోమా (నీటి కాసులు) వ్యాధి వస్తుంది ఈ కళ్ళ వ్యాధి 40 సంవత్సరాలు దాటిన వారిలో సాధారణంగా కనబడుతుంది. దీనికి మొదట్లోనే చికిత్స పొందకపోతే అంధత్వం ప్రాప్తించవచ్చు. ఈ వ్యాధి అకస్మాతుగా రావచ్చు లేదా నిదానంగా రావచ్చు. గ్లాకోమా వచ్చినవారిలో భరించలేనంత తలనొప్పి, కళ్ళగుడ్లు గుంజివేసినట్లు బాధ ఉంటాయి. కళ్ళు ఎర్రబడతాయి. చూపు మబ్బు మబ్బుగా ఉంటుంది. కంటిగుడ్లు నొక్కి చూస్తే గట్టిగా అనిపిస్తాయి. కొందరికి ఈ సమయంలో వాంతులు కూడా వస్తాయి. గ్లాకోమా వచ్చిన కంటిలో, కంటిపాప రెండవ కంటిపాప కంటే పెద్దదిగా ఉంటుంది. వెంటనే ఈ వ్యాధికి చికిత్స పొందకపోతే కొద్ది రోజులలోనే కంటి చూపు శాశ్వతంగా పోతుంది. అకస్మాత్తుగా కాకుండా నిదానంగా వచ్చే గ్లాకోమాలో తలనొప్పి గానీ, కంటి గుడ్డు లాగడం గానీ ఉండవు. చూపుమాత్రం రోజురోజుకీ తగ్గి పోతూంటుంది. డాక్టరు పరీక్ష చేసి చూస్తే, ఆ కంటి గుడ్డులో ఒత్తిడి పెరిగినట్లు గుర్తించడం జరుగుతుంది.

40 సంవత్సరాలు దాటినవారిలో వచ్చే మరో కళ్ళ బాధ 'శుక్లాలు'. శుక్లాలు రావడం వల్ల కంటి చూపు తగ్గిపోతుంది. మరి కొందరిలో తెల్లని గోడ వైపు చూస్తే వారికి ఇటూ అటూ కదిలే నల్లని మచ్చలు కనబడతాయి. ఇటువంటి మచ్చలు అకస్మాత్తుగా కనబడితే మాత్రం కంటి లోపల ఉండే 'రెటీనా' పొరలు ఊడటం వల్లనే. 'రెటీనల్ డిటాచ్‌మెంటు' జరిగితే వెంటనే చికిత్స పొందాలి. లేకపోతే అంధత్వం ప్రాప్తిస్తుంది. వయస్సు మళ్ళిన తరువాత ఎక్కువ మంది అలసట, నీరసం, పని చేయడానికి హుషారు లేదంటూ ఉంటారు. వీరు ఈ వయసులో తగిన విధంగా పోషకాహారం తీసుకుంటే అలసట, నీరసం ఉండవు.

వృద్ధుల్లో తరచు పాదాల వాపు కనబడుతుంది. దీనికి కారణం వీరిలో రక్త ప్రసారం సక్రమంగా లేకపోవడం లేదా గుండె జబ్బు ఉండటమే. ఏ కారణం అయినప్పటికీ పాదాలవాపు ఉన్నప్పుడు కాళ్ళు ఎత్తిపెట్టి కూర్చోవడం, పడుకున్నప్పుడు కాళ్ళ క్రింద ఎత్తుగా దిళ్ళు పెట్టుకోవడం అవసరం. రోజూ కొంతదూరం నడవడం కూడా మంచి

ఫలితం ఇస్తుంది. అయితే ఎక్కువ సేపు నిలుచోవడం లేదా కాళ్ళు క్రిందకు వ్రేలాడేసి ఎక్కువ సేపు కూర్చోవడం మంచిది కాదు.

కొందరికి కాళ్ల మీద, పాదాల దగ్గర పుళ్ళు పడి ఎంత కాలానికీ మానకుండా అవుతాయి. ఇలాంటి పుళ్ళు లెప్రసి వల్ల కూడా అవవచ్చు లేదా వృద్ధాప్యంలో రక్త ప్రసారం సరిగ్గా లేకపోవడం వల్ల కూడా కావచ్చు. కొందరికి వేరికోజ్ వైన్స్ వల్ల పుళ్ళు పడవచ్చు. లేదా మధుమేహం వల్ల పుళ్ళు పడవచ్చు. ఇలా పుళ్ళు పడ్డప్పుడు కారణం బట్టి చికిత్స పొందుతూ, పుళ్ళని శుభ్రమైన నీళ్ళతో రోజూ కడుగుతూ ఉండాలి. నీళ్ళలో డెట్టాల్ గానీ, సబ్బు గానీ కలిపి కడగడం మంచిది. పుండు మానడానికి యాంటి బయోటిక్ ఆయింట్ మెంట్ గానీ, పౌడరు గానీ వేసి కట్టు కట్టుకోవడం అవసరం.

వృద్ధులలో మూత్ర విసర్జన బాధాకరంగా ఉన్నట్లయితే ప్రోస్టేటు గ్రంథి పెరిగి ఇబ్బంది కలిగిస్తోందని భావించాలి. ఇటువంటి సమయంలో మాటిమాటికి మూత్ర విసర్జన చేయాలనిపించడం, చుక్కచుక్కగా మూత్రం రావడం ఉంటుంది. కొందరిలో అసలు మూత్రం రావడం ఆగిపోతుంది. ప్రోస్టేటు గ్రంథి పెరిగి మూత్ర విసర్జన ఇబ్బందికరంగా మారిన వారిలో తరచు జ్వరం రావచ్చు. దానికి కారణం మూత్రంలో వ్యాధి క్రిములు చేరడమే. ప్రోస్టేటు గ్రంథి పెరిగినపుడు ఆపరేషన్ చేయించుకోవడం ఒక్కటే మార్గం.

వృద్ధులు ఏ కారణం లేకుండా దగ్గుతున్నారంటే దానికి వారు పొగ త్రాగడమే కారణం. అటువంటప్పుడు పొగ త్రాగటం మానివేయాలి. వయసులో ఉండగా క్షయ వ్యాధి వచ్చి ఉన్నా, దగ్గుతో రక్తం పడి ఉన్నా, తిరిగి వృద్ధాప్యంలో దగ్గు వస్తూ ఉంటే క్షయ వ్యాధి వచ్చిందేమోనని అనుమానించాలి. మరికొందరికి దగ్గు రావడం, ఉబ్బసం కారణం కావచ్చు. లేదా గుండె జబ్బు కారణం కావచ్చు.

వృద్ధాప్యంలో కీళ్ళ నొప్పులు సహజం. ఇటువంటప్పుడు ఆ భాగానికి పని కల్పించకుండా విశ్రాంతి ఇవ్వడం అవసరం. మోకాలు నొప్పులు ఉన్నప్పుడు ఎక్కువ నడవడం మంచిది కాదు. కీళ్ళ నొప్పులు, కండరాల నొప్పులు ఉన్నప్పుడు ఆ భాగంలో వేడినీళ్ళలో గుడ్డ ముంచి కాపడం పెట్టడం అవసరం. అలా చేయడం వల్ల చాలా వరకు నొప్పులు తగ్గుతాయి. దీనికితోడు బ్రూఫెన్ - 400 బిళ్ళలు తడవకి ఒకటి చొప్పున రోజుకి 2 - 3 సార్లు వేసుకుంటే నొప్పులు తగ్గుతాయి. కీళ్ళనొప్పులు చాలా కాలం నుంచి వున్నవారు ఆ కీళ్ళకి వ్యాయామం చేయాలి. వాటిని ముందుకీ, వెనకకీ, ఇటు - అటు త్రిప్పడానికి కృషి చేయాలి. లేకపోతే బిగదీసుకుని పోతాయి.

వృద్ధాప్యంలో గుండె జబ్బులు ఎక్కువ. అందులోనూ క్రొవ్వు ఎక్కువ ఉండేవారికీ,

పొగ త్రాగేవారికీ, రక్తపోటు ఎక్కువ ఉన్నవారికి, మధుమేహం కలవారికీ గుండె జబ్బులు ఎక్కువ వస్తాయి. గుండె జబ్బు ఉన్నవారు కొద్ది శ్రమ చేయగానే గాలి తీసుకోవడానికి ఆయాసపడవలసి వస్తుంది. రాత్రిపూట ఉబ్బసంలాగా ఆయాసం వస్తూ ఉంటుంది. నాడి కూడా బలహీనంగా ఉండడం, సక్రమంగా నాడి కొట్టుకోకపోవడం ఉంటాయి. ఉదయం కంటె సాయంత్రానికి పాదాలు ఉబ్బినట్లు అవుతాయి. గుండె జబ్బు ఉన్నవారికి అకస్మాత్తుగా ఛాతిలో నొప్పి రావడం, ఆ నొప్పి ఎడమ చేతికి, క్రింది దవడకి, వీపు వెనకకి ప్రయాణించడం జరుగుతుంది. సాధారణంగా ఎడమ చేతికి నొప్పి ప్రయాణిస్తుంది. ఇలా వచ్చిన గుండె నొప్పి విశ్రాంతిగా పడుకోగానే కొద్ది నిముషాల్లో తగ్గిపోతూ ఉంటుంది. సాధారణంగా ఈ విధంగా వచ్చే ఛాతి నొప్పిని యాంజైనా పెక్టోరిస్' అంటారు. ఇది కాక గుండెపోటు వచ్చినవారిలో గుండె మీద బరువు పెట్టినట్లు ఉంటుంది. లేదా కత్తితో పొడుస్తున్నట్లు ఉంటుంది. గుండెపోటు వచ్చినవారిలో విశ్రాంతిగా పడుకున్నా నొప్పి తీవ్రత తగ్గడం జరగదు. ఇలా నొప్పి వచ్చినప్పుడు కొందరికి వెంటనే ప్రాణం పోతుంది.

గుండె జబ్బు ఉన్న వృద్ధులు ఎక్కువ పనిచేయకూడదు. నొప్పి అనిపించగానే పని ఆపి విశ్రాంతి తీసుకోవాలి. క్రొవ్వు పదార్థాలు తినకూడదు. ఒళ్ళు ఉంటే తగ్గడం మంచిది. గుండె జబ్బులు ఉన్న వృద్ధులు ఆహారంలో ఉప్పు చాలా తక్కువ వాడడం అవసరం. మానసికంగా ప్రశాంతంగా ఉండటం, చీకులు - చింతలు పెట్టుకోకపోవడం అవసరం. ఎక్కువసేపు నిద్రపోవడం కూడా మంచిదే.

పక్షవాతం కూడా వృద్ధుల్లో ఎక్కువ. దీనికి ప్రధానంగా మెదడులో రక్తం గడ్డకట్టడం గాని, రక్తనాళాలు పగలడం గానీ కారణం. రక్తపోటు, మధుమేహం, రక్తంలో అధిక క్రొవ్వు శాతం ఇందుకు ముఖ్య కారణాలు.

వయసు పెరుగుతున్న కొద్దీ వినికిడి తగ్గిపోతుంది. ఇటువంటప్పుడు వినికిడి సాధనాలు ధరించడం అవసరం. కొందరు వృద్ధుల్లో చెవిలో హోరు, బాజాల మోత ఎక్కువ అనిపిస్తుంది. తల కూడా తిరుగుతుంది. బహుశా మీనియర్స్ డిసీజ్ ఇందుకు కారణం కావచ్చు. అటువంటప్పుడు వెంటనే డాక్టరుకి చూపించి, మందులు వాడుతూ విశ్రాంతి తీసుకుంటే తేలికగా ఉపశాంతి కలగవచ్చు.

కొందరికి వృద్ధాప్యంలో ఎంతకీ నిద్ర రాదు. ఇటువంటి వారికి పగటిపూట కొంత శారీరక శ్రమ అవసరం. కాఫీ - టీలు త్రాగకూడదు. నిద్రపోయే ముందు రాత్రిపూట తేనె నీళ్ళుగానీ, ఒట్టి నీళ్ళు గానీ త్రాగాలి. వేడి నీటి స్నానం కూడా మంచిదే. ఇలా చేయడం వల్ల నిద్ర పట్టవచ్చు. అప్పటికీ నిద్ర పట్టకపోతే డాక్టర్ సలహాపై నిద్ర బిళ్ళలు వాడటం అవసరం.

వృద్ధాప్యంలో శారీరక వ్యాధులతో పాటు మానసిక వ్యాధులు కూడా వస్తాయి. ఆరోగ్యం గురించి మొదటి నుంచి సరైన శ్రద్ధ వహించినట్లయితే చాలా వరకు బాధలు లేకుండా చేసుకోవచ్చు.

అందుచేత వృద్ధాప్యం వచ్చిన తరువాత పిల్లా జెల్లాతో సరదాగా గడపడం, వారి స్వంత విషయాల్లో కల్పించుకోకుండా ఉండటం అవసరం. అందరికీ తన ప్రేమను పంచుతూ, వారి ప్రేమను పొందుతూ వృద్ధాప్యాన్ని మరచిపోవడంలోనే మాధుర్యమంతా ఇమిడి ఉంది. స్వీట్‌హోమ్‌లో పీస్‌ఫుల్ మైండ్ కూడా ఉంటుంది.

❑❑❑

## గర్భధారణ - సుఖప్రసవం

ఈనాడు దినపత్రిక సమీక్షనుండి

సృష్ట్యాది నుంచి ఆడవాళ్లు బిడ్డల్ని కంటూనే ఉన్నారు. పెంచి పెద్దచేస్తూనే ఉన్నారు. అయినా సరే, మాతృత్వం అనేది ప్రతి మహిళకూ ఓ మధుర స్వప్నం. ఆ స్వప్నం నిజమయేటపుడు ప్రతి మహిళకూ ఏవో భయాలు, సందేహాలు ఉండనే ఉంటాయి. ఇలాటి సందేహాలలో కొన్నిటిని, ఇంట్లోవాళ్లను అడిగో, డాక్టరును సంప్రదించో, తగిన సమాధానాలు పొంది, తీర్చుకోగల వీలుంది. మరికొన్ని ఎవరినీ అడగలేనివిగా ఉండిపోతాయి. ఇలాటి సాధారణ, అసాధారణ ప్రశ్నలన్నిటినీ పోగుచేసి డాక్టర్ జి. సమరం ఈ పుస్తకాన్ని రచించారు. కొన్ని పాత్రలను తీసుకొని, అందులో ఒక పాత్రను ఆధునిక యువతిగా తీర్చిదిద్ది, అన్నీ అడిగి తెలుసుకొనే తత్వాన్ని ఆ పాత్రకు స్వభావాన్ని చేసి, సమాధానాలను డాక్టర్ల ద్వారా ఇప్పిస్తూ కథలాగ దీన్ని నడిపించారాయన. పుస్తకంలో భాష తేలికగా, ఎవరికైనా అర్థం అయ్యేలా ఉండటం విశేషం. పెళ్లి తర్వాత నుంచి సుఖప్రసవం వరకు రాగల సమస్యలు, సందేహాలు అన్నీ మొత్తం నలభై అంశాలుగా విభజించి తేటతెనుగులో ప్రతి విషయాన్ని రచయిత వివరించారు. ఉదాహరణకు పదకొండో చాప్టర్‌కు అవశ్యకత ఎంతైనా ఉంది. రచయిత, ప్రచురణకర్తలు అభినందనీయులు.

# 20. విషపదార్థాలు - విరుగుడు

## 1. క్రిమిసంహారక మందులు తాగినప్పుడు

నువక్రాన్, మెలాథియాన్, పేరాథియాన్, బేగాన్, డైజినాన్.

పంటపొలాల్లో పట్టే చీడని, క్రిములని చంపడానికి పై రకాలైన క్రిమిసంహారక రసాయనికాలు, స్ప్రేలు వాడతారు. అలా వాటిని వాడినప్పుడు కొందరికి వీటివల్ల కొన్ని దుష్ఫలితాలు కలుగుతాయి. ప్రాణాపాయం కూడా కలుగుతుంది. కొందరు ఆత్మహత్య చేసుకోవడానికి కూడా పై క్రిమిసంహారక రసాయనికాలని త్రాగుతారు. ఇటువంటి పరిస్థితుల్లో ఆయా వ్యక్తులని ప్రాణాపాయం నుంచి రక్షించడానికి కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

విషప్రభావం లక్షణాలు:

పై మందులు చర్మం ద్వారా, ఊపిరితిత్తుల ద్వారా, కడుపు ద్వారా రక్తంలోకి చేరుతాయి.

పై మందులు తాగిన పావుగంట, అర్థ గంటలో కడుపులో నొప్పి, వాంతులు, చెమటలు, నోటిద్వారా నురుగు వస్తాయి. ఊపిరి పీల్చుకోవడం కష్టమవుతుంది. చూపు మందగిస్తుంది. కొద్దిసేపటికి విషప్రభావం ఎక్కువై కండరాలు కొట్టుకోవడం, కండరాలు బలహీనం అవడం, చేతులూ కాళ్ళూ కదపలేకపోవడం ఉంటాయి. మందు తాగిన వారికి గానీ, ప్రమాదవశాత్తు ఈ మందు శరీరంలో ప్రవేశించినవారికిగానీ వెంటనే చికిత్స చేయకపోతే గుండె, ఊపిరితిత్తులు పనిచేయడం మానివేస్తాయి. కొద్దిసేపట్లో ప్రాణం పోతుంది.

మందు తాగినవారికంటే చర్మం ద్వారా, ముక్కు ద్వారా విషం లోనికి ప్రవేశించిన వారిలో దుష్ఫలితాలు కాస్త తక్కువలో ఉంటాయి. వీరిలో వికారం, ఆకలి లేకపోవడం, కడుపు నొప్పి, తలనొప్పి, చిరాకు పడడం, చేతులు వణకడం, చూపు మందగించడం ఉంటాయి.

చికిత్స:

1. పొలంలో మందు కొడుతున్నప్పుడు పై లక్షణాలు కనబడగానే ఆ మనిషిని ఆ పని నుంచి వెంటనే దూరం చేయాలి.

2. అతను వేసుకున్న దుస్తులని పూర్తిగా తీసివేయాలి.
3. శరీరమంతా నీళ్ళతో శుభ్రంగా కడగాలి. మంచి దుస్తులు వేయాలి. దాంతో చాలావరకు మనిషి కోలుకోవచ్చు.
4. మందు తాగిన వారిలో విషప్రభావం ఎక్కువగా ఉంటుంది.
5. వారిచేత వెంటనే వాంతి చేయించాలి. చేతి వ్రేళ్ళని నోటిలోపలి భాగానికిపోనిచ్చి రుద్దాలి. దాంతో వాంతి అయిపోతుంది.
6. అలా పూర్తిగా వాంతి అవనప్పుడు ఒక గ్లాసు నీళ్ళలో 3 చెంచాలు ఆవాల పొడి కలిపి త్రాగించాలి. లేదా ఒక గ్లాసు నీళ్ళలో 5,6 చెంచాలు ఉప్పు కలిపి త్రాగించాలి. దాని వల్ల వాంతి అయి తీసుకున్న మందు బయటికి వచ్చేస్తుంది.
7. ఒక వేళ మనిషి అపస్మారక స్థితిలో ఉన్నట్లయితే పై విధంగా వాంతి చేయించడం కుదరదు.
8. ఇటువంటి వాళ్ళకి స్టమక్‌వాష్‌ట్యూబ్ ద్వారా వాంతి చేయించాలి.
9. కడుపులోకి స్టమక్‌వాష్‌ట్యూబ్ పోనిచ్చి 2% పొటాషియం పర్‌మాంగనేట్ సొల్యూషన్‌తో స్టమక్ వాష్ చేయాలి.
10. పై మందుల విషప్రభావానికి విరుగుడుగా ఎట్రోపిన్ ఇంజక్షన్స్, పామ్ ఇంజక్షన్స్ ఇవ్వాలి.

□□□

# 2. ఎండ్రిన్ తీసుకున్నప్పుడు

*ఎండ్రిన్ కూడా పొలాలకి వాడతారు. కొందరు ప్రాణం తీసుకోవడానికి ఎండ్రిన్ తాగుతారు.*

## ఎండ్రిన్ దుష్పలితాలు:

ఎండ్రిన్ తాగినవారిలో వాంతులు, కడుపులో నొప్పి, నోటినుంచి నురగ, అపస్మారక స్థితి, వణుకు, తలనొప్పి, ఫిట్స్ వస్తాయి.

## చికిత్స:

1. ఎండ్రిన్ తాగి స్పృహలో ఉన్నప్పుడు నవక్రాన్, బేగాన్ మందులు తాగినవారిలో వలె వాంతి చేయించాలి.
2. స్పృహ లేనివారికి స్టమక్ వాష్ చేయాలి.

3. ఫిట్స్ తగ్గడానికి కాంపోజ్ ఇంజక్షన్ చేయాలి. గుండె, ఊపిరితిత్తులు సక్రమంగా పనిచేయడానికి మందులు వాడాలి.
4. ఎండ్రిన్ తాగగానే కక్కించి చికిత్స చేస్తే కొంత ఫలితం ఉంటుంది. ఆలస్యం అయితే ప్రాణాపాయం కలుగుతుంది.

❑❑❑

# 3. కాస్టిక్ పొటాష్, కాస్టిక్ సోడా, వాషింగ్ సోడా, లైమ్

*కొందరు కావాలనో, ప్రమాదవశాత్తో పై పదార్థాలని తీసుకుంటారు. కాస్టిక్ పొటాష్, కాస్టిక్ సోడా 5 గ్రా. మించి తీసుకోవడం జరిగితే ప్రాణాపాయం కలుగుతుంది. వాషింగ్ సోడా 30 గ్రా. మించి తీసుకుంటే ప్రాణాపాయం కలుగుతుంది.*

**లక్షణాలు:**

నోటిలోనూ, గొంతులోనూ, కడుపులోనూ విపరీతమైన మంట వస్తుంది. కడుపులో నొప్పి అనిపిస్తుంది. వాంతులు అవుతాయి. వాంతుల్లో రక్తం పడుతుంది. విరోచనాలు అవుతాయి. కొందరికి విరోచనాలతో పాటు రక్తం పడుతుంది. పై పదార్థాలు కళ్ళల్లో పడ్డప్పుడు కళ్ళు ఎర్రబడతాయి, మండుతాయి. నీళ్ళు కారతాయి. కొందరిలో పై పదార్థం సేవించినప్పుడు ఒళ్ళు చల్లబడడం, బి.పి.పడిపోవడం, షాక్ కలగడం ఉంటాయి.

**చికిత్స:**

1. కళ్ళల్లో పై పదార్థాలు పడ్డప్పుడు వెంటనే నీళ్ళతో కడగాలి.
2. పై పదార్థాలు త్రాగినప్పుడు ఐస్ ముక్కలు చప్పరిస్తే గొంతునొప్పి, మంట తగ్గుతాయి.
3. వెనిగార్ గానీ, నిమ్మకాయ రసం గానీ త్రాగించాలి.
4. కోడిగుడ్డు తెల్లసొన మింగించాలి.
5. వెన్న తినిపించాలి.
6. గొంతు మంట, నొప్పి ఎక్కువగా ఉండి కోడిగుడ్డు తెల్లసొన, వెన్న మింగలేనప్పుడు నోటి ద్వారా ట్యూబ్ వేసి కడుపులోకి ఎక్కించాలి.
7. షాక్ పరిస్థితి చక్కదిద్దడానికి నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టడం, ఇతర మందులు వాడడం చేయాలి.

❑❑❑



# 4. కిరసనాయిలు తాగినప్పుడు

*కొందరు పొరబాటున కిరసనాయిలు తాగుతారు. మరికొందరు ప్రాణం తీసుకోవడానికి తాగుతారు. ప్రమాదవశాత్తు తాగడం పిల్లల్లో ఎక్కువ.*

**లక్షణాలు:**

గొంతు మంట, కడుపు నొప్పి, వాంతులు, విరోచనాలు, తల తిరగడం, దగ్గు, ఆయాసం ఉంటాయి. కొందరు తెలివి కూడా కోల్పోతారు. పిల్లల్లో న్యుమోనియా రావడం ఎక్కువ.

కిరసనాయిలు 50 యం.యల్. తీసుకున్న వారిలో కాంప్లికేషన్సు రావడం ఎక్కువ.

**చికిత్స:**

1. కిరసనాయిలు తాగినప్పుడు జాగ్రత్తగా స్టమక్ వాష్ చేయాలి.
2. పిల్లల్లో మరీ జాగ్రత్తగా స్టమక్ వాష్ చేయాలి.
3. కిరసనాయిలు తాగి అపస్మారక స్థితిలో ఉన్నప్పుడు స్టమక్ వాష్ చేయడానికి తలవైపు క్రిందిగా ఉండేటట్లు చూసుకోవాలి.
4. శ్వాస తీయడం కష్టంగా ఉంటే ఆక్సిజన్ పెట్టాలి.
5. యాంటీబయోటిక్ మందులు వాడాలి.

❑❑❑

# 5. కర్పూరం (కేంఫర్)

**లక్షణాలు:**

గొంతు మంట. ఛాతిలోనూ, కడుపులోనూ మంట. దాహం, వాంతులు. ఆందోళన, చికాకు, కోపం, అయోమయ పరిస్థితి, చూపు మందగించడం ఉంటాయి. నిదానంగా కోమా వస్తుంది. కర్పూరాన్ని 1, 2 గ్రా. మించి తీసుకున్నట్లయితే ప్రాణాపాయం కలగవచ్చు.

**చికిత్స:**

1. కర్పూరం తీసుకున్నప్పుడు, చేతివేళ్ళు గొంతులోనికి పోనిచ్చి గట్టిగా రుద్ది, వాంతి అయ్యేటట్లు చేయించాలి. లేదా స్టమక్‌వాష్‌ట్యూబ్ ద్వారా సెలైన్ నీళ్ళతో కడుపుని కడగాలి.

2. కోడిగుడ్డు తెల్లసొన బాగా తాగించాలి. లేదా ట్యూబ్ ద్వారా కడుపులోకి ఎక్కించాలి.
3. గుండె, ఊపిరితిత్తులు సక్రమంగా పనిచేయకపోయినా రోగి షాక్ పరిస్థితిలో ఉన్నా దానికి తగిన చికిత్స చేయాలి.

❑❑❑

# 6. ఎలుకల మందు

*ఎలుకల మందునే 'రాట్ పాయిజనింగ్' అంటారు. ఈ మందుని ఎలుకలని చంపడానికి ఉపయోగిస్తారు. ఎలుకల మందునే 'గుళికలు' అంటారు. జింక్‌ఫాస్ఫైడ్, అల్యూమినియం ఫాస్ఫైడ్ కూడా రాట్‌పాయిజనింగ్ కోవకి చెందినవే.*

*పై మందులు నీరు తగలగానే ఫాస్ఫీన్ అనే విషవాయువుని విడుదల చేస్తాయి. మందు మింగగానే కడుపులో ఉన్న యాసిడ్ లేదా నీరు వల్ల ఈ వాయువు విడుదలై ఊపిరి స్థంభింపచేసి మరణానికి కారణమవుతుంది.*

**లక్షణాలు:**

ఎలుకల మందు తీసుకున్నవారిలో - వాంతులు, చేతులూ కాళ్ళూ వణకడం మగత, క్రమంగా ఊపిరి తీసుకోవడం కష్టం అవడం ఉంటాయి. ఆ పైన మరణం ప్రాప్తిస్తుంది.

**చికిత్స:**

1. ఎలుకల మందు తిన్నవారిచేత ఆ మందుని కక్కించాలి.
2. తెలివిలో ఉన్నవారిచేత గ్లాసు నీళ్ళలో 3 చెంచాలు ఆవాల పొడి కలిపి ఆ నీళ్ళని త్రాగించాలి. లేదా 1 గ్లాసు నీళ్ళల్లో 5,6 చెంచాల ఉప్పు కలిపి త్రాగించాలి. పూర్తిగా మందు బయట పడిపోయేవరకు ఈ విధంగా కక్కించాలి.
3. మామూలుగా మందు కక్కించడం కుదరని వారిలో స్టమక్‌వాష్‌ట్యూబ్ వేసి కడుపుని కడగాలి.
4. ఆ తరువాత కోడిగుడ్డు తెల్లసొన, పాలు ఇవ్వాలి. రోగి రక్తపోటు, నాడి, శ్వాసక్రియ సక్రమంగా ఉన్నదీ లేనిదీ పరీక్ష చేస్తూ తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

❑❑❑

# 7. మైలుతుత్తం (కాపర్ సల్ఫేట్)

*మైలుతుత్తం తీసుకున్న వారిలో కడుపులోనూ, ఛాతిలోను విపరీతమైన మంటలు కలుగుతాయి. ఉమ్ము ఎక్కువగా వస్తుంది. దాహం అతిగా అనిపిస్తుంది. వాంతులు, విరోచనాలు ఉంటాయి. వాంతి నీలం రంగులో ఉంటుంది. ఫిట్స్ కూడా వస్తాయి. నాడి*



అందకుండా అవుతుంది. బి.పి. పడిపోతుంది. మరణం కూడా ప్రాప్తించవచ్చు.

మైలుతుత్తం 15 గ్రా. కంటే ఎక్కువ తీసుకున్నవారిలో ప్రాణాపాయం కలుగుతుంది.

**చికిత్స:**

1. వాంతి అయ్యేలా చేయడం.
2. 1% పొటాషియం పర్మాంగనేట్ సొల్యూషన్‌తో స్టమక్ వాష్ చేయాలి.
3. స్టమక్ వాష్ చేసిన తరువాత కోడిగుడ్డు తెల్లసొన గానీ, పాలుగానీ ఇవ్వాలి.
4. ఆముదం తాగించి విరోచనం అయ్యేలా చూడాలి.
5. జనరల్ కండిషన్‌ని కాపాడాలి.

❑❑❑

# 8. గార్డినాల్ పాయిజనింగ్

**లక్షణాలు:**

మగత, కండరాలలో పటుత్వం తగ్గడం, నడుస్తూంటే తూలడం, బి.పి. డౌను అవడం, ఒళ్ళు చల్లగా ఉండడం, మూత్రం తక్కువగా అవడం, కోమా రావడం, ఊపిరి తీయడంలో ఇబ్బంది.

**చికిత్స:**

1. రోగి తెలివిగా ఉంటే మందు కక్కించడం, కక్కకపోతే స్టమక్ వాష్ చేయడం.
2. మూత్రం ఎక్కువ అవడానికి లాసిక్స్ 40-60 మి.గ్రా. ఇంజక్షన్ నరానికి ఇవ్వడం.
3. నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టడం.
4. సీరియస్ కేసుల్లో హీమోడయాలసిస్.

❑❑❑

# 9 నిద్ర బిళ్ళలు

కొందరు ఎక్కువ మోతాదుల్లో కాంపోజ్, వాలియం, ఆల్ప్రొలాం బిళ్ళలు ఎక్కువ మోతాదులో వేసుకుంటారు. ప్రమాదంలో పడతారు.

**లక్షణాలు:**

మగత, అంతా అయోమయంగా ఉండడం, అడుగు సరిగా పడకపోవడం, ఒళ్ళు తూలడం, మాటల్లో స్పష్టత లేకపోవడం, బి.పి. పడిపోవడం, కోమాలోకి వెళ్ళడం.

చికిత్స:

1. మందు కక్కించడం.
2. స్టమక్ వాష్.
3. నరానికి లాసిక్స్ ఇంజక్షన్.
4. నరానికి గ్లూకోజ్ సెలైన్.
5. శ్వాస సక్రమంగా ఉండేటట్లు చూడడం, ఆక్సిజన్ పెట్టడం
6. మత్తు బిళ్ళ ప్రభావం ఎక్కువయిన వారిలో ఊపిరితీయడం కష్టం అవుతుంది. అటువంటి వారికి రెస్పిరేటరీ స్టిమ్యులెంట్స్ ఇవ్వాలి.

❑❑❑

# 10 మద్యం ఎక్కువ సేవిస్తే

లక్షణాలు:

మగత, మాటల్లో తడబాటు, అర్థం లేని మాటలు, అడుగు సరిగా పడక పోవడం, కండరాలు పట్టు తప్పడం, ఊపిరి కష్టం అవ్వడం, కోమా రావడం.

చికిత్స:

1. స్టమక్ వాష్ చేయడం.
2. నరానికి గ్లూకోజ్ పెట్టడం.
3. గుండె, ఊపిరితిత్తులు, నాడీమండలం సక్రమంగా ఉండేటట్లు చూడటం.

❑❑❑

# 21. ప్రథమ చికిత్స

## 1. ప్రథమచికిత్స ప్రాధాన్యత

ఎవరయినా. ఏదైనా ప్రమాదానికి గురి అయినప్పుడు, అకస్మాత్తుగా అనారోగ్యానికి గురి అయినప్పుడు, వారిని రక్షించడానికి, వారికి మరింత హాని జరగకుండా కాపాడటానికి వెంటనే చేసే చికిత్సని 'ప్రథమచికిత్స' అంటారు.

వైద్యుడు అందుబాటులో లేని చాల సందర్భాలలో ప్రథమచికిత్సే వ్యక్తిని ప్రాణాపాయం నుంచి రక్షిస్తుంది.

ప్రాణాపాయ స్థితిలో డాక్టర్ కోసం ఎదురుచూస్తూ కూర్చుంటే ప్రాణమే పోవచ్చు. లేదా మరింత నష్టం జరిగిపోవచ్చు. అలా జరిగిన నష్టాన్ని ఆ తరువాత డాక్టర్ కూడా సరిచేయలేకపోవచ్చు. అందుకని ప్రథమచికిత్స చాలా ప్రధానమైన చికిత్స.

ఏ వ్యక్తి అయినా నీళ్ళలో మునిగిపోయినప్పుడు, గొంతుకి ఏదైనా అడ్డుపడి శ్వాస ఆగిపోయినప్పుడు, అకస్మాత్తుగా గుండె ఆగిపోయినప్పుడు, యాక్సిడెంట్‌లో కాలో, చెయ్యో తెగిపోయి రక్తస్రావం అధికంగా అయిపోతున్నప్పుడు, బట్టలు నిప్పంటుకున్నప్పుడు, విష పాము కరిచినప్పుడు - ఇలా ఎన్నో సందర్భాలలో ప్రథమచికిత్స తెలిసిన వ్యక్తి ప్రక్కనే ఉంటే ప్రాణాలని తేలిగ్గా రక్షించగలరు. ప్రథమ చికిత్స తెలిసిన వ్యక్తి లేకపోతే ప్రాణమే పోవచ్చు. ప్రథమ చికిత్స చేయడానికి డాక్టరే కావలసిన అవసరం లేదు. ఎవరయినా ప్రథమ చికిత్స చేయవచ్చు.

ప్రమాదాలు జరిగినప్పుడు ప్రతి క్షణం ఎంతో విలువైనది. ప్రథమచికిత్స చేయడానికి ఒక్క క్షణం ఆలస్యం చేసినా, ఆ వ్యక్తికి మృత్యువు దగ్గరైపోతుంది. అందుకే ప్రతివ్యక్తికి ప్రథమచికిత్స తెలిసిఉండాలి. ఆపదలో ఉన్న వ్యక్తికి గానీ, కొన్ని సమయాల్లో ఎవరిమటుకువారు గానీ ప్రథమ చికిత్స చేసుకుని ప్రాణాలని రక్షించుకోవచ్చు.

□□□

# 2. గాయాలై రక్తం కారుతున్నప్పుడు

చేయి గానీ, కాలుగానీ శరీరంలో ఏదైనా భాగం తెగి రక్తం కారుతూంటే, వెంటనే దానిని ఆపాలి. గాయం చిన్నదైనప్పుడు రక్తం కారుతున్న చోట తడిగుడ్డతో గట్టిగా అదిమి పట్టుకోవాలి. అలా 5 నుంచి 10 నిముషాలు పట్టుకుంటే రక్తం కారడం ఆగిపోతుంది. కొందరు గాయమైన చోట కాఫీ పొడి, పసుపు, పంచదార, సున్నం మొదలైనవి వేస్తారు. అలా ఎప్పుడూ చేయకూడదు.

మన శరీరంలో సిరలు, ధమనులు అనే రెండు రకాల రక్తనాళాల ద్వారా రక్త ప్రసారం జరుగుతూంటుంది. సిరలు ద్వారా జరిగే రక్త ప్రసారం ఫోర్స్ తక్కువ. అందుకని సిరలు తెగినప్పుడు గట్టిగా అదిమి పడితే రక్తం కారడం ఆగిపోతుంది. ధమనుల్లో రక్త ప్రసారం ఫోర్స్‌లో ఉంటుంది. చిన్న ధమనులు అయినట్లయితే కొద్ది సేపు అదిమి పట్టుకుంటే అవి కూడా తగ్గిపోతాయి.

రక్తం ఎక్కువగా కారుతున్నప్పుడు, గాయానికి కాస్త పైన కట్టు కట్టాలి. కట్టు కట్టడానికి గుడ్డగానీ, రబ్బరుట్యూబుగానీ, 1-2 సెం.మీ. వెడల్పు ఉండే బెల్టుగానీ వాడాలి. ట్వైన్ దారం, వైరు, నులకతాడు వంటివి వాడకూడదు. ఇవి వాడినట్లయితే కట్టుకట్టిన చోట కోసుకుపోతుంది. రక్తం కారకుండా గాయానికి బెత్తెడు పైన కట్టు కట్టాలి. కట్టు మరీ బిగుతుగా ఉండకూడదు. కేవలం రక్తం కారడం ఆగేటంత బిగుతు ఉంటే చాలు. సాధారణంగా కట్టిన కట్టు కింద నుంచి వేలు దూర్చితే కాస్త టైటుగానైనా వేలు దూరాలి.

బాగా తెగినప్పుడు కట్టు కట్టి వీలయినంత త్వరగా డాక్టర్ దగ్గరికి తీసుకు వెళ్ళాలి.

రక్తం కారకుండా గాయానికి పైన బిగించి కట్టు కట్టినప్పుడు, కట్టు దిగువ భాగం నీలంగా మారకుండా చూడాలి. కట్టు దిగువ భాగం ఏ మాత్రం నీలంగా కనిపించినా కట్టు వదులు చేయాలి.

రక్తం కారకుండా కట్టు బిగించి కట్టినప్పుడు డాక్టర్ దగ్గరికి వెళ్ళేలోగా ప్రతి 20 నిముషాలకి ఒకసారి ఒక నిముషం పాటు పూర్తిగా వదులు చేసి కట్టు కట్టాలి. ఒక నిముషం పాటు రక్తం కారిపోయినా నష్టం లేదుగానీ రక్తప్రసారం లేకుండా గంటల తరబడి కట్టు టైట్‌గా ఉంటే దిగువ భాగం కుళ్ళిపోయే ప్రమాదం ఉంది.



రక్తస్రావాన్ని అరికట్టడానికి కొన్ని పద్ధతులు:

మోచేతి దగ్గర గాయమై రక్తం కారి పోతున్నప్పుడు ఆ వైపు చంకలో ఒక పొడుగాటి గుడ్డ గుండ్రంగా చుట్టి పెట్టాలి. ఆపైన మోచేతులు రెండింటిని వీపు వెనక్కిలాగి దగ్గరగా కట్టాలి. అలా చేయడంవల్ల చంకల్లో ఉండేటటువంటి ధమనులు (రక్తనాళాలు) అదిమి పెట్టబడి బ్లీడింగ్ లేకుండా అవుతుంది.

తొడ దగ్గర గాయమైనప్పుడు గజ్జల దగ్గర ఒక గుడ్డని గుండ్రంగా చుట్టి పెట్టాలి. ఆ పైన తొడని కడుపు పైకి మడిచి గట్టిగా అదిమి పట్టి పట్టుకోవాలి. దానివల్ల గజ్జల దగ్గర రక్తనాళాలు నొక్కుకుని రక్తస్రావం ఉండదు.

ఇదే విధంగా మోచేయి కీలు దగ్గర, మోకాలు కీలు వెనుక గుడ్డని ఉండగా పెట్టి అక్కడ కీలుని మడిచినట్లయితే రక్తస్రావం నిరోధింపబడుతుంది.

❑❑❑

## 3. ముక్కు వెంట రక్తం కారుతుంటే

ముక్కు వెంట రక్తం కారుతుంటే రెండు వేళ్ళతో ముక్కు రంధ్రాలని 10 నిముషాలు నొక్కిపెట్టి ఉంచాలి. ముక్కుని నొక్కిపెట్టినా, నోటిద్వారా గాలి తీయవచ్చు గనక భయం అవసరం లేదు. 10 నిముషాల అయిన తరువాత కూడా బ్లీడింగ్ తగ్గకపోతే పలచని గుడ్డని నీళ్ళలో ముంచి ముక్కు రంధ్రంలోకి టైట్‌గా నెట్టాలి. దాంతో బ్లీడింగ్ చాలా వరకు తగ్గిపోతుంది. అప్పటికీ తగ్గకపోతే డాక్టర్‌కి చూపించాలి.

❑❑❑

## 4. జ్వరం ఎక్కువగా ఉంటే

జ్వరం ఎక్కువగా ఉన్నప్పుడు ఒళ్ళంతా చన్నీళ్ళ గుడ్డతో తుడవాలి. తల మీద తడిగుడ్డ వేయాలి. కేవలం నుదురు మీద తడిగుడ్డ వేస్తే ఫలితం లేదు. జ్వరం ఎక్కువగా ఉన్నప్పుడు ఒళ్ళంతా తడిగుడ్డ కప్పి ఉంచాలి. గుడ్డ తడి తగ్గిపోతే మళ్ళీ చన్నీళ్ళలో ముంచి కప్పాలి. జ్వరం తగ్గేవరకు అలా చేయాలి. జ్వరం తగ్గడానికి పేరాసెటమాల్ టాబ్లెట్స్‌గానీ, సిరప్ గానీ, ఇంజక్షన్ గానీ వాడితే ఫలితం త్వరగా కనబడుతుంది. జ్వరం తగ్గిన తరువాత తడిగుడ్డ తీసివేయాలి.

❑❑❑

# 5. వడదెబ్బ తగిలితే

వడదెబ్బ తగిలినప్పుడు జ్వరం 106° 107° ఉంటుంది. రోగికి మగత కూడా ఉంటుంది. చెమటలు కూడా పట్టవు. చర్మం పొడిగా అనిపిస్తుంది. వడదెబ్బ తగిలిన వ్యక్తిని చల్లని ప్రదేశంలో పడుకోపెట్టాలి. ఒళ్ళంతా ఐస్ నీళ్ళలో తడిపిన గుడ్డతో కప్పి ఉంచాలి. తల మీద తడిగుడ్డ కప్పాలి. జ్వరం తగ్గకపోతే నీళ్ళ తొట్టిలో పడుకోపెట్టి తల మాత్రం పైకి ఉంచి తక్కిన భాగమంతా నీళ్ళలో ఉంచాలి. ఆ నీళ్ళలో ఐస్ ముక్కలు వేయాలి. జ్వరం 102 డిగ్రీలకి దిగిన తరువాత రోగిని బయటికి తీసి చల్లని ప్రదేశంలో పడుకోపెట్టాలి.

❑❑❑

# 6. గొంతులో ఏదైన అడ్డుపడితే

తినే ఆహార పదార్థంగానీ, నాణాలు గానీ, మరొకటి గానీ గొంతుకకి అడ్డుపడితే ఊపిరితిత్తులలోకి గాలి ప్రవేశం ఆగిపోతుంది. ఇటువంటి పరిస్థితుల్లో 3-4 నిముషాలలో తిరిగి గాలి ఆడేటట్లు చేయకపోతే ప్రాణమే పోతుంది.

**చిన్న పిల్లలకి:**

గొంతులో ఏదైన అడ్డు పడితే ఒళ్ళో కూర్చోపెట్టుకుని, వీపు మీద గట్టిగా నాలుగు గుద్దులు గుద్దాలి. దాంతో గొంతు తెరపి అవుతుంది.

**కాస్త పెద్దవాళ్ళయితే:**

వారి వెనక నించుని నడుముని చేతులతో గట్టిగా చుట్టాలి. గుప్పిడిని ఛాతి క్రిందన, బొడ్డుకి కాస్త పైన ఉంచాలి. బలంగా ఒక్కసారి గుప్పిడితో పొట్టని పైకి నొక్కాలి. ఇలా చేయడం వల్ల ఊపిరితిత్తులు పిసకబడినట్లయి వాటిలోని గాలి బయటికి నెట్టుకుని వస్తూ గొంతుకు అడ్డంపడ్డ మాంసం ముక్కో, నాణెమో బయట పడుతుంది. లేదా గాలి గొట్టానికి కాస్త ఖాళీ ఇస్తుంది. దాంతో గాలి ఆడుతుంది.

**బరువైన మనిషయితే:**

గొంతులో ఏదైనా అడ్డుపడి గాలి ఆగిపోయినప్పుడు వెంటనే వెల్లకిలా పడుకోపెట్టాలి. అతనికి ఎదురుగా కూర్చొని బొడ్డుకు, ఛాతికి మధ్య రెండు చేతులని కలిపి

ఉంచాలి.ఒక్కసారిగా బలంగా పైకి నొక్కాలి. అలా నొక్కడంతో ఊపిరితిత్తులలో ఉన్న గాలి ఒక్కసారిగా బయటకు నెట్టుకుంటూ వచ్చి అడ్డంకిని తొలిగిస్తుంది. అవసరం బట్టి నోటికి నోరు బిగించి బలంగా ఊది - కృత్రిమ శ్వాస అందించాలి. నోటికి నోరుపెట్టి గాలి గట్టిగా ఊదేటప్పుడు రోగి ముక్కుని వేళ్ళతో గట్టిగా నొక్కిపట్టి ఉంచాలి. గాలిఊదేటప్పుడు ముక్కు మూయకపోతే ఊదినగాలి ముక్కుద్వారా బయటకి వచ్చేస్తుంది.

❑❑❑

# 7. నీళ్లలో మునిగినప్పుడు

నీళ్ళలో మునిగినప్పుడు శ్వాస కోశాలకి నీళ్ళు చేరతాయి. దాంతో శ్వాస ఆడదు. శ్వాస ఆగిపోయిన నాలుగు నిముషాలలో తిరిగి శ్వాస ఆడేటట్లు చేయకపోతే మెదడులోని రెస్పిరేటరీ సెంటర్ డామేజీ అయిపోతుంది. ఇక అది పనిచేయదు. అందుకని శ్వాస ఆగిపోయిన మూడు, నాలుగు నిముషాలలో తిరిగి శ్వాస ఆడేటట్లు చేయాలి. శ్వాస ఆగిపోయిన, గుండె మాత్రం దాదాపు 15 నిముషాలు కొట్టుకుంటూనే ఉంటుంది. అందుకని ముందు శ్వాస ఆడేటట్లు చూడాలి.

నీళ్ళలో మునిగిన వ్యక్తిని వెంటనే బయటకి లాగి తొడమీద బోర్లా పడుకోపెట్టుకుని అతని తలని కిందకు వంచి ఛాతిని గట్టిగా నొక్కాలి. అలా చేయడం వల్ల నీరు బయటకు రావడం, శ్వాస ఆడటం జరుగుతుంది. ఒక్కొక్కసారి నీళ్ళలో మునగడం వల్ల, గొంతులో గడ్డి, ఇతర పాచి పదార్థాలు అడ్డుపడతాయి. అందుకని నీళ్ళలో మునిగిన వ్యక్తి నోరుని వెంటనే పరీక్ష చేసి చూడాలి. ఏవైనా అడ్డు ఉంటే తొలగించాలి.

భారీ మనిషయితే వెల్లికలా పడుకోపెట్టి తల ఒక పక్కకి తిప్పి పొట్టమీద బలంగా పైకి నొక్కాలి.దాంతో శ్వాసకోశాల్లో నీళ్ళు ఉంటే బయటికి వస్తాయి. ఆ తరువాత వెంటనే నోటిమీద నోరుపెట్టి గాలిని గట్టిగా ఊదాలి. ఛాతి నిండినట్లు కనపడాలి. గాలిని ఊదేటప్పుడు ముక్కుని మూయాలి. ఈ రకంగా నిముషానికి 16-18 సార్లు చేయాలి. గాలిని ఊదేటప్పుడు తలని వెనక్కి బాగా వంచి గాలిగొట్టం తిన్నగా ఉండేటట్లు చూడాలి.

పై విధంగా చేసే కృత్రిమ శ్వాస పద్ధతిని ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ అంటారు. నీళ్ళలో మునిగినప్పుడు, పొగతో ఊపిరి ఆడనప్పుడు, విషం తీసుకున్నప్పుడు, గుండెపోటు వచ్చినప్పుడు, తలకి బలమైన దెబ్బ తగిలినప్పుడు, గొంతులోకి అడ్డుపడినప్పుడు శ్వాస ఆగిపోవడం సాధారణంగా జరుగుతుంది. ఇటువంటప్పుడు ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ అవసరమౌతుంది.

❑❑❑

# 8. గుండె ఆగిపోయినప్పుడు

గుండె పోటు, కరంట్ షాక్, గాలి ఆడకపోవడం, పొగలో చిక్కుకుని పోవడం, నీళ్ళలో మునిగిపోవడం, గొంతులో అడ్డం పడడం, పెద్ద గాయం తగలడం, తలకి దెబ్బ - ఇటువంటివి జరిగినప్పుడు అకస్మాత్తుగా గుండె ఆగిపోతుంది. కొందరిలో గుండె, శ్వాస రెండూ కూడా ఒకేసారి ఆగిపోవచ్చు.

4-6 నిముషాలలో తిరిగి గుండె, శ్వాస కొంతైనా వచ్చేటట్లు కృషి చేయాలి. లేదా ప్రాణమే పోతుంది. గుండె, శ్వాస రెండింటిని తిరిగి వచ్చేటట్లు చేసే ప్రక్రియని కార్డియో పల్మనరి రీసక్సిటేషన్ (సి.పి.ఆర్.) అంటారు.

ఒక విషయం మాత్రం తెలుసుకోవాలి. కొన్ని సందర్భాలలో శ్వాస తీయడం ఆగిపోయినా గుండె కొట్టుకుంటూనే ఉంటుంది. కానీ గుండె ఆగిపోతే వెంటనే శ్వాస కూడా ఆగిపోతుంది. దానికి కారణం రక్తప్రసరణ ఆగిపోవడం. మెదడుకి ఆక్సిజన్ అందకపోవడం. అందుకని అకస్మాత్తుగా గుండె ఆగిపోయినప్పుడు గుండెను తిరిగి ఆడేటట్లు చేయడమే కాకుండా ఊపిరి కూడా తిరిగి పోసుకునేటట్లు కృషి చేయాలి.

అకస్మాత్తుగా గుండె, శ్వాస ఆగి ప్రాణంపోయినప్పుడు ఆ వ్యక్తిని వెల్లకిలా పడుకోబెట్టాలి.

ఛాతికి మధ్య కాస్త దిగువున చేయి మీద చేయి పెట్టి ఒకటి ఒకటిన్నర అంగుళాల లోతుకి గట్టిగా అదమాలి. అలా నిముషానికి 70-80 సార్లు చేయాలి.

ప్రతి ఐదు కార్డియాక్ మసాజ్‌లకి (ఛాతి మీద చేయి పెట్టి గట్టిగా నొక్కడం) ఒకసారి నోటికి నోరు పెట్టి గాలి గట్టిగా ఊదాలి.

ఒకవేళ ప్రథమ చికిత్స తెలిసిన వ్యక్తి ఒకరే ఉంటే ప్రతి 15 కార్డియాక్ మసాజ్‌లకి రెండు సార్లు నోటికి నోరు పెట్టి గాలి ఊదాలి.పై విధంగా నిముషానికి కనీసం 70-80 సార్లు కార్డియాక్ మసాజెస్, 18-20 సార్లు ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ చేయాలి.

చంటి పిల్లల్లో గుండె ఆగిపోతే ఛాతి మధ్యలో ఒక వేలు పెట్టి గట్టిగా నొక్కి వదులుతూండాలి. నోటితో గాలి ఊదాలి.

కాస్త పెద్ద పిల్లలయినట్టయితే ఒక చేత్తో ఛాతి మధ్య గట్టిగా నొక్కుతూ నోటిలో నోరు పెట్టి గాలి ఊదాలి.

□□□



# 9. బెణికితే

నడుస్తూంటే కాలు స్లిప్ అయి మెలి పడవచ్చు. లేదా బెణకవచ్చు. ఇటువంటి కేసుల్లో ఎముకలు విరగడం, తొలగడం ఉండవు. కానీ వాపు వచ్చి చాలా నొప్పి అనిపిస్తుంది.

బెణికితే కొందరు తోముతారు. తోమడం తప్పు. తోమడం వల్ల నలిగిన కండరాలు మరింత నలుగుతాయి. పగిలిన రక్త నాళాలు మరింత పగులుతాయి.

బెణికినప్పుడు 2,3 రోజులు కదల్చకుండా ఆ భాగానికి రెస్ట్ ఇవ్వాలి. రెండు రోజుల పాటు బెణికిన చోట ఐస్‌తో కాపడం పెట్టాలి. దాని వల్ల నొప్పి తగ్గడమే కాకుండా వాపు పెరగడం ఉండదు. కొందరికి బెణికిన చోట రక్తం గూడు కడుతుంది. ఇటువంటి వారు మూడు,నాలుగు రోజులు వేడి నీళ్ళు కాపడం పెట్టాలి.

❑❑❑

# 10. కీళ్ళు జారితే

కొందరికి గూడఎముక తరచు జారుతుంది. దానిని తిరిగి పొజిషన్‌లో పెట్టి వారం-పది రోజులు కదలకుండా కట్టు కట్టి ఉంచాలి. గూడ కీలు జారినా, తొంటి కీలు జారినా, దానిని తిరిగి పొజిషన్‌లో పెట్టడం తెలుసుకోవాలి.

❑❑❑

# 11. ఎముకలు విరిగితే

ఎముకలు విరగడాన్నే ఫ్రాక్చర్స్ అంటారు. ఎముక విరిగిన చోట వాపు వస్తుంది. ఆకారంలో కొంత మార్పు వస్తుంది. నొప్పిగా ఉంటుంది. కదిపితే ఎముక విరిగిన చోట గర గర మంటూ అసాధారణ శబ్దం వస్తుంది.

ఎముక విరిగితే, విరిగిన స్థలంలో కదలిక లేకుండా చేయాలి. వీలయినంత వరకు మామూలుస్థితికి తీసుకువచ్చి, కదలకుండా బద్దలతో గానీ, పొడుగుపాటి అట్టముక్కలతో గానీ సపోర్టు చేసి కట్టు కట్టాలి.

మణికట్టు దగ్గర విరిగితే మోచేతి కింద సపోర్టుగా బద్దలుగానీ, అట్ట ముక్కలుగానీ పెట్టి కట్టు కట్టాలి. ఆ తరువాత మోచేతి దగ్గర వంచి మెళ్ళో నుంచి ఒక గుడ్డవేసి అందులో చేయి పెట్టాలి.

మోచేతి పైన విరిగినా, గూడ జారినా, కాలర్ బోన్ విరిగినా. మెడలో నుంచి ఓ తుండు గుడ్డ వేసి, అందులో చేయి పెట్టి కదలకుండా చేయాలి.

కాలు ఎముక, తొడ ఎముక విరిగినప్పుడు, తొడ దగ్గర్నుంచి పలచని బద్దలు వేసి కదలకుండా కట్టు కట్టాలి. నడవకుండా మోసుకు వెళ్ళాలి.

వెన్నుపూస ఎముకలు విరిగినప్పుడు వెడల్పాటి చెక్క మీద వెల్లకిలా పడుకోబెట్టి డాక్టర్ దగ్గరికి తీసుకువెళ్ళాలి.

మెడ దగ్గర ఎముకలు విరిగినప్పుడు తల కదలకుండా రెండు పక్కల ఇసుక దిండ్లు పెట్టి పడుకోపెట్టి డాక్టర్ దగ్గరికి తీసుకువెళ్ళాలి.

❑❑❑

# 12. విష పాము కరిస్తే

అన్ని పాములు విష పాములు కాదు. త్రాచుపాము, కట్లపాము, రక్త పింజిర, మినినాగు, సముద్ర సర్పాలు మాత్రమే విషసర్పాలు.

విష సర్పం కరిచినప్పుడు కరిచిన చోట రెండు కోరల గాట్లు కనబడతాయి. ఆ గాట్లు నుంచి 1,2 చుక్కలు రక్తం కారుతుంది. విషసర్పం కరిచిన చోట 10-15 నిముషాలలో వాపు వస్తుంది. నొప్పి అనిపిస్తుంది. ఆ పైన నిదానంగా మనిషిలో మగత ఏర్పడుతుంది. గుండె బరువు ఎక్కుతుంది. నాడి నిదానం అవుతుంది. బి.పి.తగ్గిపోతుంది.

విషపాము కరవగానే కరిచిన పై భాగంలో గుడ్డ పెట్టి గట్టిగా కట్టుకట్టాలి. నోట్లో పుళ్ళు లేని వ్యక్తిచేత కరిచిన చోట నుంచి విషాన్ని పీల్పించి ఉమ్మి వేయించాలి.

పాము కరచినప్పుడు కరచిన చోట, ఆ పై భాగంలోనూ ఐస్ గడ్డలతో కాపడం పెట్టాలి.దాని వల్ల విషం పైకి వెళ్ళదు.

విషపాము కరిచినప్పుడు ఆ భాగాన్ని కదపకుండా ఉంచాలి. ఒకవేళ కాలికి పాము కరిచినప్పుడు నడిస్తే కండరాల కదలికతో విషం త్వరగా పైకి వెళుతుంది. అందుచేత కరిచిన భాగాన్ని కదల్చకుండా ఉంచాలి. వీలైనంత త్వరగా డాక్టర్ దగ్గరికి తీసుకువెళ్ళి యాంటిస్నేక్ వీనం ఇప్పించాలి.

❑❑❑

# 13. తేలు కుడితే

సాధారణంగా తేలు కుడితే ఎటువంటి ప్రమాదం జరగదు. కానీ నొప్పి ఉంటుంది. నొప్పి తగ్గడానికి తేలు కుట్టిన చోట జైలోకైన్ ఇంజక్షన్ 1 సి.సి. ఇచ్చినట్లయితే వెంటనే

నొప్పి తగ్గిపోతుంది. ఆ పైన తేలు కుట్టిన దుష్ఫలితాలు ఏమైనా ఉన్నాయేమో కొంతసేపు పరిశీలించాలి.

బి.పి. పడిపోవడం, నాడి నిదానం అవడం లాంటి షాక్ లక్షణాలు కనబడితే వెంటనే హైడ్రోకార్టిజోన్ ఇంజక్షన్ ఇవ్వాలి, నరానికి గ్లూకోజ్ సెలైన్ పెట్టాలి.

❑❑❑

# 14. పిచ్చి కుక్క కరిస్తే

పిచ్చికుక్క కరిస్తే కొందరికి కరిచిన చోట ఆకు పసరు కట్లు కడతారు. దాని వల్ల ఫలితం లేదు సరికదా నష్టం ఉంది.

పిచ్చి కుక్క కరిచినప్పుడు వెంటనే ఆ గాయాన్ని కార్బాలిక్ సోప్‌తో శుభ్రంగా కడగాలి. **లేదా** పొటాషియం పర్మాంగనేట్ సొల్యూషన్‌తో కడగాలి. పిచ్చి కుక్క కరిచిన గాయం ఎంత పెద్దదైనా సరే కుట్లు వేయకూడదు. కేవలం యాంటిసెప్టిక్ అయింట్‌మెంట్‌గానీ, లోషన్ గానీ వేసి కట్టు కట్టాలి.

పిచ్చి కుక్క కరిచిన వారు కోర్సుగా యాంటిరేబీస్ వ్యాక్సీను చేయించుకోవాలి.

పిచ్చి కుక్క కరిస్తే ఎటువంటి పథ్యాలు లేవు. అన్నీ తినవచ్చు. అన్నింటిలో మామూలుగా ఉండొచ్చు.

❑❑❑

# 15 ఒళ్ళు కాలితే

వంటింట్లో పనిచేస్తున్నప్పుడు, ఇతరత్రా పనులు చేస్తున్నప్పుడు చేతుల మీద, కాళ్ళ మీద, ఇతర చోట్ల వేడిగా ఉన్నవి పడి కాలడం జరుగుతుంది. ఇటువంటప్పుడు కాలిన చోట వెంటనే చల్లని నీళ్ళు గాని, ఐస్ నీళ్ళుగానీ పోయాలి. మంట తగ్గేవరకు చల్లని నీళ్ళలో ముంచి ఉంచాలి. నీళ్ళు పోస్తే బొబ్బలు వస్తాయని కొందరు అపోహ పడతారు. అది నిజం కాదు. నీళ్ళు పోయకపోతే బొబ్బలు ఎక్కువ అవుతాయి. కాలిన చోట చన్నీళ్ళు పోస్తేనే తక్కువ నష్టం కలుగుతుంది.

కట్టుకున్న దుస్తులకి నిప్పంటుకున్నప్పుడు బకెట్‌తో ఒంటి మీద నీళ్ళు పోసేయడం గానీ, మందపాటి దుప్పటితో ఒళ్ళంతా గట్టిగా చుట్టేసి పడుకోపెట్టడం గానీ చేయాలి. దాంతో మంటలు ఆరిపోతాయి. లేదా బట్టలకు నిప్పంటుకున్నప్పుడు కింద పడుకోబెట్టి దొర్లించాలి.

❑❑❑

## 16. కంట్లో నలక పడితే

కంట్లో ఇసుక, బొగ్గు రేణువులు పడటం సహజం. ఇటువంటప్పుడు కంట్లో గ్లాసుతో నీళ్ళు పోస్తూ కడగాలి. దాంతో కంట్లో పడ్డ నలక బయటికి వచ్చేస్తుంది. కంట్లో నలక పడ్డప్పుడు నలపడం గానీ, నాలిక కంట్లో పెట్టి తిప్పడం గానీ చేయకూడదు.

❑❑❑

## 17. కంట్లో యాసిడ్ పడితే

ప్రమాదవశాత్తు కంట్లో యాసిడ్ పడవచ్చు. వెంటనే నీళ్ళతో కళ్ళు కడిగివేయాలి. ఆ పైన డాక్టర్‌కి చూపించి మందు వాడాలి.

గమనిక :

*ప్రథమచికిత్సతో ప్రమాదకర పరిస్థితుల్లో వ్యక్తులని రక్షించినా అంతటితో చికిత్స పూర్తి అయినట్లు కాదు. వీలయినంత త్వరగా డాక్టర్‌కి చూపించి తదుపరి చికిత్స చేయించాలి.*

❑❑❑

## 18. ఫస్ట్ ఎయిడ్ బాక్స్

ప్రతి ఇంట్లోనూ ఫస్ట్ ఎయిడ్ బాక్స్ ఉండాలి. అందులో ప్రధానంగా ఉండవలసినవి

1. దూది.
2. బాండేజి క్లాత్.
3. టించర్ ఐడిన్.
4. బోరిక్ పౌడర్ లేదా యాంటిసెప్టిక్ పౌడర్.
5. సిజర్స్.
6. ప్లాస్టర్.
7. బ్లేడు.
8. పొటాషియం పర్మాంగనేట్ క్రిస్టల్స్.
9. హైడ్రోజన్ పెరాక్సైడ్
10. డెట్టాల్
11. థర్మామీటరు.
12. ఆస్పిరిన్ బిళ్ళలు.

❑❑❑

# 22. వ్యాధులు - మందులు

ఈ అధ్యాయంలో వివిధ వ్యాధులకి సాధారణంగా వాడే మందులు, వాటి మోతాదు ఇవ్వడమైంది. రోగి ఆరోగ్యం బట్టి, వ్యాధి తీవ్రత బట్టి మందుని, మందు మోతాదుని నిర్ణయించడం జరుగుతుంది. ఈ 'మందుల చిట్టా'లో ఒకే వ్యాధికి ఎన్ని రకాల మందులు మార్కెట్టులో ఉన్నాయో తెలియడానికి సాధారణంగా వాడే వాటిల్లో కొన్ని ఈ దిగువ ఇవ్వడం జరిగింది. ప్రతివ్యాధికీ అనేక రకాల మందులు ఉండటమే కాకుండా, ఒకే మందుని అనేక మందుల కంపెనీలు తయారు చేస్తాయి. డాక్టర్ తన అనుభవాన్ని, మందు మంచి చెడులని దృష్టిలో పెట్టుకుని వాటిల్లో కొన్నింటినే సెలెక్టెడ్‌గా వాడటం జరుగుతుంది. సాధారణంగా ఎక్కువ మంది డాక్టర్స్ వాడేవాటిని దృష్టిలో పెట్టుకుని వివిధ వ్యాధులకి సంబంధించిన మందులని ఈ దిగువ ఇవ్వడం జరిగింది. మందు బిళ్లలు లేదా ఇంజక్షన్ల పవర్‌ని యం.జి అనీ, మి.గ్రాం. అనీ తెలపడం జరిగింది. యం.జి అన్నా, మి.గ్రాం. అన్నా ఒకటే.

❑❑❑

## కడుపులో మంట, గ్యాస్, గ్యాస్ట్రిక్ అల్సర్

| | | |
|---|---|---|
| 1. | GELUSIL MPS | Tablets,LIquid |
| 2. | DIGENE | Tablets, Liquid, |
| 3. | DIOVOL FORTE | Suspension, |
| 4. | LOGASCID | Tablets, Suspension, |
| 5. | POLYCROL FORTE | Tablets, Suspension. |

పై మందు బిళ్ళలు **లేదా** లిక్విడ్ ప్రిపరేషన్ ఏదైనా సరే కడుపులో మంట, ఉబ్బరం ఉన్నప్పుడు వాడాలి. మామూలుగా భోజనం తరువాత రెండు బిళ్ళలు చప్పరించాలి **లేదా** రెండు చెంచాలు లిక్విడ్ వేసుకోవాలి. రాత్రి నిద్రపోయే ముందు రెండు బిళ్ళలు **లేదా** రెండు చెంచాల మందు తీసుకోవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| 6. | ZINETAC | 150 mg. | **or** | 300 mg. |
| 7. | ULCITAB | 150 mg. | **or** | 300 mg. |
| 8. | HISTAC | 150 mg. | **or** | 300 mg. |
| 9. | FAMONIT | 20 mg. | **or** | 40 mg. |
| 10. | FAMOCID | 20 mg. | **or** | 40 mg. |
| 11. | OMEZ | 20 mg. | | |
| 12. | OCID | 20 mg. | | |
| 13. | OMEZOL | 20 mg. | | |
| 14. | LANZOL | 30 mg. | | |

ఈ బిళ్ళలు ముఖ్యంగా కడుపులో అల్సర్ ఉన్నవారికి వాడబడతాయి. 20 mg. బిళ్ళలు ఉదయం ఒకటి, రాత్రి ఒకటి వాడాలి. 40 mg. బిళ్ళలు రాత్రిపూట పడుకునేముందు ఒకటి వేసుకుంటే చాలు. కడుపులో పుండు లేకుండా కూడా మంట, ఉబ్బరం ఉన్నవాళ్ళు ఈ బిళ్ళలు 3 నుంచి 5 రోజులవరకు తాత్కాలికంగా వాడవచ్చు.

15. SIZA 10 mg. Tablets.
16. CISAPID 10 mg. Tablets.
17. CISAPRO 10 mg. Tablets

భోజనం చేయగానే కడుపు ఉబ్బరంగా అనిపించేవారు ఈ పై బిళ్ళలని భోజనానికి పావుగంట ముందు ఒకటి వేసుకోవాలి లేదా ఉబ్బరం అనిపించినపుడు ఒకటి వేసుకోవాలి. దీనివల్ల కడుపులో గ్యాస్ నిలిచి ఉండదు. కడుపులో గ్యాస్ చేరి పాలు కక్కే పిల్లలకి ఈ మందుకి సంబంధించిన లిక్విడ్ ప్రిపరేషన్ పాలు త్రాగే ముందు పట్టాలి. ఈ బిళ్ళలు వాడే వారిలో విరోచనం కూడా సాఫీగా అవుతుంది. మలబద్ధకం ఉన్నవారు ఉదయం ఒకటి, మధ్యాహ్నం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున వాడితే తేలికగా విరోచనం అవుతుంది. కడుపు బరువు ఉండదు.

□□□

# జీర్ణాశయం ప్రేగులు నొప్పి

1. ANTRENYL Tablets.
2. BARALGAN Tablets.
3. COLIMEX Tablets.
4. CYCLOPAM Tablets.
5. MEFTAL - SPAS Tablets.

మెలిపెట్టే పేగు నొప్పి ఉన్నప్పుడు పై బిళ్ళల్లో ఏదో ఒకటి ప్రతి 6 గంటలకి ఒకటి చొప్పున వాడాలి.

6. MUCAINE GEL.
7. VISCO GEL.
8. PEPTICAIN GEL.

పై లిక్విడ్ ప్రిపరేషన్‌లు జీర్ణాశయంలో నొప్పి, అన్నవాహికలో మంట ఉన్నప్పుడు వాడతారు. తడవకి రెండు చెంచాలు చొప్పున రోజుకి నాలుగు లేదా ఐదు సార్లు వాడాలి.

9. CYCLOPAM Drops.
10. COLIMEX Drops.
11. SPASMINDON Drops.

రెండు బిళ్ళలు వేసుకోవాలి. ఆ తరువాత రెండు గంటలకి 15 నిముషాలపాటు ఎండలో ఉండాలి.

3. MELANOCYL Solution.
4. MELANOCYL Ointment.
5. NEOSORAILIN Tablets.
6. NEOSORALIN Ointment.
7. PLACENTREX Solution

తెల్ల మచ్చలు ఉన్న చోట పై ఆయింట్‌మెంట్లుగానీ, సొల్యూషన్‌గానీ రాయాలి.

8. PARAMINOL Cream

తెల్లపొడ పోవడానికి పై ఆయింట్‌మెంట్లు, సొల్యూషన్లు పొడమీద రాసినప్పుడు తెల్లపొడ చుట్టూ ఉండే ఆరోగ్యకరమైన చర్మం దెబ్బతినకుండా ఆ ప్రాంతంలో పారామినాల్ క్రీము రాయాలి. లేని పక్షంలో తెల్ల పొడ ప్రక్కనున్న చర్మం బొబ్బలెక్కడానికి అవకాశం ఉంది.

❑❑❑

## వాపులు తగ్గడానికి

1. THROMBOPHOB Ointment

కొందరికి ఏదైనా ఇన్‌ఫెక్షన్ వచ్చినా, గడ్డలు వచ్చినా చేతికి సెలైన్ పెట్టినా వాపుగా రావచ్చు. వాపుపైనా థ్రోంబోఫోబ్ ఆయింట్‌మెంట్ రోజుకి రెండుసార్లు రాస్తే వాపు త్వరగా తగ్గుతుంది. గడ్డ త్వరగా కరుగుతుంది.

2. HIRUDOID Ointment

చీముగడ్డలు, నరాల వాపులు, బొప్పి కట్టడాలు, ఉన్నప్పుడు, దానిపైన రోజుకి రెండుసార్లు ఈ ఆయింట్‌మెంట్ రాయాలి. కొందరికి ఆపరేషన్ చేయగా, గాయాలు అవగా ఆ ప్రదేశంలో కండిలాగా తయారవుతుంది. అలా గట్టి పడిన టిష్యూ మెత్తబడటానికి, కండె తరగడానికి హిరుడాయిడ్ ఆయింట్‌మెంట్ రోజుకి రెండుసార్లు రాయాలి.

❑❑❑

కేన్సర్‌కి మందులు డాక్టర్ పర్యవేక్షణలో జాగ్రత్తగా వాడాలి. కొందరికి మందులు వాడే ముందు రక్త పరీక్షలు జరపవలసి వస్తుంది.

1. ALKERAN Tablets 2 mg, 5mg.
2. ALKERAN Injection 50mg.



| | |
|---|---|
| 3. AQUAPLAT | Injection 10mg. |
| 4. BIOTREXATE | Injection 5mg, 50mg. |
| 5. BLEOCIN | Injection. |
| 6. CISPLATIN | Injection. |
| 7. CYCLOXAN | Tablets, Injection. |
| 8. CYTOCRISTAN | Injection. |
| 9. CYTRABIN | Injection. |
| 10. DOXORUBICIN | Injection. |
| 11. DROGENIL | Tablets. |
| 12. ENDOXAN | Tablets. Injection. |
| 13. ETOSID | Injection. |
| 14. FLURACIL | Injection & Capsules. |
| 15. LEUKERAN | Tablets. |
| 16. LEUNASE | Injection, |
| 17. MAMOFEN | Tablets. |
| 18. MESNA | Injection. |
| 19. METHOREXATE | Tablets. |
| 20. MITOMYCIN - C | Injection. |
| 21. MYLERAN | Tablets. |
| 22. TAMOFEN | Tablets. |
| 23. VINCRISTINE | Injection. |

కేన్సర్‌బట్టి మోతాదు, కోర్స్ ఉంటుంది. కేన్సర్ స్పెషలిస్ట్ నిర్ధారించిన మేరకు మోతాదు వాడాలి.

❑❑❑

# గౌట్

1. XYLORIC Tablets 100mg

తడవకి ఒకటి, రెండు బిళ్ళలు చొప్పున రోజుకి మూడు సార్లు.

❑❑❑

# మద్యం మానడానికి

1. ANTADICT (Disulfiram) 250 mg Tablets.
2. ESPERAL (Disulfiram) 250 mg Tablets.

*ఈ పై మందుల్లో ఏదో ఒకటి డాక్టర్ పర్యవేక్షణలో మొదటి రోజు నాలుగు బిళ్ళలు, రెండవ రోజు మూడు బిళ్ళలు, మూడవ రోజు రెండు బిళ్ళలు, నాలుగవ రోజు ఒక బిళ్ళ వాడాలి. ఆ తరువాత డాక్టర్ సలహా మేరకు మందులు కంటిన్యూ చేయాలి.*

# గమనిక

* ఏ మందుకైనా రియాక్షన్ రావచ్చు.
* వాడే మందు గురించి పూర్తి వివరం తెలిసి ఉండడం అవసరం.
* మందు మోతాదు ఎంత కాలం వాడవలసింది తెలుసుకోవాలి.
* మందులకి వచ్చే సైడ్ ఎఫెక్ట్స్, రియాక్షన్స్ తెలిసి ఉండాలి.
* మందు రియాక్షన్ వస్తే దానికి విరుగుడు, తీసుకోవలసిన జాగ్రత్తలు తెలిసి ఉండాలి.

❑❑❑

# మరొక విషయం

క్రొత్తగా వచ్చే మందులు, వివిధ వ్యాధులకి వాడే మందులు వాటి మోతాదులు తెలిపేందుకు

MIMS - (మాస పత్రిక)

DRUG TODAY - (మూడు మాసముల కొకసారి)

CIMS - (నాలుగు మాసముల కొకసారి)

అనే పత్రికలు క్రొత్త సమాచారంతో వెలువడతాయి. ఎప్పటికప్పుడు క్రొత్త మందులు, వాటి వివరాలు తెలుసుకోవడానికి వీటిని చదవాలి. ఏ మందు అయినా వాడే ముందు అది ఎందుకు వాడేదీ, ఎలా వాడేదీ, వాటి సైడ్ ఎఫెక్ట్స్ తెలుసుకోవాలి. పై పత్రికల్లో ఆ వివరాలు క్లుప్తంగా ఉంటాయి.

❑❑❑

## మద్యపానం తెచ్చే అరిష్టం

కడుపులో పుండు.
కడుపులో కేన్సర్.
నరాల బలహీనత.
మెదడు మొద్దబారటం, పనిలో నైపుణ్యం తగ్గడం.
మూత్రపిండాలు దెబ్బతినడం.
కాలేయం డామేజి - పొట్టకి నీరు.
గుండె సాగిపోవడం.
కండరాల పటుత్వం తగ్గడం
శరీరం కంట్రోలు తప్పడం.
ఇల్లు - ఒళ్లు గుల్ల.
నైతిక పతనం.

## మద్యం అలవాటు 'నరకానికి' మెట్టు

# 23. లేబరేటరీ పరీక్షలు-పద్ధతులు

## లేబరేటరీకి కావలసిన కనీస పరికరాలు

- ✤ మైక్రోస్కోప్
- ✤ సెంట్రిఫ్యూజ్
- ✤ కలోరిమీటర్
- ✤ వాటర్‌బాత్
- ✤ రొటేటర్
- ✤ టెస్ట్ ట్యూబ్స్, సెంట్రిఫ్యూజ్ ట్యూబ్స్, స్టాండ్ E.S.R ట్యూబ్స్, స్టాండ్సు, గ్లాస్ స్లైడ్స్, కవర్‌స్లిప్స్.
- ✤ ఫ్రిజ్

పై పరికరాలు అన్ని రకాల పరీక్షలకి అవసరం.

## 1. మూత్ర పరీక్ష - చేయు విధానం

* **షుగర్ పరీక్ష:** టెస్ట్ ట్యూబ్‌లో 5CC బెన్‌టిక్ట్ ద్రవం తీసుకొని స్పిరిట్ ల్యాంప్‌మీద వేడి చేసిన తరువాత డ్రాపర్ సహాయంతో 8 చుక్కలు మాత్రము కలిపి తిరిగి స్పిరిట్ ల్యాంప్ మీద బాగా వేడిచేయాలి. షుగర్ ఉన్న యెడల బెన్‌టిక్ట్ ద్రవము రంగు మారుతుంది. బెన్‌టిక్ట్ ద్రవము రంగు - నీలము రంగు

ఆకుపచ్చ రంగులోకి మారితే - (+) లేక 0.5%

పసుపు పచ్చ రంగులోకి మారితే - (++) లేక 1%

నారింజ రంగులోకి మారితే - (+++) లేక 1.5%

ఇటుక రాయి రంగులోకి మారితే - (++++) లేక 2%

ఈ రకంగా మారిన రంగును బట్టి మూత్రములో షుగర్ ఎంత ఉందో చెప్పవచ్చు.

మూత్రములో షుగర్‌ని "డిప్‌స్టిక్స్" ద్వారా కూడా తెలుసుకోవచ్చు.

* **అల్బుమిన్ :** టెస్ట్ ట్యూబులో సగానికంటే ఎక్కువగా మూత్రము తీసుకొని ట్యూబ్‌ను ఏటవాలుగా ఉంచి స్పిరిట్ దీపము మీద మూత్రము పై భాగాన్ని వేడి చేయాలి. వేడి

చేసిన భాగంలో తెల్లగా వస్తే అది ఫాస్ఫేట్స్ లేక అల్బుమిన్ అని అర్థం. తరువాత 2,3 చుక్కలు గ్లేషియల్ ఎసిటిక్ యాసిడ్ కలపాలి.

తెల్లని భాగం కరిగిపోతే - అవి ఫాస్ఫేట్సు

కరగకుండా ఉంటే - అల్బుమిన్

* **డిపాజిట్స్:** సెంట్రిఫ్యూజ్ ట్యూబులో సగం వరకు మూత్రము తీసుకొని సెంట్రిఫ్యూజ్‌లో ఉంచి కొన్ని నిమిషాలు సెంట్రిఫ్యూజ్ చేయాలి. తరువాత ట్యూబ్‌లోని మూత్రము అంతా పారబోసి కింద మిగిలిన ఒక చుక్కను గ్లాస్‌స్లైడ్ మీద వేసి దాని మీద కవర్‌స్లిప్ వేయాలి. దానిని మైక్రోస్కోప్‌లో హైపవర్‌లో చూడాలి.

మూత్రములో జబ్బు ఉన్న యెడల ఈ కింది కణాలు మైక్రోస్కోప్‌లో కనబడతాయి. అవి ఎర్ర రక్త కణాలు (RBC), తెల్ల రక్తకణాలు లేక చీము కణాలు (W.B.C), క్రిస్టల్స్, క్యాస్ట్సు మరియు ఎపిథిలియల్ కణములు.

**మూత్రములో కామెర్ల నిర్ధారణ :**

* **బైల్ సాల్టు :** టెస్ట్ ట్యూబులో మూత్రము తీసుకొని సల్ఫర్ పౌడర్ వేయాలి. సల్ఫర్ పౌడర్ నెమ్మదిగా క్రిందికి దిగినయెడల బైల్‌సాల్టు ఉన్నాయని అర్థం. పౌడర్ దిగకుండా మూత్రము మీద తేలుతూ ఉన్నట్లయితే బైల్‌సాల్టు లేవని అర్థం.

* **బైల్ పిగ్‌మెంట్సు :** టెస్ట్ ట్యూబ్‌లో సుమారు 10cc మూత్రానికి 5cc 10% క్లోరైడు కలపగా ఏర్పడిన ప్రెసిపిటెడ్‌ను వాట్‌మెన్ ఫిల్టర్ పేపర్ సహాయంతో వడపోయాలి. వడపోత అయిన తరువాత ఫిల్టర్ పేపర్‌లో 2,3 చుక్కలు "ఫౌచెట్స్ ద్రవము" కలపాలి. ఆకుపచ్చ రంగు వస్తే - బైల్ పిగ్‌మెంట్సు ఉన్నట్లు

* **యూరోబైలినోజన్ :** టెస్ట్ ట్యూబ్‌లో సుమారు 5cc మూత్రానికి 1cc ఎర్లిచ్ ఆల్డిహైడ్ కలపాలి. ఎరుపురంగులోకి మారితే - యూరోబైలినోజన్ ఉన్నట్లు.

* **మూత్రములో "కీటోన్ బాడీస్" :** కోటోన్ బాడీస్‌ను తెలుసుకునే పౌడరును ఒక పేపర్ మీద కొంచెము తీసుకొని దానికి ఒక చుక్క మూత్రము కలిపితే వైలెట్ రంగులోకి మారితే - కోటోన్ బాడిస్ ఉన్నట్లు.

* **ఖైల్ :** టెస్ట్ ట్యూబ్‌లో 10cc యూరిన్ తీసుకొని కొంచెము ఈథర్ కలిపి బాగా కుదపాలి. పైన ఏర్పడే భాగాన్ని తీసుకొని మైక్రోస్కోప్‌లో చూసి ఖైల్ ఉందో లేదో చెప్పవచ్చు.

* **మైక్రోఆల్బుమిన్ పరీక్ష:** ఈ పరీక్ష ద్వారా మూత్రములో అతి తక్కువ పరిమాణములో

ఉండే అల్బుమిన్‌ను తెలుసుకోవచ్చు. మూత్రములో ముంచి లేపే స్టిక్స్ ద్వారా ఈ పరీక్ష చేస్తారు.

ఈ పైన పేర్కొన్న పద్ధతుల ద్వారా కాకుండా ప్రస్తుతం లభ్యమయ్యే "మల్టీ స్టిక్స్' ద్వారా మూత్రములోని పదార్థాలను తెలుసుకోవచ్చు.

**మూత్రం ద్వారా ప్రెగ్నెన్సీ నిర్ధారణ పరీక్ష :** ఇవి రెండు రకములు

స్లైడ్ టెస్ట్

ఎలైసా టెస్ట్ మరియు ప్రెగ్‌కలర్

స్లైడ్‌టెస్ట్‌లో పిరియడ్స్ ఆగిన ఆరు లేక ఏడు రోజులకు కాని గర్భవతి అవునో కాదో తెలియదు.

ఎలైసా లేక ప్రెగ్‌కలర్ పద్ధతిలో పిరియడ్స్ ఆగిన తరువాత 1 లేక 2 రోజులకే గర్భవతి అవునో కాదో తెలుసుకోవచ్చు.

❏❏❏

# 2. రక్తపరీక్షలు - చేయువిధానం

**హీమోగ్లోబిన్ % (రక్త శాతము) :** శాహ్లిస్ హీమోమీటర్ సహాయంతో రక్తశాతము (Hb%) ఎంత ఉందో తెలుసుకోవచ్చు. హీమోగ్లోబిన్ ట్యూబ్‌లో క్రింద 2 మార్కు వరకు N/10 Hcl తీసుకోవాలి. ఇంజక్షన్ సూదితో వేలిని పొడిచి హీమోగ్లోబిన్ పిప్పెట్టులోని గుర్తుమేరకు రక్తము తీసుకొని ట్యూబులోని Hcl తో కలపాలి. 5 నిమిషాలు తరువాత ట్యూబ్‌లో కొద్దికొద్దిగా డిస్టిల్డ్ వాటర్ కలుపుతూ హీమోమీటర్‌లో ఉన్న స్టాండర్డ్‌తో పోల్చుకోవాలి. రంగు సరిపోయిన తరువాత ట్యూబ్‌ను బయటకు తీసి రీడింగ్ చూడాలి. ట్యూబ్‌కు ఒకవైపు గ్రాములలో వేరొక వైపు పర్సెంటైజ్జుగా అంకెలు ఉంటాయి. దాని ప్రకారం హీమోగ్లోబిన్ పర్సెంట్ తెలుసుకోవచ్చు. సాధారణంగా

మగవారికి 13.2 నుంచి 18 g/dl

ఆడవారికి 11.5 - 16.5 g/dl

**W.B.C టోటల్ కౌంటు (మొత్తం తెల్లకణాల సంఖ్య) :** వేలు చివర భాగము నుండి టోటల్ కౌంట్ పిప్పెట్‌లో 0.5 గుర్తు వరకు రక్తము తీసుకొని తరువాత పిప్పెట్‌లోని బల్బు పై భాగములో ఉన్న 11 మార్కు వరకు టీ.సి ద్రవము తీసుకోవాలి. పిప్పెట్‌ను రెండు చేతుల మధ్య సమాంతరముగా ఉంచి కుదపాలి.

తెల్ల రక్త కణముల సంఖ్యను లెక్క పెట్టడానికి న్యూబార్ ఛాంబర్ అనే ప్రత్యేకమైన స్లైడు ఉంటుంది. స్లైడు మీద కవర్‌స్లిప్ వేయాలి. టీ.సి. పిప్పెట నుండి మొదటి రెండు మూడు చుక్కలు వదిలివేసి తరువాత చుక్కను స్లైడు మీద కవర్‌స్లిప్ కింద నింపాలి. 5 నిమిషాల తరువాత న్యూబార్ ఛాంబర్‌లో నాలుగు ప్రక్కలా ఉన్న పెద్ద గళ్ళలోని తెల్ల రక్త కణములను మైక్రోస్కోప్ సహాయంతో లెక్కించాలి. తెల్ల రక్త కణములు స్లైడ్ మీద నీలము రంగులో కనబడుతాయి. నాలుగు మూలలలో గల గళ్ళలోని తెల్ల కణముల మొత్తము సంఖ్యను 50తో హెచ్చించగా క్యూబిక్ మిల్లి మీటరుకు గల మొత్తము తెల్ల కణముల సంఖ్య వస్తుంది.

సాధారణంగా ఉండే సంఖ్య (Normal Value) = 4,500 - 11,000 Cells / C.mm

## మొత్తము. ఎర్ర రక్తకణముల సంఖ్య (Total R B C Count)

ఎర్ర రక్త కణములను లెక్కించే పిప్పెట్‌లో 0.5 గుర్తు వరకు వేలు చివర నుండి రక్తము తీసుకోవాలి. తరువాత పిప్పెట్‌లోని 101 గుర్తు వరకు ఎర్ర రక్త కణముల ద్రవాన్ని తీసుకోవాలి. పిప్పెట్‌ను రెండు చేతుల మధ్య సమాంతరముగా ఉంచి కుదపాలి. 5 నిమిషాల తరువాత పిప్పెట్ నుంచి రెండు మూడు చుక్కలు వదిలివేయాలి. తరువాత చుక్కను న్యూబార్ ఛాంబర్ మీద కవర్‌స్లిప్ క్రింద నింపాలి. న్యూబార్ ఛాంబర్‌లో మధ్యలో ఉన్న చిన్న గళ్ళలో ఎర్ర రక్త కణములను మైక్రోస్కోప్ సహాయంతో లెక్కించాలి. వచ్చిన సంఖ్యను 10,000తో హెచ్చించాలి. సాధారణముగా ఉండే సంఖ్య.

| | | |
|---|---|---|
| పురుషులు | 4.6 - 6.2 | మిలియన్స్ / క్యూబిక్ మి.మి |
| స్త్రీలు | 4.2 - 5.4 | మిలియన్స్ / క్యూబిక్ మి.మి |

## ప్యాక్ట్‌సెల్ వాల్యూమ్ (P.C.V)

రక్తశాతము బాగా తక్కువ ఉన్న వారికి ఈ టెస్ట్ చేస్తారు. సిరల నుండి రక్తాన్ని 'ఇ.డి.టి.ఏ' లేక 'ఆక్జలేట్' లో తీసుకోవాలి. వీటి వలన రక్తము గడ్డ కట్టుకోకుండా ఉంటుంది. ఈ రక్తాన్ని "హియాటోక్రిట్" ట్యూబులో 100 మార్కు వరకు నింపాలి. తరువాత ట్యూబ్‌ను సెంట్రిఫ్యూజులో 30 నిమిషములు తిప్పాలి. తిప్పిన తరువాత ట్యూబ్‌లో ప్యాక్ట్ సెల్స్ రీడింగ్ చూడాలి.

సాధారణ సంఖ్య (నార్మల్ వాల్యూ)

పురుషులు 40-54%

స్త్రీలు 38 - 47%

**డిఫరెన్షియల్ కౌంట్ (తెల్ల రక్త కణములలో ఉన్న 5 రకముల కణముల నిష్పత్తి) :** రెండు గ్లాస్ స్లైడ్‌లు తీసుకోవాలి. ఒక స్లైడ్‌కు ఒక చివర వేలు చివర భాగము నుండి ఒకటి లేదా రెండుచుక్కలు రక్తాన్ని అంటించాలి. రెండో స్లైడ్ యొక్క అంచును మొదటి స్లైడ్ మీద ఉన్న రక్తానికి ఆనించి నెమ్మదిగా వెనక్కి లాగాలి. ఈ విధంగా చేయటం వలన స్లైడ్ మీద పలుచని రక్తపు పొర (థిన్ ఫిల్మ్) ఏర్పడుతుంది.

**స్టైయినింగ్ పద్ధతి :** రక్తపు పొర ఆరిన తరువాత స్లైడ్ మీద సుమారు 10 చుక్కలు "లీష్‌మెన్ స్టైయిన్" వేసి ఒక నిమిషము ఆగాలి. తరువాత 10 నుండి 15చుక్కలు డిస్టిల్డ్ వాటర్ కలపాలి. అలా కలిపిన తరువాత స్లైడ్ మీద నోటితో ఊదుతూ ద్రవాన్ని కలపాలి. 10 నిమిషాల తరువాత స్లైడ్ మీద స్టైయిన్‌ను పారబోసి నీటితో కడిగి ఆరబెట్టాలి. ఆరిన తరువాత ఒక చుక్క "ఆయిల్" వేసి మైక్రోస్కోప్‌లో 'ఆయిల్ ఇమ్మర్షన్ లెన్స్' సహాయంతో 100 తెల్ల కణములను స్లైడ్‌ను కదుల్చుతూ లెక్కపెట్టాలి. ఈ రకంగా తెల్ల కణములలోని 5 రకాల నిష్పత్తి తెలుస్తుంది.

తెల్ల కణములోని రకాలు :

పాలీ మార్ఫ్స్ : 40-70%

లింఫోసైట్సు : 20-45%

ఇసినోఫీల్స్ : 2 - 6%

బేసోఫిల్స్ : 0 - 1%

మోనోసైట్సు : 2 - 8%

ఈ రకంగా స్టైయిన్ చేసిన స్లైడ్‌ను మైక్రోస్కోప్‌లో చూసి రక్తములోని "ఎబ్‌నార్మల్‌సెల్స్" (అరుదుగా ఉండే కణాలు)ను కూడా తెలుసుకోవచ్చు.

**E.S.R (ఎరిత్రోసైట్‌సెడిమెంటేషన్ రేట్):** ఈ పరీక్షకు కావలసింది."వెస్టర్‌గ్రెన్" ట్యూబ్ (Westergren Tube) ఈ ట్యూబ్ 0 నుండి 200 మి.మి వరకు విభజించబడి ఉంటుంది. 1.6 cc రక్తాన్ని 0.4 cc 3.8% సోడియం సిట్రేట్ ద్రవానికి కలపాలి. సోడియం సిట్రేటు వలన రక్తము గడ్డకట్టకుండా ఉంటుంది. ఈ మిశ్రమం నుండి ట్యూబులోని '0'

మార్కు వరకు రక్తాన్ని పీల్చాలి. తరువాత ఈ ట్యూబ్‌ను ఇ.యస్.ఆర్ స్టాండులో నిటారుగా గంటసేపు ఉంచాలి. తరువాత ఎర్రరక్త కణాలు ఎన్ని మి.మి దిగాయో తెలుసుకోవచ్చు.

సాధారణంగా పురుషులు 50 సంవత్సరములలోపు 15మి.మి/ గంటకు, 50 సం॥ పైవారికి 20 మి.మి/గంటకు,

స్త్రీలకు 50 సం॥ లోపు 20 మి.మి / గంటకు,

50 సం॥పైన 30 మి.మి / గంటకు.

**వి,డి.ఆర్.ఎల్ (V.D.R.L)** : సిఫిలిస్ సుఖవ్యాధి నిర్ధారణకు ఈ టెస్ట్ చేస్తారు. ఈ పరీక్షకు సీరమ్ కావాలి. రక్తము గడ్డ కట్టుకున్న తరువాత ట్యూబ్‌లోకి తీసుకొని సెంట్రిఫ్యూజు చేయగా పైన వచ్చు లేత పసుపు పచ్చని పదార్థాన్నే సీరమ్ అంటారు. ఒక చుక్క సీరమ్‌తో ఒక చుక్క వి.డి.ఆర్.ఎల్ యాంటిజన్‌ను వి.డి.ఆర్.ఎల్ స్లైడ్ మీద కలిపి 4 నిమిషాలు రోటేటర్ మీద తిప్పాలి. తరువాత మైక్రోస్కోప్‌లో చూడాలి.

**బ్లడ్ గ్రూప్** : స్లైడ్ మీద వేలు చివర నుండి 3 చుక్కలు రక్తము తీసుకోవాలి. మొదటి చుక్కకు "యాంటి ఎ" (Anti A) సీరమ్ రెండో చుక్కకు "యాంటి బి" (Anti B) మూడవ చుక్కకు యాంటి డి (Anti D) కలపాలి. స్లైడ్ మీద ఏర్పడిన క్లంప్స్ ఆధారంగా రక్తము ఏ గ్రూపుకు చెందినదో తెలుసుకోవచ్చు. 'ఓ' గ్రూపు వాళ్లు ఎక్కువ శాతము ఉంటారు. "AB" గ్రూపు వారు తక్కువ మంది ఉంటారు.

| | | |
|---|---|---|
| o | - | 44% |
| A | - | 40% |
| B | - | 10% |
| AB | - | 6% |

Anti D కలిపిన రక్తపు చుక్కలో క్లంపింగ్ (విరిగిపోయినట్లు) వస్తే Rh Factor ఉన్నట్లు (Rh Positive) క్లంపింగ్ రాకపోతే Rh Factor లేనట్లు (Rh Negative) స్లైడ్ మీద వేసిన మూడు రక్తపు చుక్కలలో క్లంపింగ్ వస్తే ఆ రక్తము AB పాజిటివ్ (AB '+') మూడు చుక్కలలో క్లంపింగు రాకపోతే 'O' నెగటివ్ (O'-') ప్రతి గ్రూప్‌లోను 95% మందికి Rh Factor ఉంటుంది.

**వైడాల్ టెస్ట్** : టైఫాయిడ్ జ్వరము నిర్ధారణకు ఈ పరీక్ష చేస్తారు. ఈ పరీక్షకు రక్తము గడ్డ కట్టుకున్నతరువాత వచ్చే "సీరమ్" కావాలి. వైడాల్ స్లైడ్ మీద నాలుగు చుక్కలు

సీరమ్ తీసుకొని వాటికి S-Typhi H, S-Typhi - O, Para - AH, Para BH యాంటిజన్స్‌ను ఒక్కొక్క చుక్క కలపాలి. స్లైడ్‌ను ముందుకు వెనక్కు కదుపుతూ ఒక నిమిషము తరువాత వెలుతురులో పరీక్షించాలి. క్లంపింగ్ (విరిగిపోయినట్లు) వస్తే వైడాల్ పరీక్ష పాజిటివ్.

□□□

# 3. కళ్లె, చీము పరీక్షలు

కళ్లెలోని బాక్టీరియాను AFB (యాసిడ్ ఫాస్ట్ బ్యాసిలై) స్టెయిన్ ఉపయోగించి నిర్ధారించవచ్చు.

**పద్ధతి :** గ్లాసు స్లైడ్ మీద కళ్లెను పలుచని పొరగా చేసి కొంచెము స్పిరిట్ దీపము మీద వేడి చేయాలి. తరువాత "కార్బాల్ ఫ్యూషిన్" స్టెయిన్ స్లైడు మీద ఎక్కువగా పోసి స్లైడ్‌ను స్పిరిట్ దీపము సహాయంతో కింది నుండి వేడిచేయాలి. తరువాత డిస్టిల్డ్ వాటర్‌తో స్లైడ్‌ను కడగాలి. తరువాత 20% సల్ఫ్యూరిక్ యాసిడ్‌తో కళ్లె పలుచని పొర మీద పోయాలి. సల్ఫ్యూరిక్ యాసిడ్ పారబోసేసి డిస్టిల్డ్ వాటర్‌తో కడగిన తరువాత స్లైడ్ మీద " మిథిలిన్ బ్లూ" వేసి ఒక నిమిషము స్లైడ్‌ను కడిగి ఆరబెట్టి మైక్రోస్కోప్‌లో చూడాలి.

క్షయ వ్యాధి క్రిమి గులాబి రంగులో కడ్డీల ఆకారములో మైక్రోస్కోప్‌లో కనబడుతుంది.

**చీము పరీక్ష :** చీమును స్లైడ్ మీద ఒక పలుచని పొరగా చేయాలి. తరువాత 'జన్షన్ వైలెట్' స్టెయిన్ స్లైడ్ మీద వేయాలి. తరువాత వరుసగా ఐయోడిన్, ఆల్కహాల్, వాడిన తరువాత చివరగా డైల్యూట్ కార్బాల్‌ఫ్యూషిన్ వేసి ఒక నిమిషము తరువాత కడిగి ఆరబెట్టి మైక్రోస్కోపులో చూడాలి.

□□□

# 4. బయోకెమికల్ టెస్ట్లు

రక్తములోని వివిధ పదార్థాలను తెలుసుకొనుటకు ప్రస్తుతము మార్కెట్‌లో 'కిట్స్' లభ్యమవుతున్నాయి. ఉదాహరణకు బ్లడ్ షుగర్, బ్లడ్ యూరియా, సీరమ్ క్రియాటినిన్, సీరమ్ బిలిరుబిన్, S.G.O.T., S.G.P.T సీరమ్ ఆల్కలైన్ ఫాస్ఫటేజ్, కొలెస్టరాల్, R.A. Factor, A.S.O, HBS Ag మొదలైనవి.

□□□

# 5. ఎయిడ్స్ టెస్ట్

ఎయిడ్స్ నిర్ధారణకు ప్రస్తుతము నాలుగైదు రకాల కిట్స్ లభ్యమవుతున్నాయి. పరీక్షకు కావలసిన అన్నికెమికల్స్ కిట్స్‌లో ఉంటాయి. అంతే కాకుండా పరీక్ష చేయవలసిన పద్ధతి కూడా కిట్‌లో ఉంటుంది. ఉదాహరణకు Tridot పద్ధతి చూద్దాం

ఈ టెస్ట్‌కు కావలసిన రోగి యొక్క సీరమ్, బఫర్, కాంజుగేట్ పదార్థాలను కిట్‌లో యిచ్చిన డివైజ్‌లో కలపాలి. ఎయిడ్స్ పాజిటివ్ అయితే నిర్దేశించిన ప్రాంతములో 'చుక్క' ఏర్పడుతుంది. ఎయిడ్స్ I & III పాజిటివ్ అయితే డివైజ్‌లో మూడుచుక్కలు వస్తాయి. ఈ Tridot పద్ధతి ద్వారా హెచ్.ఐ.వి. 1 మరియు హెచ్.ఐ.వి II లను తెలుసుకోవచ్చు.

"ఎలైజా టెస్ట్" ద్వారా కూడా ఎయిడ్స్ నిర్ధారించవచ్చు.

"వెస్ట్రన్ బ్లాట్ టెస్ట్" ద్వారా ఎయిడ్స్ కొరకు నిర్ధారణ చేస్తారు.

❑❑❑

# 6. మల పరీక్ష (మోషన్ టెస్ట్)

స్లైడ్ మీద ఒక చుక్క సెలైన్ తీసుకొని దానికి పుల్ల సహాయంతో కొంచెము మలము కలిపి, కవర్ స్లిప్ చేసి మైక్రోస్కోప్‌లో చూడాలి. దోషము ఉన్నట్లయితే పురుగుల యొక్కగ్రుడ్లు కాని, సిస్ట్‌లు గాని కనబడతాయి.

❑❑❑

# 7. వీర్య పరీక్ష

గుంట ఉండే ప్రత్యేకమైన గ్లాస్ స్లైడ్‌తో వీర్యాన్ని మైక్రోస్కోప్‌లో పరీక్ష చేయాలి. వీర్యకణములు ఉన్న యెడల కణముల సంఖ్యను లెక్కించాలి.

వీర్యాన్ని, తెల్లరక్త కణములను లెక్కించే పిప్పెట్‌లో 0.5 గుర్తు వరకు తీసుకొని తరువాత వీర్య కణములను లెక్కించే ద్రవాన్ని, పిప్పెట్‌లోని 11 మార్కు వరకు పీల్చాలి. 5 నిమిషముల తరువాత పిప్పెట్‌లో మొదటి రెండు మూడు చుక్కలు ద్రవాన్ని ఒదిలివేసి తరువాత చుక్కను న్యూబార్ ఛాంబర్‌లో కవర్‌స్లిప్ కింద నింపాలి. మైక్రోస్కోప్‌లో వీర్య కణముల సంఖ్యను లెక్కించాలి.

సాధారణంగా 40-110 మిలియన్స్ /cc వీర్య కణాలు ఉంటాయి.

❑❑❑

# 24. BLOOD TESTS - NORMAL VALUES

## HAEMOGRAM

| Investigations | Normal Range |
|---|---|
| Haemoglobin | 13.5 - 18.0 g/dl (Male) |
| | 11.5 - 16.4 g/dl ( Female) |
| Total R.B.C. Count | 4.6 - 6.2 millions / Cu. mm (Male) |
| | 4.2 - 5.4 millions / Cu. mm (Female) |
| Packed cell volume | 40 - 54% (M) |
| | 38 - 47% (F) |
| M.C.V. | 80 - 96 Cu. microns |
| M.C.H. | 27 - 31 Micro micrograms |
| M.C.H.C. | 32 - 36% |
| Reticulocyte count | 0.5 - 1.5% |
| Total W.B.C. Count | 4500 - 11000 Cells / Cu.mm |

## DIFFERENTIAL W B C COUNT

| | |
|---|---|
| Neutrophils | 40 - 70% |
| Lymphocytes | 20 - 45% |
| Eosinophils | 1 - 6% |
| Basophils | 0 - 1% |
| Monocytes | 2 - 8% |
| Platelet Count | 1.5 - 4.0 Lakhs / Cu.mm |
| Bleeding Time | 1 - 3 min |
| Clotting Time | 2 - 5 min |
| E.S.R. (Westergren method) | Under 50 yrs <15 mm/hr (M) |
| | over 50 yrs < 20 mm/hr (M) |
| | Under 50 yrs < 20 mm/hr (F) |
| | Over 50 yrs < 30 mm/hr (F) |

## BLOOD CHEMISTRY

| | |
|---|---|
| Blood Urea | 10 - 50 mg. / dl |
| Serum Creatinine | 0.6 - 1.5 mg. / dl |
| Serum Uric Acid | (M) 2.5 - 7.0 mg. / dl |
| | (F) 1.5 - 6.0 mg. / dl |

| | |
|---|---|
| Serum Sodium | 135 - 150 ME g /l |
| Potassium | 3.5 - 5.0 ME g /l |
| Chlorides | 95 - 105 ME g /l |
| CPK Nac | 24 - 195 U / L at 37 x C |
| LDH | 230 - 460 IU / L at 37 x C |
| Serum Bicarbonates | 24 - 28 ME g /l |
| Serum Calcium | 9 - 11 mg / dl |
| Serum Phosphorus | 2.5 - 4.8 mg / dl |
| Serum Anylase | 35 - 165 Somogyi Units M/F |
| Vandenbergh Reaction | No direct Reacion |
| Rheumatoid Factor | Negative |
| Australian Antigen ( Hbs Ag) | Negative |
| A.S.O. Titre | Up to 200 IU / ml |

## WIDAL TEST

| | |
|---|---|
| Salmonella typhi ' O' | Less than 1 in 20 dilutions |
| Salmonella typhi ' H ' | Less than 1 in 20 dilutions |
| Salmonella paratyphi ' AH' | Less than 1 in 20 dilutions |
| Salmonella Paratyphi ' BH ' | Less than 1 in 20 dilutions |

Titre not suggestive of enteric fever.

Titre boarder line significance. Repeat widal after one week to check the doubling titre.

| | | |
|---|---|---|
| Blood Sugar (Fasting) | 76 - 110 mg / dl | |
| Blood Sugar (PP) | upt to 150 mg / dl | |
| Blood Sugar ( Random) | upto 140 mg / dl | |
| Glycosylated Haemoglobin | Non Diabetic | 4.5 - 8.0% |
| | Good Control | 8.0 - 9.0% |
| | Fair Control | 9.0 - 10.0% |
| | Poor Control | 10.0% and above |
| Total Proteins | 6.0 - 8.0 gm / dl | |
| Serum Albumin | 3.8 - 5.0 gm / dl | |
| Serum Globulin | 2.3 - 3.5 gm / dl | |
| Total Bilirubin | upto 1.0 mg / dl | |
| Direct Bilirubin | upto 0.25 mg / dl | |
| Indirect Bilirubin | upto 0.75 mg / dl | |
| SGPT | Male upto 40 U/L at 37 x C | |
| | Female upto 31 U/L at 37 x C | |
| SGOT | Male upto 37 U/L at 37 x C | |
| | Female upto 31 U/L at 37 x C | |
| ALKALINE PHOSPHATASE | 12 - 30 U/L at 25 x C | |

| | |
|---|---|
| GAMMA GT | 11 - 50 U/L at 37 x C |
| SERUM TRIGLYCERIDES | upto 200 mg / dl |
| SERUM CHOLESTROL | upto 220 mg /dl |
| HDL CHOLESTROL | 30 - 70 mg ./dl |
| LDL CHOLESTROL | 80 - 180 mg / dl |
| VLDL CHOLESTROL | 10 - 35 mg / dl |
| CHOLESTROL / HDL RATIO | 3.6 : 0.7 |
| LDL / HDL RATIO | 2.1 : 0.6 |

## OSMOTIC FRAGILITY TEST FOR R.B.C

Normals : Haemolysis begins from 0.44% to 0.40%
Haemolysis complete from 0.36% to 0.32%

## BLOOD ENDOCRINOLOGY

| | | | |
|---|---|---|---|
| ESTRADIOL | : | 257.20 pg / ml | |
| Adult | Males | : | 0 - 44 pg / ml |
| Female | | | |
| Follicular - 14 days | : | 10 - 50 | |
| - 4 days | : | 60 - 200 | |
| Mid cycle - 1 day | : | 120 - 375 | |
| Luteal + 2 days | : | 50 -155 | |
| + 6 days | : | 60 - 200 | |
| Post Menopausal | : | 0 - 14 | |
| TESTOSTERONE | : | 3.40 ng / ml | |
| Males | | | |
| 20 - 49 yrs | : | 3.6 - 15.9 | |
| > 50 yrs | : | 2.8 - 7.5 | |
| Females | : | 0.4 - 0.8 | |

| RADIO IMMUNO ASSAY INVESTIGATION | REFERENCE VALUES |
|---|---|
| T3 | 0.7 - 2 ng / dl |
| T4 | 5 - 13 ug % |
| TSH | 0.3 - 6.5 mIU / ml |
| LH | 0.4 - 5.7 mIU / ml |
| FSH | 1.10 - 13.50 mIU / ml |
| Prolactin | 0 - 15 ng / ml |
| Progesterone | **Males :** 0 - 0.6 |

| | |
|---|---|
| | **Females :** |
| | Follicular Phase : 0.1-1.5 |
| | Luteal Phase : 2.5 - 28.0 |
| | Mid uteal Phase : 3.8 - 28.0 |
| | Postmenopausal : 0 - 0.7 |
| | **Pregnant Females :** |
| | First Trimestar : 9.47 |
| | Second Trimestar : 17 - 146 |
| | Third Trimestar : 55 - 255 |
| Cortisol | 8 am - 9am - 5-25 micro gm / dl. |
| | 8 pm - 9 pm - 3-15 micro gm / d.l |

## SOME IMPORTANT POINTS IN BLOOD FILM STUDY

1. Search for malarial parasites
2. Search for microfilaria

   If pyrexia is intermittant or associated with rigors.
3. Polymorphs predominate in acute suppurative conditions.
4. Lymphocytes predominate in viral and bacillary infections. In a known case of tuberculosis, increased lymphocytosis is of good prognosis and speaks of good resistance.
5. Plasma cells, increased about 11% in small pox.
6. High Lymphocytosis (60-80%) in whooping cough.
7. Absence of eosinophils in typhoid.
8. Eosinophils : Marked increase (tropical eosinophilia), moderate increase (Scarlet fever and allergies). Mild increase (tuberculosis and Hodgkin's)
9. Normoblast - in large number (in Cooley's anaemia). Bone marrow study for diagnosis of leukemia, detection of blood parasites like malarial and L.D.bodies.

## CONDITIONS WITH DEFINITE LEUCOCYTOSIS

1. Acute folliculart onsilitis (12,000 - 20,000) Polymorphs predominating.
2. Diphtheria (8,000 - 12,000)
3. Broncho pneumonia (15,000 - 30,000)
4. Acute Lobar pneumonia (15,000 - 30,000)
5. Pleurisy with effusion (15,000 - 25,000)
6. Amoebic hepatitis (10,000 - 15,000)
7. Small pox pustular stage (15,000 - 30,000) and also in early stage of small pox. Leucocyte count may be normal in haemorrhagic type. (Plasma cells 11% or more)
8. Acute peritonitis (15,000 - 30,000) polymorphs predominating.
9. Scarlet fever (15,000 - 30,000) eosinophils 10 - 25%

10. Whooping cough (20,000 - 40,000), lymphocytes 70%
11. Infectious mononucleosis (15,000 - 30,000) a typical mononuclears in children 60% associated with generalised enlargement of lymph glands.
12. Subacute bacterial endocarditis (12,000 - 20,000)
13. Tuberculosis (9,000 - 14,000)
14. Acute rheumatic conditions (12,000 - 20,000)
15. Rhenmatoid arthritis (10,000 - 17,000)
16. Septicemia (20,000 - 40,000)
17. Leukemias acute (20,000 - 60,000). Blast cells present in the peripheral blood and chronic leukemia (50,000 - 2,00,000)
18. Cooley's anaemia (15,000 - 35,000). In infants or children peripheral smear shows normoblasts in large number.
19. Plague (more than 32,000)
20. Tropical eosinophilia (20,000 - 50,000), eosinophils more than 40%
21. Typhus (10,000 - 14,000) plasma cells and myelocytes present.
22. Poliomyelitis (10,000 - 16,000)
23. Spirochaetal jaundice weil's disease (20,000 - 30,000)
24. Rat bite fever (15,000 - 25,000)
25. Rabies (15,000 - 20,000)

## CONDITIONS WITH DEFINITE LEUCOPENIA

1. Influenza
2. Viral pneumonia
3. Chicken pox
4. Kala Azar
5. Aplastic anaemia
6. Agranulocytosis

## CONDITIONS IN WHICH LEUCOCYTE COUNT MAY BE NORMAL OR LEUKOPENIC

1. Measles
2. Typhoid
3. Brucella
4. Malaria
5. Infective hepatitis
6. Mumps
7. Poliomyelitis

## EXAMINATION OF CEREBROSPINAL FLUID

1. Normal Proteins and clear C.S.F. is usually a normal C.S.F.
2. If C.S.F. contains frank blood, centrifuge the specimen. After centrifuging if supernatent fluid is absolutely clear, the blood is traumatic. If the supernatent fluid is haemolysed (brownish or reddish) the bleeding is probably intra - cerebral.
3. If the C.S.F. is turbid in appearance, do not wait for laboratory investigations, it is definitely acute bacterial infection (meningitis - bacterial origin)



| Test | Normal | Acute Bacterial Meningitis | Tuberculous Meningitis | Virus Meningitis |
|---|---|---|---|---|
| Proteins | 15 - 40 mg% | Marked Increase<br>300 - 2000 mg % | Moderate Increased<br>75 - 300 mg% | Slight Increase<br>50 - 75 mg% |
| Sugar | 50 - 75 mg% | Markedly diminished<br>20 - 30 mg% | Markedly Diminished<br>20 - 30 mg% | Normal<br>50 - 75 mg% |
| Chloride | 700 -750 mg% | Diminished<br>400 - 600 mg% | Diminished<br>400 - 600 mg% | Normal<br>700 - 750 mg% |
| Cell Count | 0.5/Cmm | Marked Increase<br>1000/Cmm & more,<br>Polymorphs 90% | Moderately increased<br>50 - 400 / Cmm<br>Lymphocytes 70% | Slightly increase<br>10 - 50 / Cmm .<br>all Lymphocytes |
| Culture | Sterile | Secondary Organism | B. Tuberculosis | Sterile |
| Appearance | Clear | Turbid | Clear | Clear |

# 25. రోగుల వద్ద ఉంచుకోవలసిన రికార్డులు

## 1. హెల్త్ కార్డు

పేరు :

స్త్రీ / పురుషుడు :

వయసు :

చిరునామా, ఫోన్ నెంబరు :

ఎత్తు, బరువు :

బ్లడ్ గ్రూప్ :

బి.పి. :

మధుమేహం ఉందా :

మధుమేహం రోగి అయితే  ఇన్సులిన్ మరియు షుగర్ తగ్గడానికి వాడే మందుల మోతాదు :

మూర్ఛవ్యాధి ఉందా?

పక్షవాతం, గుండెపోటు, మూత్రపిండాల వ్యాధి, ఉబ్బసం, ఇతర వ్యాధులు ఉన్నాయా?

సరిపడని మందుల పేరు :

## 2. ఉబ్బసం రోగి రికార్డు

పేరు :

వయసు / వృత్తి :

చిరునామా, ఫోన్ నెంబరు :

ఫ్యామిలి డాక్టర్ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు:

ఉబ్బసం ఎంతకాలం నుంచి ఉంది?

ప్రస్తుతం వాడుతున్న మందులు/ మోతాదు:

సరిపడని మందుల పేర్లు:

ప్రత్యేకంగా దేనికైనా ఎలర్జీ ఉందా?

బరువు :

బ్లడ్ గ్రూప్ :

ఇతర పరీక్షల వివరాలు :

## 3. హార్ట్ పేషెంట్ ఉంచుకోవలసిన రికార్డు

పేరు :

వయసు / వృత్తి :

చిరునామా, ఫోన్ నెంబరు:

ఫ్యామిలీ డాక్టర్ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు :

బి.పి. :

షుగర్ :

కొలెస్ట్రరాల్ :

ఇతర క్రొవ్వు పదార్థాల శాతం :

యూరిక్ యాసిడ్ :

గుండెపోటు ఎప్పుడు వచ్చింది?

వాడుతున్న మందులు, మోతాదు :

బరువు :

బ్లడ్ గ్రూప్ :

సరిపడని మందుల పేర్లు :

## 4. హార్ట్ ఎటాక్ వచ్చిన రోగి ఇంట్లో ఉండవలసిన రికార్డు

1. రెగ్యులర్ బి.పి. రికార్డు
2. రెగ్యులర్‌గా బరువు
3. వాడుతున్న మందులు, వాటి మోతాదు
4. వివిధ పరీక్షల రికార్డు (క్రమపద్ధతిలో)

# 5. రక్తపోటు రోగి రికార్డు

పేరు :

వయసు :

చిరునామా, ఫోన్ నెంబరు :

ఫ్యామిలీ డాక్టర్ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు :

ఇటీవల - బి.పి. రీడింగ్

- పడుకుని ఉంటే
- కూర్చుని ఉంటే
- నిలుచుని ఉంటే

బి.పి.కి. వాడుతున్న మందులు, మోతాదు :

రక్తంలో క్రొవ్వు పదార్థాలు ఏ శాతంలో ఉన్నాయి?

బ్లడ్ షుగర్ :

బరువు :

బ్లడ్ గ్రూప్ :

సరిపడని మందుల పేర్లు :

గుండెజబ్బు, పక్షవాతం, మూత్రపిండాల జబ్బు వివరాలు:

అత్యవసర పరిస్థితుల్లో తెలియచేయవలసిన అడ్రసు, ఫోన్ నెంబరు

ఫ్యామిలీ డాక్టర్ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు

## 6. మధుమేహం రోగి తన వద్ద ఉంచుకునే రికార్డు

పేరు :

వయసు / వృత్తి:

అడ్రసు, ఫోన్ నెంబరు :

ఫ్యామిలీ డాక్టర్ పేరు, చిరునామా, ఫోన్ నెంబరు :

అత్యవసర పరిస్థితుల్లో తెలియచేయవలసిన చిరునామా:

మధుమేహరోగి తీసుకుంటున్న మందులు :

ఇన్సులిన్ : - రోజుకి ఎన్నిసార్లు?

- ఎన్ని యూనిట్లు ?

షుగర్ కంట్రోలు ఉన్నవాళ్ళు :

- రోజుకి ఎన్నిసార్లు ?

- మోతాదు ఎంత?

బరువు : బ్లడ్ గ్రూపు :

సరిపడని మందుల పేర్లు :

### అత్యవసర పరిస్థితుల్లో రోగి గురించి ఇతరులు తెలుసుకునేందుకు . . . .

*నేను మధుమేహరోగిని. నేను ఒకవేళ మగతగా కనబడితే, అసాధారణంగా ప్రవర్తిస్తే నోట్లో పంచదార వేయండి* **లేదా** *తీయని ద్రవం ఇవ్వండి. నేను అపస్మారక స్థితిలో ఉంటే వెంటనే ఆసుపత్రికి తీసుకుని వెళ్ళండి. నాకు సంబంధించిన వివరాలన్నీ ఈ కార్డులో ఉన్నాయి.*

## మధుమేహరోగి ఇంట్లో ఉంచుకోవలసిన రికార్డు

| తేది | మూత్రంలో షుగర్ / రక్తంలో షుగర్ | | | | | వాడుతున్న మందులు | | బరువు బి.పి. వగైరా |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఉదయం శాంపిల్ | మధ్యాహ్న భోజనం ముందు శాంపిల్ | భోజనం తరువాత రెండు గంటలకు శాంపిల్ | రాత్రి భోజనం ముందు శాంపిల్ | రాత్రి పడుకునే ముందు శాంపిల్ | మందులు టాబ్లెట్స్ లేదా ఇన్సులిన్ | వాడుతూ ఉంటే ఏదైనా తేడా వస్తే ఎపుడు? ఏమిటి? | |
| | | | | | | | | |

పై సమాచారం ప్రతిరోజూ నోట్ చేయాలి. దానినిబట్టి షుగర్ అదుపులో ఉంటున్నదీ, లేనిదీ తెలుసుకుంటూ ఆహారం, మందులలో మార్పు చేసుకొనవచ్చు.

# పిల్లల 'బరువు - ఎత్తు' పట్టిక

| వయస్సు సంIIలు | ఆడపిల్లలు బరువు | | ఆడపిల్లలు ఎత్తు | మగపిల్లలు బరువు | | మగపిల్లలు ఎత్తు |
|---|---|---|---|---|---|---|
| 1. | 7.5 | - | 72.5 | 8.5 | - | 72.5 |
| 2. | 12.3 | - | 86.6 | 12.6 | - | 87.5 |
| 3. | 14.4 | - | 95.7 | 14.6 | - | 96.2 |
| 4. | 16.4 | - | 103.2 | 16.5 | - | 103.4 |
| 5. | 18.4 | - | 109.1 | 18.4 | - | 108.7 |
| 6. | 21.4 | - | 117.3 | 22.1 | - | 118.9 |
| 7. | 24.8 | - | 122.7 | 24.5 | - | 123.3 |
| 8. | 26.1 | - | 126.8 | 26.4 | - | 127.9 |
| 9. | 29.7 | - | 132.3 | 30.0 | - | 133.6 |
| 10. | 33.5 | - | 138.5 | 32.4 | - | 138.5 |
| 11. | 36.5 | - | 144.1 | 35.3 | - | 143.4 |
| 12. | 42.6 | - | 150.3 | 38.8 | - | 148.9 |
| 13. | 44.4 | - | 153.0 | 42.9 | - | 154.9 |
| 14. | 46.7 | - | 155.1 | 48.3 | - | 161.7 |
| 15. | 48.2 | - | 155.3 | 52.2 | - | 165.3 |
| 16. | 49.8 | - | 155.4 | 55.5 | - | 168.4 |
| 17. | 49.9 | - | 156.4 | 59.0 | - | 168.9 |
| 18. | 50.1 | - | 156.8 | 61.1 | - | 169.9 |

## సంవత్సరం లోపు పిల్లల పెరుగుదల

పుట్టినప్పుడు పిల్లలు 2.8 నుంచి 3.5 కేజీలు ఉంటారు. 3వ నెల నిండేవరకు నెల నెలకీ అర కేజీ చొప్పున బరువు పెరుగుతారు. 3 నుండి 6వ నెల వరకు నెల నెలకీ పావు కేజీ చొప్పున బరువు ఎయిగుతారు. 6వ నెల నిండేసరికి 5.6 నుంచి 7 కె.జి.ల బరువు ఉంటారు. సంవత్సరాంతానికి పుట్టిన బరువుకి మూడు రెట్లు అవుతారు.

# ఎత్తుబట్టి బరువు

| ఎత్తు సెం.మీ. | పురుషులు బరువు కేజీలలో | స్త్రీలు బరువు కేజీలలో |
|---|---|---|
| 152 | --- - --- | 51 - 54 |
| 155 | --- - --- | 52 - 55 |
| 157 | 56 - 60 | 53 - 57 |
| 160 | 58 - 62 | 54 - 58 |
| 163 | 59 - 64 | 56 - 60 |
| 165 | 61 - 65 | 58 - 61 |
| 168 | 62 - 67 | 59 - 64 |
| 170 | 64 - 69 | 61 - 65 |
| 173 | 66 - 71 | 62 - 67 |
| 175 | 68 - 73 | 64 - 69 |
| 178 | 69 - 74 | 66 - 70 |
| 180 | 71 - 76 | 67 - 72 |
| 183 | 73 - 79 | 69 - 74 |
| 185 | 75 - 81 | --- - --- |
| 188 | 78 - 84 | --- - --- |
| 190 | 80 - 86 | --- - --- |

## కేజీలు - పౌండు

| పౌండ్లు | కేజీలు | కేజీలు | పౌండ్లు |
|---|---|---|---|
| 2 | 0.9 | 2 | 4.4 |
| 6 | 2.7 | 4 | 8.8 |
| 10 | 4.5 | 6 | 13.2 |
| 30 | 13.6 | 10 | 22.0 |
| 50 | 22.7 | 30 | 66 |
| 70 | 31.8 | 50 | 110 |
| 90 | 40.9 | 70 | 154 |
| 150 | 68.2 | 90 | 198 |

1 పౌండు = 0.45 కేజీ

1 కేజీ = 2.2 పౌండ్లు

# ఫారన్ హీట్ - సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రతల కొలమానం

| $^0F$ | $^0C$ | $^0C$ | $^0F$ |
|---|---|---|---|
| 0 | -17.8 | 0.0 | 32.0 |
| 95 | 35.0 | 35.0 | 95.0 |
| 96 | 35.6 | 35.5 | 95.9 |
| 97 | 36.1 | 36.0 | 96.8 |
| 98 | 36.7 | 36.5 | 97.7 |
| 99 | 37.2 | 37.0 | 98.6 |
| 100 | 37.8 | 37.5 | 99.5 |
| 101 | 38.3 | 38.0 | 100.4 |
| 102 | 38.9 | 38.5 | 101.3 |
| 103 | 39.4 | 39.0 | 102.2 |
| 104 | 40.0 | 39.5 | 103.1 |
| 105 | 40.6 | 40.0 | 104.0 |
| 106 | 41.1 | 40.5 | 104.9 |
| 107 | 41.7 | 41.0 | 105.8 |
| 108 | 42.2 | 41.5 | 106.7 |
| 109 | 42.8 | 42.0 | 107.6 |
| 110 | 43.3 | 100 | 212.0 |

# ఈ పుస్తక రచనకు తోడ్పడిన ప్రామాణిక వైద్య గ్రంథాలు

1. CECIL TEXT BOOK OF MEDICINE
2. OXFORD TEXTBOOK OF MEDICINE
3. CLINICAL MEDICINE By HARRYL GREEN
4. A SHORT TEXTBOOK OF MEDICINE By K.V. KRISHNA DAS
5. CONN'S CURRENT THERAPY
6. CLINICAL PROCEDURE IN EMERGENCY MEDICINE By ROBBINS HEDGES
7. CAMPBELL'S UROLOGY
8. CROFTON AND DOUGLAS RESPIRATORY DISEASES
9. SLEISENGEN FORDTRAN'S TEXT BOOK ON GASTRO INTESTINAL DISEASES
10. HARRISON'S PRINCIPLES OF INTERNAL MEDICINE.
11. DAVIDSON'S PRINCIPLES AND PRACTICE OF MEDICINE
12. PRICE'S TEXTBOOK OF THE MEDICINE
13. GOLWALLA MEDICINE FOR STUDENTS
14. CLINICAL PSYCHIATRY By MAYER - GROSS SLATER AND ROTH
15. CLINICAL DERMATOLOGY By HUNTER, SAVIN AND DAHL
16. MODI'S MEDICAL JURISPRUDENCE AND TOXICOLOGY
17. PYE'S SURGICAL HANDICRAFT
18. HUTCHISON'S CLINICAL METHODS
19. HUMAN NUTRITION By BENJAMIN
20. DISEASES IN INFANCY AND CHILDHOOD By ELLIS AND MITCHELL
21. NELSON'S TEXTBOOK OF PAEDIATRICS
22. DISEASES OF THE LIVER AND BILIARY SYSTEM By SHEILA SHERLOCK

## '2000 సం॥ నాటికి అందరికీ ఆరోగ్యం'
## ధ్యేయంతో మీముందుకు వచ్చిన పుస్తకమే
# "మీ ఇంట్లో మీరే డాక్టర్"

పెరుగుతున్న ఆరోగ్య కాంక్షకుతోడు ఆరోగ్య విజ్ఞానం కూడా అందుబాటులో ఉండాలి. అందుకోసమే **'ఇంటింటా వైద్య విజ్ఞానం'** ధ్యేయంగా ఉద్యమిస్తున్న వైద్య విజ్ఞాన రచయిత **డాక్టర్ జి. సమరంతో నవభారత్ బుక్‌హౌస్** పాలుపంచుకుంటోంది.

## ఈ సిరీస్‌లో డాక్టర్ సమరం రచించిన

'ఆధునిక వైద్య విజ్ఞాన గ్రంథావళి' 12 పుస్తకాలు,

'ఆధునిక ఆరోగ్య రక్షణ గ్రంథావళి' 20 పుస్తకాలు,

'శాస్త్రీయ వైద్య విజ్ఞాన గ్రంథావళి' 6 పుస్తకాలు,

'సంపూర్ణ సెక్స్ విజ్ఞాన గ్రంథావళి' 5 పుస్తకాలు,

'వైద్య విజ్ఞాన నవలావళి" 5 నవలలు

**నవభారత్ బుక్‌హౌస్** వెలువరించింది.

సరళమైన భాషలో, ఆకట్టుకునే శైలిలో, ఏమాత్రం అక్షర జ్ఞానం ఉన్నవారికయినా అర్థమయ్యే రీతిలో వ్రాసిన ఈ వైద్య గ్రంథాలు అందుబాటులో ఉండి అందరికీ ఎంతగానో ఉపయోగపడ్డాయి. ఎన్నో పునర్ముద్రణలు జరిగాయి.

ఏవ్యాధి సింపుల్, ఏవ్యాధి సీరియస్ అనేది తెలియడానికి, సాధారణ వ్యాధులకి చికిత్స తెలుసుకోవడానికి **డాక్టర్ సమరం** వైద్య విజ్ఞాన గ్రంథాలు తోడ్పడతాయని హెల్త్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ **ప్రొఫెసర్ లింగం సూర్యనారాయణ**, రిజిస్ట్రార్ **డా. యన్.యస్. దాస్** ప్రభృతులు శ్లాఘించారు. ఈ పుస్తకాలు ప్రతిగ్రామానికీ చేరగలిగితే అనుభవజ్ఞుడైన వైద్యుడు చేరినట్లేనని **వివిధ పత్రికలు** తమ **సమీక్షలలో** ఈ గ్రంథావళి ఆవశ్యకతను శ్లాఘించాయి.

పై పుస్తకాలవల్ల ఉపయోగం పొందినవారి సూచనల మేరకు మా బాధ్యతగా ఇప్పుడు ఈ పుస్తకం **"మా ఇంట్లో మీరే డాక్టర్"** ప్రచురించాము. ఈ పుస్తకం కూడా మీ ఇంట్లో అందరికీ అందుబాటులో వుంచండి. ఫ్యామిలీ డాక్టర్‌గా ఎంతో ఉపయోగపడుతుంది.

ఈ పుస్తకం మీరు చదివి మీకు మంచి సలహాదారుగా ఉపయోగపడిందని అభిప్రాయపడితే మీరు బాగా యిష్టపడే వ్యక్తికి, కనీసం ఒక్కరికైనా ఆ విషయం చెప్పండి. వారి శ్రేయోభిలాషిగా అది మీ కనీస కర్తవ్యం.

కుటుంబంలో ఎప్పటికప్పుడు ఎవరికో ఒకరికి అనారోగ్యం కలుగుతూ వుంటుంది. కుటుంబం అనగానే చంటిపిల్లలు, వయస్సులో అడుగిడుతున్న అబ్బాయిలు-అమ్మాయిలు, కాన్పుకొచ్చిన కూతుళ్ళు-కోడళ్ళు, నడివయస్సులో, వృద్ధాప్యంలో ఉన్న ఆడవాళ్ళు-మగవాళ్ళు అందరూ ఉంటారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమైన ఆరోగ్య సమస్య వుంటుంది. ఆ ఆరోగ్యసమస్య శారీరకమైనది కావచ్చు, మానసికమైనది కావచ్చు. బయటికి చెప్పుకునేది కావచ్చు, చెప్పుకోలేనిది కావచ్చు.

మీ 'కుటుంబ గ్రంథాలయం' అల్మరాలో అందరి ఎదుటా ఈ పుస్తకం ఉంటే అనుభవజ్ఞుడైన డాక్టర్ మీ చెంత ఉన్నట్లే.

***ఫస్టు "మీ ఇంట్లో మీరే డాక్టర్ పుస్తకం" రిఫరెన్సు, ఆ తరువాతే డాక్టర్ ప్రిఫరెన్సు.***

ఆరోగ్యమే మహాభాగ్యం అంటారు. అందుకోసం ఆహారం ఏది తీసుకోవాలి, ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకోవాలి, అనారోగ్యంలో ఎలాంటి చికిత్స పొందాలి, ఎవరిని సంప్రదించాలి, ఎక్కడికి వెళ్లాలి, పథ్యాలు ఏమిటి - ఇలా ఒకటేమిటి కుటుంబానికి కావలసినవన్నీ ప్రసాదించే విజ్ఞాన కల్పతరువు **"మీ ఇంట్లో మీరే డాక్టర్"**.

ఆప్తవాక్యం ఆత్మీయుడిని ఆదుకుంటుంది. ఆనందాన్ని పంచుతుంది. అలాగే అనారోగ్యంలో ఉన్న స్నేహితునికి, పక్కింటిలో సుస్తీగా ఉన్నవారికి ధైర్య వచనాలతోపాటు ఈపుస్తకం అందిస్తే చీకటిలో చిరుదీపంగా తోడ్పడుతుంది.

దూరంగా ఉన్న మన బంధువులు, రక్తం పంచుకుని పుట్టిన తోబుట్టువులు ఏ అనారోగ్యం లేకుండా హాయిగా ఉండాలని కోరుకుంటాం. వారికి ఈపుస్తకం పంపితే ఆరోగ్యాన్ని



కాపాడుకోవడమే కాకుండా ఏదైనా అనారోగ్యం కలిగినప్పుడు కంగారుపడకుండా ఉంటారు. మనం దగ్గరలేమని దిగులు పడకుండా **"మీ ఇంట్లో మీరే డాక్టర్"** ఆ ధర్మాన్ని నిర్వర్తిస్తుంది.

రోగికి వ్యాధి గురించి అవగాహన ఉంటే డాక్టర్‌కి చికిత్స చేయడం సులభం. డాక్టర్ దగ్గర అసలు విషయం కాకుండా అనవసరమైనదంతా ఏకరువు పెట్టి విలువైన ఆయన సమయమంతా వృథా చేయకుండా డాక్టర్ దగ్గరికి వెళ్లేముందే తన వ్యాధి గురించి సరైన అవగాహన ఉంటే టైమ్ కలిసివస్తుంది. రోగ నిర్ధారణ సులువవుతుంది. ప్రతి క్లినిక్‌లో రోగులు వేచి ఉండేచోట ఈ పుస్తకాన్ని ఉంచి అతని సుస్తీగురించి చదివించినట్లయితే రోగి నుంచి అవసరమైన సమాచారం రాబట్టడం డాక్టర్‌కి తేలిక అవుతుంది.

ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు కేవలం చికిత్సాకేంద్రాలు కాదు. ఆరోగ్య విజ్ఞాన కేంద్రాలు కూడా. '2000 సంవత్సరం నాటికి అందరికీ ఆరోగ్యం' అనే లక్ష్యం నెరవేరాలంటే ప్రతి ఒక్కరికీ ఆరోగ్యం గురించి సరైన అవగాహన ఉండాలి. అది పెంపొందడానికి ఈ పుస్తకం చక్కగా తోడ్పడుతుంది. ప్రతి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఈ పుస్తకంఉంచితే రోగులకి ఆరోగ్య విజ్ఞానాన్ని కలిగించడమే కాకుండా, ఆరోగ్య కేంద్రంలో పనిచేసే కార్యకర్తలకి **హాండ్‌బుక్**గా తోడ్పడుతుంది.

మహిళామండలులు, యువజన సంఘాలు, స్వచ్ఛంద సేవాసంస్థలు ఆరోగ్య రక్షణలో విస్తృతమైన కృషిసల్పుతున్నాయి. ఆయాసంస్థల కృషికి తోడుగా **"మీ ఇంట్లో మీరే డాక్టర్"** వారి చెంత ఉంటే వారి సేవలకు మరింత తోడ్పడుతుంది.

అలాగే హాస్టళ్లు, రెసిడెన్షియల్ స్కూళ్లు, సోషల్ వెల్‌ఫేర్ హాస్టళ్లలో ఈ గ్రంథాన్ని ఉంచినట్లయితే తరచుగా వచ్చే చిన్న చిన్న అనారోగ్యాలకి చికిత్స చేయవచ్చు. విరోచనాలు, వాంతులు, ఫ్లూ జ్వరాలు, చలి జ్వరాలు - ఇటువంటివన్నీ సులువుగా ఈ పుస్తకం సహాయంతో చికిత్స చేయవచ్చు. ప్రతి చిన్న అనారోగ్యానికి విద్యార్థులను వైద్యుని దగ్గరకు తీసుకుని వెళ్లనవసరం ఉండదు.

అందుకనే **'ఇంటింటికీ వైద్య విజ్ఞానం'** ఉద్యమంలో మీరూ భాగస్వాములు కండి. మీరు చదవండి, చదివించండి. ఆరోగ్యసుధలని పంచండి.

**- ప్రకాశకులు**

వైద్య విజ్ఞాన జ్యోతి

# డాక్టర్ జి. సమరం

# ఆధునిక వైద్య విజ్ఞాన గ్రంథావళి

## 1. ఆధునిక ఆరోగ్య రక్షణ గ్రంథావళి

1. రక్తపోటు
2. ఉబ్బసం
3. హార్ట్ ఎటాక్
4. మధుమేహం
5. జ్వరాలు
6. పక్షవాతం
7. ఎయిడ్స్
8. కేన్సర్
9. పైల్సు-ఫిస్టులా-ఫిషర్
10. నడుం నొప్పి - మెడ నొప్పి
11. కడుపు నొప్పి
12. కామెర్లు
13. అపోహలు-అనర్థాలు
14. జబ్బులు-జాగ్రత్తలు
15. ఆహారం-అలవాట్లు
16. వ్యాధులు-పథ్యాలు
17. నాటువైద్యం-నష్టాలు
18. ముప్పుతెచ్చే మూఢనమ్మకాలు
19. వ్యాధులు-భయాలు
20. సీజన్ మార్పు వ్యాధులు

## 2. ఆధునిక వైద్యవిజ్ఞాన గ్రంథావళి

1. జీర్ణకోశం-వ్యాధులు
2. గుండె జబ్బులు
3. కాలేయం-వ్యాధులు
4. మూత్రపిండాలు-వ్యాధులు
5. కీళ్ళనొప్పులు
6. మెదడు-వ్యాధులు
7. ఊపిరితిత్తులు-వ్యాధులు
8. చెవి, ముక్కు వ్యాధులు
9. నోటి జబ్బులు
10. చర్మవ్యాధులు
11. కంటి జబ్బులు
12. మెడ-గొంతు వ్యాధులు

## 3. శాస్త్రీయ వైద్య విజ్ఞాన గ్రంథావళి

1. మనస్తత్వము-సైన్స్
2. పిల్లలు-ఆరోగ్యం
3. పోస్టుమార్టమ్ సైన్స్
4. కుటుంబ నియంత్రణ-పద్ధతులు
5. గర్భధారణ-సుఖప్రసవం
6. నిత్యజీవితంలో జెనెటిక్స్

## 4. సంపూర్ణ సెక్స్ విజ్ఞాన గ్రంథావళి

1. సెక్స్-సైన్స్ (మొదటి భాగం)
2. సెక్స్-సైన్స్ (రెండవ భాగం)
3. సెక్స్-సైన్స్ (మూడవ భాగం)
4. సెక్స్-సైన్స్ (నాల్గవ భాగం)
5. సెక్స్-సైన్స్ (ఐదవ భాగం)

## 5. వైద్య విజ్ఞాన నవలావళి

1. సైకో (మొదటి భాగం)
2. సైకో (రెండవ భాగం)
3. X క్లినిక్ (మొదటి భాగం)
4. X క్లినిక్ (రెండవ భాగం)
5. ఆంటీ ఐ లవ్ యూ!